శ్రీరస్తు.

శ్రీవిశ్వేశ్వరాయనమః.

# కాశీమజిలీకథలు



## పదవ భాగము

ఇది

గోదావరీ తీరాలంకారభూతంబగు రాజమహేంద్రవరపురంబున

నివసించియున్న

**మధిర సుబ్బన్న దీక్షిత కవిచే**

రచియింపఁబడి

వారి పుత్రుఁడు కొండయ్యశాస్త్రిచే

ప్రచురింపఁబడినది

రెండవ కూర్పు 1250

రాజమండ్రి కందుల సూర్యారావు బ్రదర్సువారి

రామమోహన ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1934

 [ వెల రు. 1–12–0

# రెండవకూర్పు పీఠిక.

**ఆర్యులారా!**

అత్యద్భుతమగు నారద మహర్షి చరిత్ర మిందు వర్ణింపఁబడినది. తొలుత నారదుఁడు బ్రహ్మచే జగత్సృష్టికై దక్షాదులతో సృజింపఁబడియు విరక్తుఁడగుట సృష్టికార్యము నొల్లక పితామహుని శాపమునకు గురియయ్యెను. ఆశాపంబున ఉపబర్హణుఁడను గంధర్వ రాజై జన్మించి గానకళాప్రావీణ్యముచే పార్వతీ మహాదేవివలన "మహతి" యను వీణంబడసి విఖ్యాతినొందెను. మరుజన్మంబున గోపకుమారుఁడై తపస్సిద్ధులకు సపర్యలం గావించి వారి యనుగ్రహమున జ్ఞానియై కాలము గడపెను. మూడవ జన్మంబున తిరుగా నారదుండై కాంతాపరిగ్రహణ మొల్లిక పితామహునాజ్ఞ నతిక్రమించి పునశ్శాపోపహతుండై వివాహమాడి అది విడిచి విష్ణుమాయచే కాంతాకృతినొంది సంతానము వడసి తుదకు స్వస్వరూపప్రాప్తి నొంది మహాతపంబు గావించి సర్వముని సార్వభౌముఁడని కీర్తింపఁబడి ప్రసిద్ధినొందెను.

ఇట్లెన్ని శాపంబులు గల్గినను హరిభక్తిని విడువక జ్ఞానియై జితమాయుండై ప్రసిద్ధినొందిన నారదుని దివ్యచరిత్రము జ్ఞానదాయకము రసవంతమునై శోభిల్లుచున్నది.

నారదుని చరిత్ర యనుటచే యెద్దియో గాథయని తొలుత చదువరులకు తోఁచినను చదువ మొదలిడిన ఇది సుప్రసిద్ధమగు కాశీమజిలీ కథలన్నిటియందును మనోహరమైనది యని పాఠకులు గ్రహింపఁగలరు.

దైవానుగ్రహమున నేటికి 12 భాగములు పూర్తికాబడినవి మణిసిద్ధయతీంద్రుఁడు గోపకుమారునితో వారణాసిం జేరెను. "జగమెఱిగిన బ్రాహ్మణునకు జందెమేల" యను నుడువున సుప్రసిద్ధములగు నీకథలను గురించి పెద్దగ వర్ణింప నవసరము లేదు. దీనికి లోకమే ప్రమాణము.

రాజమండ్రి.
ది 3–12–1934.

ఇట్లు సుజనవిధేయుఁడు
మధిర కొండయ్యశాస్త్రి.

## మొదటికూర్పుపీఠిక.

ఆర్యులారా!

మహాత్ముల చరిత్రము లైహికాముష్మికఫలసాధనములై యొప్పుచుండును. ఇందుఁ బరమభాగవత శిఖామణియగు నారద మహర్షి చరిత్రము తెలుపు కథలు వ్రాయబడినవి. చిరకాలమునుండి నాకీ మహాత్ముని చరిత్రము వ్రాయవలయునని యభిప్రాయము గలిగి యున్నది. ఋషులచరిత్రములు వేదాంత కథాప్రసక్తములగుటఁ బండిత పామరహృద్యములుగా నుండవని యుపేక్ష జేసితిని.

మఱియుఁ దచ్చరిత్రాంశములు విమర్శింపుచుఁ బురాణములు పరికింప నెందుఁజూచినను నమ్మునిచంద్రుని కీర్తిచంద్రికలే హృద యాహ్లాదము గలుగఁజేయుచుండునవి. మహాభారతము, బ్రహ్మవైవ ర్తము, దేవీభాగవతము, భాగవతము, లోనగు పురాణములన్నియు నమ్మహాభాగుని ప్రభావము వేనోళ్ళఁ బొగడుచున్నవి.

వానిలో ముఖ్యములు పండితపామరజన మనోహరములు చరిత్రాత్మకములగు కథల నేరి యిందువ్రాసితిని. ఇంకను వ్రాయ వలసిన విషయములు చాలగలవు. వానినెల్ల మఱియొకప్పు డీకాశీమ జిలీ కథలయందుఁగాక వేరొక భాగముగా వ్రాయఁదలంచికొంటి. అది కేవలము వేదాంతప్రబోధకముగా నుండును.

నారదమహర్షి హరిమాయామోహితుం డగుచు నాఁడుదియై తాళధ్వజుం డను నృపాలుం బెండ్లియాడి యిరువండ్రఁ గుమారులం గనుటయు లోకైక వీరులగు నారాజకుమారులు దేశసంచారము జేసి నాలుగుదిక్కులు జయించి త్రిలోకాభిరామలగు రామలం బెండ్లియాడి యనేకవిచిత్రకార్యములు గావించిన విషయములు ఇదివఱ కిందుఁ వ్రాయఁబడిన వరప్రసాదులు, విజయభాను రామచంద్రులు, అదృష్ట దీపుఁడు లోనగువారి కథలకన్నఁగడు చమత్కృతిగా నున్నవని పండితు లభిప్రాయ మిచ్చియున్నారు.

సంపూర్ణముగా జదివినంగాని యిందలి చమత్కారము తెల్లముకాదు. కాశీమజిలీకథలు పదవభాగముతో ముగింతునని యిది వఱకుఁ దెలిపియుంటిని మజిలీలు పూర్తికాకపోవుటయు మంచికథలు మిగిలియుండుటయు, మణిసిద్ధయతి శిష్యునితోఁ గాశీనగరము జేరక పోవుటయు లోనగు కారణములంబట్టిపంద్రెండవభాగము వఱకువ్రాసి నంగాని సమాప్తినొందింపఁ వీలుపడినదికాదు. సాధ్యమైనంత త్వరలో 11-12 భాగము లొకసారియే ప్రకటింతునని మా చదువరులకు విన్నవించుచున్నాను. రెండు సంవత్సరములనుండి మాచదువరులీభాగమునకు వ్రాయులేఖలకు మేఱలేదు.

మా చదువరు లందఱకు నీకథలయం దాదరము కలిగియున్నదని వారు వారు వ్రాయునట్టి లేఖలవలన దెల్లమగుచున్నది. వీనిపై నిచ్చిన పండితాభిప్రాయముల 12వ భాగమునఁ బ్రకటింపగలవాఁడ.

కథలన నెట్టిపామరులకైన నానందము గలుగకమానదు. శర్కరయని చెప్పి పిల్లలకు మందు ద్రావించినట్లు కథలని చెప్పి జన్మతారకములైన మహాపురుషుల చరిత్రములు లోకులకు విన్నవించుటయే నాయుద్దేశమని పండితులు గ్రహింతురుగాక. ఇందు నలుపది మజిలీల కథలు గలిగియున్నవి. దేశనాంప్రాదాయములు నారీ సంకేతకములు లోనగు విశేషము లిందు వ్రాయ బడియున్నవి

నారదమహర్షి చరిత్రాంశములు పురాణములో బలువిధములగా వ్రాయఁబడియున్నవి, నారదుండు బహ్మదేవుని తొడనుండి యుదయించెనని భారతాదిగ్రంథములు, కంఠమునుండిఁ బొడమెనని బహ్మావైవర్తపురాణము చెప్పుచున్నవి. పరస్పరభేదముల సవరించి నాచే నీకథలు వ్రాయఁబడినవి కావున నిందలి తప్పులు మన్నించి యొప్పుల గ్రహింతురని విద్వాంసులఁ బ్రార్థించుచున్నాను.

20—6—26
రాజమండ్రి

ఇట్లు
మధిర సుబ్బన్న దీక్షితకవి

# విషయసూచిక.

# కాశీమజిలీకథలు.

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవిగారిచే నీగ్రంథరాజము పండ్రెండు భాగములుగాఁ బండితపామర హృద్యమగు శైలితో వచనమున రచియింపఁబడి యున్నది. ఈకథలు ఆంధ్రదేశమంతటను వ్యాపించియుండుటనుబట్టి వీనిగుఱించి విస్తరించి వ్రాయఁబనిలేదు.

ఇందుఁబతివ్రతలప్రభావము దుష్టస్త్రీలకుచ్చితచేష్టలు, సత్పురుష సాంగత్యమువలనఁ గలుగు లాభములు, దుష్టసహవాసంబునం గలుగు ననర్థములు, దేశాటనము పండితసంపర్కమునగలుగుజ్ఞానము రాజనీతి, వ్యవహారవివేకము, వదాన్యలక్షణము, లోభిప్రవృత్తిలోనగు విశేషము లనేకములు వర్ణింపఁబడియున్నవి. మఱియుఁ గృష్ణదేవరాయ, భోజరాజ, శంకరగురు, విక్రమార్క, నారద, ప్రహ్లాదాది, మహాపురుషుల చరిత్రములు విచిత్రముగా వ్రాయఁబడియున్నవి. ప్రతికథయందును నేదియో మంచినీతియుండక మానదు.

ఈకథలు విరక్తులకు వేదాంతవార్తికములు, జ్ఞానులకునుపనిషత్తులు, కర్మిష్ఠులకు స్మృతులు, వైదికులకు ధర్మశాస్త్రములు, యువకులకు గావ్యములునై యొప్పుననుటకు సందేహములేదు. ఏకథనైనను ప్రారంభించినతరువాత దుదముట్టువరకు చదివినంగాని విడువ బుద్ధిపుట్టకపోవుటయే యీకథలయందలి చమత్కారము. పెక్కుల యొక్కుడలు సర్వజనాహ్లాదకరములై యున్నవని నొక్కి వక్కాణింపుచున్నాము. ఇందులకు లోకమే ప్రమాణము.

ఇప్పటికి 12 భాగములు అచ్చుపడి సిద్ధముగానున్నవి.

12 భాగములు అనుబంధము సహితము అన్నిభాగములు ఒకేసారి కొనువారికి వెలలో కొంతతగ్గించి పంపబడును. పోస్టుఖర్చులు కొనువారే వహించికొనవలెను. పలయువారు యీదిగువ అడ్రస్సుకు వ్రాయవలెను,

మధిర సుబ్బన్న దీక్షితకవి అండుసన్

పుల్లితోటవీధి—రాజమండ్రి.

# కాశీమజిలీకథలు.

| రు. అ. పై | |
|---|---|
| 1— 8—0 | 1 భాగము. వరప్రసాదుల కథగలది. |
| 1— 8—0 | 2 భాగము. అదృష్టదీపుని కథగది. |
| 1—12—0 | 3 భాకము. మందారవల్లి కథగలది. |
| 1—12—0 | 4 భాగము. విజయభాస్కరిని కథగలది. |
| 1— 8—0 | 5 భాగము. శంకరుని కథగలది. |
| 1—12—0 | 6 భాపము. భోజుని కథగలది. |
| 1—12—0 | 7 భాగము. విభీషణుని కథగలది. |
| 1—12—0 | 8 భాగము. దత్తకాదుల కథగలది. |
| 1—12—0 | 9 భాగము. విక్రమార్కుని కథగలది. |
| 1—12—0 | 10 భాగము- నారదుని కథగలది, |
| 1—12—0 | 11 భాగము. ప్రహ్లాదుని కథగలది. |
| 0—12—0 | 12 భాగము. పుండరీకుని కథగలది. |
| 0—12—0 | అనుబంధము. (కాదంబరి) కాదంబరీ మహాశ్వేతలకథ. |

—:పద్యకావ్యములు:—

| | |
|---|---|
| 0— 8—0 | భద్రాచల మహాత్మ్యము పద్యకావ్యము |
| 0—12—0 | సప్తసాగర సంగమహాత్మ్యము డిటో |
| 0— 2—0 | కన్యావరశుల్క నిరసనము వచనము |
| 0—12—0 | సావిత్రీనాటకము |

ఒక్కొక్క పుస్తకముగాఁ దెప్పించుకొనుటకంటె 4, 5 కలిపి తెప్పించుకొనినచో పోస్టుచార్జి తగ్గును. మేము అట్టివారికి కొంత సదుపాయము చేయుచుందుము.

పలయువారు:—

మధిర సుబ్బన్న దీక్షితకవి అండుసన్

పుల్లిలోటవీధి, రాజమండ్రి. వ్రాయవలెను.



శ్రీ ర స్తు.

# కాశీమజిలీకథలు

## ప ది య వ భా గ ము

### 210 మజిలీ

### నారదమహర్షికథ



క. శ్రీనారదవరవీణా
గానారవ నిరత మౌళి కలితార్థమృగాం
కా! నీరధి తూణీరా
క్షోణీరథ ఘనరథాది సురగణవరదా.

వ. దేవా! అవధరింపుము. అపూర్వ మణిప్రభావ సమధిగత విచిత్రకథాప్రబోధన విదగ్ధుండగు మణిసిద్ధయతిసార్వభౌముండు. అభినవోదంతశ్రవణప్రవణ హృదయాశ్రయుం డగుగోపాలుతో గూడ దశోత్తర ద్విశతతమ నివాసప్రదేశంబు జేరి యందు విధికృత్యంబులం దీర్చికొని స్థానవిశేషంబులు జూడనరిగిన శిష్యునిరాకనరయుచున్నంత,

క. ముసిముసినగవుల మొగము
ల్లసితంబై యొప్పు దన తలం పెటిఁగింపన్
వెస వచ్చి మ్రొక్కె నగ్గో
పసుతుండా సిద్ధుపాదపద్మంబులకున్.

క. దీవించి యతఁడు వత్సా!
నీవదనముఁజాడఁజూడ నేఁడిచ్చట నే
దో వింతఁ జూచివచ్చిన
భావంబది దోఁచెఁ దేటపడఁ దెల్పుమనన్.

సీ. ఇది చిన్నకొట్టిక యిం దేవిశేషంబు
గానంగఁబడలేదు గానిసామి!
సీమాంతమున నొక్కగ్రామదేవత యాల
యము గ్రాలు దానికుడ్యములయందుఁ
దమకుఁదోఁచిన విగ్రహములను వ్రాసి పో
వుదురు పాంథులు వాని పొంత నరయ
వల్లకీకరుఁడు భాస్వజ్జటాధరుఁడు నా
రదమహామునివిగ్రహము నాకుఁ

గీ. గానఁబడె నేత్రపర్వంబుగా మహాత్మ
విస్మయప్రదమగు తత్ప్రవృత్తులెల్ల
వినఁగ వేడుక జనియింప వేగ నిటకు
వచ్చినాఁడ నియ్యదియ మద్వాంఛితంబు.

గురువర్యా! అమ్మహాత్మునిచరిత్ర మెన్నియోసారులుమిమ్మ డుగఁదలంచుచుండియు నేదియో ప్రసంగవశమున నామాట మఱచి పోవువాఁడను. నేఁడ విగ్రహదర్శనమూలముగా నేతత్ప్రశ్నావకాశము గలిగినది. నారదమహర్షి యెవ్వనికుమారుఁడు? ఎప్పుడు పుట్టెను? నివాసదేశ మెయ్యది? మహర్షియయ్యు నొండొరులకుఁ గలహములు పెట్టుటేమి? విరాగియయ్యు సంగీతప్రియుండెట్లయ్యె? దేవమునియయ్యు మూఁడులోకములు దిఱుగుచుండనేల? ఈసందియము లన్నియుఁ దీర నారదమహాముని చరిత్ర మంతయు సవిశేషంబుగా నెఱింగింపు మని ప్రార్థించుటయు మణిసిద్ధుండు నిజమణిప్రభా

వంబున నశేషపురాణస్థంబులైన నారదకథావిశేషంబులెల్లఁ గరతలా మలకంబుగాఁ దెలిసికొని మేను పులకరింప వాని కిట్లనియె—

వత్సా! సంసారలతాలవిత్రమగు నారదముని చరిత్రము విచిత్రకథాభూయిష్ఠమై యొప్పుచున్నది. నారదకథావిశేషములేని పురాణములులేవు. భారత భాగవత రామాయణములు తదుపోద్ఘాత ఖ్యాతములై యొప్పుచున్నవి. పెక్కేల? సమస్త పురాణములందు నేభాగము పరికించినను నేపుట్టము జదివినను నారదోక్తములగు కథలే కనబడుచుండును. నారదమహర్షికథాప్రశంస లేని గ్రంథమే లేదు. అక్కథలన్నియుం జెప్పుటకుఁ బెద్దకాలము పట్టును. సర్వజనసాధారణములైన తత్కథావిశేషంబులఁ గొన్ని యెఱింగించెద. సవహితుండవై యాలకింపుము. కల్పాదిని విరించి పద్మనాభు నాభికమలంబున జనించి పెద్దకాలము తపంబుగావించి పరమేశ్వరు నానతి సృష్టి సేయఁదలంచి తత్పరికరముల సరయుచున్నంతఁ బంచభూతము లావిర్భవించినవి. తదనంతరమున,

శ్లో॥ మరీచి రంగిరా అత్రిః పురస్త్యః పులహఃక్రతుః
షడేతేమానసాః పుత్రాబ్రహ్మణస్సుమహాబలాః॥

మరీచి, అంగిరసుస్సు, అత్రి, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు అను మహర్షు లావిర్భవించిరి. బ్రహ్మ మనంబునం దలంచినంతనే జనించుటచే వారికి బ్రహ్మమానసపుత్రులని పేరువచ్చినది. తరువాతనతని కుడికాలి పెనువ్రేలినుండి దక్షుండు నెడమకాలి వ్రేలి నుండి యసిక్నియను కన్యకయు హృదయమునుండి ధర్ముఁడు స్తనమునుండి భృగుఁడు తొడనుండి నారదుఁడును జనించిరి.

అరవిందభవుండు వారినందఱ నాదరించుచు బిడ్డలారా! మీరెల్ల ననుగుణ సతీయుతులై మత్సంకల్ప ప్రకారంబు ప్రజాసర్గము గావింపవలయును. ఇదియ మదీప్సితంబని యానతిచ్చుటయు,

సీ. అలరి మీయాజ్ఞనే నాచరించెదనంచు
సూచించె లేచి మరీచి యపుడు
మీయానతి నతిక్రమింప నేర్తునెయంచు
ననుమతి దెల్పె నయ్యంగిరస్సు
తప్పక మీరన్నచొప్పున నత్రిస్వ
నరసి కైకొందు నేననియె నత్రి
యంజలిపట్టి దేవా! వరించెద మంచి
వనిత నంచుఁ బులస్త్యముని వచించె

గీ. పులహుఁ డనుమోదమని ప్రీతిఁదెలిపెఁ గ్రతువు
కతుకపడె ధర్మమఁ జెప్పె భృగుండు లెస్స
యనియె దక్షుఁడ సిక్కి పాణిని గ్రహించె
నపుడె నారదుఁడేమి మాటాడఁడయ్యె.

గీ. నారదా! దారసంగ్రహ ణముగుఱించి
మౌనము వహించితేల? సమ్మతము లేదొ
సోదరులరీతి నీవు నే స్తుండవగుట
కభిమత మదేమియో తెల్పు మనిన నతఁడు.

ఉ. ఇంతికరంబు నెవ్వఁడు గ్రహించునొ యాతఁడు భోగసంగత
స్వాంతుఁడు గాడగు న్విగతభార్యునకుం బనిలేవు భోగముల్
కాంతనొకర్తుక న్విడునగా జగమంతయు వీడినట్లె వి
శ్రాంతి జగంబువీడిన ప్రశాంతుని దేకద సౌఖ్య మెన్నఁగన్.

సీ. చపలలాలారస స్రావిస్సై తగుమోవి
సేవింప నమృతంపుబావియనుచు

---

శ్లో॥ ఉత్సంగాన్నారదోజజ్ఞే అని భారతము కంఠదేశాచ్చనారదః నరదమన బ్రహ్మకంఠము వానివలన జనించినవాఁడు కావున నారదుఁ డనఁబడు చుండెను అని బ్రహ్మకైవర్తము.

నూహింప వక్షస్థలోద్భూత దుర్మాంస
పిండముల్ బంగారుకుండలనుచు
నస్తిసందర్శన వ్యాపారము రుభావ
భాసురాంచిత మందహాస మనుచు
దూషిత రుధిర మేదోమాంస చర్మాస్థి
నిచయంబు ఘనతటిత్ప్రచయ మనుచు
గీ. మానినీగాత్రముల కిల లేనిపోని
వర్ణనలు సేయుచుంద్రు నీ! వనితఁ దలఁప
నేవపుట్టుకుఁ బడఁతి గ్రహించుటెల్ల
జనక! మెడఁ బెద్దగుదె గట్టికొనుట గాదె.
గీ. భూరిసంసార సాగరాంబువుల నన్ను
ముంపఁదలఁచితె కాంతాభిముఖునిఁ జేసి
కలదె నిష్కృతి యెన్ని యుగములకైన
భవజలధి మున్గినట్టిజంతువున కభవ!
చ. సుతునకుఁ దండ్రియే సుగతిదొవ్పతిఁగింపక సక్తుఁడై యధో
గతిఁ బడఁజేయఁగా నతని గాచెడు వా రెవరింక తండ్రి! శ్రీ
పతిచరణారవింద యుగ భక్తి ఘటిల్లఁగఁ జేయుమయ్య! బల్
నెతబడ దారసంగ్రహణ వృత్తికి నామది యొప్పదెన్నడున్.

అనుటయుఁ జతురాననుండు వత్సా! సమస్తాశ్రమములలో గృహస్థాశ్రమ ముత్తమమని మహాత్ములు సెప్పియున్నారు. దేవతాతిథి పితృ తృప్తి గృహస్థులవలనం గలుగుచున్నది. గోవులు పానశాల సేరునట్లు గేస్తు నెల్లరు నాశ్రయింతురు. నీ వుత్తమకన్యం బెండ్లియాడుము. భార్యాస్వీకరణమున కంగీకరించిన మరీచ్యాది మహర్షులకంటె నీ వెక్కుడెఱుఁగుదువా! బాబూ! పెండ్లియాడుము నేనానందింతు, నని పలికిన విని నారదుండు తాలువులెండ భీతుఁడై యిట్లనియెం.

తండ్రీ! నన్ను స్త్రీని బరిగ్రహింపుమని బోధించుచుంటివి. ఆమాట వినిన నాహృదయము దద్దరిల్లుచున్నది. స్త్రీస్వభావము నీ కెఱుంగనిదా. వినుము.

సీ. వేదశాస్త్రములందు వెలఁదులచరితముల్
గడుదుష్టముగఁ జెప్పఁబడవె తండ్రి?
అశ్రుత శ్రుత్యర్థుఁడగు దుష్కులుఁడు గాక
ప్రాజ్ఞుండు నమ్మునే పడఁతుకలను
మనసులో సుభగుఁ గన్గొని పొందఁ గోరుఁ బైఁ
బ్రకటించు ఘనపతివ్రత యనంగ
ముదిమిడప్పినవాని మది శత్రువుగఁ జూచు
యౌవనవంతు సంస్తవము జేయు

గీ. సకలదోషంబులకు తావు జలరుహాక్షి
మది ముముక్షువులు మఱచియు ముదితఁ జూడ
గూడ దాసింపఁగూడ దెక్కాలఁదినైన
విషమువంటిది వాల్గంటి వివిధగతుల.

ఆమాటలు విని హాటకగర్భుండు నవ్వుచు నిట్లనియె. పుత్రా! నీవు స్త్రీజాతియంతయు దోషయుక్తమని నిందించుచుంటివి. అది తెలిసిన మాట కానేరదు. స్త్రీ లేనిచో సృష్టియే లేకపోవును. దుష్కులజ తలిదండ్రుల దోసంబున స్వతంత్రురాలై భర్తయాజ్ఞ నుల్లంఘించుఁగాక స్త్రీలందఱు నట్టివారలే యగుదురా? సత్కులంబునం బుట్టిన యువతి పతివ్రతయై పతిసేవఁ జేయుచున్నది. పతివ్రతాప్రభావము నీ వెఱుంగనిదియా? సాధ్వీతిలకము కన్నెఱ్ఱఁజేసిన మూఁడులోకములు గడగడలాడవా? సాధ్వియందుఁ బుత్రులంగని వృద్ధుండై తపోవనమున కరుగవలయు. గృహస్థుఁడు బాహ్యాభ్యంతర

ములు విష్ణునారాధించిన మహర్షితుల్యుండగును. నామాట విని పెండ్లి యాడుమని బోధించిన నారదుం డంజలివట్టి యి ట్లనియె.

మహాత్మా! నీవు సర్వజ్ఞుండవయ్యు నా కి ట్లసత్పథము బోధించుచుంటివేమి? ఇది నాకర్మముగాక మఱియేమి? స్త్రీలలో మంచివా రుందురుగాక సంసారము జలబుద్బుదమువంటిది కాదా! జలరేఖయెట్లు మిథ్యయో సంసారమునట్టిదే. యెండమావులయందు దప్పిదీర్చికొనఁదలంచినట్లు పునర్భవంబున సౌఖ్యంబుగోరుట నిష్ఫలంబుసుమీ! తండ్రీ! హరిదాస్యము విడచి విషయభోగములకుఁ బొమ్మందు వేమిపాపము. మూఢమానవులను విషయేచ్ఛ పురుగులకు మనోహరముగాఁ గనంబడు దీపశిఖవంటిదియై యంటిన నశింపఁ జేయును. మత్స్యబంధనమువలె ముట్టినందగిలికొనును. జనకా! ఈ సంసారమున నెవ్వని కెవ్వతె ప్రియురాలు. ఎవ్వని కెవ్వఁడు మిత్రుఁడు. బంధువుఁ డెవ్వఁడు? ఏటికట్టియలవలెఁ గర్మోర్ములచేఁ గూడికొని విడిపోవుచుందురు. గహనమువంటి సంసారమునఁ బ్రవేశింప నా కిష్టములేదు. కృష్ణాశ్రయ మంత్ర ముపదేశింపుమని ప్రార్థించుటయుఁ బరమేష్ఠి సంతుష్టినొందక యంతటితో నాప్రస్తావము విరమించెను.

దక్షుండును దండ్రియాజ్ఞ నసిక్నియందుఁ బదివేలమంది పుత్రులంగనియె. వారందఱు పెండ్లియాడఁ బ్రయత్నించుచుండ నారదుం డేదియో యుపదేశించి వారినెల్ల దిక్కులపాలు గావించెను. అందులకు వగచుచు దక్షుండు మఱియు వెయ్యిం డ్రబుత్రులం బడసి ప్రజాసర్గంబు గావింపుఁడని యుపదేశించుటయు నతని మాటలు పాటింపక వారు గూడ నారదోపదేశంబున దేశములపాలై పోయిరి.

అవ్వార్తవిని దక్షుండు క్షీణకోపాటోపంబున నారదుకడకు వచ్చి నీవేకాక నాబిడ్డల నందఱ సన్యాసులఁ గావించితివే అసూయా

పరుండవై మత్కులతంతువులఁ దెగ్గింపితివి నిన్ను పేక్షింపరాదు. వినుము. నీవు నాకుఁ బుత్రుఁడవై పుట్టుటయేకాక.

క. కొండెములుసెప్పి నేర్పుగ
నొండొరులకుఁ దగవుపెట్టు టుచితక్రియగా
నుండగఁ జగములఁగలహా భు
జుండని పేర్పొందుదవుర సురమునికోటిన్.

క. నీచెవిఁ బడినరహస్యం
బేచందంబైన నొరుల కెఱిఁగింపక లో
దాచినచో నీయుదరము
వాచు న్వ్రేలిబుచ్చదనుకఁ బరులెఱుఁగంగా.

అని శపించి దక్షుం డాక్షణమ బ్రహ్మయొద్దకుంబోయి నారదుండు తనకుఁ గావించిన యపకారప్రకారం బంతయు నెఱింగించిన విని విరించి పరితపించుచు నారదుని రప్పించి యత్యంతకోపముతో.

ఉ. ఏమిరమూఢ! నాపలుకులెల్ల గణింపక వీటిఁబుచ్చితౌగా
మఱి దక్షపుత్త్రులను గన్యకల న్వరియింపకుండ
దిగ్గాములఁ జేసినాడవఁట కాపురముల్ చెడఁగొట్టవచ్చునే
నీమది పాపమం చిది గణింపవొ పెద్దలధిక్కరింతువో.

ఏను వాసుదేవు నానతింగాదె ప్రజాసర్గంబునకుఁ బూనికొంటి నిప్పని కంతరాయంబు గల్పించుచుంటి వికఁ నిన్ను పేక్షింపరాదు. వినుము, నీవు స్థిరయౌవనులగు నేబదుగుర సుందరులకు వల్లభుండవై శృంగారప్రబంధముల రచించుచు శృంగారరసాసక్తిం బ్రవర్తిల్లుచుఁ బూర్వజ్ఞాన మించుకయులేక గాయకులలో నుత్తముఁడవని ప్రఖ్యాతి వడసి చరింతువుగాక. నామాటలు పాటింపనందులకు నీకీపాటిశిక్ష విధింపవలసివచ్చిన" దని శపించిన విని నారదమహర్షి దుఃఖించుచుఁ దండ్రి కిట్లనియె.

“తాతా! నేనేమితప్పుఁజేసితినని నాకిట్టి దారుణశాపమిచ్చితివి? సంసారమునకు వగచి విరక్తుండనై తపంబునకుఁ బోయెద నను జ్ఞయిమ్మని కోరితి నిదియపరాధమా? నాపై నీకీకోప మేలగలుగవలయు. అయ్యో! నేనీపునర్భవక్లేశ మెట్లనుభవించువాఁడ. కటకటా! తండ్రీ! యింతకఠిన శాపమిత్తువే. కానిమ్ము. నే నేజన్మమైన నెత్తుదును. సంతతము హరి పదారవింద ధ్యానమేమరకుండ నాకు వరంబిమ్ము. నీశాపము నన్నేమి యుం జేయజాలదు.

క. హరిభక్తి శూన్యుఁడైనన్
ధరణీసురుఁడైనఁ జెప్పఁదగు నధమునిగా
హరిభక్తి యుక్తుఁడైనన్
బురుగైన న్సర్వలోక పూజ్యత వడయున్.

అని కోరికొనుటయు హాటకగర్భుం డభినందించుచు నారదా! నీవు కోరిన వరమిచ్చితి. నీవు గంధర్వ చక్రవర్తివై హరిభక్తాగ్రేస రుండవై మహాపతివ్రతలగు నేబదుగురు భార్యలతోఁ బెద్దకాలము సుఖించి క్రమ్మర నన్నుఁ జేరుదువు గాక. నీకిది శాపము గాదు వరం బనుకొనుము. శృంగార లీలావిలాసము లనుభవించిన పిమ్మట నంతయు నీకే తెలియఁగలదని పలికి పలుకు కలికి యెకిమీఁడతనినను పయించెను:—

అని యెఱింగించిన విని గోపాలుండు ముకుళిత కరుండై మఱియుసిద్ధున కిట్లనియె. మహాత్మా! నారదమహర్షిని దక్షుండు తనకు బుత్రుండవై పుట్టుమని శపించెను కదా? ఆమాటయేమియుం జెప్పి తిరి కారేమి? మఱియు బంచభూతములు సృష్టికిఁ బూర్వము లేనట్లు మీమాటలం దేటపడుచున్నది. అప్పుడీ ప్రపంచకస్థానమం దేమి యున్నది? అది యెట్లుండును? చెప్పుమని యడిగిన నవ్వుచు మఱి సిద్ధుండు గోపా! నీవు లోతు ప్రశ్నములు వైచుచుంటివే! బాగు

బాగు. సృష్టికి బూర్వమీ పంచభూతములు లేనియవ్వుడీప్రపంచక స్థాన మెట్లుండునో చెప్పుటకే కాదు. ఇట్లుండునని యూహించుటకు గూడ వీలులేదు. అది పరమేశ్వరునికే తెలియును. నారదమహర్షి రెండవజన్మము. అసిక్నియందు గలిగినది వినుమని యవ్వలికథ పై మజిలీయం దిట్లు చెప్పఁదొడంగెను.



211 మజిలీ

# నారదుని గంధర్వజన్మము.



క. తరమే విధిగతి దాటఁగ
నొరులకు నారదమహర్షి యును గంధర్వాం
బుజహోతృల నేబదుగురఁ
బరిణయమై క్రీడ సలిపెఁ బరజన్మమునన్.

విద్యాధరాది దేవతావిశేషులలో గంధర్వు లొకతెగవారు. వారికి సంగీతమే కులవిద్య. స్త్రీపురుషులు సంతతము గానపరిశ్రమ చేయుచుందురు. వారికి దేవలోకములో నేకాక భూలోకములోఁగూడ సంచారము గలిగియున్నది. గంధర్వులు స్త్రీపురుషులు మిక్కిలి చక్కనివారు. గంధర్వకన్యకలు అచ్చరలవలె స్వేచ్ఛావిహారములు సేయరు. భర్తలవరించి పాతివ్రత్యశీలంబుల నొప్పుచుందురు.

గంధర్వలోకములో నొకభాగము రత్నకేతుఁడను గంధర్వ రాజు పాలించుచుండెను. అతండు సకలైశ్వర్యసంపన్నుండయ్యు సంతతిం బడయఁజాలక చింతించుచు వసిష్ఠోపదిష్టంబగు శివమంత్రంబు

జపించుచుఁ బుష్కరతీర్థంబున నూరుదివ్యవర్షంబులు తపంబు గావించెను. తత్తపంబునకు మెచ్చి మహేశ్వరుండు ప్రత్యక్షుండై యభీష్టమేమని యడిగిన నతండు విష్ణుభక్తాగ్రేసరు సకలకళాభిరాముఁ గుమారుదయజేయుమని కోరుటయు నవ్వరంబిచ్చి యుమాకాంతుం డంతర్హితుం డయ్యెను.

తద్వరప్రభావంబున నచిరకాలములో రత్నకేతునకుఁగుమారరత్నం బుదయించెను. వాని కుపబర్హణుఁడని పేరుపెట్టిరి. ఆబాలుండు శుక్లపక్షశశిపాపాలుఁడు వోలె ననుదినప్రవర్ధమానుండగుచు మాటలతోనే హరినామకీర్తన హితుండు, ఆటలతో విష్ణుకథా ప్రస్తారకోపరతుఁడు నై సర్వజనమనోహరంబగు శైశవంబునఁ దలిదండ్రులకే కాక సర్వగంధర్వలోక మనోహరుఁడై యొప్పుచుండెను.

రత్నకేతుఁడుచితకాలమున వానింజదువవేయుటయు గంధర్వవృద్ధులుకులాచార ప్రకారంబున,

క. స రి గ మ ప ద ని యటంచున్
స్వరములఁ బలికింపఁ దొలుత సంగీతమునన్
హరి నిగమపద యటంచుం
బరువడి వర్ణములమార్చి పలుకు నతండున్.

వత్సా! ఇది స్వరక్రమముగాదు. తొలుత సకారముచ్చరింపక హకారముచ్చరించెదవేమి? అని యుపాధ్యాయు లాక్షేపింప నాబాలుండు ఆర్యులారా! హకారపూర్వక రివర్ణకముగాని సకారపూర్వరివర్ణము నానాలుకకు రాదు. సంజ్ఞలలో సవర్ణము హవర్ణముగా మార్చికొనిన దోషములేదని యుక్తియుక్తముగా నుపన్యసించెను.

ఆయుపన్యాసమువిని గురువులబ్బో! ఈబాలుండు సామాన్యుఁడు కాఁడు. శాస్త్రములు స్వయముగా రచింపఁగలఁడని యబ్బురపడఁ జొచ్చిరి. అతని కుపాధ్యాయులు నిమిత్తమాత్రమునకే వాసినోటి

నుండి ప్రవాహమువలె శాస్త్రము లావిర్భవించుచుండెను. అచిరకాలములో నాబాలుఁ డశేషవిద్యా పారంగతుండగుటఁజూచివాని గారణజన్మునిగాఁ దలఁచుచుండిరి.

ఒకనాఁడు అమ్మాణవకోత్తముఁడు సవయస్కులగు గంధర్వకుమారులతోఁగూడి యుద్యానవనంబున హరిలీలావిశేషంబులఁ బాడికొనుచున్న సమయంబున నొకపరిచారకుం డేదియో పత్రికందెచ్చి యిది ప్రభువుగారు కుమారరాజుగారి కిమ్మనిరి. చదివి ప్రత్యుత్తరము తెమ్మనిరని నివేదించుటయు రాజపుత్రుని బాలసఖుండు శారదుండనువాఁడా చీటి నందుకొని విప్పి యిట్లు చదివెను.

శ్రీమదశేష గంధర్వ శిరోమణి కిరణ నీరాజిత పాదపీఠుండగు రత్నకేతుసార్వభౌముని చరణసన్నిధికి నీమిత్రుఁడు చిత్రరథుఁడువ్రాయు విజ్ఞాపనపత్రిక. ఱేపు రాఁబోవు కృష్ణచతుర్దశినాఁడు మద్గృహంబునఁ బార్వతీపరమేశ్వరులకు నాచే మహాపూజ గావింపఁబడును. అప్పుడు ముప్పదిమూఁడుకోటులు వేల్పులునింద్రాదిదిక్పతులు సంగీతవిద్వాంసులు మూఁడులోకంబులఁ బేరుపొందినవారందఱు వత్తురు. తాముగూడ సకుటుంబముగావచ్చి యిమ్మహోత్సవ విషయంబులఁ బాలుగొని నన్నానందింపఁ జేయ వేడుచున్నాను.

మఱియు నందొకనాఁడు సంగీతవిద్యాప్రసంగము జరుగును. అందు మొదటివాఁడుగాఁ బేరుపొందిన విద్వాంసునకుఁ బార్వతీమహాదేవి స్వయముగా జేసిన మహతియనువీణ పారితోషికముగానీయగలదు. అక్కానుకఁబడయుటకై త్రిభువనంబులంగల సంగీతవిద్యా విశారదుల వారిపేరులు పంపుఁడు. మనలో నెవ్వఁడైన నాపారితోషికమందఁ గలిగిన వోఁ గులవిద్య నిలుపుకొనినవార మగుదుము.

ఇట్లు విధేయుఁడు,

చిత్రరథుఁడు.

ఆపత్రికనంతయు విని రాజకుమారుఁడు వయస్యా! ఈజాబు తండ్రిగారు మనకుఁ జూపుమని పంపుటకుఁ గారణమేమనుటయు శారదుఁడు నవ్వుచుఁ జూచుటయేగాక ప్రత్యుత్తర మిమ్మనిరఁట. మనవిద్యావ్యాసంగ మేపాటిదియో: తెలిసికొనుటక్కై పంపిరి. కానిమ్ము. ఆపారితోషికము నీవందకుందువా? క్రింద సంగీత విద్యాప్రసంగకర్త యుపబర్హణుఁడు అని వ్రాసిపంపుము. తక్కినవానితో మనకుఁ బని లేదని పలికి యట్లు వ్రాయించి యాచీటి రాజుగారియొద్ద కనిపెను.

గంధర్వపతి యుపబర్హణుని వ్రాఁతజూచి చిఱునగవుతో నట్టె ప్రత్యుత్తరము వ్రాసి హేమకూటనగరమున కనిపెను. మఱి రెండు దివసములఱిగిన పిమ్మటఁ గుమారు రప్పించి రత్నకేతుఁడు బాబూ! నీవాసంగీతసభలోఁ బ్రసంగింతునని వ్రాయించితివి. ముక్కుపచ్చ లారని నీవెక్కడ? ఆసంగీతసభయెక్కడ? తగనిపనికిఁ బూనుకొంటివే! ఆమహాసభకు మహావిద్వాంసులందరు రాఁగలరు. తుంబురుఁడనువాఁడు గొప్ప పండితుఁడు. వానిముందర గానములో నితరులు పెదవి గదపఁ గలరా? సభకుఁబోయి యోడివచ్చిన యపఖ్యాతికాదా? అని యేమేమో పలికిన విని కుమారుఁడు మందహాసము గావించెను. శారదుఁడు తప్పక నీపుత్రుఁడా కానుక, బడయఁగలఁడని పన్నిదము వైచెను. అదియుఁ జూతుముగదాయని తేఁడు సమాధానముచెప్పెను.

చతుర్దశి సమీపించినంత శుభముహూర్తంబున రత్నకేతుఁడు కుమారుఁ బయనముజేసి శారదప్రముఖులు గంధర్వకుమారులు పెక్కండ్రు వెంటరా ఛత్రచామరాందోళికాది రాజచిహ్నములతో హేమకూటనగరమునకనిపెను. అప్పుడప్పట్టణమంతయు విచిత్రముగా నలంకరింపఁబడియున్నది. గరుడ గంధర్వ కిన్నర సిద్ధ విద్యాధరాది దేవతావిశేషులు గుంపులుగా వచ్చి యందుఁ బ్రవేశించుచున్నారు.

ప్రేక్షకులు ప్రవాహమువలె వచ్చి చేరుచున్నారు. రాజధానియం తయు మంగళవాద్యములు మ్రోగుచున్నవి.

చిత్రరథుని మంత్రులుపబర్హణుని రాక విని యెదురేగి సపరి వారముగాఁ దీసికొనివచ్చి రాజబంధువుఁడగుట రాజపుత్రికలుండు గృహారామసౌధంబునఁ బ్రవేశపెట్టిరి. మఱియు,

సీ. కోరి ముప్పదిమూడు కోటులు వేలుపుల్
భజియింప విచ్చేసె బలవిరోధి
స్వాహా స్వధా వధూ సహితుఁడై వచ్చె మ
హాహర్థుఁ డగ్నిభట్టారకుండు
కాలకన్యాది కింకర వర్గ మనుసరిం
పఁగఁ జేరెఁ జారురూపమున యముఁడు
గానశిక్షితులు కోటానఁగోటులు గొల్వఁ
జనుదెంచె దానవచక్రవర్తి

గీ. వరుణుఁ డనిలునితోఁ గూడివచ్చె యక్ష
భర్త విచ్చేసె నీశానుపజ్జ మఱియు
నాగలోకమునుండి పన్నగులు శేష
వాసుకి ప్రముఖులు వేడ్క వచ్చిరపుడు.

మఱియు నియమితవాసరంబునకు,

గీ. ఇరుగడలఁ బార్షదులు బరాబరులు సేయ
నందివాహనమెక్కి తా నగజతోడ
వచ్చె శంకరుఁ డయ్యుత్సవమున కపుడు
చిత్రరథుకోర్కి దీర నర్చింపఁబడఁగ.

చిత్రరథుండు బంధుమిత్ర పరివార యుక్తుండై పెద్దదూర మెదు రేగి నమస్కారపూర్వక స్తుతివాక్యములతోఁ దూర్యనాదంబు లవా ర్యంబై యొప్ప నయ్యుమామహేశ్వరుల నాత్మీయ మందిరాభ్యంత

రంబునకుఁ దోడ్కొనివచ్చి రత్నమంటపమునందలి మాణిక్యపీఠంబు నం గూర్చుండఁబెట్టి నట్టియెడ,

శా. మ్రోసెన్ దంధణయంచు దుందుభిరవంబుల్ నల్దెసల్ నిండఁబూ
సేసల్ జల్లిరి వేల్పులాడిరి సురస్త్రీ లింపుగా వేణువీణా
సంగీతములు న్నుతించిరట గంధర్వుల్ మును ల్భక్తితో
దోసిళ్లొగ్గి నమశ్శివాయ యనుచున్ స్తోత్రంబులం జేయఁగా.

చిత్రరథుం డట్టితఱిఁ దనమనోరథంబు దీర నానాభువనంబుల నుండి యరుదెంచిన శునాసీరాది బృందారక బృందంబులు సంభ్రమముతో నుపలక్షించుచుండ భార్యతోఁగూడ నభిముఖముగాఁగూర్చుండి యుమామహేశ్వర చరణారవిందంబుల సువర్ణపుష్పంబులఁ బూజింపుచుండె నప్పుడు తత్పుత్రికలు మాలావతీప్రభృతులేబదుగురు జగన్మోహన రూపవేషంబులతోవచ్చి తలిదండ్రులు గావించునర్చనలకు తోడుపడుచుండిరందు,

గీ. మాలావతి యటఁ జపురీ
వాలముకై బూని వీచెఁ బరమేశ్వరులన్
లోల మణికిరణ కంకణ
జాల ఝుణంఝుణారవం బెసంగఁ బ్రియముతోన్.

కొందఱు పూజాపాత్రంబులఁ గైకొనిరి. కొందరు జేగంటల మ్రోగించుచుండిరి. కొందరు మంగళహారతులు బాడుచుండిరి. కొందరు పన్నీరు జల్లుచుండిరి. చిత్రరథుం డత్యంతవైభవంబుతో నుమామహేశ్వరుల మహాపూజగావించి స్తుతిపాఠంబులం బఠించె. తదనంతరంబున నతనిపుత్రికలేబదుగురు గీతంబులం బాడుచు మంగళహారతు లీయఁబోవుసమయంబున నారదుండు లేచి మహాపీఠంబున కనతిదూరములోఁ గూర్చున్న యుపబర్హణుని నిరూపించుచు "సభ్యులారా! యీతఁడు రత్నకేతునికుమారుఁడు. ఈమహాపూజాసమయం

బునఁ బార్వతీపరమేశ్వరులపై దాను రచించిన గీతఁబొకండుపాడుట కుత్సహించుచున్నాఁడు. అనుజ్ఞయిత్తురే" యని యడిగినఁ దుంబురుఁడు లేచి "నేఁడు కాలాతీతమైనది. తేపుజరుగఁబోవుసంగీతసభలో నీగీతవిషయములు పాడవచ్చు"ననియుత్తరమిచ్చెను. 'ఇదిసంగీతవిషయముకాదు. శివస్తోత్రగీతము నేఁడే పాడవచ్చు'నని సభాధిపతిగానున్న బృహస్పతి యాజ్ఞయిచ్చెను.

అప్పుడువబర్హణుండు వీణపై మనోహర స్వరములు వెలయించుచు నిట్లుపాడెను.

పంచచామరము. ఉమామహేశ పాదపద్మయుగ్మమున్ భజింతునే
సమస్త దేవ మస్తకప్రశస్త రత్న భూషణా
ప్రమేయ చిత్ర సత్ప్రభా విభాసితంబులన్ సదా
నమో నమో నమో యటంచ నంతభక్తి యుక్తిమై.

ఆగీతము వీణాతంత్రీస్వర మిశ్రితముగా నపూర్వస్వరకల్పనలు చేసి తనకుఁగల సంగీతవిద్యావైదగ్ధ్య మంతయుఁ బ్రకటించుటయు సభ్యులాశ్చర్యరసావిష్టులై యాహాహాయనిపొగడ మొదలిడిరి. ఈమహాపురుషుండెవ్వఁడని యందఱు నతనిదెస దృష్టులువ్యాపింపఁజేసిరి. క్షణకాల మాసభాభవనము తదీయ స్తవనాదముఖరితమై యొప్పినది. చిత్రరథుని పుత్రికలు అతనిసంగీతనైపుణ్యము ఆకారసౌష్ఠవము తేజోలక్షణముపరికించి మోహావివశలై యూరక యతనిఁ జూడఁదొడంగిరి. తరువాత నప్పురాణదంపతులకు నివాళులిచ్చిరి. మహోత్సాహముతో నాఁటిసభ ముగిసినది.

అని యెఱింగించి యయ్యోగి పుంగవుండు తదనంతరోదంతం బవ్వలిమజిలీయం దిట్లు చెప్పందొడంగెను.

# ఉపబర్హణుని వివాహము.



అరవింద—ఆచార్యా! తుంబురూ! నేఁడు సంగీతసభాదివసము గదా! ఇంకను శయనగృహము వీడకుంటిరేల? సూర్యోదయమగుచున్నది. అప్పుడే సంగీత విద్యావిశారదులందఱు సభాస్థలమునకరుగుచున్నారు. లెండు లెండు.

తుంబురుఁడు—(కన్నులు నలిమికొనుచు లేచి నిట్టూర్పుతో) అరవిందా! సూర్యోదయ మగుచున్నదా? కానిమ్ము. నేఁడు మనమా సభకుఁబోవకునికియే శ్రేయమని తోఁచుచున్నది.

అరవింద—స్వామీ! అట్లనుచున్నారేమి? మీశిష్యురాండ్రమందరము ప్రథమపారితోషిక మామహతి మీచేతంబడునని యనుకొనుచున్నామే సభకేపోవలదందురేల? మీముందరనిలిచి పాడెడి వైణికుఁ డెవ్వఁడుగలఁడు? మీకాదైన్యమేలగలుగవలయును?

తుంబు—నిన్న నీవాసభకు రాలేదాయేమి?

అరవింద-లేదుసామి. లేదు.క్రొత్తగీతములనాలపించుచున్నాను.

తుంబు—అందులకే అట్లడుగుచున్నావు. మనకిఁక నాలాపములుకావు విలాపములే.

అరవింద—నిన్నటిసభలో నేమిజరిగినదిసామి!

తుంబురు-క. ఉపబర్హణుఁడఁట భళి మన
మెపుఁడెఱుగమువానిఁజూచి యింతీ! తద్గా
నపరిశ్రమ మీవిధమని
నిపుణతఁబరికింపఁ దెలియనేరముకాదె.

గీ. రమణి! గంధర్వకులభర్తరత్న కేతు
నందనుండఁట యట్టిగానప్రశస్తి
యెందునేర్చెనో దేశికుండెవఁడో వాని
కహహా! తత్కల్పితము లగమ్యములుసూవె.

అరవింద—అయ్యో! గానవిద్యా మహామహోపాధ్యాయు లైన మీరే యిట్లు మెచ్చుకొనుచుండ నగ్గంధర్వకుమారుని గాన పాండిత్యం బనన్యసామాన్యమని తెలియఁబడుచున్నది. అతనిపేరు పట్టికలో వినియుంటి మిక్కిలి చక్కనివాఁడనియు హరిభక్తుండ నియుం జెప్పిరి. కాని సంగీతములో నింతవాఁడని యెవ్వరును దెలిపి యుండలేదు.

తుంబురు—త్రిలోకమోహజనక రూపుఁడగుఁగాక. హరిభ క్తుఁడగుఁగాక దాన మనకేమి? అట్టియద్భుతగాన కౌసల్యమెట్లునేర్చె నో తెలియదు. నిన్న నొక్కగీతముపాడి తన ప్రావీణ్యము తెలియఁ జేసెను. నేఁడెంత ప్రగల్భముజూపునో తెలియదు కానిమ్ము వేళ యగుచున్నది.
నీవీ వీణఁబట్టించుకొని సభకుఁబొమ్ము. రాజపుత్రికలు నాకై వేచి యుందురు వారిందోడ్కొని వచ్చెద.

అని తుంబురుఁడు శిష్యురాలగు నరవిందకు నియమించి తాను రాజపుత్రికలయంతఃపురమున కరిగెను. అప్పుడు చిత్రరథునికూఁతురు మాలావతి చెల్లెండ్రతోఁగూడికొని యుపబర్హణుఁడు పాడినస్వర విశేషంబులఁ బాడఁ బ్రయత్నించుచుండెను. అలవడినవి కావు. అంతలో సంగీతోపాధ్యాయుఁడు తుంబురుఁడు వచ్చెననువార్త విని సంతోష ముతో నార్యా! నిన్న నాగంధర్వకుమారుఁడుచేసిన స్వరకల్పనలెట్టివో యని విమర్శింపఁజేతగాకున్నవి. ఆమెలకువ మాకు కఱపింతురా! అతఁ డేపాటి గట్టివాఁడు? అని యడిగినఁ దుంబురుఁ డిట్లనియె.

మాలావతీ! ఇప్పుడు వేళచాలదు. తరువాత నారహస్యము లెఱింగింతు. సభకుఁ బదుఁడు. అతండెట్టివాఁడో నేఁడు తెలియఁబడుఁగాదె. ఇప్పుడు చెప్ప నేల? అనిపలికి యటఁగదలి సామాన్యవేషముతో నుపబర్హణునిబసలోని కరిగెను. అందొక వీణ సవరించి యాలాపించుట కమరింపఁబడియున్నది. తుంబురుఁడు అందున్న శారదుం బల్కరించి యుపబర్హణుం డెందున్నవాఁడని యడుగుచు నావీణనంటి తంత్రులమోగించి మెట్లుపరికించి యాప్రస్తారప్రకార మేమియుం దెలియక సిగ్గుపడుచు దిగ్గునమరలి నీవెవ్వండ వెందులకువచ్చితివని శారదుఁడడుగుచుండ వినిపించుకొనక మెల్లగా నవ్వలకుఁబోయెను.

అంతలో నలంకరించుకొని యుపబర్హణుఁడు మేడదిగి వచ్చి శారదునితోఁగూడ బండియెక్కి సభాభ్యంతరమున కరిగి యొకపీఠంబునఁ గూర్చుండెను. తోడనేయతని పరిజనులావీణఁదెచ్చి ముందరిపీఠంబున నునిచిపోయిరి.

ఆసభ విశ్వకర్మచే నిర్మింపఁబడినదగుటఁ బీఠములచే విచిత్రముగా బ్రస్తరింపఁబడియున్నది. సంగీతప్రసంగముచేయఁగలస్త్రీలును బురుషులు గరుడగంధర్వసిద్ధవిద్యాధరాదులు దిక్పతులు యథాగతముగావచ్చి సభ నలంకరించిరి. పిమ్మటఁ బార్వతీపరమేశ్వరు లగ్రపీఠముల నధివసించిరి. చిత్రరథుండును భార్యయు నిరుగడల నిలిచి వింజామరలు వీచుచుండిరి.

నవరత్నఖచితమై యద్భుతతంత్రీకలితమైన మహతియను వీణారత్న మొకండెత్తుపీఠంబున మెఱయుచున్నది. అదియే పార్వతీనిర్మితమగు విపంచియని యెల్లరువిస్మయముతోఁ జూచుచుండిరి. సభయంతయు నిండినపిమ్మటఁ బార్వతీపతి యనుమతిని బృహస్పతి లేచి యెల్లరు వినునట్లుపన్యసించెను.

సభ్యులారా! గంధర్వులకుఁ గులవిద్యయగుట సంగీతమునకు గాంధర్వమని పేరువచ్చినది. ఇది గంధర్వలోకమగుట నావిద్య యిందుఁ బరీక్షింపఁబడుచున్నది. ఆవిద్యలోఁ బ్రసంగింప నింతకు మున్ను పేరులు వ్రాసిపంపినవారందఱు నిందు వచ్చియున్నవారని తలంచెదము. గానమన వీణాగానమేగానము. వైణికులే యిందుఁ బరీక్షింప బడుదురు. మనోహరముగాఁ బాడుట తచ్ఛాస్త్రములోఁ బ్రసంగించి గెలుపుగొనుట వీనిలో నెవ్వఁడుత్తముఁడని పేరుపొందునో వానికీమహతి పార్వతీమహాదేవి పారితోషికముగా నీయఁగలదు. పిమ్మట నీమహతిపై మంజులముగాఁ బాడి సభ్యుల రంజిల్లంజేసిన యంత నతనికిఁ ద్రిలోకసంగీతవిద్వద్రత్నమని బిరుద మీయఁబడును. అట్టి సమర్థుఁడెవ్వఁడో లేచి ముందరకు రావలయునని పలికి సురగురుండు గూర్చుండెను. క్షణకాలమాసభ చిత్రింపఁ బడినట్లు నిశ్శబ్దంబై యొప్పెను. అంతలో,

సీ. ఊర్ధ్వపుండ్రములు దామోదరోత్తమభక్త
శేఖరత్వము ప్రతిష్ఠింపుచుండఁ
జారుతేజము చిరాచరితాధిక తపఃప్ర
భావజ బ్రహ్మత్వపటిమ దెలుప
లలితావయవ కోమలత సర్వగంధర్వ
సార్వభౌమత్వ లక్షణము బలుక
వాగ్వైభవంబు సర్వకళావిశేష పాం
డిత్యోచ్చ్రయం బుగ్గడింపుచుండ

గీ. లీల నుపబర్హణుం డట్టులేచి యాది
జంపతుల కంజలిఘటించి సభ్యులెల్ల
విస్మయంబంది చూడంగ వివశులగుచు
జలద నిర్ఘోష లలిత వాక్కుల వచించె.

చ. అడుగుఁడు నన్ను గానకళ లం దెటనైన సదుత్తరంబుగా
నుడివెద శాస్త్రపద్ధతి మనోజ్ఞముగాఁ దగఁ బాడువాఁడ నె
వ్వఁడు గలఁడిందు నాకుఁ బ్రతి వాది వచింపుఁడు వాని పేరు న
న్నడచినవాని కిందు మణి కంకణమిచ్చెద మెచ్చి చెచ్చెరన్.

క. గానం బొకఁడే కా దె
వ్వానికి నేవిద్యయందుఁ బరిచితిగలదో
దాని నడుగంగవచ్చుం
బో నిపుణతదెలియ మెప్పు బొందఁగ నిందున్.

అని పలికి కూర్చుండెను. అప్పుడు

సీ. మోమెత్తకట మౌనముద్రఁ బూనుచుఁ దుంబు
రుఁడు కాలి పెనువ్రేలఁ బుడమివ్రాయు
ఘనులు హాహాహూహూ గంధర్వులురు లజ్జఁ
దలవాల్చికొని యేమి పలుకరైరి
వినుపించుకొననిచాడ్పునఁ బరాకుగ మాట
లాడుదు రితరులతోడ సురలు
వగచి డెందములఁ బన్నగులు విన్నదనంబుఁ
దొడరంగఁ బడగలుముడిచికొనిరి

గీ. యూర్వశియు రంభ మేనకయును ఘృతాచి
మారుపలుకక యొకమూల మసలుచుండి
రెల్లఁగి యాసభ్యులందు నొక్కరుఁడు గాని
నిలిచి యేనని పలుకంగ నేరఁడయ్యె.

అప్పుడు బృహస్పతియే వానికిఁ బ్రతివాదియై సంగీతశాస్త్ర
ములో విపులముగాఁ బ్రసంగించి తత్సమాధానములకు మెప్పువడసి
యతని నాలింగనముజేసి గంధర్వపుత్రా! నీవు కారణజన్ముండవు.
హరిభక్తాగ్రేసరుఁడవు. సంగీతమందే కాదు. ఏవిద్యలో నిన్ను మించి

నవాఁడు లేడు. నీ నిమిత్తమే సర్వమంగళ యీవిపంచి నిర్మించి తెచ్చినది. దీనిపై సంతతము శ్రీహరిం గీర్తింతువుగాక. అని పలుకుచు నాశర్వాణి పాదపీఠముదాపునకుఁ దీసికొనిపోయి నిలువఁబెట్టెను.

ఆమె యతనిమ్రొక్కు లందుకొని పెండ్లికొడుకవుకమ్మని దీవించుచు నా విపంచి యతనిచేతం బెట్టినది.

అప్పుడు సభ్యు లతనిపైఁ బుష్పవర్షము గురిపించిరి. పిమ్మట నతం డగ్రపీఠ మలంకరించి యామహతి మేలగించి యనంతరాగము లుప్పతిల్ల సర్వజనమోహజనకంబుగా గీతంబులం బాడి వేదవేదాంగ ములవినిపించి శాస్త్రప్రవత్తులం దెలిపి శ్రోతలరాగవివశులం గావించె నప్పుడు,

సీ. తుంబురుఁడు రులజ్జతో నెక్కడో డాగి
కొనియె నింద్రుఁడు మెచ్చికొని నుతించె
బాపురే యనుచు దిక్పతులు సన్నుతిఁజేసి
రురగులు పొగడిరో హో యటంచు
విద్యాధరులు మోహవివశులై కొనియాడి
రౌరాయటంచు గుహ్యకులు మెచ్చి
రాదిత్యులెల్ల మేలౌనౌనటంచుఁ గై
వారముల్ సేసి గ ప్సరసలెల్ల

గీ. ఫాలమునఁ గేలుగీలించి ప్రణుతిఁజేసి
రోలగములోని వారెల్ల నొక్కపెట్టు
భళిర! యుపబర్హణా! బలే! బాగుబాగు
లెస్సపాడితివని నుతుల్ సేసి రపుడు.

అప్పుడు చిత్రరథుఁడు పరమేశ్వరుఁడు వినఁ బార్వతీమహా దేవితో అంబా! నీ వాగంధర్వకుమారునికి వల్లకి నిచ్చుచుఁ బెండ్లి కొడుకవు గమ్మని దీవించితివి. ఆదీవెన వరముగా దయచేయుము.

మీ సేవకురాలు మాలావతి నతని యర్ధాంగింజేసి యాశీర్వదింపు మని జనాంతికముగాఁ బ్రార్థించిన మహేశ్వరుఁడు నవ్వుచు మాలావతికే కాదు. నీకూతుండ్రందరకు నతండే భర్తకాఁదగినవాఁడని యుత్తర మిచ్చెను.

అట్లైన మఱియుం బ్రమోదమేకదా. అని చిత్రరథుండు పలికెను. అందుఁ గల సంగీత విద్వాంసుల కందఱకు నుపబర్హణునే కానుకలిచ్చునధికారిగా నియమించుటచే నతండందున్న గాయకుల పేరులు చదువుచుఁ బరీక్షించి వారివారికిం దగిన పారితోషికము లిప్పించుచుండెను.

మాలావతి మొదలుగాఁ గల చిత్రరథపుత్రిక లేబదుగురు తమ పేరులు వ్రాసియిచ్చియుండిరి. ఉపబర్హణుఁ డాపట్టికం జూచి మాలావతి యెవ్వతె? యని యడిగిన నమ్మగువ నగజప్రక్కం గూర్చుండి యట్టిలేచి నేను నే నని యుత్తరమిచ్చినది. అతం డత్తలోదరి గానకళాప్రసక్తిం గొన్నిప్రశ్నము లడిగి సదుత్తరంబు వడసి మెచ్చుకొనుచు నా మచ్చెకంటి కీయఁదగిన కానుక యేదియని యాలోచించుచుండ జగదంబ గ్రహించి యి ట్లనియె.

కుమారా! ఈబాలిక చక్కఁగాఁ బాడినది. దీనికిం దగిన పారితోషిక మేమియిత్తువు? యీసతి మితముగా నిచ్చిన నొప్పుకొనదు. అమితప్రదుండవు కావలయునని మా యభిప్రాయము. ఏమందువని యడిగిన నామాట కర్థము గ్రహించి యుపబర్హణుఁడు అంబా! నేను మీయాజ్ఞాకరుండ. నాకొక స్వతంత్రముగలదా. మీ రెట్లు చెప్పిన నట్లు చేయుటకు సంసిద్ధుఁడనని యుత్తరము జెప్పెను. అప్పుడు పార్వతి యాయువతి నొడిలో నిడుకొని,

ఉ. ఈమె మహాపతివ్రతలకెల్ల శిరోమణియై జగన్నుతో
ద్దామయశఃప్రకాశముల ధర్మరతిం బతితోడఁగూడి నా

నా మణికాంచనోరుభవనంబుల సౌధములందు సంతతే
చ్ఛామహితప్రచారముల సౌఖ్యములందుచు నొప్పుగాభుర్తఁ.

తక్కినవారింగూడ నట్లే పేర్కొనుచుఁ గీర్తించినది. అప్పుడు,

క. మ్రోగించిరి దుందుభులు న
భోగులు గురిపించి రపుడు పూవులవానల్
యోగులు దీవించిరి సు స
భాగులు, వినుతించిరిష్ట పడి దంపతులఁ.

అప్పుడు చిత్రరథుండు సఫలీకృతమనోరథుండై యుమామహేశ్వరులం బ్రార్థించి యింద్రాదిబృందారకుల వేడికొని రత్నకేతు సకుటుంబముగా రప్పించి యయ్యుత్సవము పరిణయోత్సవముగా మార్పించి యామంటపంబు వివాహవేదికగాఁ జేసి తన కూఁతుండ్ర నేబదుగురనయ్యుపబర్హణున కిచ్చి వివాహము గావించెను. అయ్యుత్సవానంతరమున దంపతులం దీవించి దేవతలెల్ల దమతమ నెలవులకుఁ జనిరి. రత్నకేతుండును కుమారుండును కోండంద్రును వెంటరా చిత్రరథు చేననిపించుకొని స్వనిలయంబునకుం జనియె.

ఉపబర్హణుఁడే బదుగురు భార్యలతో విమానమెక్కి తిరుగుచు భక్తిరసము మూర్తిభవించినట్లా విపంచిపై శ్రీహరిఁగీర్తించుచు శృంగారరసము తనువుగైకొని నట్లా చేడియలతోఁ గ్రీడాశైలముల సుందరోద్యానవనములఁ గొలకుల కెలకులఁగాసారతీరముల నదీపుళినంబుల మనోభవకళావైదగ్ధ్యంబు తేటపడ నప్పడతులతో బ్రహ్మానందసదృశమగు సుఖం బనుభవించుచుండెను. అని యెఱింగించునప్పటికిఁ గాలాతిపాతమైనది. తదనంతరోదంత మవ్వలిమజిలీయందిట్లు చెప్పందొడంగె.

---

213 వ మజిలీ

# మాలావతికథ



క. నారాయణ నారాయణ
 శ్రీరాజితవక్ష దేవసేవితచరణాం
 భోరుహ కారుణ్యా కూ
 పారా క్షీరాబ్ధిశయన పాలితభువనా.

బ్రహ్మలోకములో నొకనాఁడు సంగీతసభ జరిగినది. ఆసభకు రమ్మని దేవలోకములోఁ బ్రసిద్ధివడసిన వైణికులకెల్లఁ బత్రికలువచ్చి నవి. ఉపబర్హణుఁడు విమానమెక్కి యాగానసభకుఁబోయెను. ఉప బర్హణుని గీతప్రావీణ్యము మూడులోకములు వ్యాపించినది. అతం డుండ మరియొకగాయకుఁడు నోరుమెదల్పఁజాలడు. ఆసభలోఁగూడ నతండే వీణాగానంబున శ్రీహరిం గీర్తించుచు సభ్యులచే మెప్పువడ సెను. తరువాత సభ్యులకుల్లాసము గలుగఁజేయ రంభచే నందు నాట్యము జేయించిరి. అప్పుడు,

చ. వలఁబడినట్టి జక్కవకవం బురడించి మెఱుంగుపైఁటలో
 గులుకుమిటారిబోటి చను గుత్తులనట్టె నలంతిగాలిఁ బై
 వలువఁదొలంగఁజూచి యుపబర్హణుఁడంగజబాణతప్తుఁడై
 స్ఖలనమునొందెఁగన్గొని పకాపకనవ్విరి వేల్పులెల్లరున్.

గీ. రంభకన్నను గడునభి రామలైన
 రామలెందరో కలుగ భార్యలుగ నతఁడు
 రంభకుచకుంభములఁగాంచి భ్రాంతిపడియె
 పరతరుణులన్న రహిగాదె పురుషులకును.

అప్పుడు చతుర్ముఖుఁడు తదీయశృంగారలీలావిశేషంబు లరసి యాహా. పరమవిరక్తుఁడగు కుమారుని శృంగారశేఖరుఁ గావించి భ్రష్టుఁ జేసినవాఁడ నేనకదా! కానిమ్ము. ఉత్తమసత్త్వులకు విపత్తి మూలమునఁగాని యాత్మీయ సామర్థ్యము వెల్లడికాదని తలఁచి యతనినుద్దేశించి యిట్లనియె.

గీ. బ్రహ్మసభయంచునించుక భయములేక
నిట నసభ్యప్రవర్తన నెసఁగఁజేసి
తనయమతిఁగాన గంధర్వతనువువిడిచి
శూద్రయోని జనింపుమా క్షోణియందు.

అని శపించుటయు నుపబర్హణుఁడాత్మీయ ప్రమాదవిధానంబు తెలిసికొని లజ్జావనతవదనుఁడై దోసిలివట్టి.

గీ. అట్లమీయాజ్ఞశూద్రుండనగుదుఁగాక
యపుడు శ్రీమన్ముకుందపాదారవింద
భక్తియేమరకుండఁగ వరమొసంగు
మిదియపదివేలు నాకు లోకేశయనిన.

నీయభీష్టప్రకారంబె కాఁగలదని పలికి జలజగర్భుండతని వీడ్కొలిపె నుపబర్హణుఁడు క్రమ్మరనింటికివచ్చి శాపప్రకారంబు భార్యల కెఱింగింపక వారితోఁగూడ విమానమెక్కి మలయపర్వతమునకరిగి విశాలరమణీయలతావేష్టితమగు నొక శిలాఫలకంబునం గూర్చుండి భార్యలకందలి వినోదంబులఁజూపుచున్నంతలో,

క. తలనొప్పివచ్చె మేనికి
బలువేకిజనించె మిగులబడలికదోపన్
గలఁగియతఁడొక్క చలితోడ
దలగడగాఁజేసికొని వెతన్ శయనించెన్.

అక్కలికి యతని ముఖవికారంబు జూచి వెఱచుచు అక్కా! మాలావతీ! యిటురా. మన మనోహరుఁడు ఇట్లున్నవాఁడేమి? కన్నులకళదప్పినదే! రమ్మురమ్ము. అని కేకలు వేయుటయు మాలావతి వడిగా వచ్చి చూచి గుండె బాదుకొనుచు అయ్యో! ఇదియేమి పాపము! ఇప్పుడే కాదా మన కీవినోదములఁ జూపుచుండెను ప్రాణనాథా! ఉపబర్హణా! అని పెద్దయెలుంగునం బిలిచినది. ప్రత్యుత్తరమువడయక యతండు మృతుండయ్యెనని తెలిసికొని యురము మోదుకొనుచు నేలంబడి మూర్ఛవోయినది. తక్కినకాంతలందఱు చుట్టుకొని హాహాకారరవంబులతో విలపింపఁదొడంగిరి.

అక్కాంత కొంతసేపటికి లేచి యతని మోము జూచుచు లేవనెత్తి యురంబున వైచికొని యవయవముల ముట్టుచు గడ్డముపట్టుకొని జీవితేశ్వరా! యొక్కసారి మాటాడుము. అమృతమును దిరస్కరించు పలుకుల మమ్మొకమాటు అలరఁజేయుము హా! విదగ్ధరసికప్రవరా! హా సుందరమూర్తీ! హా విష్ణుభక్తాగ్రేసరా! మమ్ము విడిచియరగడియ తాళకుందువే అయ్యో, నీవియోగ మెట్లు సైతుము మాలతీలతావిలసితములగు గంధమాదనశైలతటంబుల మలయపర్వతంబున జందనప్రవాళతల్పంబుల మనోహరసరస్సికతాతలంబులఁ గోకిలలు గూయ నీవు గావించిన రహఃక్రీడలెట్లు మఱచువారము? అక్కటా! ఇంతలో మాకీవంతవచ్చునని యెఱుఁగకపోతిమే. స్త్రీలకు బతివియోగముకన్న దారుణమగు విపత్తి మఱియొకటి లేదుగదా. ఇతర దుఃఖము లెన్నియైనఁ బతిఁగలసికొనిన నట మటుమైపోవును. అని దుఃఖించుచు నంతలో నత్తలోదరిశోకోన్మత్తయై తత్తరముతో నాకసమువంకఁ జూచి యంజలివట్టి యోదేవతలారా! ఓదిక్పతులారా! త్రిమూర్తులారా! మీరు మీభార్యలతో నెట్లు సుఖింతురో నాభర్త నాతోనట్లు సుఖింపరాదా! ఈవియోగమేమిటికి

గలిగించితిరి ? కరుణించి నాభర్తం బ్రతికింపుఁడు ఏమంటిరి ? పల్కరేమి ? ఔను సామంబున నెవ్వరు నుపకారము సేయరు కానిండు. ఇఁక నాప్రజ్ఞ జూపించెదఁ గాచికొనుఁడు అరే ! వేల్పులార ! మీరు యజ్ఞభాగములఁ గుడిచి మత్తిల్లి యొడలెఱుంగకున్నారు తృటిలో మీనోఁటియన్నము పడఁగొట్టెదఁ జూడుఁడు! దామోదరా? నీవు జగదీశుండవని యెఱుంగుదు నామొర విని నాపతిం బ్రతికింపక పోయితివి. ఇఁక నీగొప్ప నాకేమిటికి ? పతివియోగదుఃఖావేశంబున నేను యుక్తాయుక్త వివేకశూన్యురాలనై యున్నాను. నీయధికార మూడ నిన్నుఁ గూడ శపింపకమానను. చతురాస్యుఁడా ! నీవిది వఱకే యపూజ్యుఁడవై యున్నావు. ఇప్పుడు నేను గావించు ననర్థము తెలిసికొనుము నీయధికార మూడఁ బెఱికి కుండలుజేయు కుమ్మరవానిఁ జేయుదుఁ జూడుము. శంకరా ! నీపేరు నేతిబీరకాయవంటిదే మైన దేమి ? నాకుఁ బతిసుఖము లేకుండఁ జేయుదువా ? నీవు మృత్యుంజయుఁడవై యొరులకు మృత్యువు నప్పగింతువా ? నిన్ను జ్ఞానశూన్యుఁ జేయఁదలఁచుకొంటి నెఱుఁగుము. యముఁడా ! నీవు ధర్మరాజని పేరుపెట్టుకొంటివి. నీధర్మ మేమూల దాచితివి ? నాబతింగడతేర్చితివే ! ఆయనధర్మ లోపమేమి గావించెనో చెప్పుము. నీకడ మృత్యువు గాలుడు నున్నారఁట వారినెల్లఁ గుటుంబముతో నాశనము జేసి లోకోపకారము గావించెద నిన్ను స్థానభ్రష్టుం గావింతు సూర్యచంద్రాదుల గతులెట్టుసాగునో చూచెదం గాక నిలువుఁడని పెద్దయెలుఁగునఁ బలుకుచు నమ్మహాపతివ్రత వారినెల్ల శపింపం దలంచి యురంబునుండి పతిశవంబు మెల్లన నేలంబరుండబెట్టి స్నానము జేయఁ గౌశికితీరంబున కరిగినది అప్పుడు,

చ. గడగడలాడె లోకములు గంపమునొందెఁ గులాచలంబులుఁ
 వడఁకె సమస్తదిక్కులును వార్ధులుఘూర్ణిలెఁబంకిలంబులై

దడఁబడె దిగ్గజంబులు వితాకుపడెఁ ఫణినేత వేల్పులం
గడఁకశపింపఁ గాంత యుదకంబులచెంతకుఁ జేరునంతలో.

అప్పుడు బ్రహ్మరుద్రేంద్రాది దేవతలా యుపద్రవ మెఱిఁగి శ్రీమన్నారాయణునికడ కరిగి యిట్లు విన్నవించిరి. అందు ముందు యముండు కరకమలంబులు ముకుళించి తన ప్రభుత్వము నుద్దేశించుచు నిట్లనియె.

సీ. దురితాత్ములైనను మరణకాలమున మీ
పేరెన్నికొనినంతఁ జేరరాదు
నరకార్హులై యొప్పినను శంభుపూజ నిం
చుక చేయవారిఁ జేర్చుకొనరాదు
కాలంబుమూడినగాని పోయిపతివ్ర
తలభర్తలను దేరఁ దలఁపరాదు
బ్రహ్మవ్రాసినయట్టి బ్రదుకు చెల్లినను దా
పసకుమారులఁజేరి పట్టరాదు
గీ. అరసి మాకున్నయధికార మనుసరించి
చేయుటయుఁ దప్పులగుచుండఁ జెడ్డదేదొ
మంచియేదియొ ధర్మసూక్ష్మంబుదెలియ
సంకటంబయ్యె నిఁక నెట్లు జరుగు ప్రభుత.

మహాత్మా! నే నీ యధికారము సేయజాల. తపంబునకుం బోయెద నిప్పనికి మఱియొకని నియమింపుము. అయ్యయ్యో బ్రహ్మశాపదగ్ధుండగు నుపబర్హణునిం బట్టికొనుటకు వ్యాధిపుంజంబులం బంపక కాలపురుషు సహాయమిచ్చి మృత్యుకన్యంబంపి రప్పించుకొంటి. నందులకై యలిగి యతనిపత్ని మాలావతి మృత్యుకన్యా కుటుంబముతో నన్ను మహోద్వాసన జేయుటకు సంకల్పించుకొన్న దఁట. ఈమృత్యుకన్యక యన్నమునినక బెంగపెట్టుకొని సకుటుంబ

ముగా నాకడకువచ్చి మొఱ్ఱవెట్టుకొనుచున్నది. మేమందఱ మవ్వలఁ బోయెదము సెలవిండనిపలికె ననంతరము పరమేష్ఠి యిట్లుస్తుతించెను.

చ. బళిర! పతివ్రతా ప్రథితభాసుర తేజము కాలదారుణా
నలముగతిం దహించె భువనంబులనన్నిటిఁ జూడుమెల్ల వే
ల్పులకును మాకునుం భయముపుట్టగఁ జేయుచునున్న దయ్యయో!
తెలిసి యుపేక్షసేయుటిది దేవరకుందగునే రమాధవా!

అని బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు ప్రార్థించుటయు నారాయణుఁడు వారి కభయహస్తమిచ్చి వారినెల్ల వెంటబెట్టుకొని బ్రహ్మచారి వేషముతో నమ్మహాపతివ్రతయున్న నెలవునకుంబోయి—

సీ. ఉరమునన్ జీవితేశ్వరు శవంబల్లన
బూని దక్షిణ హస్తమునఁదదీయ
వీణార్కమాలల వ్రేళులదాల్చి కాం
త ప్రీతి యోగముద్రను ధరించి
సారెకుఁ బలిముఖాబ్జము శుభేక్షణములఁ
గనుచు నద్భుత తేజమున దనర్చి
వహ్నిశుద్ధంబైన వస్త్రంబు రుచి శర
త్కౌముదీ రుచిరాంగ కాంతిఁ దెలుప
గీ. షోడశాబ్దవయః పరిస్ఫురిత యౌవ
నమున నొప్పుచు మణిమండనములతోడ
మోముదామర దిలకంబు ముద్దుగులుక
తనరు మాలావతిని గనుంగొనియె శౌరి.

అట్లు చూచి తలయూచుచు నెఱుఁగనివాఁడుంబోలె బ్రహ్మాది దేవతల మీరిందేల వచ్చితిరని పల్కరించుచు మాలావతి నుద్దేశించి యిట్లు పలికెన.

బ్రహ్మచారి—సాధ్వీమణీ! నీవెవ్వని కూఁతురవు? ఎవ్వని భార్యవు? నీపేరేమి?

మాలావతి—వటూత్తమా! ఆనందపూర్వకముగా విప్రరూపుఁడగు జనార్దనునకు నమస్కరించుచున్నాను.

బ్రహ్మ—స్వస్తి తేస్తు. సౌభాగ్యవతీభవ.

మాలావతి—మహాత్మా! నీమాట సత్యమగుఁగాక. వినుమేను చిత్రరథుని కూతురను. ఉపబర్హణుని భార్యను నాపేరుమాలావతి యండ్రు.

బ్రహ్మ—నీవీశవంబు నిట్లురంబున వహించియుంటివేల?

మాలావతి—ఈతండు నాపతి అకస్మాత్తుగా మృతినొందెను. సతులకుఁ బతులయందెట్టి యనురాగముండునో విద్వాంసుఁడవగు నీ వెఱుంగకపోవు.

బ్రహ్మ—ఎంతయనురాగమున్నను సతి పతిశవంబు దాల్చియుండునా?

మాలావతి—నాభర్త శవముగాదు. ఈతనిం బ్రతికింపవలయునని వేల్పులంబ్రార్థించుచుంటి. శుభాశుభ కర్మఫలంబుల దేవతలిచ్చుటకు కర్తలు. కర్మవృత్తుచ్ఛేదముసేయుటకుఁ గూడ వారికధికారమున్నది. నాకు వారు పతిభిక్షపెట్టినలెస్సయే. లేకున్న వారిదారుణశాపపాత్రులం గావించెద.

బ్రహ్మ—తల్లీ! దేవతలు కర్మఫలంబిచ్చుటకుఁ గర్తలేకాని వానివెంటనే యీయఁగలరా? కాలపక్వము కావలదా? కృషికుండు విత్తనముచల్లినతోడనే ఫలించునా? సుఖదుఃఖములు పూర్వజన్మకర్మఫలంబులని నీవేచెప్పితివిగదా. అందులకు దేవతలేమిచేయగలరు? నిర్హేతుకముగా దేవతలశపించినఁ బ్రయోజనమేమి?

మాలావతి——వటూత్తమా! ఎట్టివారికిని స్వకార్యమునకై ప్రయత్నించుట సహజము కార్యతత్పరులు భావాభావములం దెలిసి కొనజాలరు. నాభర్తం బ్రతికింపకపోయినచోఁ దప్పక వేల్పులనెల్ల శపింపకమానను నాశాప మెవ్వఁడడ్డముసేయునో చూతుగాక.

బ్రహ్మచారి——అమ్మా! మాలావతి! నీవుమహాపతివ్రతవు. నీశాప మమోఘమని యెఱుఁగుదును. ఇంచుక నిదానించుము నాకు సర్వరోగచికిత్సలుం దెలియును. ఏడుదివసంబులక్రిందట మృతినొందిన వానిం బ్రతికింపఁగలను నీభర్త యేరోగముచేత మృతినొందెనో చెప్పుము. మృత్యుజరావ్యాధిపుంజములు నావశములోనున్నవి. నీవు కోరినవానినెల్ల రప్పించి నీయెదుటఁ బెట్టెదను.

మాలావతి——(మోమెత్తియతనింజూచి) మహాత్మా! నీవు ప్రాయంబున జిన్నవాడవైనను యోగవేత్తలకన్న బ్రౌఢముగాఁ జెప్పుచుంటివి. నీవునాపతింబ్రతికింపఁగలవు సంతోషమయినది. ఏరీ కాలమృత్యుకన్యాదుల రప్పింపఁగలనని చెప్పితివి. వారినొకసారినామె దుట బెట్టుము కొన్నిమాటలడిగెదంగాక!

బ్రహ్మచారి——వారినెల్లంజీరి రప్పించి యామె యెదుట నిలువంబెట్టి,

ఉ. నల్లనికాంతిగల్గి యరుణంబగు వస్త్రములంధరించి హా
సోల్లసితాస్యమొప్పఁద్రియుగోరు కరంబులతోడ భీతిసం
ధిల్లగఁజేయు రూపున ననేకులు వ్యాధిసుతుల్ భజింపఁగా
నల్లదెమృత్యుకన్య కనుమా! పతికాలునిమ్రోలనిల్చెడిన్.

సీ. ఆఱుమోములు పదియాఱుబాహువులు ని
ర్వదినాల్గునేత్రముల్ బాదషట్క
మమర గ్రీష్మరుమార్తాండ తేజముగల్గి
యసితదేహచ్ఛాయలెసఁగమెసఁగ

వికట దంష్ట్రాభయానకరక్త నేత్రుఁడై
రక్తాంగరాగవస్త్రములుదాల్చి
సర్వసంహారదక్షస్వరూపముతోడ
వెలయుకాలుఁడువీఁడె కలికి! చూడు

గీ. మరసివరియించె మృత్యుకన్యాలలామ
వీనిమున్ను స్వయంవరవిధులనితఁడు
జమునకుహితుండు వ్యాధిపుంజములనెల్ల
గడుపునిండంగ మున్నుదాగన్నతండ్రి.

క. అలమృత్యుకన్య చెంగట
నిలిచి మహావృద్ధులయ్యు నిపుణత శిశువుల్
వలెఁ బాలుగ్రోలుదురు వ్యా
ధులువారదె జనకునూత దుర్జయులుసుమీ.

క. యముఁడీతఁడు ధర్మా ధ
ర్మములెఱిఁగినప్రోడ చూడు మధురాధర! రో
గములును మృత్యువు కాలుఁడు
సమముగనడిపింతు రితనిశాసనమెపుడున్.

సాధ్వీ! ఆమెమృత్యుకన్యక పెద్దకూతురు జరాదేవి. ఆము వ్వురు వాతపైత్యశ్లేష్మలు కుమారులు వారందఱు ఆసంతతివారే వారి నేదేనియడుగఁ దలంచిన నడుగుమని పలికినవిని యక్కలికి తొలుత యము నుద్దేశించి.

మాలావతి—ధర్మరాజా! నీవు సమస్తధర్మముల నెఱింగిన వాడవుగదా? నాభర్తనేమిటికి మృత్యువశుం జేసితి? నీకుజాలిలేదా?

యముఁడు—అమ్మా! మాలావతి! కాలము మూఁడనివాని నెవ్వరుఁజంపనేరరు. కాలపురుషునియాజ్ఞఁబూని యతనిభార్య మృత్యు కన్యక జంతువులసమయించుచుండు. కావున నీమాటకు మృత్యు

కన్యయొ బాధ్యురాలు నాకేమియుందెలియదు.

మాలావతి—(మృత్యుకన్యకంజేరి) ఓసీ మూర్ఖురాల నీయాకారము చూచినంతనే ప్రాణములుపోవఁగలవు. నీవాఁడుదానవు కావా? భర్తృవియోగదుఃఖమెట్టిదో నీకుఁదెలియదా? నాభర్తనేమిటికిఁదీసికొని పోయితివి? దారుణశాపంబున నిన్ను నాశనముజేసి లోకముల కుపకారము గావింతుఁ జూడుము.

మృత్యుకన్య—(గడగడవడంకుచు) తల్లీ! పరమేష్ఠి యిట్టి దారుణకృత్యములు సేయుటకే నన్ను సృష్టించెను. తేజస్వినివగు నీ యట్టి మహాపతివ్రతయే నన్ను భస్మముసేయ సమర్థురాలగుచున్నది. నన్ను నాశనముజేయుము. భువనంబుల కుపకారమగుఁగాక. అమ్మా నాకేమియు స్వతంత్రములేదు నాభర్తయగు కాలపురుషునిచేఁ బ్రేరేపింపఁబడి ముందుగా బిడ్డల ననిపి తరువాత జీవకోటిని వశముజేసికొందును. ఇదియే నాపని నీభర్తను స్వతంత్రించి నేను దీసికొనిరాలేదు. ఆకారణము నాభర్తనే యడుగుము.

మాలావతి—(కాలపురుషుం జూచి) ఓయీ! నీవు కర్మసాక్షివి సనాతనుఁడవు. నారాయణాంశము నీయందున్నది నీకు నమస్కరించుచున్నదాన. నాభర్త నేమిటికి నీభార్య కప్పగించితివి? ఈద్రోహకృత్యము నీవే చేసితివని యందఱు నీపై ద్రోసివేసిరి. తగుకారణము సెప్పకున్న నిన్ను భస్మముజేసెద నాసామర్థ్య మెఱుఁగుదువా?

కాలపురుషుఁడు—తల్లీ! నీభర్తను దీసికొనిపోవుటకు నే నెవ్వఁడను? ఈమృత్యుకన్యక యెవ్వతె. యముఁ డెవ్వఁడు? వ్యాధు లేమి చేయఁగలవు? ఇందులకు మాకే స్వతంత్రమున్నచో రెండుగడియలలో బ్రహ్మాండములన్నియుఁ గబళింపకపోవుదుమా? పరాత్పరునికి బద్ధులై సూర్యచంద్రులు పంచభూతములు పంచరించు

చున్నవియో మహామాయ యెవ్వని స్వాధీనములోనున్నదియో ఎవనియాజ్ఞ బ్రహ్మ సృష్టించునో రుద్రుఁడు లయముజేయునో యట్టి నారాయణునియాజ్ఞ లేక యెవ్వరు నే పనియుఁ జేయజాలరు. నీవు నిజము దెలిసికొని మమ్ము శపింపుము.

మాలావతి—(వారిమాటలు విని యాబ్రహ్మచారి మొగము చూచుచున్నది)

బ్రహ్మచారి—(నవ్వుచు) సాధ్వీ! నీవు వీరి మాటలన్నియు వింటివిగదా? వీరిలో నీభర్తను హరించినవాఁ డెవ్వడో చెప్పుము వానిని శిక్షించెదంగాక. మఱియు నన్నేమియడిగెదవో యడుగుము.

మాలావతి—స్వామీ! వారి యధికారపుమాటలు వారు సెప్పిరి. వారితో నాకునిమిత్తములేదు. నీవు మొదట నాభర్తం బ్రతికించెదనని శపథము జేసితివి. ఆమాటయేనిలుపుకొనవలయును.

బ్రహ్మచారి—వేల్పులారా! మహాపతివ్రతయగు మాలావతి తనభర్తంబ్రతికింపవలయునని కోరుచున్నది. లేనిచో లోకములు భస్మము జేయునఁట. సతీశాప మమోఘముగదా. పరమేష్టీ! కర్తవ్య మేమియో చెప్పుము.

బ్రహ్మ—వటూత్తమా! నీవెవ్వఁడవో మాకుఁ దెలియదు వాక్పటుత్వముగలవాఁడ వగుదువు. మానిమిత్తము వాదించి యామె కోపము జల్లారఁజేసితివి.

ఈగంధర్వకుమారుండు నా [illegible]. యతి కొంతకాలమువఱకు నా శాపంబంటకుండఁ జేయఁగలను. ఇప్పుడయూ పద దాటినపిమ్మటం జూచుకొందముగాక. అనిపలుకుచుఁతన కమండ లూదక మతనిపైఁ జల్లినంత నతఁడు గదలఁజొచ్చెను. శివుండు జ్ఞాన మిచ్చెను. వహ్ని జఠరాగ్ని, కాముఁడు కామబలము, వాయువు ప్రాణములు, సూర్యచంద్రులు దృష్టులునిచ్చిరి వేల్పులెల్ల తమతమ

సామర్థ్యాను సారముగా జీవనోపాధిగలుగఁ జేసిరి. కాని చైతన్యము గలుగలేదు. ఆత్మాధిష్టాతలేకపోవుటచేత బోధత్వము గలిగినది కాదు. అప్పుడు పరమేష్ఠి మాలావతితోఁ దల్లీ! నీవు శ్రీవిష్ణుంగీర్తింపుము. ఆయనశక్తి ప్రవేశించినంగాని నీభర్తకుఁ జైతన్యముగలుగదు. మాకాసామర్థ్యములేదు. మామాశక్తుల నిచ్చితిమని పలికిన విని యక్కలికి యలరుచులేచి స్నానముజేసి శుచియై యంజలిపట్టి యిట్లు స్తుతించినది.

గీ. ఎవఁడు లేక దేహములెల్లను శవములై
పోదురట్టి పరమపురుషుసర్వ
హేతుమూలహేతు నీశ్వరునభవు న
నంతునాత్మఁ బ్రస్తుతింతునెపుడు.

గీ. ఎల్లరును సేయు కర్మలకెల్లసాక్షి
యగుచు నిర్లిప్తుఁడై వానియందు నెప్పు
డెల్లకడ నిండియుండియు నితరులకు నో
కింతయునుగానఁ బడని పరేశుఁగొలుతు.

అని వినుతించుచు నా వటూత్తముని పాదంబులంబడి మహాత్మా! నీవే సర్వాధిష్టాతవు. రక్షింపుమని ప్రార్థించినది. అప్పుడు విష్ణుండు సర్వశక్తులతోఁగూడ నధిష్టానముగా నాయుపబర్హణుని దేహములోఁ బ్రవేశించెను. నిద్రితుండు మేల్కాంచినట్లుపబర్హణుం డట్టలేచి చెంగటనున్న మాలావతింజూచి ప్రేయసీ! నేను బండుకొని చాలసేపైనది కాఁబోలు లేపితివి కావేమి? అని యడిగిన నాచేడియ యతని యడుగుల నంటి ప్రాణేశ్వరా! మీకుఁ జెప్పవలసినది చాల గలదు. స్నానముజేసి రండని ప్రార్థించినది.

అతండు లేచి కౌశికీనదిం గృతావగాహుండై ధౌతవస్త్రంబు ధరించి వీణంగైకొని శ్రీహరి నిట్లు గీర్తించెను.

పంచచామరము. హరే హరే హరే హరే సితాంబరాయ తేనమో
సురేశముఖ్య సర్వదేవ సుందరోత్తమాంగ స
త్కిరీటదీప్త పాదపీఠ దివ్యమంగళస్వరూ
పరాజితాపరాజితారి పంచచామరస్తుతా.

అని భజియించుచు మాలావతివలనఁ దన మరణవృత్తాంతము విని యందున్న దేవతాబృందములకు వందనంబొనరించుటయువారం దఱు నాదంపతుల నాశీర్వదించుచు బతివ్రతా ప్రభావమింతయొప్పునే యని యచ్చెరువందుచు సంతోషముతో నిజనివాసంబులకుఁబోయిరి.

మాలావతి చెల్లెండ్రతో భర్తతో నింటికిం జని యత్తమామల కావృత్తాంత మెఱింగించి బ్రాహ్మణుల కనేక దానములు గావించినది. అనేకవ్రతములు సేసినది. మఱికొన్ని సంవత్సరము లాయుపబర్హణు నితో సంతోష మనుభవించినది అని యెఱిఁగించి... పై మజిలీయం దిట్లు చెప్పఁదొడంగెను.



## 214 వ మజిలీ.

### నా ర దు ని దా సీ పు త్ర జ న న ము.

# క లా వ తి క థ



గీ. వరములిచ్చిన దేవతావరులు వచ్చి
శూద్రయోని జనించుట సురుఁగదయ్యొ
బ్రహ్మశాపప్రసక్తి నారదమహర్షి
కరయ విడుచునే ప్రారబ్ధమవని జనుల.

కన్యాకుబ్జదేశంబున కథినాయకుండై ద్రుమిళుండను గోపా

లుండు కళావతియను భార్యతోఁ గాపురము సేయుచుండెను. ద్రుమిళుఁడు హరిభక్తుఁడు. సంతతము శ్రీహరినామసంస్మరణము గావించుచుండును. కలావతియుఁ గలావతీశిఖామణియనఁద్రిలోకమోహజనకంబగు సౌందర్యంబునం బ్రకాశించుచునది.

సీ. శారదపూర్ణిమా చంద్రబింబము డంబు
దెగడు చక్కని ముగ్ధమొగముతోడ
దేహలావణ్యప్రవాహప్లవోరుకం
భము లనఁదగునురోజములతోడ
మేలిమిబంగారు మిసిమిరంగుబెడంగు
జడిపించు నునుమేనిచాయతోడ
మునులకైనను మోహమొదవించు బలుచూపు
లను జిమ్ము తెలిసోగకనులతోడ

గీ. కలదు లేదను భ్రమగొల్పు కౌనుతోడ
రత్నభూషణరుచిర గాత్రములతోడ
దనరు నయ్యింతి బలు చక్కఁదనము కళకు
సాటివత్తురె తెరగంటి చానలైన.

నవరత్నపరిభాధగద్ధితములగు భూషణంబుల ధరించి యమ్మించుబోడి వేడుకలతో భర్తసమీపమునఁ జిట్టకంబుల వెలయింప నతండా వాని నేమియు గణింపక హరిధ్యానలాలసుండై యొప్పుచుండును. అతని విరక్తి గ్రహించి గోపిక యోపికతోఁ బతిసేవచేయుచుండును. మఱియును.

చ. కనుఁగవమూసి యాతఁడధికంబగు భక్తిరమేశునామ చిం
తన మొనరించుచుండఁ బ్రమదామణి దాపునఁ దాళవృంతమున్
గొని తగవీచుఁ బాదములకుం బ్రణమిల్లు నతండు లేచి న
ర్తనమొనరింపఁ దాను ననురక్తి రమాధవుఁబాడు నింపుగాన్.

మ. త్రిజగన్మోహన రూపసంపదల నుద్దీపించు నయ్యింతి యం
బుజ నాభాంఘ్రిసరోజయుగ్మ భజనాప్తాండై మనోనాథుఁడా
త్మజ కేళీవిముఖాత్ముఁ డయ్యెననుచుం దర్కించినద్భక్తితో
భజియించున్ సువిరక్తి రాగరహితుం బ్రాణేశునెల్లప్పుడున్.

అవ్విధం బొరులకుఁ దెలియనీయక కలావతి సంతతము పతిసేవా పరాయత్తచిత్తయై వర్తించుచు నొకనాఁ డేకాంతముగాఁ గాంతు నంతికమున వసించి చిఱునగవుమొగంబునకు నగయై మెఱయఁ గర కమలంబులు ముకుళించి యిట్లనియె. ప్రాణేశ్వరా! హరిపాదసేవా నిరతులైన మీచరణసేవ నా కనేకజననకృత సుకృతపరిపాకంబున లభించినది. అందులకు నిత్యము డెందంబున సంతసించుచుందు. మఱియు లోకవాసనాలబ్ధంబగు నభిలాషచే మిమ్మొక్కటి కోరు చుంటి. వినుండు. పుత్రోత్పత్తికై నాయందు వీర్యాధానంబు గావింప వలయు. కామాభిలాష నిట్లడిగితినని తలంపవలదు. మీపాదంబుల తోడు నాకయ్యభిలాషలేదు అని లజ్జావనతవదనయై యడిగిన నతండు సిగ్గును విషాదంబును మనంబున బెనఁగొన దలవాల్చి యిట్లనియె.

గీ. ఏ నపుంసకుండ నెఱుఁగవో నీవయో
వాంఛలేదు నాకు వనితలందు
నిన్నుఁ జూచిచూచి నే నెదఁజింతింతు
మగతనంబులేమి మగువ! యెపుడు.

గీ. ఒడలునిండంగఁ దొడుగ నీతొడవులెల్ల
కడుపు నిండంగఁగుడువ నీ కుడుపులెల్ల
కలుగనీ భాగ్యమది యెంతగాని సతికి
గలుగదించుక రతికేళిఁ గలుగు ప్రీతి.

అని శాస్త్రప్రవాద మున్నది. విలాసవతీ! భవదభినవరూప యౌవన శృంగార విలాసంబులం దిలకించియు నసమర్థుండనగుట, బరిత

పించుచుందును. నీవును మదనసమర్థత్వంబు గ్రహించి రట్టుసేయక పతీ ధర్మంబు నెరవేర్చుచుంటి విది లెస్సయగుతెరు విందులకు దేవతలు మెచ్చుదురు. అది యట్లుండె. నీవివ్వుడు సంతానాపేక్షంజేసి కామాభిలాష సూచించితివి కావున నాయుపదేశంబొండు వినుము. నీ విప్పుడుండేనింబోయి యుత్తమపురుషునివలన వీర్యాధానంబువడసి రమ్ము. దానం బుత్రునిం బడయుదువుగాక. ఇది శాస్త్రదూష్యంబు గాదు. కులాభివృద్ధికై పూర్వు లాచరించిన పని. పురాణముల వ్రాయఁబడి యున్నదని యుపదేశించిన విని యవ్వనితారత్నం బొక్కింతసేపు ధ్యానించి యిట్లనియె.

ప్రాణేశ్వరా! నేను మీయాశయము గ్రహింపక యిట్లడిగి నందులకుఁ జింతించుచుంటి. క్షమింపుఁడు మీపాదసేవకన్న నాకు సంతాన మెక్కువదికాదు. ఇఁక త్రికరణముల నామాట తలపెట్టనని పలికిన నతండనునయపూర్వకముగా నిట్లనియె. ప్రేయసీ! నీ వడుగకున్నను నీ కీమాట చెప్పఁదలఁచికొనియే యున్నాను. ఇది తప్పుపని కాదు, మరియొక తెరువునఁ గులాభివృద్ధి బడయఁజాలము పొమ్ము. ఉత్తమపురుషు నరసికొమ్మని పలుకుచు బలవంతముగా నామె నిల్లు కదలించెను.

గోపికయు భర్తృనిర్బంధమున శుభముహూర్తమున నిల్లు విడిచి యొక మహారణ్యమార్గంబునఁ బడి పోవుచు,

గీ. వర్ణములకెల్ల గురువు విప్రవరుఁడరయ
సందు సత్కర్మనిరతుఁ డత్యధికుఁడంత
కన్న శ్రేష్ఠుండు సత్త్వకరణశాలి
యట్టితాపసుఁడెందు నొప్పారునొక్కొ.

అని తలంచుచు నగ్గోపిక యోపికతోఁ బెక్కుదేశములు తిరిగి తిరిగి యొక్క వనంబునఁ దపోనిష్ఠాగరిష్ఠుండై యోగధ్యానరతుండై

యున్న కాశ్యపుండను బ్రాహ్మణోత్తముంగాంచి గ్రీష్మకాలమ ధ్యాహ్న మార్తాండతేజమువోలె దుర్నిరీక్ష్యంబగు తదీయతేజంబు గన్నులకు మిఱుమిట్లు గొలుపవెరగందుచు దూరమున నిలువంబడి నమస్కరించుచు,

గీ. ఇతఁడు హరిభక్తుఁడుత్తమ వ్రతరతుండు
బ్రహ్మతేజఃప్రపూర్ణ విగ్రహుఁడు విప్ర
వంశభూషణుఁ డిమ్మహావరుని బొంది
పడసెదనుగాక సుగుణాఢ్యుఁ గొడుకునేను.

అని తలంచి యమ్మహర్షి స్నానమున కఱుగు మార్గమధ్యంబున శృంగారచేష్టలు వెలయింపుచు వసియించినది. కాశ్యపుండునుకొండొక వడికిఁ దపోనిష్ఠ చాలించి స్నానంబుసేయ నా ప్రాంతమందలి జలాకరంబున కరుగుచు దారిలో దివ్యరూపంబునం బ్రకాశించు నమ్మించుబోడిగాంచి వెరగంది జవ్వనీ! నీవెవ్వతెవు? ఎవ్వనిభార్యవు? ఇవ్విపినంబున కేమిటికి వచ్చితివి? నీయొయ్యారంబుసూడ బుంశ్చలివివలెఁ దోచుచుంటివి. దాచక నీయుదంతము చెప్పుమని యడిగిన నయ్యొప్పులకుప్ప లేచి నమస్కరించుచు నిట్లనియె. దేవా! నేను గోపకులసంజాతను ద్రుమిళుండను గోపశ్రేష్ఠుని భార్యను. నాపేరు కళావతియంద్రు. నేను భర్తయాజ్ఞవడువునఁ బుత్రార్థినై మీకడ కరుదెంచితి. నాయందు వీర్యాధానంబు గావించి మంచికుమారుం దయచేయుఁడు. సర్వభక్షకుఁడైన పావకునకుం బోలెఁ దేజశ్శాలులకు నేపనివలనను దోసములంటవు. నా యభీష్టంబు దీర్పుఁ డిదియే నాయాగమనకారణంబని ప్రార్థించిన విని యాబ్రాహ్మణుఁడు భ్రుకుటీవికటనిటలుండై కటంబు లదర పండ్లు పటపటం గొఱుకుచు నిట్లనియె.

ఓసి రంకులాడీ! నీవు నాకు శాస్త్రముపదేశించుచుంటివా? చాలుఁజాలు. జ్ఞానదుర్బలుండైన బ్రాహ్మణుఁడు శూద్రపత్నిం

గూడినచో చండాలుండగుచున్నాఁడు. దేవపితృకార్యముల నట్టివానిం జేరరాదు. వాఁడు సాలగ్రామము ముట్టికొనఁదగఁడు వృషలీసంపర్కంబు గలిగిన విప్రుండు పితరులతోఁ గూడఁ గుంభీపాకనరకంబునం బీడింపఁబడు. వాఁ డిచ్చిన తర్పణంబులు పిండంబులు మూత్రపురీష తుల్యంబులగుచుండును. శూద్రాధరపానంబును గావించిన పాఱుఁడు రౌరవంబునొందు. కావున నీ భోగంబు నే నొల్ల. నీవిలాసంబు నాకడఁ జూపకుము. మఱియొకని నాశ్రయింపుమని పలికిన విని యక్కలికి యులికిపడి సిగ్గు పెంపున నేమాటయుఁ బలుకనేరక ముహూర్తకాల మూరకుండి వెండియు నిట్లనియె.

మహాత్మా! మత్సంపర్కంబు కల్మషప్రదమని యొల్లకున్న నే నేమిసేయుదాన నానపడివచ్చిన మచ్ఛ్రీకంటిం గూడిన దోసంబు లేదని లోకప్రవాదముగలదు. మీకిష్టములేకున్న పోనిండు. మత్పూర్వపుణ్యమెట్లున్నదియో యట్లు కాఁగలదు. శ్రీకృష్ణమంత్రంబు జపించుచు మీకడ వసించెద నాశుశ్రూష కంగీకరింతురే అని యడిగిన నతం డామాట వినిపించుకొనక తటాకంబున కరిగెను.

కలావతియు నమ్మౌనమే యంగీకారసూచకమని తలంచి యయ్యాశ్రమమున కల్లంతదవ్వులోఁ జలాకరము దాపున వసించి కందమూలాదులం దినుచుం గృష్ణమంత్రంబు జపించుచు నమ్మహర్షి దయ కెదురు సూచుచుండెను. కాశ్యపుఁడు కొన్నిదినము లామెవంక చూడకయే స్నానముచేసి పోవుచుండును. కొన్నిదినము లటు చూచుచు మాటాడక పోవుచుండును. మఱికొన్నిదినము లామె గుణవంతురాలని తెలిసికొని స్నానమున కరుగునప్పుడు గోపీ! నీ వేమి తినుచుంటివి. కందమూలాదులవలన నాఁకలి దీరుచున్నదా? అని పల్కరించి పోవుచుండును.

మఱియొకనాఁ డతండు కొలనికిం బోవుచు వానం దడిసిన

పుట్టంబు విప్పి పిండికొనుచున్న యాచిన్నదాని యవయవలావణ్యంబు జూచి హృదయము చలింప నందు నిలువంబడి గోపీ! పాపము రాత్రి వానం దడిసితివి కాఁబోలు పర్ణశాలకు రాలేకపోయితివా? అని యడిగిన విని చెలఁగుచు నచ్చెలున తళ్కుఁ చూపుల నతనిఁ జూచుచు స్వామీ! మీసాన్నిధ్యంబున నుండ నన్ను జడి యేమి జేయఁగలదు? ఈసారి వానవచ్చిన నట్లువత్తును లెండని సమాధానము జెప్పినది.

శరచ్చంద్రనిభంబగు నమ్మగువ మొగంబు జూఁచి యతండు చిత్తంబు సంకల్పభవాయత్త మగుటయు నీ! ఇదెక్కడి మోహము ప్రమాదమందితినే యని బుద్ధి మరలించుకొని కాసారంబునకుఁ బోయెను. స్నానము చేయుచున్నను ఇంటికివచ్చి కన్నులు మూసికొని జపముజేసికొనుచున్నను నాచిన్నదాని మొగము కన్నులకుఁ గట్టినట్లగపడుచుండెను. ఆ దరహాస మా చూపు లా మాటలు దలంచుకొనుచుండ నతని చేఁతినుండి జపమాల జారి నేలంబడినది. అదరిపడి తన ప్రమాదము తెలిసికొని అయ్యయ్యో! ఇదియేమి కర్మము నాచిత్తం బీశ్వరాయత్తముగాక యత్తరుణిమీఁదకుఁ బోవుచున్న దేమి? నీ! స్త్రీసాన్నిధ్యంబు తపసులకుఁ గూడదని చెప్పిన మాట తథ్యమగుచు రేపు దాని నీయాశ్రమమునుండి యవ్వలకుఁ బొమ్మని చెప్పెదం గాక యని తలంచుచు నాఁ డట్టకే మనసుం బట్టికొని జపము గావించుకొనియెను.

మఱునాఁడు స్నానంబున కరుగుచు గోపీ యిటు రా నీకతంబున మాజపంబున కంతరాయము గలుగుచున్నది. నీ విఁక నిందుండ రాదు. ఎందేనిం బొమ్మని పలికిన విని యక్కలికి కలికిచూపుల నతనిం జూచుచు స్వామీ! నే నేమి యపరాధము జేసితిని? మీరు రమ్మన్నను మీపర్ణశాలకు రానైతిని. రాతిరి నా చెక్కిలి యొక్క

కీటంబు గఱచినది. ఎట్లు గంటువడినదియో చూచితిరా? అప్పుడు కూడ మిమ్ముఁ బిలిచితినికాను. నన్నేమిటికి బొమ్మనుచుంటిరి? అని చెప్పిన నతండు మణిదర్పణమువలె మెఱయుచున్న యా చిన్నదాని కపోలమంటి చూచి వెనుకటి మాట యంతయు మఱచి మోహావేశముతో అయ్యో! పాపము నీ గండంబు దుండగవు కీటకము గఱచినదా. అక్కటా మిక్కుటముగా గంటు వడినదిగదా. ఇది నీ ముఖచంద్రబింబమునకుఁ గళంకమువలెఁ గ్రొత్త యందము గలుగఁ జేయుచున్నది. అని పలుకుచు వ్రేళ్లతోఁ దుడిచి పడఁతీ! నీ వింతటినుండి యీ పచ్చికలోఁ బండుకొనవలదు. మాపర్ణశాలకు రమ్ము. అందలి వేదికపైఁ బండుకొందువుగాక. ఈమాట నీకు వెనుకనే చెప్పితింగాదా! అని పలుకుచు నతండు తటాకంబున కరిగి స్నానముజేసి పర్ణశాలకుఁ బోయెను.

గోపికయు నతని పలుకులు తలంచి యాహా! ఆ మహామహుని శాంతివంటి హృదయము నా కతంబున విచ్ఛిన్నము కాఁజొచ్చినది గదా. మత్కపోలతలస్పర్శంబున నతని మేనఁ బులకలు జనించుట మారవికారముకాక మఱియేమి? అయ్యో దీనివలన నాకు మఱియొక పాపము జుట్టబెట్టుకొనునేమో? మృగమువంటి మహర్షిని స్మరలీలలో దింపుచుంటినే! అని తలంచుచుండ నతండు పర్ణశాలనుండి గోపీ! గోపీ! యిటురా! అని పెద్ద కేక వైచెను.

ఓ! యని పలుకుచు నక్కలికి తదంతికంబున కరిగి ప్రాంజలియై దూరముగా నిలువంబడినది. తదీయ రూపాతిశయ మాపాద మస్తకముగాఁ బరిశీలించినంత నతని యూర్ధ్వరేతస్కత్వ మధోముఖముగా మారినది. అబలా! ఇఁక నీ వా పచ్చికలోఁ బరుండవలదు. ఇందే యుండుము. మద్భుక్తశేషంబు భుజించుచుండుమని పలికిన సంతసించుచుఁ గళావతి క్రమంబునఁ జనవుచేసుకొని దేవతార్చనకై కుసు

మంబులఁ గోసికొనివచ్చి యర్పించుచుఁ దరుఁ లతాగుల్మాదుల కాలవాలములు గట్టుచుఁ బర్ణశాల వేదిక లలికి ముగ్గులు పెట్టుచుఁ జెంత గూర్చుండి తాళవృంతమున వీచుచు నతనిశుశ్రూషఁ జేయుచుండెను.

అతం డనురాగముతో నొకప్పుడు గోపీ? నీ వేమైన బాడ గలవా! యని యడిగిన నక్కాంత సంతసించుచు పికస్వర వికస్వర స్వరంబుల మాధుర్యముగాఁ బాడి యా జడదారి మదిం బెడదారిఁ బడఁజేసినది. అమ్మహర్షి యేదియో నెపంబున గోపికం జీరుచుండును. లేనిపోని పనులు కల్పించి పల్కరించుచుండును. క్షణకాలము గోపిక గనంబడనిచోఁ బదిసారులు బిలుచుచుండును. ఇట్లుండ దైవికముగా నెక్కడికో పోవుచు మేనక యాశ్రమమున కరుదెంచి కలావతితో ముచ్చటించుచు నొకనాఁ డందు వసించినది. ఉబుసుబోక యొక లతాడోలికనెక్కి యా దేవకాంత వింతపాటలు పాడుచు నూగుటయు గాశ్యపుండా గానమాలించి స్మారవికారముతో నందు వచ్చి చూడ గాలిచే వలువదొలఁగి తదీయ మృదూరుస్తనజఘనంబులు బయల్పడుటయు నక్కాంచన గర్భాన్వయ తిలకంబునకుఁ దటాలున వీర్యము స్ఖలనమై నేలం బడినది.

అవ్విధంబెఱింగి యక్కరంగటనున్న గోపిక యతిరయంబునం జని పదిలంబుగఁ దత్తేజంబు చేతులతో నెత్తి నిశ్శేషముగా గ్రోలి తన్నుఁ గృతకృత్యురాలిఁగాదలంచికొనియె. నా కాశ్యపుఁడును దన ప్రమాదము దెలిసికొని వగచుచు అయ్యో! నేనెంత మూర్ఖుఁడ నైతిని! యోగభ్రష్టుండనగుచుంటినను జ్ఞానమే లేకపోయినదే ఛీ! ఛీ! పామరుఁడువోలె నీ గోపికమూలమున నా యూర్ధ్వరేతస్కత్వంబు పటాపంచలుచేసికొంటినే! హరిహరీ! యెంతప్రమాదము జరిగినది! మొదట నీమదవలితో నెంతయోచెప్పి చివరకు నగాధకూపములోఁ బడిపోతినిగదా. ఈ స్త్రీసాన్నిధ్యదోషంబు లక్కవంటి నామనసును

నిప్పువలె మెత్తనగావించినది. ఇసిరో మేదోమాంస చర్మాస్థి పుంజంబగు కాయంబుజూచి మోహపడితినే! అహా! యేమి స్త్రీ మోహము. ఎట్టివారినైన మోసము జేయక మానదు. అని నిందించు కొనుచు పో, పొందు మీరిందుండ రాదు. అని వారిం కసరి తరిమి వైచి తాను స్నానమున కరిగెను.

మేనకయు నేఁటికి బ్రతికిపోయితిని. ఇతండు శపింపక విడిచె నిది పూర్వపుణ్యమేయని మురియుచు నాకమున కరిగినది. గోపికయుఁ ద్రిభువన సామ్రాజ్యమబ్బినట్లు సంతసించుచు నమ్మునివరునకు మ్రొక్కి యొకమార్గంబునంబడి తనగ్రామమున కరుగుదెంచి భర్తకు నమస్కరించి చేసిన కృత్యంబంతయు బోధించుటయు నతండు పరిశీలించి కలావతి కిట్లనియె.

క. తరుణీ! నీగర్భంబునఁ
బరమతపోనిష్ఠుఁడైన బ్రాహ్మణు తేజం
బరుగఁగ నెఱయుచునున్నది
యురు తేజస్స్ఫూర్తిఁ బుత్రుఁ డుదయించుఁజుమీ.

ఉ. ఏసతిగర్భమందు జనియించునొ వైష్ణవసత్తముండ హా!
ఆసతిభర్తయుం గులజులందఱు దివ్యవిమానసంస్థులై
వాసిగ జన్మరోగభయవర్జితులై తగు విష్ణులోకము
న్లాసముతోడఁ బోవుదు రలంకృతభాసుర దివ్యగాత్రులై.

క. నీకతమున నెఱసెఁగదా
మాకులమెల్లను వెసం గుమారుంగనఁగాఁ
గోకస్తని! తగుధనముం
గైకొని యొక విప్రునింటికడకుం జనుమా!

నీవిఁక శూద్రాన్నంబు గుడువరాదు. బ్రాహ్మణశుశ్రూషా నిరతవై నిరంతరము నియమయుక్తినందు వసింపుము. విష్ణుభక్తాగ్రేస

రుండు కుమారుం డుదయింపఁగలఁడని యుపదేశించి నిరతిశయ తపస్సంపన్నుఁడైన యొకానొక భూసురునకుఁ బోషింప బహు ధన యుక్తముగాఁ దనభార్య నప్పగించి తగులము వదలెఁగదాయని మఱియుచు తనయాస్తి యంతయు బ్రాహ్మణులకుఁ బంచిపెట్టి విరక్తుండై బదరికారణ్యంబునకుంబోయి యందుఁ గంగాతీరంబున మాసమాత్రంబు యోగంబుపట్టి యెల్లమునులుసూచుచుండ విష్ణు సాయుజ్యమునొందెను.

క. ద్రుమిళుం డింతటివాఁడని
యమివర్యులకైనఁ దెలియదహహా పలుయో
గములం బ్రాపింప నశ
క్యమునైకుంఠము లభించె నతిసులభముగాన్.

కలావతియు నీలానుగునింట వసించి యెవ్వరివలననో భర్తృ మరణ వృత్తాంతము విని యత్యంత దుఃఖావేశముతో విలపించుచు,

క. తనయునిగని నెనరమ్మని
నను నిటకుం బనిచి ప్రాణనాథ! విరక్తిన్
వనమున కేగి సుయోగము
నను దనువుం దొరగు టిది ఘనంబగు తెరువే?

గీ. కొడుకుగాంచి నీదు నొడివెట్టి తగముద్దు
లాడఁజూచి వేడ్క నందఁదలఁతు
నేది లేకపోయె నెవ్వరు మత్పుత్రు
నరసి యింక ముద్దులాడువారు.

చ. సుతుఁగనఁగోరినాఁడు మిము సుందరవేషముతోడఁజేరి నే
రతికభిలాషజేసిన భరంబగు సిగ్గును జింతయుం దయా
ళుతయుఁ దగంగ నన్యు సుకలుం బలిగా భజియింపుమంచుఁ బ
ల్కిటి రిది నామనంబును జెలింపఁగఁజేయుచు నుండె నయ్యయో!

క. మీారే పోయిన నింకఁ గు
మారుం డేమిటికి? నాకు మడిసెదను బలా
త్కారముగా నగ్నింబడి
వారక మిముఁ గలిసికొందు వైకుంఠమునన్.

అని దుఃఖించుచు నింధనములం జేర్చి యగ్నింబడఁ బ్రయత్నింప నెఱింగి తద్రతుకుండైన బ్రాహ్మణుండు వారించుచుఁ బుత్రీ! నీ గర్భంబున నుత్తముం డగు నర్భకుండున్నవాఁడు. నీవు మృతి నొందిన మహాపాతకముజామీా! పతి వియోగదుఃఖంబు సుతలాభంబున మఱతువుగాక యూరడిల్లుమని బోధించి యయ్యుద్యమంబు మానిపించెను.

మఱియు

క. ఆపన్నసత్వయగు నా
గోపిక యాపగిది మదిని గుందంగ నెలల్
ప్రాపించెఁ బొడమె గొమరుఁడు
రూప కళా కాంతి భాసురుఁడు శుభవేళన్.

అప్పుడు పెక్కండ్రు పెద్దముత్తైదువు లరుదెంచి సూతికా గృహంబున మధ్యందినమార్తాండ తేజంబునఁ బ్రకాశించుచున్న యక్కుమారశేఖరుం జూచి యాశ్చర్యమందుచు వాని చక్కఁదన మభివర్ణించుచుఁ దీర్ఘములాడించి పాలం గుడిపించుచు ముద్దుపెట్టుకొని పెద్దతడవందుండి యిండ్లకుం బోయిరి.

ఆవిప్రుండును శంఖచక్రాదిరేఖాచిహ్నిత కరచరణుండగు నాడింభకుం గాంచి వానికారణ జన్మునిగాఁ దలంచి పోషింపుచుఁ గ్రమంబున జాతకర్మాదివిధుల నిర్వర్తించి యబ్బాలునకు నారదుఁడని పేరుపెట్టెను. అని చెప్పిన విని గోపకుమారుండు మణిసిద్ధునితో గురువర్యా! ఆబ్రాహ్మణుఁ డాబ్బాలుండు నారదుని యవతారమని

యొఱిఁగి యట్టి పేరు బెట్టినా యేమి? చెప్పుఁడని యడుగుటయు వవ్వుచు నయ్యతి యిట్లనియె.

వత్సా! అంతకు మున్నా దేశంబున ననావృష్టిదోషంబు గలిగి యాబాలుఁడు జనించినతోడనే వర్షముగురిసినది. దానంజేసి పండితుం డగు నాపాఱుండు వానికి నుదకము నిచ్చినవాఁడని యర్థమువచ్చు నట్లుగా నారదుఁడని పేరుపెట్టెను. అంతియకాని యతండు నారదుని యవతారమని తెలిసికాదు. తెలిసినదా. తరువాత వినుము.

కలావతియు బుత్రలాభంబున భర్తృవియోగశోకంబు గొంత మఱచి తల్లాలనావినోదములతో నొకరీతిఁ గాలక్షేపము సేయుచుండెను. ఆబాలుండును ననుదిన ప్రవర్ధమానుండగుచుఁ బూర్వజన్మోపాసిత విష్ణుమంత్రంబు మాటలతోనే నేర్చికొని జపించుచు విజ్ఞానయుక్తుండై

సీ. ధూళిధూసరితగాత్రుఁడుగాఁగ నడివీధి
    నాడుచు భక్తియై హరిని బాడు
ధూళిపోగిడుచు గోపాలవిగ్రహముగాఁ
    బూజించు ధూళిచేఁ బూవులనుచు
బుధులు వీధి బురాణములు విష్ణుగాథలా
    య్యనఁ బఠింపఁగఁ జేరి యాలకించుఁ
బఠియింపఁజేయు శ్రీపతిమంత్రముల ధూళి
    వ్రాయుచుఁ దనతోడి బాలకులను
గీ. చూడ బోయినవారింటి గోడలందు
వాసుదేవునిప్రతిమల వ్రాయుచుండు
తల్లిచంకనయుండి గాత్రములనిండ
గీట్లుగా గీయు హరిమంత్ర కీర్తనముల.

ఉ. ఏమిరవత్స! యందుఁబనియేమి యొనర్చుచునుంటి విందు రా
వేమిరవేగ బువ్వ భుజియింతువుగాకని తల్లి పిల్వ న

మ్మా! మధుసూదనుఁ హరిరమాధవు నర్చన సేయుచుంటినిం
దీమెయిఁ బల్కరింపఁదగ దిప్పుడు తీరదునాకు రా ననున్.

ఇట్లు నారదుఁడు బాలక్రీడలయందె విష్ణునారాధించుచుఁ దల్లి కిని బ్రాహ్మణునకును నానందము గలుగఁజేయుచుండెను. గోపికయు నోపికతో నాపాటు నారాధింపుచు నారదుం బెనుచుచు సంతోషము తోఁ గడుపుచుండెను.

అట్లు కొన్ని దివసంబు లరుగుసంత నొకనాఁడా బాడబునింటికి సల్వురు మహర్షు లతిథులుగా వచ్చి యతనిచే నర్చితులై తద్భక్తికి మెచ్చుకొని వారింటఁ జాతుర్మాస్యవ్రతంబు గావించుట కొడంబడిరి. ఆగృహస్థుండత్యంతభక్తితో యథాకాలమునకు ఫలమూలాదు లర్పిం చుచు సేవ సేయుచుండెను.

మఱియు నారదుండును నామునిసత్తములు హరిభక్తులని తెలిసి కొని సంతతము వారిదాపునఁ గూర్చుండి జపముఁ జేసికొనుచుండఁ దాళ వృంతమున వీచుచుఁ దిరిగివచ్చిన పాదములొత్తుచు హరికీర్తనలఁ బాడు చుఁ దద్భుక్తశేషముల నేవగించుకొనక కన్నులకద్దుకొని భక్షించుచుఁ దల్లితోఁగూడ నామహర్షులకోపినగతి నుపచారములు సేయుచుండెను.

గడియయైనఁ దమ్ము విడువక పరిచర్య సేయుచున్న యాబా లునిభక్తికి మెచ్చుకొని వారిలో నొకఁడొకనాఁడు వానిఁజీరి యోరీ! నీవూరక నిత్యము మమ్మారాధించుచుంటివి. నీయభీష్టమేమని యడి గిన వాఁడుచేతులు జోడించి స్వామీ! నాకేకోరికయులేదు జన్మ తారకంబైన విష్ణుమంత్ర ముపదేశింపుఁడనికోరి కొనియెను. ఆమాట విని యాతపస్విమంచివేళ వానిదాపునకురమ్మని చెవిలో శ్రీకృష్ణ మంత్రముపదేశించెను.

నారదుండామంత్రము సర్వదా జపించుచు వారికి శుశ్రూష చేయుచుండెను. ఒకనాఁడాబాలకునితల్లి గోపిక రాత్రివేళ వీథిలో నడుచుచుండఁ ద్రాచుపాముగఱచి హాపుత్రా! అని యఱచుచు నేలం బడినది. అవార్త విని నారదుండార్తనాదముతోఁబోయి తల్లిం గాఁగ

లించుకొని అమ్మా! నీవు దుఃఖింపకుము. శ్రీహరిం దలంపుము జన్మ జరావ్యాధిశూన్యంబగు వైకుంఠమునకుం బోవుదువుగాక! అనికన్నుల నీరునించుచు నుపదేశించుచుండెను. అంతలో నాబ్రాహ్మణుఁడరుదెంచి జాంగలికులం బిలిపించి చికిత్సచేయించెం గాని విషము విరిగినది కాదు.

అప్పుడగ్గోపిక నారదునొడిలో నిడికొని యాభూసురునకప్ప గించుచుఁ దండ్రీ! నీముద్దుముచ్చటలు చూచుటకు నాకును మీతం డ్రికిఁగూడ యోగములేకపోయినది. ఈపాపఁడే నీకుఁ దండ్రి. అమ్మహా త్ములే నీకు గురువులు వీరినాశ్రయించిన నీకుసహాయము చేయుదురు. నేను నిన్ను విడచిపోవుచున్నదాన నామాటలు మఱువవలదని పలుకు చునే ప్రాణములువదలినది. ఆవార్త విని యమ్మహాత్ములువచ్చి దేహవాస నచే దుఃఖించుచున్న నారదు నూరడించుచు తత్త్వోపదేశముగావించిరి.

పెంచినబ్రాహ్మణుఁడా గోపికకపరసంస్కారములు చేయించి యాకలావతినుగుణంబు లుగ్గడింపుచుఁ బెద్దగావిలపించెను. నారదుండును దదుపదేశంబుసంజేసి విరక్తుండై తగులంబులు [illegible] బాయని తలంచుచు నమ్మహాత్ములవిడువక శుశ్రూషచేయుచుండెను.

ఆవ్రతంబు బూర్తియైనపిమ్మట నమ్మునులు బదరికారణ్యము నకుఁ బ్రయాణమగుచుండ నారదుండును దానుగూడ వారితోఁ బోయెద ననుజ్ఞయిమ్మని పెంచిన విప్రునిగోరికొనియెను. నీవుచిన్న వాఁడవు మహారణ్యములు తిరుగఁజాలవు. కొన్నినాళ్లిందుండుమని బ్రతిమాలికొనియెను. కాని యతండంగీకరింప [illegible] బదరీ వనంబునకుంబోయెను. నారదుండు [illegible] దాపసో పదిష్టమగు విష్ణుమంత్రంబు జపించుచుఁ బెద్దకాలము తపంబుగావించి శాపదోషంబు వాసి మేనువిడిచి క్రమ్మఱస్వస్వరూపముతో బ్రహ్మ లోకంబునకుంబోయి తండ్రికి నమస్కరించెను. బ్రహ్మ కుమారుం గౌఁగలించుకొని యాదరించుచుఁ బెండ్లియాడుమని నిర్బంధించెను.

ఆవిషయమై యిరువురకు మరలసంవాదము జరిగినది. నారదుండు కాంతల గర్హించుచుఁ బెండ్లియాడనని నిర్భయముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను. కానిమ్ము నీచేఁ బెండ్లియాడింపక పోవుదునా చూతువుగా అని తలకంపించుచు నప్పటికూరకొనియెను.

అని యెఱింగించి....

---

215 వ మజిలీ.

# నారదవివాహము

## దమయంతి కథ.

నారదమహర్షి యొకనాఁడు భాగినేయుండగు పర్వతునితోఁ గూడ భూలోకవిశేషంబులం జూడ వేడుకపడి గగనమార్గంబున భరత ఖండమునకరుదెంచియందుఁగల తీర్థక్షేత్రాద్యవిశేషంబులంజూచుచుఁ దిరిగితిరిగి యొక గ్రీష్మాంతమునఁ జాతుర్మాస్యవ్రతంబు సేయఁదలంచి సృంజయుండను నృపకుంజరుని గృహంబునకరిగి యతనిచే సన్మానితుండై యిట్లనియె. మహారాజా! మహర్షులకు వర్షకాలమున యాత్రలు సేవించుట దుర్ఘటమగుట నొక్కచో నీనాలుగుమాసములువసించి వ్రతంబు బూర్తిసేయవలసియున్నది. మీయింటవసించుట కనుకూలమగునే అని యడిగిన సృంజయుం డిట్లనియె.

మహాత్ములారా! మీయట్టి తాపసోత్తముల చరణరజస్సంపర్కంబుఁ బొందనిభవనంబు వనంబుగాదే. మదీయభవనోద్యానవస్తువాహనాదికములన్నియు మీయధీనముగావింతు మీయిచ్చవచ్చినట్లు వాడుకొనుఁడు అనుభవింపుఁడు. అనిపలికిన విని నారదుం డిట్లనియె. మహారాజా! ఇట్లనుటకు నీకే చెల్లును. మాకస్తోకములగు భోగము లవసరములేదు. వ్రతనియమవిశేషంబులకుఁ దగినపరికరంబులంగూర్పనేర్పు గలిగిన పరిజనుల నియమింపుము. ఇంతియ చాలునని తెలిపిన నమ్మను

జపతి సంతసించుచుదమయంతియను పేరుగలతనకూఁతుంజీరియిట్లనియె.

తల్లీ! యిరువురు మునిపల్లజులు మనయింటఁ జాతుర్మాస్య వ్రతంబు సేయనున్నారు. వారిశుశ్రూషకు నిన్నప్పగించుచున్నాను. నీవు వారిచిత్తములెఱింగి లజ్జాభిమానంబులం బూనక యుపచారములం జేయవలయు నీవు విద్యావతివి నీకుఁ జెప్పనక్కరలేదు. మునులు ముక్కోపులుసుమీ! యౌవనవిలాసములం బ్రకటింపక భయభక్తివినయవిశ్వాసములతో నారాధింపుము నీకు శుభంబులం గూర్పఁగలరని బోధించి వారికడకుఁ బంపెను.

దమయంతియు యతులకన్న మున్న లేచి శాటీపటంబు లుతికి యారవైచుచు స్నానమునకుష్ణోదకమమరింపుచు వేదులనలికిముగ్గులు పెట్టుచుఁబూజాద్రవ్యంబులఁజేర్చుచు హోమోపకరణంబులగు దర్భల సమిత్తుల నాయత్తపరచుచు నుచితకాలమున స్వయముగావండి భోజనంబిడుచు నతిభక్తితో నిష్కాపట్యంబున వారినిర్ధనసముగా నారాధింపుచుండెను. వారు మనసులోఁ గావలసిన వస్తువు దలఁచి కొనినతోడనే తెలిసికొని యెదుఁబెట్టుచుండును. వారు జపము జేసి కొనుచుండ వింజామర విసరుచుండును.

వారు వేదవ్రతపరాయణులై వేదాధ్యయనంబు గావింపుచుఁ జాతుర్మాస్యవ్రతంబు నియమంబున జరుపుచుండిరి. అందు నారదుం డొకనాఁడు స్వరములఁ గల్పించి తన వీణపై గాయత్రమను సామంబు కర్ణరసాయనంబుగాఁ బాడఁదొడంగెను. నారదుని వీణాగానము వినిన మృగములుగూడ మేతమేయవు! ఇతరులమాట జెప్పనేల! దమయంతికి సంగీతమనినఁ జాల ప్రీతికలదు. స్వయముగాబాడును. నారదుని సంగీత మును వినినతోడనే యాశ్చర్యపడి హృదయము నీరుగాఁగ నాప్రాంతమునకు వచ్చి యాలించుచు దన్మయత్వమునొంది రాగలుబ్ధయై యను రాగ సముద్రములో మునిఁగిపోయినది. అమ్మహర్షి కొంతసేపు పాడి

వీణం గట్టిపెట్టునప్పుడు దాపునకుఁ బోయి నమస్కరించి మహాత్మా! నాకు సంగీతప్రవేశము గొంత గలిగియున్నది. గాయకులలో నాకంటె నధికులు లేరని గర్వపడుచుండుదాన. మీసంగీతము వినుటచే నామది తన్మయత్వము నొందినది. ఇట్టి రాగములు ఇట్టి కల్పనలు నేనిదివఱకు భూలోకములో వినియుండలేదు. మీది దేవగానమని తోచుచున్నది. నారదమహర్షికిం గాక మహర్షులకు గానలాలసత్వ ముండదు. మీరెవ్వరో తెలుపవలయు. నారదమహర్షి వేనైనచో నేను మనుష్యకోటిలో నుత్తమురాల నగుదును. నాజన్మము సార్థకము నొందఁగల దని పలికిన నామహర్షి నవ్వుచు నిట్లనియె.

యువతీ! నారదుని కథ నీ విదివఱకు వినియుంటివా యేమి? అతనియందు నీకంత ప్రీతి యేమిటికి గలుగవలయును? చెప్పుమనుటయు నక్కుటిలాలక మహాత్మా! మునులలో నారదునివంటి యుత్తముఁ డున్నవాడా? నేను సంగీతప్రియనగుట నాకతండు ప్రియుండయ్యె జెప్పితినా? అని పలికిన నతండు నన్ను నారదుఁడే యనుకొనుము. నీ కేరాగము ప్రియమైనా చెప్పుము. ఆరాగము పాడెదనని బోధించెను.

ఆమాట విని యాపాటలగంధి మోము వికసింప నాహా! నేఁడెంత సుదినము? ఎన్ని దినములనుండియో దేవర దర్శనము సేయ గోరికొనుచుంటి. నేఁటికి నావ్రతము ఫలించినదని మురియుచు నతని పాదంబులకు లలాటము సోక మ్రొక్కుచుఁ పెద్దగా నగ్గించినది. నాఁడు మొదలమ్మౌని సంతతము వీణాగానమే చేయుచుండును. ఆచిన్నది యితర వ్యాపారములు విడిచి దాపునఁ గూర్చుండి వినుచుండును. క్రమంబున నామెచిత్తము చిత్తజాయత్తమై యమ్మౌనియందు లగ్నమైనది. అయ్యనురాగ మనుదినము వృద్ధినొందుచుండెను. లీలాతరంగితములగు చూపుల నతనిఁ జూచుచు మత్స్యమును బడిశమువలె నతని హృదయ మాకర్షించుచుండెను. మునిహృదయము

క్రమంబునఁ దరళమై రాగలుబ్ధమై మోహాంబునిధిలో మునుఁగఁ జొచ్చి నది. ఆమెను సంతతము దాపునఁ గూర్చుండఁ బెట్టుకొని పాడుచుండును.

దమయంతియు భోజన భాజనాదిక్రియలఁ బర్వతు నుపేక్షగాఁ జూచుచు నారదున కెక్కుడుగా బరిచర్య సేయుచుండెను. ఆవిపరీతము గ్రహించి పర్వతుం డొకనాఁడు నారదునితో నేకాంతముగా నిట్లనియె. మామా! ఈ రాజపుత్రికచేష్టలు మొదటనున్నట్లు లేవేమి? మన యిరువురకుఁ జేయు పరిచర్యలోఁ జాల వ్యత్యాసము గనంబడు చున్నది. నీకు భోజనము పెట్టి దాపునఁ గూర్చుండి రుచు లడుగుచు దాళవృంతమున వీచుచుఁ గొసరి కొసరి వడ్డించుచున్నది. నాకట్లు కాక విస్తరిలో నున్నదియు లేనిదియుఁ జూడక విసరి పారవేయును. నీకు భర్తవలె నపచారములు చేయుచున్నది. నాకు దాసునకు వలెఁ జేయుచున్నది. నేత్ర వక్త్ర వికారాదులు పరీక్షించితిని. నిన్ను భర్తగాఁ బడయఁగోరినట్లున్నది. నీవు గూడఁ దత్తదను గుణక్రియల జరుపుచుంటివి. నిజము చెప్పుమని యడిగిన నారదుం డిట్లనియె.

పర్వతా! నీవనినసట్లే చిన్నది నన్ను భర్తగా గోరినట్లున్నదిదాని చర్యలంబరీక్షించిన నాహృదయముగూడఁ దరళమగుచున్నది. సిగ్గుచే నీకుఁ జెప్పితినికాను. ఇందులకుఁ గోపింపకుమని పలికిన విని పర్వతుఁడు,

క. పటు కోపస్ఫురితాధర
నిటలుండై నిప్పులురుల నేత్రములంద
క్కట యెట్టిపనినొనర్చితి
విటుఁడవగుచుఁ దలఁపనిది వివేకమె మామా.

ఉ. ఇద్దఱిలోన భేదము వహింపఁగఁ గూడదు లోన నెప్పుడే
బుద్ధిజనించునో యపుడెపో యెఱిఁగిఁ పదగుం బరస్పరం
బెద్దియు గోప్యముంచఁదగదేకడనంచు వచించుకోమె యా
సుద్దులు మూలఁద్రోసి యిటుశోభనమున్ భజియించెనారదా?

క. నీయందము చందము గని
యాయిందుముఖీవతంస యాసించెఁగదా
పో యిఁక వానరవదనుఁడ
నై యటునినుఁజూచి సకియ యానందించున్.

నిన్న మగనిఁగాఁ జేసికొనఁతలంపుతో నన్నవమానించిన యా రాజపుత్రిక కిదియశిక్ష. నీకోఁతిమొగంబుఁజూచి యిటుపై నెట్లుచేయునో చూచెదంగాక! అనిశపించినవిని నారదుండు ఔరా! పర్వతా! స్వల్పాపరాధమునకే నన్నిట్లుశపింతువురా! అసూయాపరతత్వముగాక దీననీకేమివచ్చెడిని? కానిమ్ము. ఇందులకుఁ బ్రతిఫలం బనుభవింతువుగాక యీమర్త్యలోకనివాసమే నీకు శాశ్వతమగుఁగాత. ఇఁకనీకు నాకలోకాలోకన సుఖం బాకాశకుసుమంబగు పోపొమ్ము. నీసహవాసంబు దోషప్రదంబని నారదుండు క్రమ్మఱశపించెను పర్వతుండు పశ్చాత్తాపము జెందుచు విచారముతో నెందేనింబోయెను.

నారదుండు వానరముఖుండై సిగ్గుతో నాఁడు రాజపుత్రిక మొగముజూడక మార్మొగముపెట్టుకొని నాడుకప్రకారము వీణం బాడుచుండెను. దమయంతి యంతికమునఁ గూర్చుండి యాకర్ణింపుచు హఠాత్తుగా నతనిమొగముజూచి మునీంద్రా! మీమొగంబునకు మసిబూసికొనిరా యేమి? అట్లునల్లపడినదే! అని యడిగిన నతండులజ్జావనతవదనుండై యిదియొకప్రారబ్ధమని యుత్తరముచెప్పెను. అవ్వనిత తత్కారణము తెలియక పరితపించుచు నతండు తన్నుఁజూడ సిగ్గుపడుచున్నాడనియెఱింగి యక్కారంత పాటింపనట్లభినయించుచు మునుపటికంటె నెక్కువప్రీతితో నాలించి శుశ్రూషచేయుచుండెను. నారదుఁడాత్రముతో నప్పడమ్మనేత్ర మొగము మొగమెత్తి చూడలేకుండెను.

సృంజయుండు పుత్రికకు వివాహప్రయత్నము చేసి కొందఱు రాజపుత్రుల చిత్రఫలకములఁ దెప్పించి వారిలో నిచ్చవచ్చినవానిఁ

గోరికొనుమని దాసీముఖముగా దమయంతియొద్దకనిపెను. దమయంతి వానినేమియుఁ బరికింపక వానిందెచ్చినదాసితో నోసీ! నామాటలుగా మాతండ్రితో నిట్లుచెప్పుము.

తండ్రీ! మనయింటఁజాతుర్మాస్యవ్రతము సేయువారిలో నొకఁడు నారదమహర్షి యని తెలిసికొనుము. మహతీయుతుండగు నమ్మునితిలకుని నేనువరించితిని. అతండేనాకుభర్త అతండెట్టివాఁడో మీరువినియే యుందురు. నేను తదీయగానవిద్యాపరవశనై తిని నక్రహీనంబై రసాత్మకంబై ఘోరరహితంబై సుఖసంపూర్ణంబై తిమింగిలవర్జితమగు నాదసముద్రములోమునిఁగిపోయితిని. జనకా! నాకు మఱియొకపతియవసరములేదు. నారదునకే వివాహముగావింపుము.

అనియుపదేశించిపంపుటయు నాదాది యాపై దలిచెప్పినమాటలన్నియు సృంజయున కెఱిఁగించినది. రాజు మిక్కిలి పరితపించుచు భార్యనురప్పించి దమయంతియుద్యమమెఱింగించి యిట్లనియె. అక్కటా నీకూఁతున కిట్టివిపరీతబుద్ధిపుట్టినదేమి? ఎంతయో తెలివిగలదనుకొంటినే. ఔను స్త్రీబుద్ధి ప్రళయాంతక మనుమాట తథ్యమగును. వనితయు లతయు దగ్గరనున్నవారి నాశ్రయింతురనుమాటయేలతప్పును? ఆభిక్షుకుండు వానరముఖుండఁట! నేనప్పుడు తిన్నగాఁ జూడలేదు. మహర్షులు గదాయని శుశ్రూషకునియమించితి ఛీ. ఛీ. ఆఁడుదానిగుణము కడు నింద్యమైనది. తానురాజపుత్రికయై భిక్షుకు నెట్లువరించినదో తెలియదు. అందులకే గాయకులకడ నాఁడువారినుంపరాదని చెప్పుదురు. తెలియక మోసపోయితిని నీవుపోయిదానిమందలించుముకులముచెడగొట్టవలదని చెప్పుమని యెన్నియోబోధించి భార్యం గూఁతునొద్దకనిపెను.

రాజపత్ని పుత్రియొద్దకుఁబోయి భర్తమాటలన్నియు జెప్పి ముక్కుపై వ్రేలిడికొని అయ్యో! యిదియెక్కడికోరిక. ఆకోతిమొగమువాఁడేమి? నీవేమి? వానివరించితినని పలుకుటకు నోరెట్లాడినది?

నలుపురు నవ్వుదురని యించుకయుసిగ్గులేకపోయెనే అయ్యయ్యో! ఇది యెక్కడివలపే? వానింబెండ్లాడి భిక్షమెత్తికొనుచు నూళ్లవెంబడి తిరుగు చుందువుకాఁబోలు నారదుఁడైననేమి? వ్యాసుఁడైననేమి? నీవులతా కోమలదేహవు. అతఁడు భస్మరుద్రాక్షవిగ్రహుఁడుకోఁతిమొగమువాఁడు నీవు నవ్విన పూవులురాలినట్లుండును వెన్నెలలుగాసినట్లు మెఱయును. ఇట్టి నీవాకోఁతి మొగమువానితో నెట్లుముచ్చటింతువు? ఎట్లువిలాసము లందెదవు? నిన్ను వరించి మన్మథునికన్నఁ జక్కనగు రాజపుత్రులనే కులు వార్తలనంపుచున్నారు. వారిలోఁ జక్కని వారినేరి వరింపుము. ఈ విపరీతబుద్ధి విడువుము నీవుపరిహాసమున కట్లంటివా! నిజముగానంటివా చెప్పుమనియెన్నియోబుద్ధులుగరపిననవ్వుచునాపువ్వుఁబోడియిట్లనియె.

అమ్మా! రసవేత్తలకు రూపముతో ధనముతోఁబనిలేదు అవి దగ్గులు మూర్ఖులునగువారు నారదసముగ్రహింపజాలరు రాజ్య మేమి జేసికొనవలయు వనములోనున్న లేళ్ళుగూడ గీతనాదమువినిధన్యము లగుచున్నవి. మృగములు గాయకునికిఁబ్రాణము లర్పించుచున్నవి. యెఱుంగుదువా మృగములకన్న మనుష్యులే మూర్ఖులు సప్తస్వరాత్మకమైన సంగీతవిద్య శంకరుండెఱుంగు. నారదుఁడెఱుంగు. వారింబోలిన వాఁడు మూడులోకములలో మఱియొకఁడులేడు. మూఢునితోఁ జిర కాలము సహవాసముచేయుటకంటె నుత్తమునితోఁ గడియచాలును గుణహీనుఁడగువాడు ధనవంతుఁడైననేమి? రూపవంతుఁడైననేమి? అట్టివాఁడు విడువఁదగినవాఁడే బిక్షుకుండైనను గుణవంతుఁడైనచో స్వీకరింపఁదగినవాఁడే తల్లీ! నీకొక్కరహస్యము చెప్పుచున్నాను. వినుము సప్తస్వరజ్ఞుఁడుగ్రామ వేత్త మూర్ఛనాభేదవిదుండుఅష్టరసజ్ఞుండు దుర్లభుండని యెఱుంగుము గంగానరస్వతులు కైలాసము నెట్లుపొందిం చునో స్వరజ్ఞానవిశారదుండట్లు పొందించునుస్వరజ్ఞానమెఱింగినవాఁడు మనుష్యుఁడైనను దేవసమానుఁడు దానినెఱుఁగనివాఁడుదేవుఁడైనను

మనుష్యునికన్నను హీనుఁడుసుమీ! దేవేంద్రుఁడైనను రసజ్ఞానము లేనిచోఁ బశువే. ఎవ్వఁడుమూర్ఛనాతానమార్గమువిని యానందింపఁడో వాఁడుగూడ పశువే మృగములు పశువులుకావు. రసజ్ఞానములేనివాని కన్న విషధరమే శ్రేష్ఠమైనది. చెవులులేకున్నను సంగీతమువిని యా నందించును. ఛీ ఛీ చెవులున్నను గొంకఱు గానప్రీతిలేనివారగుచున్నా రు. శిశువులుఁగూడ సుస్వరయుక్తమగు గానమువిని యానందింతురు.

అక్కటా! నాతండ్రి నాదమహాత్మ్యమేమియు నెఱుంగఁడు నారదుఁడెవ్వఁడో యెట్టివాఁడో తెలిసికొనఁజాలఁడు అట్టిప్రభావసంప న్నుఁడు మఱియొకఁడులేఁడు. ముమ్మాటికిని లేఁడు. అతనికి నాచేత వరింపఁబడినతరువాతఁ గోఁతిమొగమువచ్చినది. మొగమెట్లున్న నేమి తురగముఖులు పూజ్యులుగారా! అంబా! నీవొక్కసారివచ్చి యతని సంగీతమువింటివేనినన్నిట్లనవు పెక్కేలనేనుద్రికరణములచే నాతనిభర్త గావరించితిని. ఇఁకనామనసుతిరుగదు. ఇదిపూర్వజన్మసంబంధమనిమా తండ్రితోఁజెప్పి సమాధానపరుపుము అనికచ్చితముగా నుత్తరము చెప్పు టయు రాజపత్ని యేమియుమాటాడనేరక భర్తయొద్దకుఁబోయి కూఁతు నుద్యమమంతయు నెఱింగించి యిట్లనియె. మనోహరా! పిల్లదాని గాయకుని కడ శుశ్రూషజేయ నప్పగించుట మనదే తప్పు. అదినాద సముద్రములో మునింగి యతని వరించినది. మనమాటలేమియుఁ జెవి కెక్కుటలేదు దానికర్మమిట్లున్నది మనమేమి చేయఁగలము? మంద లించి చెప్పుటకది చిన్నపిల్లయా! మనమందఱము పశువులమఁట నాదజ్ఞులే యుత్తములఁట దానిమాటలకు నాకు గోపము నవ్వుగూడ వచ్చినది. ఇఁక దాని మనసు తిరుగదు. పోనిండు మునుల బెండ్లి యాడినవా రెండఱు సుఖింపలేదు? సుకన్య గ్రుడ్డి శతవృద్ధునగు చ్యవనుం బెండ్లియాడి మంచి స్థితికి రాలేదా? అనుమతించి వానికే పెండ్లిచేయుఁడని యేమేమో బోధించి యంగీకరింపఁజేసినది.

సృంజయుండును మంత్రిముఖముగా నావార్త నారదున కెఱిం గించుటయు నతండును దనప్రమాదము దెలిసికొని పశ్చాత్తాపము జెందుచు నప్పని కంగీకరింపనని ప్రత్యుత్తరమిచ్చెను. సృంజయుండు సంతసించుచు నామాట కూఁతునకుం దెలియజేయుఁడని నియమించెను. దమయంతి యావార్త మంత్రులవలనవిని యమ్మఱునాఁడు తాను జక్కఁగా నలంకరించుకొని నారదుఁడు పాడుచుండ దాపునఁ గూర్చుండి యాలించి వివశయై మురియుచు గానావసానంబునఁ జేఁతులు జోడించి యమ్మునీశ్వరున కిట్లనియె.

స్వామీ! నేను భవదీయగాననాదామృతము గ్రోలిచొక్కితిని నాయింద్రియములన్నియు మీయధీనములైనవి నేను మిమ్మే భర్తగాఁ గోరికొనియుంటి మీ పాదశుశ్రూషజేసి కృతార్థురాల నగుదునని తలంచుచుంటి. నాదబ్రహ్మవేత్తలగు మీసేవకన్నఁ దరింపఁజేయ మఱియొక సాధనములేదు. నన్ను భార్యగా శిష్యురాలిగా దాదిగా ననుగ్రహించి స్వీకరింపవలయు లేకున్న నాకు మృతియే గతియని ప్రార్థించిన విని నారదుం డించుక తలయెత్తి యిట్లనియె.

తరుణీమణీ! నీవు రాజపుత్రికవు. నేను తాపసుండ వానర ముఖుండ నన్ను నీవు పెండ్లియాడినఁ జూచినవారు నవ్వరా. నీ శుశ్రూషవలన నామనసించుక చలించినది. ఆప్రమాదము దాటించు కొంటి స్త్రీ సంపర్క మింక నంగీకరింపను తండ్రిగారి శాపమువలన నా కీవ్యామోహము గలుగుచున్నది. అక్కటా చాతుర్మాస్యవ్రత మేడ నీశుశ్రూషయేడ? ఈవివాహ ప్రయత్నమేడ! నే నొకచో నిలువరాదు మూడులోకములు తిరుగుచుండవలయును. వ్రతము పూర్తియైనది. పోయివచ్చెద ననుజ్ఞ యిమ్ము నీవలపు నాకాలికి సంకెలియై కదలనిచ్చినది కాదు. మోహము దెలిసికొంటి వలదు సంగమువలదని యుత్తరమిచ్చిన నమ్మచ్చెకంటి యల్లన నిట్లనియె.

ప్రాణేశ్వరా! నే నెవ్వతె ననుకొంటిరి? వెనుకటి జన్మమున మీభార్యను మాలావతిని తెలిసినదియా? మదీయపాతివ్రత్యమహాత్వంబున జాతిస్మరత్వము గలిగినది. మీరు దాసీపుత్రులై జనించినప్పుడు మీవియోగమునకు వగచుచు మీకు భార్య యయ్యెదు తలంపుతో వేల్పులవలన వరములువడసి యిందు జన్మించితిని. మీయనురాగము వేయిజన్మములకైన మఱుపువచ్చునా? వెనుకటిప్రేమదలంచి నన్నుఁ బాణిగ్రహణము జేసికొనుఁడు. అనిపలికిననారదుండులికిపడి యిట్లనియె.

ఓహోహో! నీవు మాలావతివా? తెలిసినది ఔను నేను దాసీపుత్రజన్మము విడిచి తిరుగా బ్రహ్మలోకమున కరిగితిని నన్నుఁ జూచి మాతండ్రి క్రమ్మఱ నిర్బంధించుచు నీప్రియురాలు మాలావతి సృంజయునింట జనించినది. ఆమెబనాగ నీకుఁ దగినదగుటఁ బెండ్లి యాడుమని నియోగించెను. నే నంగీకరించితిని కాను. ఆహా! విధిఘటితంబననిదియేకాఁబోలు! ఇన్ని దేశములుండ నేనిక్కడ కేరావలయునా? పూర్వజన్మవాసనావిశేషమువలన నేనామదియిట్లుచలించినది. అక్కటా తండ్రిగారి శాపమునన్నట్లు బాధించినదో చూడుము? గంధర్వుఁడనై పెద్దకాలము గ్రామ్యధర్మనిరతుండనై కడపితిని. తద్ధేతుకముగాశూద్రయోనిం జనించితిని. ఇప్పటికైన విముక్తిబొందుదమన్న నీవువెంటాడించుచుంటివేమిసేయుదును? సాధ్వీ! నాజోలికిరాకుము నన్నుఁ బోనిమ్ము కరుణింపుమని బ్రతిమాలిన దమయంతి యిట్లనియె.

మహాత్మా! నేను మిమ్ము వరించుట కామాభిలాషచేతగాదు భోగవిముఖనై మీశుశ్రూషచేయుచు ముక్తినొందవలెననికోరియుంటిని మనసులువిరక్తినొంద నెందున్న నేమి? ఇందులకుఁ జింతిల్లవలదు. అనుమతింపుఁడని వినయముగాఁ బ్రార్థించినది. అతండనుమతించెను.

సృంజయుఁ డిష్టములేకున్నను నారదునకుఁ దమయంతినిచ్చి వివాహము గావించెను. అంతలో యదృచ్ఛముగాఁ బర్వతుఁడరుదెంచిస్వర్గభ్రష్టత్వ

మునకు వగచుచు నారదుంజూచి మామా! నేను తొందరపడి నిన్ను శపించితిని. నాశాపముమరలించెదనన్ను స్వర్గమునకుబోవునట్లనుగ్రహింతువా? అనియడిగిన నతండంగీకరించెను. ఒండొరులశాపములఁ గ్రమ్మఱించుకొనిరి. పర్వతుఁడు నాకంబునకుఁబోయెను. నారదుండు వెనుకటిముఖముతో నొప్పుచుండె నాదమయంతి మిక్కిలిసంతసించుచుండెను.

దమయంతినిమిత్తముగా నారదుండా సృంజయునకు సువర్ణష్ఠీవియను పుత్రుందయచేసి వానిమృత్యువువలన రక్షించి వంశహాని కాకుండ ననుగ్రహించెనని యెఱింగించునప్పటికిఁ గాలాతీతమగుటయు

క. లే లెమ్ము మిగిలెఁ బయనపు
వేళకథాగతరసప్రవృత్తార్థ గో
పాలా! యని యమ్మునిశా
ర్దూలుఁడు చని చేర శిష్యతోఁ బయినెలవున్.

---

## 21ం వ మజిలీ

# నారదుని స్త్రీ జన్మము.

## సౌభాగ్యసుందరి కథ

క. శ్రీనారదవరవీణా
గానస్వానానురక్త కరుణావిలస
న్మానస తాపసహృదయా
స్థానసుఖాసీన భక్తజనసంతానా.

దేవా! అవధరింపు మమ్మణిసిద్ధుఁడా నివాసదేశంబున నిత్యకృత్యంబులఁ దీర్చికొనినపిదప రమ్యస్థలాసీనుఁడై శిష్యునుద్దేశించి

క. హరిమాయామోహితుఁడై
తరుణీమణియగుచు దేవతాముని భూమీ

శ్వరుఁ బెండ్లియాడి తమిఁబె
క్కురఁ బుత్రులఁగనినకథ తగుంజిత్రంబై.

పుత్రా! తచ్చరిత్రం బెఱింగించెద నవహితుండవై యాలింపు మొక్క నాఁడు నారదమహర్షి ప్రహర్షపులకితగాత్రుండై

క. హరినారాయణ దామో
దర కేశవ వాసుదేవ దానవవైరీ
మురహరసురవరపూజిత
చరణ రమారమణ భక్తజనహృచ్చరణా.

అని విపంచిపై శ్రీహరిం గీర్తింపుచు నమ్మహాత్ముని సేవింప శ్వేతద్వీపముకరిగి తదభ్యంతరమందిరంబున.

గీ. ప్రక్కనిలఁబడి సురటిచేబట్టి దుగ్ధ
వారినిధిపట్టి పీవ శృంగారలీల
లమరఁ నర్మోక్తులాడు చత్యంతవిభవ
మునవసించిన హరిఁగనుంగొనియెఁదపసి.

క. అనిమిషముని దవుదవ్వుల
కనుఁగొని కమలావఘూటి గ్రక్కున లజ్జా
వనతముఖియగుచు లోనికిఁ
జనియెన్ జలదమున నడఁగు చంచలవోలెన్.

తన్నుఁజూచి జలధికన్య దిగ్గున సిగ్గున లోపలికిఁ బోయినదని తెలిసికొని తన కప్పని తలవంపుగాఁ దలంచి పలుతెఱంగులఁ దల పోయుచుఁ గ్రమంబున నయ్యంబుజాక్షు సమక్షమునకుం జని నమస్క రించుటయు దామోదరుం డతని నాదరించి కరుణామేదురములగు చూపులతనిపై వ్యాపింపఁజేయుచు సుచితాసనాసీనుం గావించిదీవించి వత్సా! నీకు సేమమా ఎందుండి వచ్చితివి? త్రివిష్టపములనేవైన విశేషములు గలిగియున్నవియా? అని యడిగిన నారదుండు చిన్న

వోయిన మోముతో స్వామీ! మీదయవలన నన్నిలోకముల వారు సుఖులైయున్నవారు. ఎచ్చటను నే విశేషము గనంబడదు. ఇందే క్రొత్తవింత బాడఁగంటి వినుఁడు.

క. ఏ నటుఁడఁగాను ధూర్తుఁడ
గాను భుజంగు డనుగాను కామక్రోధా
ధీనుఁడఁగాను జితేంద్రియుఁ
డైన తపోధనుఁడ దావకాంఘ్రిప్రియుఁడన్.

గీ. ఇట్టి నన్నుఁ జూచి యేకాంతవాసంబు
జేరి లోకమాత సిగ్గుతోడ
యతులయెడల నిట్టి యాటంకములుసూప
నెట్లు కొలుచు వారమింకనిన్ను.

మఱియు నేను వీణాగాన పరిశ్రమ సేయుటం బట్టి నీయిల్లాలు నన్నుఁ గాయకుంగాఁ దలంచినదేమో యది యసంభావ్యంబు గాయత్రసామంబు సంతతము బాడుచు నిన్నుఁ గీర్తించుట వేదసమ్మతము గాని దూష్యంబు గానేరదు సంసారమాయాబలంబు దెలిసికొని సంపదలరోసి భవత్సేవారతుండనై యరుదెంచిన నన్నుఁ జూచి లోపలికేఁగుట నాకు మిక్కిలి యవమానకరముగానున్నది. తాతా! నీవైన వలదని చెప్పితివి కావుగదా! అని సాభిమానముగాఁ బలికిన విని జనార్దనుండు నవ్వుచు నారదా! నీవింతబేలవైతివేమి? నీశాస్త్ర పరిశ్రమయంతయు వ్యర్థమైనట్లు తోచుచున్నదే. మాయాప్రభావంబు దెలియనివాఁడవగుట నిట్లంటివి వినుము.

క. మాయాబలమరయఁగ దు
ర్జేయముబ్రహ్మాదులకు న జేయంబహహా
పాయకనది మోహితులం
జేయు మహామునులనైనఁ జెప్పఁగనేలా?

జితమారుతులగు యతులు, సాంఖ్యులు, తాపసులు, యోగులు, బ్రహ్మాదిదేవతలు, విద్వాంసులు, మూర్ఖులు గూడ త్రిగుణాత్మకమగు నమ్మాయను జయింపఁజాలరు. ఆ మాయ కాలస్వరూపమై యొప్పుచుండును. ఆకాలమొకప్పుడు ధర్మజ్ఞుఁగూడ వికలుంగావించును. కావున సాధ్వియగుకాంత యెట్టివాఁడైనను బరపురుషుని చెంత వసింపరాదు. దానంజేసి కమలయవలఁబోయినది. ఇందులకుఁ జింతించెద వేమిటికని పలికిన విని నారదుండించుక సిగ్గుఁజెందుచు నిట్లనియె.

తాతా! మాయాబలమున ధర్మజ్ఞుండుగూడ విపరీతమతియగునని చెప్పితివి. తత్స్వరూప మెట్టిదో యేయాధారముగలదియో ప్రత్యక్షముగాఁ జూచినంగాని నామనసు సమాధానము పడకున్నది తద్విశేషము జూపఁగోరెదనని యడిగినవిని ముకుందుడు మందహాసము గావింపుచు వత్సా! సర్వాధారమైన యామాయ జగంబంతయు నిండియున్నది. ఇచ్చగలదేని తత్ప్రభావము జూపింతు నాతోరమ్మని పలికి గరుత్మంతుని స్మరించుటయు నవ్విహగపతి సన్నిహితుండయ్యెను.

విష్ణుండు నారదునితోఁగూడ నానీడజవరంబు నధిష్ఠించి యుత్తరాభిముఖముగాఁబోవుచు బహువిధఫలదళకిసలయవిలసితములగు తపోవనంబులు శరభశార్దూలాది మృగభయంకరములగు మహారణ్యములు కమల కల్హారవాసితములగు సరోవరంబులు నగాధజలపూరితంబులగు హ్రదంబులు బహుజనాకీర్ణంబులగు పురగ్రామపక్కణ విశేషంబులం జూచుచుఁ బెద్దదూరమరిగి యచటి కన్యాకుబ్జమను పట్టణంబునకల్లంతదవ్వులోఁ జక్రవాక హంసకారండవాది జలవిహగ పరివృతంబు బంకజపరాగరంజితంబునగు కాసారమొకండు నేత్రపర్వంబు గావించుటయు వాసుదేవుండు గరుత్మంతునాపి నారదున కిట్లనియె.

క. సారసనాద సువాసిత

సారసవనముదిత పాంథజనమగు నా కా

సారవిలాసము గంటివె
నారద దుగ్ధాబ్ధిగతి మనంబలరించెన్.

గీ. తాపసోత్తమ! అందుదీర్ఘంబులాకి
పోవలయునంచు మది వేడ్కఁబుట్టె నాకు
నల్లదే రాజధాని గమ్యస్థలంబు
మునిఁగిపోవుద మన నతం డనుమతించె.

పుండరీకాక్షుండు పక్షిపతి నాకుణమ తత్తటాకతీరంబు జేరంబనిచి నారదునితోఁగూడ వాహనావతరణంబు గావించి యజ్జటివరుచిటికెనం గైకొని యక్కాసారతీరవిశేషంబులఁ జూపుచుఁ బోయిపోయి యొక చోటఁదటవిటపిసాంద్రచ్ఛాయానికటంబునఁగూర్చుండియతనికిట్లనియె

క. మునునీవు గుర్తింకుమిట వ
చ్చిన పిమ్మట స్నానమేను జేసెద దివిష
న్మునివర యందాకసరి
ద్ఘనతగనుంగొనుచునుండుఁ గద యిచ్చోటన్.

అనుటయు వల్లెయని యమ్మునితల్లజుండు వల్లకియుఁ గృష్ణాజినంబు మెల్లగ నొకచోట నునిచి చేతులకును శిఖకును ధర్భలు ముడివైచి కాళ్ళుఁ గడిగికొని సంకల్ప పూర్వకముగ రెండు మునుంగులు మునింగి మూఁడవమాటు మునుంగునంతలో,

సీ. తళుకుచూపుల ముద్దు గులుకు వాల్గన్నుల
బెళుకు చెక్కులనిగ్గు పెద్దసేయ
వదనాంశుకము కెంపు వదలించి చిఱునవ్వు
లేతవెన్నెలరుచుల్ పూఁతబూయ
మోముదామరనళుల్ మూఁగుచున్నవి నాఁగఁ
జికురముల్ నొసలిపైఁ జిందులాడ
చనుదోయి పెనుభారమునుబూన స్రుక్కుమ
ధ్యమున కూఁతగ నితంబము దలిర్ప

గీ. నూరుమృదుకాంతి వల్వపై కుబికిరాఁగ
మేనిడాల్తళుక్కఁగమి మిఱుమిట్లుగొలుప
మహితసకలాంగ సౌభాగ్యమహిమతోడ
నారదుం డొక్క చక్కని నవలయయ్యె.

అప్పుడమ్మహర్షి కించుకయుఁ బూర్వస్మృతి లేకపోవుటంజేసి తానెవ్వరో తెలిసికొనలేక కర్తవ్య మెఱుంగక జగన్మోహనంబగు తన రూప మూరక చూచుకొనుచు విస్మయము జెందుచు జలమునుండి యొడ్డుపై కెక్కి యున్మత్తవోలెఁ జిత్తమోహముతోఁ దటాకముదెసఁ జూచుచుండెను. అంతలోఁ దాళధ్వజుండను నృపాలుం డొకడు చతురంగ బలపరివృతుండై వేటకై యవ్వనమున కరుదెంచి పిపాసాలసుండై దైవవశంబున నత్తటాకంబున చెంతఁజేరి తత్తీరంబున జగన్మోహనా కారంబునం బ్రకాశించు నమ్మించుఁబోఁడింగాంచి పంచశరచంచలిత హృదయుండై యబ్బురముగాఁ జూచుచు నిట్లనియె.

సీ. పొలతి! నీవెవ్వని పుత్రిక వొంటి నీ
వనమున కేమిట వచ్చినావు
అతివ! నీనామధేయాక్షరంబులను గ
ర్ణోత్సవంబుగఁ జెప్పు మొకట నాకు
గలికి! నీయాకృతిగన సురగరుడోర
గాదిఖేచరకన్య వనుచుఁ దోచె
నాతి! నూతనయౌవనవిభూషితాంగివై
తగు నిన్నుఁజూడ డెందము చలించె

గీ. నెలఁత! సౌందర్యరాశివో నీవు నన్ను
గనుల వీక్షింపు మమర సౌఖ్యములభించు
సరసి దెసజూచుచుంటి వచ్చటఁ ద్వదీయు
లెవ్వరుండిరొ వచియింపు మింతి నాకు.

క. తాళధ్వజుఁడను వాఁడన్
గాళీభక్తుండఁ బ్రథితకన్యాకుబ్జా
ఖ్యా లలితనగరపతినై
పాలింతున్ భూరిభూమిభాగంబెలమిన్.

ఉ. పెండిలియాడలేదు తగుభీతమృగాయతనేత్ర లభ్యగా
కుండుటఁజేసి యీసరికి నోసరసీరుహనేత్ర! త్వద్వయో
మండితచారురూప లసమానవిలాసములా ప్రసూనకో
దండ నిశాత సాయకవితానములై ననునేచె నిత్తఱిన్.

కృశోదరీ! నీవునన్నుఁ బెండ్లియాడితివేని త్రిభువనంబుల నన్నుఁబోలు భాగ్యవంతుఁడు లేఁడుగదా నాకుఁగల సకలసౌభాగ్యంబులు నీయధీనంబు గావించి నీ చెప్పినట్లు నడుచువాఁడ నన్నను గ్రహింపుమని పలికిన విని యక్కలికి కలికిచూపు లతనిపై వ్యాపింపఁ జేయుచు దత్సౌందర్యాతిశయంబున కచ్చెరువందుచు మెల్లన నిట్లనియె.

చ. సలలితరూప నుత్తసుమచాప! మదీయచరిత్ర యేమియున్
తెలియదునాకు నీవనికి నేనెటువచ్చితినో యెఱుంగ మ
మత్కులమును దల్లిదండ్రులును గోత్తులు నెవ్వరో యేమిచేయఁగా
వలయునో తోఁచకున్నయది భావమునందలపోసిచూడఁగన్.

అంతయు నాకగమ్యగోచరముగా నున్నది. నిరాధారనై చికీర్షితముల గుఱించియే వితర్కించుచుంటి. నీవు ధర్మజ్ఞుఁడవు సత్యసంధుండవని తోఁచుచున్నది. నాకెవ్వరు దిక్కులేరు. నేనీ యధీననగుదు బాలకుండవై యేలికొనుము అనిపలుకుటయు నప్పలుకులమృతము పలుకుల వలెఁ జెవులకుసోకి కుతుకపరుప మదనాతురుండై యనతిదూరములో నున్న భృత్యులచే ముక్తాజాలవిభూషితంబు మృద్వాస్తరణశోభితంబు కౌశేయాంబరవేష్టితంబునగు పల్లకిఁదెప్పించి యప్పంకజాక్షిఁ దానిపై నెక్కించి మహావైభవములోఁ గన్యాకుబ్జనగరంబునకుం దీసికొనిపోయి

యంతఃపురమునఁ బ్రవేశపెట్టించెను మఱియు,

గీ. సూరులెన్నంగ సౌభాగ్యసుందరియని
సార్థకాహ్వాయముంచె నాసరసిజాక్షి
కతఁడు శుద్ధాంతకాంత లత్యంతగౌర
వ ప్రపత్తుల నర్చింపఁ బ్రభ్వియనుచు.

క. కాలాతిపాత మోర్వక
బాలామణిఁ బెండ్లియాడెఁ బతి యధికశుభ
శ్రీలగ్నమందుఁ దద్విభ
వాలోకనసక్తచిత్తులై ప్రజలొప్పన్.

ధవళప్రభావిలసితదీపధూపాభిరామంబై బహువిధప్రసూనమాలికామోదబంధురంబై యొప్పు కేళీమందిరంబున నమ్మహారాజు దివ్యభూషణభూషితుండై సకలాలంకార భాసితవేషయగు నాయోషారత్నమును తనవామపార్శ్వమునఁ గూర్చుండఁబెట్టి పెద్దయుం బొద్దు నర్మగోష్ఠీవిశేషముల వినోదము గలుగఁజేయ నానందించుచు సహచరవర్గంబు నిర్గమించిన తరువాత లజ్జావశంవదయై కదలఁబోయిన నదిమి పోనీయక నాయకుండు శయ్యాతలంబునఁ దలవాల్చికొనియున్న యాయన్ను మిన్నను ముట్టినఁ గందునోయనియుఁ బలుకరించిననాయాసపడునోయనియు వెఱచుచు,

ఉ. హారమణుల్ విచిత్రములటంచుఁ గరంబు నురోజయుగ్మముం
జేరుచు నడ్డబాసతుదిఁ జేర్చిన ముత్తెము కెంపుగాఁగ నొ
ప్పారె నిదేమియంచధరమంటు జడన్ ఘటియించుఁ బుష్పముల్
జారెనటంచుఁ జెక్కులను జందనముందుకుచు న్నెపంబునన్.

ఉ. అంటినఁ గందునీయొడ లహో సుమకోమలమాట మాటలం
గంటకపెట్ట నొప్పిదముగాదిఁక నేమి యొనర్తునొక్కొ? పూ
వింటివలంతి నాయెడద భిన్నము సేసెడుఁ గాన నాకు వా
ల్గంటి! మహోపచారకములం నినుఁగొల్చుటయే శుభంబగున్.

చ. అనుచువిపంచిఁగైకొని ప్రియంబున సుస్వరతానయుక్తి నూ
తనగతిఁ బాడుచుండ సతి దప్పులఁబట్టుచు నొండువీణ న
ల్లన బలికించెఁదత్స్వరవిలాసములన్వొరపించు రాగముల్
జనపతి హాయిహాయి యని సంతసమందుచుఁ గాంగలింపఁగన్.

మఱియు నమ్మహారాజు తదీయపాండిత్యవిశేషం బెట్టిదోయని ప్రసంగించి చతుష్షష్టి కళారహస్యవేతృత్వంబు వేదవేదాంగ పరిజ్ఞాతృత్వంబు ప్రకటింపఁ దెలిసికొని యురముపైఁ జేయిడుకొని యాహా! యీమోహనాంగి వాణీవధూటి యపరావతారమని చెప్పనొప్పు. ఇన్నివిద్య లెఱింగిన కురంగాక్షు లెందైనఁగలరాయని యచ్చెరు వందుచుఁ గామకళానైపుణ్యంబున నయ్యంబుజాక్షింగూడి రాగసముద్రంబున మునింగి తేలియాడుచుండెను.

మఱియు నాధాత్రీపతి రాజ్యతంత్రంబుల మంత్రులయధీనముగా వించి యమ్మించుఁబోఁడితోఁగూడికొని మధుమాసముల ఫలదళకుసుమ కిసలయవిలసితములగు నుద్యానవనంబుల మధుకరరవ ముఖరితములగు చందనవాటికలనమయూరకేకారవబంధురంబులగు క్రీడాశైలకందరంబు లహంసకారండవాదిజలవికిరనికరవిరుతమనోహరంబులగు సరోవరతీరంబుల నదీసికతాతలంబుల సముద్రతటంబుల మనోజ్ఞప్రదేశంబుల విహరింపుచుఁ గ్రీడాపరతంత్రుండై పెద్దకాలము తృటిగా వెళ్ళించెను.

సౌభాగ్యసుందరియుఁ దనపూర్వజన్మవృత్తాంత మించుకయుఁ దెలిసికొనలేక లోకపరిపాటివధూటియుం బోలె విదగ్ధుండగు తాళధ్వజుని కేళీవినోదములఁజిక్కి పరవశయై యొండు తెలియక రాగజలరాశి మునింగి కాలవ్యతిక్రమ మించుకయు నెఱుంగదయ్యెను.

క. పడతింజూడఁగ నిమిషం
బెడమైనన్ యుగములట్లు లెంచుం బతి దా
నొడయనిగన నరనిమిషము
తడవైన న్మేను విడువఁదలచున్ సతియున్.

క. మఱచెను బ్రహ్మజ్ఞానము
మఱచెను యోగప్రసక్తి మతిఁదాను మునీ
శ్వరుఁడగుట మఱచె నృపతిని
మఱఁగి రతుల యువతి మాయమఱుఁగె ట్టిదయో!

అట్లు కొన్నివత్సరంబులు గడిచినంత నక్కాంతామణికి దౌహృదలక్షణంబులు పొడసూపుటయుఁ నాభూపతి యపరిమితానందంబుఁ జెంది గర్భసంస్కారములఁ గావింపఁజేసి మహోత్సవములతోఁ బుత్రోదయ మభిలషించుచున్నంత,

క. అభినవమదనుండో యన
శుభలక్షణ లక్షితుండు శూరాంకుండై
ప్రభవించె సుతుఁడు సుదతికి
శుభలగ్నమునందు భూభుజుఁడు గనిమురియన్.

ఆరాజు పాఱులకపారముగా షోడశమహాదానములు గావించి జాతకర్మానంతరము విప్రప్రేరితుఁడై పుత్రునకు వీరవర్మయను నామకరణము జేసెను. మఱియు నాశిశువుం బెనుప దాసీసహస్రములు గలిగి యున్నను దదర్పితముసేయక తామేసుతపోషణలాలసులై తదీయ గమనహాసవచనరచన క్రీడావినోదములు మోదం బొనరింపుచుండ రెండుసంవత్సరములు తృటిగా వెళ్ళించిరి.

ద్వితీయవత్సరాంతమునఁ గ్రమ్మర నయ్యువతి గర్భవతియై పదవమాసంబునఁ బుత్రరత్నమునే కనినది. సర్వలక్షణలక్షితుండగు నాబాలునకు భూపాలుండు సుధన్వుండని పేరుపెట్టెను. తిరుగా మూఁడేండ్లకు నారాచపట్టి యతియొకముద్దులపట్టిం గాంచినది. వానికి రాగవర్ధనుఁడని పేరుపెట్టెను. ఈరీతి నా నారీరత్నము మూఁడేండ్లకొకపుత్రుని వరుస గ్రమంబున నిరువదిమంది పుత్రులంగనినది వారందరు నసమానరూపరేఖావిలాసంబుల నొప్పియు సమానరూపరేఖావిలాసములతో

నొప్పారc జూచువారలకుc గన్నులపండువుగాc దోచుచుండిరి.

సీ. పాలీయవేయంచుc బైcటలాగు నొకండు
బువ్వబెట్టుమటంచుc బొడుచునొక్కc
డంగీలు గూర్చవే యని లాగునొక్కండు
జుట్టుదువ్వు మటంచుc బట్టునొకcడు
తొడవులిమ్మనుచుc బైcబడునొక్కతనయుండు
చదువుజెప్పుమటంచు నదుమునొకcడు
తలయంటుమంచుc జిందులుద్రొక్కునొక్కండు
వంటకాల్దెమ్మని గెంటునొక్క

గీ. దూర్మినందఱకన్నియు నొసcగి విసుగుc
జెంద కఱనవ్వుతో నరవిందగంధి
చేcతనేయక కటువుభాషింపకెపుడు
బిడ్డలందరc గడుబ్రీతిcబెనుచుచుండె.

సీ. ఒకనికి జాతకర్మోత్సవం బొక్కనం
దనుని కన్నప్రాశనప్రశక్తి
రణసిద్ధి నవస్త్రధారణ భద్రమొక్క ప
ట్టికి నిభారోహణాత్మకశుభంబు
అక్షరాభ్యాసకార్యారంభ మొకని క
శ్వారోహణోరు కల్యాణ మొక్క
సుతునకు స్నాతకవ్రత మొక్కనికి నుప
నయనక్రియ మఱొక్కనందనునకు

గీ. నెప్పుడును జేయుచుంద్రు వారింట శుభము
లెడ తెగక నిత్యకల్యాణ మొసగc బచ్చ
తోరణముగాcగ మఱియేకుమారునకు నొ
చూడ వారి కుటుంబమే చూడవలయు.

అని యెఱింగించువఱకు వేళయతిక్రమించుటయు నయ్యావారు తద నంతరోదంతంబు పై మజిలీయం దిట్లు సెప్పందొడంగెను.



217 వ మజిలీ

## వీరవర్మకథ.

తాళధ్వజుండు కుమారుల కండఱకు వేరువేరు విద్యామందిరములు వ్యాయామశాలలుగట్టించి తగిన యుపాధ్యాయుల నియమించి విద్యలు గఱపించుచుండెను. అందు వీరవర్మయు సుధన్వుండును పదియారేఁడుల ప్రాయము వచ్చునప్పటికి ధనుర్వేదమంతయు సాంగముగా నభ్యసించిరి. ఇతర విద్యలయందుఁ గూడ నిరుపమానమైన ప్రజ్ఞసంపాదించిరి.

ఒకనాఁడు వీరవర్మ తమ్మునితోఁగూడఁదండ్రియొద్దకుఁబోయి నమస్కరించి ఆర్యా! మేమిప్పుడు ధనుర్వేదమంతయు జదివితిమి. తత్ఫలం బరయ దిగ్విజయయాత్ర సేయ నభిలాషగలుగుచున్నది. అందుల కనుజ్ఞయిండని కోరిన విని యతండు మీతల్లి నడుగుఁడని కనుసన్న జేసెను. వారు ప్రాంతమందేయున్న యామెకు నమస్కరించుచుఁదమ యభిప్రాయమెఱింగించుటయుఁ గటకటంబడి యాసాధ్వీమణియిట్లనియె

బిడ్డలారా! మీరు విద్యామందిరమునుండి యింటికివచ్చుటకు గడియ యెడమైన నెడదఁ దల్లడిల్ల యుగములైనట్లు తోచును. మీరు విదేశయాత్రకరిగిన బ్రదుకఁగలనా? దిగ్విజయమన మాటలతో నున్నదా! మహాశూరులతోఁ బోరుసంఘటిల్లును. వాఁడిశరంబులేసి మీ మృదుగాత్రంబులు నాశ్రపఱతురు. శత్రువులకు జాలియుండునా! జయాపజయంబులు దైవాయత్తములు మీరు ధనుర్వేదము జదివితిరేనికాని తత్పరిశ్రమయెట్టిదో యెఱుంగరు. యువరాజ్యపట్టభద్రులై

యింటికడసుఖింపక కయ్యమున కేలకాలుద్రువ్వవలయును బాబులారా! యుద్ధమునకుఁ బోవలదు. సుఖంబుండుఁడని గడ్డముపట్టుకొని బ్రతిమాలికొనినది.

అప్పుడు వీరవర్మ నవ్వుచుఁ దల్లీ! నీవు క్షత్రియపుత్రికవు కావా యేమి? మునికన్యకవలెఁ బిరికిమాట లాడుచుంటివే? వీరమాత లిట్లనవచ్చునా? రాజపుత్రులకు సంగ్రామముసేయక పేరెట్లువచ్చును? ఆఱుమాసములు దేశములు దిరిగి క్రమ్మఱ రాఁగలము. పోవుట కాటంకము సెప్పక యనుజ్ఞయిమ్మని ప్రార్థించెను. ఆమాటల కేమియు సమాధానము జెప్ప నేరక విజయమందుఁడు పొండు. అని దీవించివారి యాత్ర కనుమతించినది.

ఆరాజకుమారులిరువురు దివ్యాలంకారభూషితులై ధనురాది సాధనంబులధరించి చతురంగబలంబులు వెంటనంటిరాశుభముహూర్తంబున నిల్లువెడలి ప్రాఙ్ముఖముగాఁ బోయిపోయి యంగ వంగ కళింగాది దేశంబులం జొరఁబడి,

క. శరణాగతులగు నృపతులఁ
గరుణింపుచు నెదురుకొనిన క్ష్మాపతులన్ సం
గరమున నోడించి కడుం
బరిభవ మొనరించి విడుచుఁ పన్నులఁగొనుచున్.

ఇట్లా రాజకుమారద్వయంబు కుమారద్వయంబు భాతి నిర్వక్రపరాక్రమంబున బహుదేశములాక్రమించి భూచక్రాధిపతులనెల్లఁ బాదాక్రాంతులఁ గావించుకొని తమకీర్తిసస్యంబులనెల్లకడలం జల్లి యల్లుకొనఁజేసి తల్లిచెప్పినగడువుదాటకుండ నింటికింబోదలంచిక్రమ్మఱి వచ్చుచు నొకనాఁడొక మహారణ్యమధ్యంబునమధ్యందిన దినకరకిరణజాలంబుల వేడిమికోడి యలసినబలంబుల పరితాపంబపనయింప విశ్రమింపఁజేసి మఱియుఁ బయనంబగుచుండు నంతలో,

సీ. త్రుంచివైచెనదే భ్రమించి కాల్బలము మం
జుల ఫలప్రసవప్రసూనతతులఁ
ద్రొక్కివైచినవవే తురగముల్ ఖురపుటీ
కోటీహతులఁ బుష్పవాటికలను
విరచివైచినవవే వేదండములు కరాం
తములెత్తి ఛాయాప్రధానతరుల
జెఱచివైచినవవేఁ పఱచి తేఱులు నేమి
ధారాగతులను గేదారములను

గీ. మీరలెవ్వారలధికకాంతారమధ్య
గతతపోవనభంగంబుఁ గలుగఁజేయ
వచ్చితి రెఱుంగరో మునీశ్వరులమహిమఁ
గన్నులెఱ్ఱైనబసుమంబు గాకయుండ్రె.

అని యుచ్చస్వరంబునఁ బలుకుచు నచ్చటికొక తాపసకుమారుండరు దెంచుటయు వానింగాంచి వీరవర్మ నమస్కారముగావించిస్వామీ! మీరెవ్వనిశిష్యులు ఇది తపోవనంబని దెలియక నిందుసేనలతో విడిసితిమి క్షమింపుఁడు మేమరుగుచున్నారమనిన నామునిశిష్యుఁడు మీరిప్పుడు పోవలదు. మాగురువుగారసతిదూరములోనున్నారు. అమ్మహాత్మునికడకువచ్చి తప్పుజెప్పుకొని సెలవడిగిపొండు. లేకున్న మీకు ముప్పురాఁగలదని పలికినవినియను మోదించి వీరవర్మవినీతవేషముతో నాశిష్యునివెంట నాయత్యాశ్రమమున కరిగెను. రుద్రాక్షమాలికా విరాజితవక్షుండు భసితావలేపితసకలాంగుఁడు జటామకుటవిరాజితుండునగు నాయోగింగాంచి వెరగందుచు వీరవర్మ తత్పాదములముోల సాష్టాంగమెఱఁగి మహాత్మా! నేను తాళధ్వజుండను క్షత్రియునిపుత్రుఁడ నాపేరు వీరవర్మయండ్రు సుధన్వుఁడను తమ్మునితోఁగూడ దిగ్విజయము సేసి యింటికరుగుచున్నవాఁడను తెలియక నేఁడు మీవంబున

వసించితిమి మాబలమువలన మీయాశ్రమమునకుఁ జెరుపుగలిగినదని మీశిష్యుండు సెప్పుచున్నాఁడు మాతప్పుమన్నించి మాయెడఁ బ్రసన్నులై పోవుట కనుజ్ఞయిండని ప్రార్థించుటయు గన్నులెత్తి చూచి యాతపోధనసత్తముండు హస్తసంజ్ఞచేఁ గూర్చుండుమని నియమించి మఱికొంతసేపునకు జపముసాలించి యక్షమాలిక చెవికిఁ దగిలించి యిట్లనియె.

ఓహో! నీవు తాళధ్వజుని కుమారుండవా? సంతోషము మీయుదంత మెఱుఁగక మాశిష్యుండు మిమ్మదలించెను. పోనిండు అది యొకశుభమే నేఁడిందు మాయతిథిపూజనంగీకరించి రేపుపోవుదురు గాక. అదియేమదీయతపోవనశైలముఅందలి విశేషములపూర్వములు శృంగుహాంతరమున నిలిచిచూచిన దిక్పతులనగరములుగనంబడును. మఱియు ననేకవినోదములున్నవి. నేఁడువానిం జూడవచ్చును. నిలువుఁడని పలికిన మనమున నిష్టములేకున్నను నతనికేమికోపమువచ్చునోయని యమ్మాటల కంగీకరించి నేఁటికిఁబయనంబు సాగింపవలదు. ఆశ్రమ భంగంబుగాకుండ నందే యుండవలయు జాగ్రతయని తమ్మునికివార్త నంపి వీరవర్మశనకా శైలవిశేషంబుఁజూపింపుడని ప్రార్థించుటయునమ్ముని యందొక శిష్యునిజీరి యోరీ! యీతండు సామాన్యమానవుండు కాడుసుమీ! మహావీరుఁడు జాగ్రతగాఁ దీసికొనిపోయి గుహావిశేషంబుల జూపింపుము మర్యాదదాటకుండఁబ్రాణములరక్షించుకొనిరమ్ము పొమ్ము. అనియెఱింగించి శిష్యుని వాని వెంటనంపెను. అయ్యతిశిష్యుం డారాజకుమారునివెంటనిడుకొని యందున్న సోపానమార్గంబున నప్పర్వతమెక్కించి యశేషతరులతావిశేషంబులం జూపుచు నానావిధ ప్రసూనవాసనలు నాసాపర్వంబుగావింపఁ దత్తత్ప్రదేశములు త్రిప్పి త్రిప్పి క్రమంబున శిఖరారోహణంబు గావింపఁజేసెను.

అందొక గుహాముఖంబు గోపురద్వారమువలె భూరికవాట

గుప్తంబై విచిత్రముగాఁ గనంబడుటయు రాజకుమారుండా మునిశిష్యునితో నార్యా! ఇదియేమి? సౌధద్వారంబా గుహాముఖంబా? దీనిలో నెవ్వరైననుండిరా? అని యడిగిన నాశిష్యుండు రాజపుత్రా! ఇదియేకాదా మాగురుఁ డెఱింగించిన కందరము దీనిలోపలికిఁబోయి చూచిన దిక్పాలురనగరంబులు గనంబడునని జెప్పెను.

వానింజూడ వేగిరపడుచు నానృపకుమారుండు పదపదతలుపులు తీయుము దారిజూపుమని తొందరపెట్టిన వాఁడు రాజపుత్రా! ఈ తలుపులు బలశాలులుగాని తీయలేరు నావలనఁగానేరదు నీవు రమ్మ త్రోయుమని యుపాయముచెప్పిన నతండొక్కత్రోపుతో నాకవాటముల తెరచివైచెను. తదంతరంబు మిక్కిలి విశాలముగానున్నది. కుడ్యభాగములు విచిత్రచిత్రప్రతిమలచే నిండింపంబడియున్నవి తద్విశేషములరయుచు రాజకుమారుఁడు మెల్లగాలోనికి నడచుచుండెను. వెనుక శిష్యుఁడు పోవుచుండెను.

కొంతదూరమరిగి యతండార్యా! దిక్పతుల నగరంబులు గనంబడలేదేమి? బొమ్మలేదిక్పతులా వేగ వానిం జూపింపుమని యడిగిన వాఁడిట్లనియె.

రాజపుత్రా! దాపునకువచ్చితిమి అదిగో యాబల్లమీఁద నిలఁబడిచూచిన నావిశేషములుగనంబడును దానినెక్కిచూడుమని పలికిన నిజమనికొని యారాజపుత్రుఁడు తటాలున నాబల్లపై కెక్కెను. అప్పుడు గుభేలుమని మీటనడలి యాబల్లయొక గర్తములోనికొఱిగినది. అతండా గర్తములోఁబడి క్రిందికి జాఱదొడఁగెను. ఆసొరంగము గుండ్రముగా నునుపుగానుండి పట్టుకొనుటకేమియు నాధారములేక యంధకారబంధురంబై యొప్పుచున్నది. అతం డందుఁబడి యూరక క్రిందికి జాఱుచుండెను నిమ్నాభిముఖముగా జాఱుచుండుట నతనిమేనికిఁ జాలనొప్పిగాఁ దోచుచుండెను.

అప్పు డతండాత్మగతంబున నౌరా! ఆకపటాత్ముఁడు నన్నెంత మోసముజేసెను! నన్నిట్లీయగాధగర్తములోఁ బడద్రోయ వానికేమి ఫలమువచ్చెను. ఒకవేళఁ బోవం బోవ దిక్పతులనగరములు గనంబడు నా? నీ నాకిదేటిలయూహ. ఈజాఱుటవలన నాకాయాసమధికమగు చున్నది. ఇఁకగడియలోఁ బ్రాణములు బోఁగలవు. అక్కటా మాతల్లి మాట వినకపోవుటచే నీముప్పు వాటిల్లినది. మాయునికిఁ దెలియకెంత చింతించునో? మాతమ్ముఁడుగూడ నన్ను వెదకుచువచ్చి వీనిమాయకు జిక్కునేమో! అని యనేకవిధంబులఁదలంచుచుండ గొంతసేపటికి వానికి స్మృతి దప్పినది.

గోపా! వినుమతండొకదివసంబెల్ల జాతిజాతి తుద నొక విశాల శిలాఫలకంబునందలి యిసుకపఱుపుపయింబడియెను ఆదేహముట్లుపడిన తోడనే యంకుఁగాపున్న రక్కసుండొక్కఁడొక బడియతో వానితల మీఁద వ్రేయఁబోయిన ఆ వలదు వలదు నిలునిలుమని యాప్రక్కనే కూర్చున్న లంబోదరియను రాత్రించరి వారించినది. ఆమాటవిని యా దానవుఁడు దేవీ! అట్లంటివేమి! ఈకళేబరములో నింకను బ్రాణము లున్నవి. పూర్తిగాజంపి రాజుగారివంటశాలకుఁ దీసికొనిపోవలదా? అని యడిగిన నాదానవి కుంభా! ఇటురా. చెవిలోమాట. నీవునరాం తకు నెఱుంగుదువా? వాఁడు నాకుఁ జుట్టమగును. వాని యిల్లాలు చూలాలై యున్నది. సద్యోహతనరశవమాంసము దిన వేడుకపడు చున్నదఁట అందులకై వాఁడు నన్నాశ్రయించుచున్నాడు. ఎల్లుండి యామెకు సీమంతోత్సవము గావింతురఁట. అప్పటికైన నట్టిమాం సము సంపాదించిపంపుమని బ్రతిమాలికొనియెను. ఇప్పుడువీనింజంపినచో నెల్లుండికాకళేబరముక్రుళ్లిపోవును. వీఁడుసగముచచ్చియున్నాఁడు. ఎల్లుం డికిఁబూర్తిగాఁ బ్రాణములుపోవును. పోకున్నను వాండ్రేకడ తేర్తురు. నీవీ కళేబరము నీతట్టలో నిమిడించుకొని మూతబెట్టి వారింటికిఁ దీసికొని

పోయి యప్పగించిరమ్ము. నాకు మాటదక్కగలదు వారిల్లా తోటలో నున్నదని యుపదేశించిన నించుకసంశయించుచు వాఁడిట్లనియె.

దేవీ! వంటవాండ్రు దీనికొఱకు వేచియుండి తీసికొనిపోకున్న రాజుగారి కెఱింగింపరా? నేఁడు పడినకళేబరమేమైనదని యడిగిన నేమిచెప్పవలయును? ఏలికవలన మాటరాదా? అనియడిగిన నారక్కసి సరిసరి. ఇదియా నీశంక మనమిరువురము గలిసిన నీరహస్యమెవ్వరికిఁ దెలియును? నేఁడే కళేబరము శిలాయంత్రమునఁ బడలేదని చెప్పుదము. వరుసతప్పక నిత్యము పడుచున్నదాయేమి? అనుటయు వాఁడుదాని కనుచరుఁడగుట నప్పనికంగీకరించి నక్కళేబరముజిదియఁ గొట్టక మెల్లగానొకతట్టలోనికెక్కించి మూతవైచి నెత్తిపై బెట్టికొని యాతోట దెసగాఁ బోవుచుండెను.

---

# పద్మసేనకథ.

అప్పు డప్పురవరప్రభువగు వజ్రకంఠుఁడను రాక్షసరాజు కూఁతురు పద్మసేనయను చిన్నది ద్విజటయను చెలికత్తెయతోడ నశ్వశకటమెక్కి పూఁదోటకుఁబోయి మరలి వచ్చుచు దైవవశమున నాకుంభున కెదురు పడినది.

కుంభుం డాబండి రాజపుత్రికదని యెఱింగి వెఱచుచు మఱిగి పోవలయునని పెడతెరువున మఱలెను. అవ్విధమరసి రాజపుత్రిక యనుమానముతో వానిం దాపునకు రప్పించి నీ వెవ్వఁడవు? ఆ గంపలో నేమియున్నది? నీమొగంబు జూడ నేదియో యెత్తికొనిపోవుచున్నట్లు కనంబడుచుంటివి. నిజము సెప్పుమని యడిగినవాఁడు గడగడ వడంకుచు నిట్లనియె.

తల్లీ ! నేను దేవరదాసుఁడ. శిలాయంత్రమును గాపాడుచున్న

లంబోదరిచేఁతిక్రింది భృత్యుఁడ నాపేరు కుంభుండందురు నేనాలంబో దరిపంపునం బోవుచుంటినని గద్గదస్వరముతోఁ బలికిన నక్కలికి గంపలోనిదేమో చూపి పొమ్మనుటయు వాఁడాగంపను మెల్లగా నేలకుదింపి పైమూఁత దీసి నంత.

సీ. ఆజాను దీర్ఘబాహాదండయుగళంబు
సురుచిరకంబు సుందరగళంబు
తొగలతేని బెడంగు దెగడునెమ్మొగముఱు
ద్యుతిఁ గల్వరేకులదొరయు కనులు
పిడికెడునడుము నొత్తైదు వళిత్రితయంబు
రమ్య వ్రణాంకితోరస్థలంబు
మేలిమిబంగారు డాలునేలఁగఁజాలు
నొడలుతీరై రొప్పుతొడలు గలిగి
గీ. యవయవంబుల గుదియించి యణఁచి గంప
లోన నిమిడించి కట్టినగాని కాంతి
దొరగకందొంటి పాణంబుతోవసించి
యున్నరాసుతుఁగాంచి రక్కన్నె లపుడు.

తటాలున బండిదిగనుఱికి రాజపుత్రిక వాని కళేబరము పరిశీలించి చూచి తలయూచుచుఁ జెలీ! వీఁ డెవ్వఁడో యీలోకమువాఁడు కాడు అయ్యో! పాపము వీనిమేన నొక్కప్రాణముమాత్రమే యున్నట్లు తోచుచున్నది. కటకటా! వీనినిట్లు తట్టలోఁ నొక్కిపెట్టితి వేమిరా? వీఁ డెవ్వఁడు? ఎందుఁ దీసికొనిపోవుచుంటివి. నిజము చెప్పుము లేకున్న నిన్ను దండింపఁ జేయుదునని యదలించి యడిగిన వాఁడిట్లనియె.

తల్లీ! వీఁ డెవ్వఁడో నేనెఱుంగ నేఁడు యంత్రశిలాఫలకంబునం బడియెను లంబోదరిపంపున నరాంతకునింటికిఁ దీసికొనిపోవుచున్నానని యావృత్తాంతమంతయు నెఱింగించెను. ఆమాటవిని రాజపుత్రిక సఖీ!

యంత్రశిలాఫలకమన నేమి? అది యెక్కడనున్నది? దానిలో వీఁడెట్లు పడెను. దానివృత్తాంతమెఱుఁగుదువా యనియడిగిన సఖురాలిట్లనియె.

ముదితా! అదియొక బోనువంటి యంత్రము. భూలోకములోఁ జిత్రకూటమను నగముగలదఁట అలంబసుండను రాక్షసుండు ముని వేషధారియై యాగిరినాశ్రయించుకొనియుండును. ఆకొండశిఖరమున సుందరంబగు కందరమొకటిగలదు. ఆగుహాలోనుండి మనలోకమునకు సారంగము త్రవ్వించిరి. అలంబసుండెఱుఁగనిమనుష్యుల నాగిరిశిఖర మెక్కించిగుహావిశేషంబులం జూపునెపంబున శిష్యునిచేనాగర్తంబునం బడనేయించును. అందుఁబడినవారు సగము ప్రాణముతో నీలోకము జేరుదురు. ఆదేహముశకలములుగాకుండమీఁదంద్రడియందొక శిలాఫలక మమరించి దానిపై నిసుకపరుపు వైపించి యందుఁబడినవెంటనే బడి యతోఁజంపించి యామాంసము తెప్పించుకొని తినుచుండును. ఆయంత్ర ము మయునిచే నమరింపంబడినది. అందునల్లపూసవైచినను జారివచ్చి యీయిసుగపఱుపుపయింబడును. అని యీకథ నాకొకప్పుడు మాతల్లి చెప్పినది పాపమీపురుషుఁ డాలయంబసునిమోసమెఱుంగక యీసా రంగములోఁ బడి వీనిచేఁజిక్కెను. వీనియాకారముజూడ గొప్పవంశము వాఁడుంబలెఁగనంబడుచున్నాఁడు. వీనిదేహమును నరాంతకునిభార్యకు గబళమగునట్లు విధి విధించెనుగాఁబోలు! నెట్లుతప్పునని పలికిన విని రాజపుత్రిక యిట్లనియె.

అట్లుకాదు దైవసంకల్పము వేరొకరీతినుండఁబట్టియే మనకంటఁ బడియెను. వినుము వీనిమనయింటికిఁ దీసికొనిపోయి బ్రతికింతము. వీని వృత్తాంతమువిని కర్తవ్యమాలోచింతము వీనిసౌందర్యము నాడెందము లాగుచున్నది వీడుబ్రతికిన నాపురాకృతము ఫలించినదనుకొనుము. అని యేమేమో పలికి దాని నొప్పించినది.

పిమ్మటఁ బరిచారిక కుంభునితో నోరీ! రాజుగారు దినవలసిన

నరమాంసము నీవుదెలియకుండ నితరులకీయఁ దీసికొనిపోవుచుంటి విది యెట్టియపరాధమనుకొంటివి? పో. పొమ్ము. రాజపుత్రిక మంచిది గనుక నీయాపద దాటినది దీని మేము దీసికొనిపోయెదమని చెప్పి వానిం బొమ్మని మెల్లగా నతనిశరీరము నొవ్వకుండ నెత్తి తమబండిలోఁ బండు కొనఁబెట్టి తమపుట్టము చెఱంగుగప్పి యప్పుడే తమయంతఃపురమునకుఁ దీసికొనిపోయి అందొక మెత్తని పానుపునం బవ్వళింపఁజేసి,

ఆ. గీ. చమురు రాచికాచి సందులఁగదలించి
కట్లుకట్టి పెక్కు పట్లువైచి
వేడినీళ్ళఁగడిగి వెసగాత్రములనెల్ల
సాగఁదీసిలాగిచక్కఁబడఁగ.

గీ. బాలునకుఁ బోలె నోటిలోఁ బాలుబోసి
త్రాగఁజేయుచుఁ బెక్కు వైద్యములు సేయఁ
గలిగె వానికిస్మృతి యొక్కనెలకు నారి
గన్నులెత్తి పరీక్షించి కలయఁజూచె.

ఆహా! నేనాగర్తములోఁబడి యీదివ్యభవనములోని కెట్లువచ్చితిని? నాకుపచారము చేయుచున్న యీరాజవరాంగనలెవ్వరు? తెలిసినది. ఇది స్వర్గలోకములోని సౌధముకావచ్చును. ఆగుహాంతరమునుండి దిక్పా లుర నగరములు గనంబడునని యయ్యతీశ్వరుఁడు సెప్పలేదా? అది కైతవమని యమ్మునిపతి నిందించితిని. నాపాపముశమించుఁగాక. వీరు దేవకన్యకలు అనితలంచుచుండ రాజపుత్రికవచ్చి వానిప్రక్కలోఁ గూర్చుండి మేను నివురుచు మొగము దుడుచుచు బంగరుగిన్నెలోఁ బాలుదెచ్చి సుందరుఁడా! నాపుణ్యమునఁ బ్రతికితివి. పాలుగ్రోలుము నోరు తెఱచుము. అనిలాలించి ఱలుకుటయు నతండు కడుపునిండఁ బాలు ద్రావి బలముగలిగి తనప్రక్కలోఁ గూర్చున్న యామె మొగము సాభి ప్రాయముగాఁ జూచుచు నిట్లనియె.

కాంతామణీ! ఇది యేలోకము? నీవెవ్వని పుత్రికవు? నేనిక్కడి కెట్లువచ్చితిని? నాకునపూర్వోపచారములు సేయుచున్న నీకులశీల నామంబులువివరించి శ్రోత్రానందముగావింపుము. అనియడుగుటయుఁ జెలువనగవుతో నమ్ముగువ యిట్లనియె.

ఆర్యా! మీరేదేశమువారో యెవ్వనికుమారులో యిక్కడి కెట్లువచ్చితిరో మీవృత్తాంతము ముందు మాకెఱింగించిన పిమ్మటఁ దరువాత మాకథ యెఱింతుమని పలికిన విని యారాజనందనుండు తాను తాళధ్వజునికుమారుండననియుఁ దమ్మునితో దిగ్విజయయాత్ర వెడలుటయు మునీశ్వరునిశాసనప్రకారము చిత్రకూటమెక్కి గర్తములోఁ బడిపోవుటయు లోనగువృత్తాంతమంతయుంజెప్పి అంతవట్టు నాకు జ్ఞాపకమున్నది పిమ్మట నేమిజరిగినదియో తెలియదు. అతండు సత్యర్షియేమైనచో నిది దిక్పతులనగరములలో నొకటికావలయు నీవు దేవకన్యకవు కావలయు నిఁకనున్న తెఱంగెఱింగింప నీవేప్రమాణమని పలికి యూరకున్నంత నాజవ్వనిలేనవ్వు మొగంబునకునగయై యొప్ప నిట్లనియె.

రాజపుత్రా! మీమాట కన్యథాత్వమేలవచ్చును. ఇది నాక లోకమే. నేను రంభను. అదినాచెలికత్తియ మేము దేవవేశ్యలమగుట నిన్నంటినదోషముండదు నీవుగావించిన సుకృతముచేఁ బ్రీతులమైతిమి. నీసేవసేయుటయే మాకు విధికృత్యము విస్రబ్ధముగా శయనింపుఁడు కావలసినపదార్థములడిగి తీసికొనుఁడు.ఇదిస్వగృహములాగుదలంచి యుపచారములఁ జేయించుకొనుఁడుఅనిపలికినవినియక్కలికికతండిట్లనియె.

రాజపుత్రుఁడు—బోటీ! నీమాటలువినఁ బరిహాసజల్పితములు వలెఁదోచుచున్నవి. నీవు నిజముగా రంభవే?

పద్మసేన—సందేహమేమిటికి! నేనురంభనే నన్ను మీరు నిర్భయముగా ననుభవింపవచ్చును.

రాజపుత్రుఁడు—దేవతలనిమిషులని వ్రాయఁబడియున్నదిగదా? నీవురంభవైతే నీకంటిరెప్పలట్లువాలుచున్న వేమి?

పద్మసేన—సరిసరి ఇదియా? మీశంక పురాణవచనములన్నియు సత్యములనుకొనుచుంటిరా ! పూర్వకాలములో నట్లుండునవి చిరకాలమగుట బరువెక్కి యిప్పుడు రెప్పలువాలుచున్నవి.

రాజపుత్రుఁడు—మంచిసమాధానమే. కానిమ్ము. నాదేహము వెనుకటిదేనా మారినదియా?

పద్మసేన—అదిమీకే తెలియగలదు చూచికొనుఁడు?

రాజపుత్రుఁడు—(చూచికొని) పూర్వదేహమె! నేనీదేహముతోనే స్వర్గముజేరితినా?

పద్మసేన—అవును. అమ్మవారిప్రసాదమువలన.

రాజపుత్రుఁడు—నేను దిరుగామాదేశమునకుఁబోవుదునా?

పద్మసేన—అది యసంభవము నాకమునకరిగినవారు తిరుగా స్వదేశమునకరుగుటయెట్లు?

రాజపుత్రుఁడు—నేనిక్కడ నేమిచేయుచుండవలయును?

పద్మసేన—మీరుపురాణములు చదివియుందురు. స్వర్గలోకవాసు లేమిచేయుచుందురో తెలియదా మీరునదియే?

రాజపుత్రు—మదీయభుజపరాక్రమము తేటపడఁ బ్రత్యర్థులతోఁ బోరాడవలయు నిందుమహావీరులెవ్వరైన నున్నారా?

పద్మ—కావలసినంతమంది మహావీరులున్నారు. ఇందున్నవారందరుశూరులే. మీభుజకండూతివదల్పఁగలరు. అని పద్మసేనవీరవర్మతో నర్మాలాపము లాడుచున్నసమయంబునఁ బరిచారిక తలుపుదగ్గిరకువచ్చి రాజపుత్రీ! నీతో మాట్లాడుటకై అమ్మగారు వచ్చుచున్నారఁట తలుపువేసి యీవలకురా అని సంజ్ఞచేయుటయు నదరిపడి యమ్మదవతి యిదిగో యిప్పుడే వచ్చెద నిందుండుఁడు. అని

పలికి తలుపుఁ జేరవైచి ముందరిచావడిలోనికివచ్చి కూర్చుండెను. ఇంతలోఁ దల్లివచ్చి.

తల్లి—అమ్మా! పద్మసేనా! కుశలముగాఁ నుంటివా?

కూఁతురు—కుశలము కాకయేమి?

తల్లి—నీకొకశుభవార్త యెఱింగింపవచ్చితిని వినుము.

కూఁతు—అవహితనైతి నెఱింగింపుము.

తల్లి—నీతండ్రి నీకుఁ గొన్నిసంబంధములు తెచ్చిరి కానివాని నేనొల్లక స్వయంవరము చాటింపింపుఁడని చెప్పితిని ఆపద్ధతినీకిష్టమేనా.

కూఁతు—ఎక్కడ చాటింపుమంటివి!

తల్లి—మనజాతివారు రక్కసులు వసించియున్న సుతలాది సప్తపాతాళలోకములలోను.

కూఁతు—రక్కసులం బెండ్లియాడనని నేనిదివఱకు నీతోఁ జెప్పలేదా

తల్లి—రక్కసులకుఁగాక నిన్ను మీతండ్రి శత్రువులైన దేవతలకును గబళములైన మానవులకు నిత్తురనుకొంటివా యేమి? వచ్చిన వారిలో నచ్చినవానిం బరిగ్రహింపుము.

కూఁతు—నాకు రాక్షసజాతియే నచ్చలేదు.

తల్లి—పుత్రీ! నీకు మాతృసాంప్రదాయము వచ్చినది. యేమిచేయుదుము నన్ను మీతండ్రి నందనవనములో విహరింపుచుండగా బలాత్కారముగా నెత్తికొనివచ్చి పెండ్లియాడిరి. నేనచ్చరజాతిదాననైనను దానవునితోఁ గాపురము సేయుచుండలేదా? దానవులలో మాత్రము మంచివారు లేరను కొనుచుంటివా యేమి. ప్రహ్లాదుఁడు బలి మొదలగువారు దానవులు కారా.

కూఁతు—ఆగొడవయంతయు నాకవసరము లేదు. నన్ను మనుష్యుఁ డెత్తికొనిపోయి పెండ్లియాడిన నేమి చేయుదురు?

తల్లీ—నిన్నెత్తికొని పోఁ దగినట్టి మనుష్యుఁడు వచ్చినప్పుడా చూతములే? నేను పోయివత్తు మీ తండ్రి నా నిమిత్తము వేచియుందురు. అని పలికి యారాక్షసరాజపత్ని నిర్గమించినది.

వీరవర్మ వారిసంవాదమంతయుఁ దలుపుదాపున నిలువఁబడి యాకర్ణించెను. అతండు సూక్ష్మబుద్ధియగుట నది పాతాళలోకమనియు నామె రాక్షసపుత్రికయనియు నామె వివాహము నిమిత్తము స్వయంవరము చాటింతురనియు లోనగువిశేషములు కొన్ని గ్రహించి తనరాకను గుఱించి యాలోచించుచు మఱికొన్ని దినములు గడిపెను.

మఱియొకనాఁడచ్చేడియ తనకు వీడియమిచ్చుచుండు నప్పు డా రాజకుమారుఁడా తరుణీమణి మణిబంధము పట్టుకొని ముద్దువెట్టుకొనుచు బాలా! నీవృత్తాంత రహస్యముజెప్పక నన్ను మోసముచేయుచున్నావు నిజముగా నీవు రంభవైనచో విమానమెక్కి విహరింతము రమ్మి. నన్నీశుద్ధాంతములో దాచుచుంటివేమిటికి? నిజము చెప్పు దనుక నీచేయి విడువనని పలికిన నవ్వనిత నవ్వుచు నింద్రునికిఁ దెలియకుండ నిన్నిందు దాచుచుంటిని. నీయునికినతం డెఱింగిన బంధింపఁగలఁడు నేను రంభనే నాసౌందర్యము నీకు నచ్చలేదా? నీవు నలకూబరునికన్నఁ జక్కనివాఁడవని నిన్ను వరించితిని. తెలిసినదియా అనుటయు నతండు నీవు రంభవు కావు గాని యూరుహాసిత రంభవగుదువు. నే నంత తెలియనివాఁడను కాను నీపేరు చెప్పువఱకు నిన్నుఁ గదలనీయనని చేయి వదలి కౌఁగిటిలోఁ బిగియఁబట్టెను. అప్పుడాచిన్నది నాథా! నాపేరు పద్మసేన అనఁబోయి కాదు రంభ నిజము చెప్పినఁ బంధింపవచ్చునా? విడువుఁడు విడువుఁడు అని పెనఁగులాడుచు నెఱుఁగనదివోలెఁ గొన్నిచిట్టకములు వెలయించుచు నిజముజెప్పెద వదలుఁడని మఱియుఁ బ్రతిమాలినది. కౌఁగిలివదలి యతండు మఱియుఁ గరగ్రహణముజేసి నిజముచెప్పుమని నిర్బంధించెను.

సఖీ! సఖీ! ఇటురా! ఈధూర్తుఁడేమిచేయుచున్నాఁడో చూడు మని కేకవేయుటయు నాపరిచారిక తలుపుత్రోసికొని లోనికి వచ్చి ఔరా! అప్పుడే పాణిగ్రహణమహోత్సవము జరుగుచున్నదా! రాజకుమారా! ఏమి యీతొందర ఏమి యీసాహసము చనువిచ్చితి మనియా? అని యడిగిన నతం డోహో నీసఖురాలు రంభకాదా రంభాసంభోగసౌఖ్యంబు బహుజన్మసుకృతపరిపాకంబునం గాని లభించునా! నాసంరంభంబు దూష్యంబుగాదు బోటీ! మీపాటమాటలు నాకు రావనుకొంటివా? మీరెవ్వరో నిజముచెప్పువఱకు నీవయస్యను గదలనీయనని యదలించుటయు నాపరిచారిక నవ్వుచు ని ట్లనియె.

ఆర్యా! మాభర్తృదారిక మీకింతవఱకు నిజముచెప్పక మీకపరాధినియైనది. నే జెప్పెద వినుండు. ఇది అతలలోకము దీని వజ్రకంఠుఁడను దానవనేత పాలించుచున్నాఁడు. ఈమె యమ్మహారాజు కూఁతురు. ఈమె పేరు పద్మసేన. ఈమె తల్లి యప్సరోవంశసంజాత యగుట నాసఖురాలు రాక్షసజాతి వ్యతికరమగు సౌందర్యము గలిగి యున్నది. భూలోకములోఁ జిత్రకూటము దాపున జపముజేయువాఁడు అలంబసుఁడను రక్కసుఁడు. వాఁడు మనుష్యుల మాయఁజేసి యాకొండ యెక్కించి గుహాంతరములోని సొరంగములోఁ బడద్రోయించును. నీవు వాని వలలోఁబడి సొరంగమార్గంబున నీలోకమునకు వచ్చితివి. వధ్యశిలపైఁబడిన తోడనే మడియవలసినదే నరాంతకునిమిత్తముగా వెంటనే చంపఁబడక భర్తృదారిక కన్నులబడితివి. ఆమె యిక్కడికిఁ దీసికొనివచ్చి యుపచారములుసేసి బ్రతికించుచున్నదని యావృత్తాంతమంతయు నెఱింగించినది.

ఆవార్తవిని వీరవర్మ విస్మయక్రోధ సాధ్వసపరితాపములొక్కమొగి చిత్తంబు త్తలపెట్ట నొక్కింత సేపు ధ్యానించి తనకుఁ బ్రాణదానముగావించిన రాజపుత్రికయెడఁ గృతజ్ఞతఁజూపుట నేదియోవిచా

రముతో నాలోచింపుచుండఁ బద్మసేన ఆర్యా! మీచరిత్రమువిని మీరు భయపడుచున్నట్లు తోచుచున్నది. మిమ్ము నాహృదయంబునం బెట్టుకొని కాపాడెదను నేను మీదాసురాలనై యుండఁ గొదవయేమి? యదేచ్ఛముగా సుఖింపుఁడని పలికిన నవ్వుచు వీరవర్మ యిట్లనియె.

ప్రేయసీ! నీయాదరణోక్తులవలన నాకెంతేని సంతోషము విశ్వాసముకలిగినది. ప్రాణదాయినివైన నీచెప్పినట్లు నడుచుటకంటె నాకు వేరొకమంచిమార్గములేదు. నేనిందలి రాక్షసులకువెరచి చింతింప లేదు. నన్నుఁబోలె నాతమ్మునిఁగూడ వాఁడు సారంగములోఁ బడఁ జేయును నేను మీమూలమున బ్రతికితిని కాని వానింజంపక విడుతురా? అనిపరితపించుచుంటి ననవుఁడాజవరాలు "ఆయువుమర్మములఁగాపాడు"నని యున్నదిగదా. దైవవశంబున నతండు సారంగమునఁ బడుట తటస్థించినప్పుడాయనమాత్రము వేరొకరీతి బ్రతుకరాదా? లోకము లన్నియు దైవాయత్తములుకావా! అవృత్తాంతముదెలిసికొనియెద మీరు విచారింపవలదని ధైర్యముగఱపినది. అతండామె చేయు నుపచారములచే నానందించుచుఁ గొన్ని నెలలు సుఖముగా వెళ్లించెను.

అని యెఱింగించువఱకుఁ గాలాతీతమైనది. అయ్యవారు తద నంతరోదంతమం బవ్వలి మజలీయం దిట్లు చెప్పఁదొడంగెను.

---

218 వ మజిలీ

## సుధన్వునికథ

లంబోదరి—ఏమిరాకుంభా! యింతయాలస్యమైన దేమి? ఆ కళేబరము నరాంతకుని కప్పగించితివా? ఏమనిరి? ముహూర్తము మారినదఁటకాదా?

కుంభుఁడు—అమ్మయ్యో! నేఁడెంతగండము ఎంతగండము.

గుండెలిప్పటికిఁ గొట్టుకొనుచున్నవి చూడుము!

లంబో—ఏమియుపద్రవమువచ్చినదో వేగిరము చెప్పరా రాజు గారు చూచిరాయేమి?

కుంభు—నాగ్రహచారము నేనాదారినే పోవలయునా?

లంబో—ఏదారిఁబోయితి వేమిజరిగినదియో చెప్పరా విధవ కాన నాగుండెలు కొట్టుకొనుచున్నవి.

కుంభు—నాకిదిపునర్జన్మమే. యీలాటిపని యెన్నఁడును జేయఁగూడదు బాబు!

లంబో—ఏమిజరిగినదియో చెప్పరా.

కుంభుడు—నీకేమి? అమ్మాయిగారు మంచివారుగనుక బ్రతికి వచ్చితిని లేకున్న నీపాటికి వల్లకాటికే.

లంబో—అమ్మాయిగారు దారిలోఁగనంబడినదా యేమి?

కుంభు—అవును బండిమీఁద నెక్కడనుండియో వచ్చుచు నాకెదురుపడినది.

లంబో—(భయముతో) అదేమని అడిగినదాయేమి.

కుంభు—అడిగి యూరకున్నదియా? మూఁతతీసి చూపువఱకు వదలినదికాదు.

లంబో—కొంపముంచి నేను పంపుచున్నానని చెప్పితివాయేమి?

కుం—మఱియేమని చెప్పవలయునో నీవే చెప్పుము.

లంబో—యథార్థము చెప్పితివి కాఁబోలు కొంపముంచితి విరా. కుంభా పైన నేమి జరిగినది.

కుం—అమ్మాయిగారు మంచివారు కావున మందలించి విడిచిపెట్టినారు.

లంబో—ఏ మన్నారో అచ్చముగా నామాటలం జెప్పుము.

కుం—రాజుగారు భుజింపఁదగిన మాంసము దొంగతనముగా

నరాంతకు నింటికిఁ దీసికొనిపోవుట సామాన్యపు నేరమనుకొంటివా? లంబోదరి చెప్పినంతనే దొంగపని చేయుదువా? జాగ్రత. ఈసారి యిట్టిపని చేసితివేని నీప్రాణములమీఁదికి వచ్చునని యేమేమో మందలించినది.

లంబో—ఇం కేమి? లంబోదరి పంపున దీసికొని పోవుచుంటి వని చెప్పితివి కాఁబోలు.

కుం—దేవీ లేదు. ఏ మన్నానో జ్ఞాపకములేదు.

లంబో—పోనిమ్ము రాజుగారితోఁ జెప్పెద ననలేదు గదా.

కుం—మొదటి తప్పుగా గణించి విడిచిపెట్టినది.

లంబో—మఱి ఆకళేబరమేమైనది?

కుం—బండిమీఁదఁ బెట్టుకొని తీసికొనిపోయినది.

లంబో—నేఁటికి ధన్యులమే. కాని మనప్రయత్న మన్నివిధముల నిరర్థకమైనది. నరాంతకు నింట సీమంతోత్సవమింక పదిదినములున్నది. ముహూర్తము మార్చిరఁట నీవక్కడికి దీసికొనిపోయి వను నుపయోగము లేకపోయెడిదే. అని యామాటలే చెప్పికొనుచు నాఁడు వెళ్ళించిరి.

మఱి రెండుదినములు గడిచినంత నొకనాఁడు లంబోదరి కుంభా! గర్తాంతరమున గంటమ్రోగుచున్నది. సొరంగమునుండి యేదో కళేబరము పడుచున్నది కాఁబోలు. కాచికొనియుండుము. మృగమైన వెంటనే జంపుము మనుష్యుఁడైన జంపకుము. ఎట్లైన నరాంతకునికోర్కె తీర్పక తప్పదని పలికిన వాఁడు దేవీ! నీవే పని చెప్పినం జేయుదును గాని ఆకళేబరముమాత్రము నరాంతకు నింటికిఁ దీసికొని పోఁజాలను. నన్ను రక్షించుమని పలికిన లంబోదరి పోనిమ్ము నీవు దీసికొని పోవలదు చీఁకటిపడిన తరువాత నేనే తీసికొనిపోయె దను. మనుష్యుఁడైనచో చంపవలదని యుపదేశించినది. అందులకు

వాఁ డోడంబడి బడియఁదీసికొని వధ్యశిలాఫలకము దాపున నిలువం బడియుండెను. అంతలో జరజరజాఱి దివ్యమంగళవిగ్రహుండగు నొక పురుషుండు గుభాలున వచ్చి యాపఱుపుపైఁ బడియెను.

మనుష్యుఁడని యెఱింగి కుంభుండు బడియతో నేయక దేవీ! లంబోదరీ! నీకోరికయే ఫలించినది. మనష్య దేహమె వచ్చిపడినది యేమి చేయుమనియెదవో చెప్పుమని యడిగిన లంబోదరి యాదరి కరిగి చూచి వీఁడు నాకెంత బరువు. వీనిఁ దట్టలోఁ బెట్టి నొక్క నక్కరలేదు చీఁకటిపడిన తరువాత బుజముమీఁద వైచికొని తీసికొనిపోయెదను. అంత దనుక నామూల దాచియుంచుము. ఈదేహము పదిదినములు నిలవయుండవలయును కావున గాయము దగులనీయ వద్దని యుపదేశించిన వాఁడట్లు కావించెను.

చీఁకటి పడిన తరువాత లంబోదరి యాకళేబరమును చంటి పిల్లనువలె బుజముమీఁద వైచుకొని నరాంతకు నింటికిఁ దీసికొనిపోయి వాని కప్పగించి వీనిం భద్రముగా స్వల్పాహారమిచ్చి కాపాడు కొనుఁడు వీఁడు బ్రతికియేయున్నవాఁడు సీమఁతోత్సవమునాఁడు చంపి మాంసము తీసి పెట్టినఁ జాల రుచిగానుండును. ఇందులకై విశ్వప్రయత్నమైనది రాజుగారికిఁ దెలిసిన ముప్పురాఁగలదు సుమీ యని చెప్పి లంబోదరి శిలాస్థానమున కరిగినది.

నరాంతకుఁడాకళేబరమును భద్రముగాఁ బెరటిలోనికిఁ దీసికొనిపోయిబోనువంటియొకయింటిలోఁ బెట్టియజ్ఞపశువునకుఁబోలె నాహారము వైచి కాపాడుచుండెను. వారుచేయు నుపచారమువలన మొదటిదిన మందే స్మృతివచ్చి వానికాహారము కావలసివచ్చినది. ఆయాహార పదార్థములంతగా రుచింపకపోయినను దారుణంబగు నాకలితోనుండుటంబట్టి దేహధారణమునకై తినకతీరినదికాదు. అతనికిస్మృతివచ్చిన తరువాతఁ దానక్కడి కెట్లువచ్చెనో తెలిసికొనలేక పరితపించుచుఁ

బందీగృహమువంటి యింటిలోనుండి తనవృత్తాంతమునుగుఱించియే వితర్కించుచుండెను.

వానికి నిత్యము నాహారమిడుటకు నరాంతకుని మేనకోడలు రత్నావతియను చిన్నదానిని నియమించిరి. రత్నావతి మిక్కిలి చక్కనిది. అచ్చరకన్యక. నరాంతకుని బావమఱది వజ్రకంఠునితోఁ గూడ నొకప్పుడు నాకముపై దండెత్తినప్పుడుపోయి యందొకయచ్చరను జెఱబట్టి తెచ్చెను. రత్నావతి ఆయచ్చరకుఁ జనించినదగుటఁ బద్మసేనవలెనే రాక్షసస్త్రీలంబోలక దేవతాకన్యలం బోలియున్నది.

రత్నావతి రెండవనాఁ డాహారము దీసికొనిపోయి యాపురుషుని యాకారముజూచి మోహపరవశయై పరిశీలించి అయ్యో! దివ్యమంగళవిగ్రహముగలయట్టి పురుషునికిఁక వారముదినములలో మరణము విధింపఁబడియున్నది. వీనింజంపక నాకువివాహముజేసిన సంతసింతును గదా! దీర్ఘజిహ్వునికొడుకు హ్రస్వపాదునకు నన్నిచ్చి పెండ్లిచేయుదురఁట వానితో నేనెట్లుకాపురముచేయుదును? వీనింజూచిన జాలిగలుగుచున్నది కానిమ్ము. నాకుఁ దోచినసహాయముజేసి రక్షించెదఁగాక అని యాలోచించుచు నాహారముదీసికొని యొకపాత్రలోఁ బెట్టి వానికుందరకుఁ ద్రోసియుందునిలువంబడినది. ఆపురుషుఁడాచిన్నదాని మొగముజూచి వెఱఁగుపడుచునదియే దేశమెవ్వరివిక్కడికెట్లువచ్చితినో ఈమె నడిగి తెలిసికొనియెదంగాక అని యాలోచించి కల్యాణీ! ఇదియే దేశము నీవెవ్వనిపుత్రికవు నీ మొగంబుజూడఁ గరుణారస మొలుకుచున్నది. నన్నిట్లు మీ రేమిటికిఁ బోషించుచున్నారని యడిగిన నాచేడియ వానికిట్లనియె.

ఆర్యా! నీవీదేశముపేరు తెలియకిక్కడకెట్లువచ్చితివి? నీమాటలు విపరీతముఁగానున్నవి. నన్నుఁబల్కరించు నెపంబున నిట్లంటివని తలంచితిని నీకథనీవేముందుఁ జెప్పవలయునని యడిగిన నాతండిట్లనియె.

కల్యాణీ! నేనుభూలోకచక్రవర్తియగు తాళధ్వజుని రెండవకుమారుండ నాపేరు సుధన్వుండందురు. నేనుమాయన్నతోఁగూడ దిగ్విజయయాత్రకు బయలుదేరి పెక్కండ్రరాజులజయించియింటికిఁబోవుచు నొకనాఁడొకకొండప్రక్క విడిసితిమి. అందొకమహర్షితపంబొనరించుచుండుటందెలిసి మాయన్నగారాయన దర్శనార్థమైయరిగి తచ్ఛైలశృంగంబున నాశైలమెక్కియేమయ్యెనో తిరుగానాకడకురాలేదు. ఆదివసమెల్లవానినిమిత్తమెదురుచూచుచుంటిమి మఱునాటికిని రాలేదు. అమ్మఱునాఁడు సాయంకాలమ నేనాఋషియొద్దకుఁబోయి మాయన్నయేమయ్యెననియడిగితిని. కొండశిఖరముమీఁదనున్నాఁడని అందలివింతలతని రానిచ్చినవికావు కాబోలు నేఁడుకూడనిలిచెను. ఈసాయంకాలము నకు రాఁగలడు ఇచ్చఁగలదేని నీవుగూడఁబోయి చూడవచ్చును. మాశిష్యుఁడు దారిఁజూపఁగలడని యుపదేశించిన వానిమాటనిజమనుకొని కొండయెక్కి గుహలోజొరఁబడి యందున్నబల్లపైఁగాలుమోపితినో లేదో తటాలున నొకగోతిలోఁబడి శరవేగముగా జారఁదొడంగితిని. కొంతసేపటికి నాకు స్మృతిదప్పినది. పిమ్మటనేమిజరిగినదియోనాకుఁ దెలియదు. తరువాతకథ నీవే చెప్పవలయునని యడిగిన నాపడతి యిట్లనియె.

ఓహో! నీవు రాజకుమారుఁడవా? మంచియాపదలోనే చిక్కుకొంటివి. వినుము. ఈలోకము అతలము వజ్రకంఠుఁడను దానవుఁడు దీనింబాలించుచున్నవాఁడు. ఇందున్నవారందరు దయాసత్యశౌచములులేని రాక్షసులు నీవువధ్యశిలపైఁబడినతోడనేకూరలత్తట్టలోఁ బడవలసినదే. ఆయుశ్శేషముండఁబట్టియింకను బ్రతికియుంటివి. సరాంతకుని భార్య సీమంతోత్సవమునాఁడు నిన్ను విశసింతురు. అందులకై నీకీయాహారమిడుచున్నవారని యారహస్యములన్నియు నెఱింగించినది.

ఆకథవినినతోడనే వానికాహారము నోటికిఁబోయినదికాదు.

కన్నులవెంబడి బొటబొట నీరుగారఁదొడంగినది. బంధువులందరు జ్ఞాపకమువచ్చిరి. కట్టఁబడియుండుటచే దనపరాక్రమ ముపయోగముకాదని తెలిసికొనియెను. హృదయంబున నధైర్యము ప్రవేశించినది. కన్నులు మూసికొని ధ్యానించుచుండ నాజవరాలు సౌమ్యా! ఆహారము గుడువుము నేనుబోయి వత్తుననుటయు నతఁడాహా? నాలుగుదినములలోఁ జచ్చువాని కాహారమేమిటికి? నాకక్కరలేదు. తీసికొనిపొమ్ము అని యుత్తరము జెప్పెను?

అప్పుడాచిన్నది వానిదైన్యముజూచిదుఃఖించుచు సుందరుఁడా! నేనబలనుగదా? నీవు దుఃఖించుచుండ నాడెందము పగిలిపోవుచున్నది. ఏమిచేయుదును? కానిమ్ము. ఇంకను బదిదినము లవధియున్నదిగదా. నాఁటికేదేని యుపాయము తోపించకపోవునా విచారింపకుము. నాయోపినసహాయము జేసి నిన్ను దాటించెద నాహారము గుడువుమని ధైర్యముజెప్పినది. ఆమాటలువిని యారాజకుమారుఁ డాచేడియం బొగడుచుఁ గడుపుచిచ్చు చల్లారుట కామెతెచ్చిన పదార్థముల భుజించెను. మరల రేపువత్తునని జెప్పి యప్పుడఁతి తలుపులువైచి లోనికిఁ బోయినది.

మఱునాఁడు యథాకాలమునకే రత్నావతి యాహారముదీసికొనివచ్చి తలుపు తెఱచి యతనియెదుటఁబెట్టినది. అప్పుడుసుధన్వుండు దైన్యముదోపఁ దన్వీ నాకీయాహార మేలతీసికొనివచ్చితివి? తినకున్నవారు చంపకముందే చత్తునుగదా! నాకు బలవన్మరణ మేలరావలయు నీవు నావిషయమై జాలిపడుచుంటి వదియపదివేలు జన్మజన్మములకు నీకుఁ గృతజ్ఞుండ నకారణవాత్సల్యరాలవగు నీసుగుణములు లోకాంతరమందుఁగూడఁ గొనియాడుచుండెద నేఁడాహారము గుడవను. ప్రాయోపవిష్టుండనై ప్రాణములువదలెదను మీవారితో తినుచున్నవాఁడే యని చెప్పుము. ఇదియె నీవు నాకుఁజేయు కడపటియుపకారమని

రెండు చేతులుజోడించి మ్రొక్కినంత నక్కాంతారత్నము కన్నులనుండి ప్రవాహముగా వచ్చుచున్న యశ్రుబిందువులఁ బైటచెఱంగున నద్దుకొనుచు పురుషరత్నమా! నీమాటలు నేను వినలేకున్నదానను. నిన్నుఁ జూచినది మొదలు నాహృదయము మేమియోకాని యుత్కంఠితమైయున్నది. నీవు మృతినొందిన నేనుగూడ నీతోమృతినొందెదనని తెలిసికొమ్ము. నీదైన్యోక్తుల నేవినఁజాలకున్నదాన మఱియు నొక్క విశేషం బెఱింగించెద నీవేమిచదివితివి? దేవనాగరలిపి నీకుఁదెలియునా అని యడిగిన నతండిట్లనియె.

కన్యామణీ! దేవనాగరలిపి యననేల సమస్తలిపులు నాకుఁ దెలియును. అడవిఁగాసిన వెన్నెలవలె నాచదువిక్కడ నేమియుపయోగించెడిని? ఎంతేనిజదివితివి అట్లడిగితి వేల? అనిపలికిన నక్కలికి యలరుచు మనోహరా! వీరింట నొకపుస్తకమున్నది. అందనేక సిద్ధులు వ్రాయఁబడియున్నవఁట దేవలోకమునుండి యాపుస్తకము నెత్తికొని వచ్చిరి. కాని యాలిపి వీరికిఁదెలియక తొట్రుపడుచున్నారు. శుక్రాచార్యుల యొద్దకుఁ దీసికొనిపోయి యడుగవలయునని తలంచుచున్నారు నేనా పుస్తకముఁదెచ్చి నీకిచ్చెదను దానింజదివిన నేదేని సాధనముతోపకమానదు. అందనేకసిద్ధులు సమస్తభువనముల విశేషములు వ్రాయబడియున్నవఁట. తెమ్మందువా? అనుటయు నతండు కానిమ్ము నాకింక జేపటివఱకు నాయుర్దాయమున్నది కాఁబోలు. అందలి విశేషంబులఁ దెలిసి తరువాతనేమృతినొందవచ్చును. అనిపలుకుచు నా చెలువదెచ్చిన యాహారము భుజించెను.

ఆరత్నావతియు నతని విడువలేక విడువలేక పెద్దతడవం దుండి త్రేపా పుస్తకము దెత్తునని చెప్పి తలుపులు వైచి లోపలకుఁ బోయినది. ఆరాత్రియెల్ల నతండు నిద్రఁబోవక తన దురదృష్టమును గుఱించి విచారించుచు నెట్టకేలకుఁ దెల్లవార్చెను. రత్నావతియు నత్యుప్రయ

త్నమున నాపుస్తకమును సంగ్రహించి యతిగూఢముగా నాహారపదార్థములతోఁగూడఁ దీసికొని వచ్చి యతని కర్పించినది. మిక్కిలి తొందరగా నాపుస్తకమును బుచ్చుకొని చూడఁగాఁ జతుర్దశభువన సిద్ధిసంగ్రహము అని పుస్తకము పేరు వ్రాయఁబడియున్నది. ఆపేరు చదివినతోడనే యతనికిఁ గొంత ధైర్యము బొడమినది. పుస్తకమును విప్పి ముందుగానందలి విషయసూచిక చదివి వితర్కించెను. వానిలో నతలాదిపాతాళలోకసిద్ధులు అను పత్రములు తీసి చదువగా నొక పత్రమున నీక్రింది విధముగా వ్రాయఁబడియున్నది.

శ్లో. ప్రథమె వివరె విప్ర అతలాఖ్యమనోహరె
మయపుత్రో బలోనామ వర్తతె ఖర్వగర్వకృత్
షణ్ణవత్యోయేన సృష్టా మాయా స్సర్వార్థసాధకాః
మాయావినో యాశ్చ సద్యోధారయంతిచకాశ్చన
జృంభమాణస్య యస్యైవ బలస్యబలశాలినః
స్త్రీగణా ఉపపద్యంతె త్రయోలోక విమోహనాః
పుంశ్చల్యశ్చైవ స్వైరిణ్యః కామిన్యశ్చైవవిశ్రుతాః
యావై బిలాయనంప్రేష్టుం ప్రవిష్టంపురుషంరహః
రసేన హాటకాఖ్యేన సాధయిత్వా ప్రయత్నతః
స్వవిలాసావలోకానురాగస్మితవిగూహనైః
సల్లాపవిభ్రమాద్యైశ్చ రమయంత్యపితాస్స్త్రియః
యస్మిన్నుపయుక్తోజనోమనుతె బహుధాస్వయం
ఈశ్వరోహ మహంసిద్ధో నాగాయుతబలోమహాన్
అత్మానం మన్యమాన స్సమదాంధ ఇవదృశ్యతె.

అని చదివి ప్రహర్షసాగరంబున మునుంగుచు రత్నావతీ ! నీవు జేసిన యుపకారమున కెన్ని జన్మములెత్తిన బ్రతిక్రియఁ జేయఁజాలను జుమీ నీదయవలన నీపుస్తకమున మంచి సిద్ధిప్రక్రియ దొరకినది.

దాన నున్నతస్థితిఁ బొందవచ్చునని పలికిన విస్మయమందుచు నయ్యిందువదన యిట్లనియె.

మనోహరా! నీకు బ్రతుకు తెరువుగనంబడిన నేను బ్రహ్మానందమబ్బినంత సంతోషము జెందుదుఁగదా. ఏదీ తద్విధానమెట్టిదో చదివి వినిపింపుఁడు సంతోషించెదంగాక యని యడిగిన నతం డిట్లు చెప్పెను. ఇది అతలలోకము సప్తపాతాళములలో మొదటిది. ఇందు మయుని కుమారుఁడు బలుఁడనువాఁడు కొంతకాలము వసించెను. అతండు తొంబదియారుమాయల రహస్యముల నెఱింగినప్రోడ. ఒకనాఁ డతం డావలింపఁగా బుంశ్చలులు స్వైరిణులు కామినులు అను మూడు విధములఁ స్త్రీలు జనించిరఁట. వాండ్రు కొండలమధ్యనున్న మహాబిలములో నివసించియుండ్రు. హాటకరససిద్ధిచే నాస్త్రీలువశ్యలై సల్లాపవిభ్రమవిలాసాదులచే రంజింపఁజేయుదురఁట మఱియు వారిం గూడిన వానికిఁ బదివేలయేనుఁగులబలము నిత్తురఁట వాఁడు సర్వలోకములకు నేనేయధిపతినని గర్వపడుచుండునఁట. మఱియు నాహాటకరససిద్ధిప్రకరణ మంతయు నిందు వ్రాయఁబడియున్నది. స్త్రీవశ్యము తరువాతఁ జూచుకొనవచ్చును గాని యిప్పటి యాపద దాటఁగలదు. తలుపు తెఱచి నన్నీయిల్లు మాత్రము దాటింపుము. ఆరససిద్ధిప్రక్రియయే సత్యమైనచో వెండియు వచ్చి యీలోకమునకుఁ గూడ ప్రభువగుదునని చెప్పినవిని యాచిన్నది యించుక విన్నవోయిన మొగముతో నార్యపుత్రా! మీసిద్ధిప్రక్రియ నాకు హృదయశూలమైనది. పోనిందు మీ రెందైన సుఖించినఁ జాలుగదా యని పలికెను.

అప్పు డతండు రమణీ! దాపునకు రా! నీయభిప్రాయము తెలిసినది. ఇదిగో నీపాదములుగొట్టుచున్నాఁడఁగొలదికాలములోవచ్చి యీరాజ్యము గైకొని నిన్నుఁ బట్టమహిషిగాఁ జేసికొనియెదఁగానిచో గృతఘ్నుఁడు బొందు నరకములఁబొందఁగలవాఁడ. వారు పుంశ్చలులనియు స్వైరిణు

లనియుఁ గామినులనియు వ్రాయఁబడియున్నది. పేరులంబట్టి వారెట్టి వారో తెలియఁబడలేదా వారిని మఱచి నిన్ను మఱచిపోవుదునని నీయభిప్రాయము అట్లు సేయఁజాల నిదిగో నాయుంగరమునీకుఁ గురుతుగానిచ్చుచున్నాఁడ నీవే నాప్రాణేశ్వరివి. ఇదిగో గాంధర్వవిధినిన్నుఁబరిగ్రహించితినని పలుకుచు నామెచేయిపట్టుకొని ముద్దువెట్టుకొనియెను.

రత్నావతియు నతనిమాటలకు సంతోషించుచు మనోహరా! నీవుపవాసములచే డస్సియున్నావు. ఎక్కడికిఁబోదువో యేమిజరుగునో తెలియఁజాలదు. ఇంకనాలుగు దినములవఱకు నిందుండినఁ బ్రమాదము లేదు. ఎల్లుండిపోవుదువుగాక నీవియోగము నాకుదుర్భరవేదనగలిగించునట్లు తోచుచున్నది. ఇదెక్కడితగులమో తెలియకున్నది. ఈమూఁడు దినములు నాయిచ్చినయాహారము గుడుచుచు బలముగలుగఁజేసికొనుమని బ్రతిమాలిన నతఁడిట్లనియె.

ప్రాణేశ్వరీ! నిన్నువిడిచిపోవుటనాకునుగష్టముగానేయున్నది. నేను వెళ్ళిననాఁడే నాయవసరమువచ్చి పారిపోయితినని తెలిసినచో నలుమూలలు వెదకి పట్టుకొందురేమో! ఇంచుకవ్యవధియుండిన నేనుదూరముగాఁ బోఁగలను మఱియు నీపుస్తకము నేను దీసికొని పోవచ్చునా? దీనివలన నీకు మాటవచ్చినచో నిచ్చియే పోయెదను. ఇందలి విషయములు కంఠస్థములు సేసికొనుచున్నాను. అని నొడివిన నప్పడంతి యిట్లనియె.

మా నరాంతకుఁడు వజ్రకంఠునికి దగ్గిరచుట్టము. వానిభార్య చిరకాలమునకు గర్భవతియైనది. రేపుచేయఁబోవు సీమంతోత్సవము మహావైభవముతోఁ గావించును. పదిదినములవఱకు త్రాగి మత్తిల్లి యొడలు తెలియకుండ సంచరింతురు. తరువాత రాజపుత్రిక పద్మసేనకు స్వయంవరమహోత్సవము జరుగును. అతొందరలో నీపుస్తకముమాట యెవ్వరికిఁ గావలయును! నీవు తీసికొనిపోవచ్చును. అనిచెప్పి చేతులు ముద్దుపెట్టుకొనుచు నతనియుంగరము భద్రపరచికొని మెల్లన తలుపు

బీగము సంగ్రహించి యెట్లో యాయిల్లుదాటించినది. సుధన్వుఁడాయిల్లు దాటి పుస్తకములో వ్రాసినప్రకార ముత్తరదిక్కు గురుతుజూచుకొని యాదెసగాఁ బోవుచు ఆహా? ఈదేశస్థితి చాలవింతగానున్నది సూర్యుఁడు గనంబడఁడు వెలుఁగుమాత్ర మున్నది. అదియుఁ గొంత సేపుండి చీఁకటిపడుచుండును. దివారాత్రవిభేదము దానివలననే తెలిసి కొనవలసియున్నది. నేను జీఁకటిపడకమున్నే యేదోగుప్తస్థానము జేరి కొనవలసియున్నది. ఈలోపలరక్కసులు నానిమిత్తముతరుముకొనివత్తు రేమో! పాపమాచిన్నది నాకొఱకెంత యుపకృతిగావించినది! మఱియు నెప్పుడుపోయి దానింగలిసికొందునో! అదిగో దూరములో నేవియో కొండలబారు గనంబడుచున్నది నాకదియేగమ్యస్థానమని యూహింపఁ బడుచున్నది. కానిమ్ము. దానినికటము జేరివిచారింపవచ్చునని తలంచుచు వేగముగా నడిచి యాకొండలగండ కరుగునప్పటికి చీఁకటిపడుచుండెను.

శ్లో. త్రికూటగిరి మధ్యస్థం బిలం రత్న ప్రభోజ్వలం
సాధకస్తు పరిక్రమ్య పశ్యే త్పాషాణరోధి తత్.

దైవప్రేరితుండై యతండు తిన్నగా నాత్రికూటగిరిపాదసమీపమునకే పోయెను. అదిత్రికూటపర్వతమని తెలిసికొనునంతతో నలుదెసలఁ జీఁకటి వ్యాపించినది. అయ్యంధకారము భయంకరమై రాతివంటి యతని హృదయమును జెదరజేసినది. కన్నులం దెరచిచూడనేరక మూసికొని యిట్లు ధ్యానించెను.

క. ఎక్కడి కన్యాకుబ్జం
బెక్కడి దిగ్విజయయాత్ర యీపాతాళం
బెక్కడ నీగిరికూటము
లెక్కడ నారాక యిటు విధీ ఘటియించితే.

గీ. కలిసికొందునె బంధువర్గంబుతోడ
మఱియుఁ బురికేగి నాదుసోదరులనెల్ల

జూతునే తల్లిదండ్రులచేత గాఁగ
లింపఁబడుదునే ప్రొక్కి దీవింప వారు.

అయ్యో! ఈయంధకారముపోయి తిరుగా వెలుగువచ్చునా? యీతేయి నేమృగమో భక్షించిన నన్నియుకుములు నటమటమై పోవును. అని మఱియు నేనెంతమూర్ఖుండనైతి, కర్తృత్వము మీఁదనిడుకొని విచారించుచున్నాఁడ. రత్నావతి కైతవంబుగ మృత్యుముఖంబునుండినన్ను దాటించినవాఁడిప్పుడీ చీఁకటిని బోఁగొట్టిసుఖంపఁజేయలేఁడా? సుఖము దుఃఖమునకు దుఃఖముసుఖమునకు నొక్కప్పుడు హేతువగుచుండును. పుస్తకములో వ్రాయఁబడినప్రక్రియ సత్యమేయైనచో నాకునిరతిశయసౌఖ్యంబుగలుగఁగలదు. అనియనేకవిధంబులదలంచుచుండ నతనిహృదయసాధ్వసంబుతోఁగూడ నాయంధకారమువిచ్చి నలుదెసల నేదోపరికాశము వ్యాపించినది.

అతఁడప్పుడు నలుదెసలు పరికించుచుఁబుస్తకములోనున్నవిధానమంతయుంజదివికొని త్రికూటగిరిమధ్యమప్రదేశమున నొకబిలముండునని వ్రాయఁబడియుండుట, త్రికూటమును గురుతుజూచుకొని యాగిరిమధ్యదేశమునులక్ష్యముగానుంచుకొని యెక్కుటప్రారంభించెను. మిక్కిలిశ్రమపడిజాముప్రొద్దెక్కునప్పటి కామధ్యభాగముజేరెను. అందుబిలమెందున్నదో యనిరెండుగడియలు పరిక్రమించి పరిశీలింపుచుండనొకచోటఁబాషాణముచేతఁ గప్పబడియున్నప్రదేశమునుజూచి మఱికొన్ని చిహ్నములంబట్టి యదియే బిలమని తెలిసికొనియెను.

అందొక వేదికపైఁ గూర్చుండి పుస్తకము చదివి తదుక్తప్రకారంబు రాతిసంఘట్టనంబున నగ్నిఁబుట్టించి సమిధలచేఁ బ్రజ్వరిల్లంజేసి కల్పోక్తరీతి మంత్రంబులు పఠించుచు వేయిసార్లు సమిద్ధోమంబు సేసి పూర్ణాహుతి గావించినతోడనే పటేల్లుమనియడ్డముగానున్నరాయిపగిలి శకలములై మార్గమిచ్చినది. అంతలో నాసింహద్వారంబు నానామణి

ఘృణీలసత్కవాటఘటితంబై యొప్పుచు నేత్రపర్వముగావించినది. తద
భ్యంతరప్రదేశము,

సీ. లలితపల్లవపుష్ప ఫలవల్లరీభార
నతమహీరుహ లతాన్వితవనంబు
వనవిరాజిత సరోవరజలాంతర చర
త్పతగసన్నాద మోదితజనంబు
జనవిహారోపయోగ నవీన సికతా వి
లసితవాపీ తటాకసురుచిరము
చిరపుణ్యలాభ సంసేవనీయ విచిత్ర
మణి లసత్ప్రాసాద మంటపంబు

గీ. మంటపాశ్రిత దేవతా మానినీ ప్ర
గీతసంగీత నాదసంప్రీత గగన
చరదమరయుగ్మ మధిక తేజఃప్రకాశ
దీపితంబగు తన్మధ్య దేశమరసె.

కనకమణిమయ శిఖరంబులఁ బ్రకాశింపుచున్న యన్నగమధ్యదేశం
బతివిశాలంబై సమచతురంబై శృంగారకేళీవన తటాకాభిరామంబై
భర్మమణిహర్మ్యశ్రేణీవిరాజమానంబై కన్నులకు మిఱుమిట్లుగొలు
పుచున్నది తత్ప్రదేశం బరయుచు లోనికి నాలుగడుగులు పెట్టిన
తోడనే యాద్వారంబు ఎప్పటియట్లు పాషాణాచ్ఛాదితంబై నంత
నివ్వెంతనరయుచున్న నతండు దూరమందుఁగనంబడుచున్న విచిత్ర
సౌధంబుల చెంతకరుగఁ దెరువరయుచుండ నింద్రజాలపింఛికచేఁ దు
డువఁబడినవాఁడుఁ బోలె విభ్రాంతిఁజెంది కర్తవ్య మెఱుఁగక చూచు
చున్నంతలో ననంతమణికాంతి సంతానంబులు దిగంతంబుల వ్యాపింప
గాంచనరత్న ప్రదీప్తంబగు పల్లకీనూని మానినీసహస్రంబులు దివ్యా
లంకారశోభిత గాత్రలై వేత్రంబులంగరంబులఁబూని కొందరు వెనుక

ముందునడువఁ గడుజవంబునఁ దన కడకువచ్చుచున్నట్లు పొడఁగని యుడు గనివెరపుతోఁ దెరవుదెసఁ బాఱఁజూచి తలయూచుచు నా చతురుండౌరా? జవరాండ్రు పెక్కండ్రు, నా కెదురువచ్చుచున్న ట్లున్నది. నా తపంబు ఫలించినదియాయేమి? ఆహా! ఆపుణ్యాత్మురాలి రత్నావతి నెన్నిజన్మములకైన మఱువఁదగినదియా! అని యాలోచించుచుండ నా స్త్రీమండలంబు దనదండ కరుదెంచి,

సీ. రమ్మెపుణ్యాత్మ! మీరలె మాకు నేతలం
చడుగులఁగడిగె పద్మాక్షి యొకతె
జయ పరాకు త్రికూట శైల దేశాధినా
యక యంచు నిడె నర్ఘ్యమొకవధూటి
సైరంధ్రీరమణ! వింజామరల్ వడయ నీ
వే యర్హుఁడ వటంచు వీచెనొకతె
దివ్యమాల్యాంబరాది విభూషణము లివే
పడయుమేలికయంచుఁ దొడిగెనొకతె

గీ. దేవ! నీకొఱకందు మాదేవులెల్ల
నెదురు చూచుచు నున్నారలిందుగూరు
చుండుఁ డనివేగ నాందోళికోపవిష్టుఁ
జేసిరొకకొందరందు రాజీవముఖులు.

వారు చేయు నుపచారముల కపరిమితాశ్చర్యము జెందుచు నారాజనందను డొండనకయాందోళికంబున గూర్చుండి యయ్యండజయానలు జయజయధ్వానములతోఁ జుట్టునుం బరివేష్టించి రా మహావైభవముతో రత్న ప్రాసాదాంతరంబునకుఁ జేరి నారీరత్నంబులు కైదండ లొసఁగ నల్లనపల్లకి దిగి నంతలో,

క. నావల్లభ నావల్లభ
నావల్లభయనుచు నంగనలు ముప్పూరు మే

ఘూవృతి బాసిన మెఱుఁగుం
దీవెలగతివచ్చి దేహదీప్తు లెసంగన్.

అతనిఁ గాంగలించుకొనుటయు విభ్రాంతుండగుచు నేమనుటకుం దోచక తదీయరామణీయకంబాహోవక నుపలక్షించుచు నొక్కింత వడికిఁ దెప్పిరిల్లి జవ్వనులారా! మీరెవ్వరు! ఏమిటికిట్లు క్రొత్త వాఁడననక నాపయింబడితిరి? అని యడిగిన నాచేడియలు,

క. మానిని నే నిది పుంశ్చలి
యీనవలా స్వైరిణీప్రహిత నామ త్వదా
ధీనలమైతిమి ముగురము
ప్రాణేశుఁడవగుచు మమ్ముఁ బాలింపుమిటన్.

మేము సమస్తమాయావేదియగు మయతనూజుండు బలుండనువాని పుత్రికలము హాటకరససిద్ధివడసిన వానికి పత్నులమై తదిష్టక్రీడావినోదంబుల మెలంగునట్లు అమ్మయపుత్త్రుండు మాకు వరం బిచ్చియున్నవాఁడు కావున నీవట్టిసిద్ధివడసి యిక్కడికి కరుదెంచితివి. నీవే మా ప్రాణేశుండవు. ఈమహారాజ్యముతోఁగూడ మన్మథరాజ్య పట్టభద్రుండవై మమ్మేలి కొనుమని ప్రార్థించిన నించుకసంశయించుచు నతం డిట్లనియె.

మోహనాంగులారా! మీరు దివ్యప్రభావసంపన్నలు నేను మానవసామాన్యుండ బాలుండ నిట్టి నాకు మీరు పత్నులగుట విపరీత ప్రక్రియకాదా? అదియునుం గాక మీపేరులు వినిన నాకు మఱియు వెఱపుగలుగుచున్నది. మీ పేరులంబట్టి మీకు వివాహముతో బనిలేదని తోచుచున్నది. అట్టి తఱి భార్యాభర్తృత్వములతోఁ బని యేమియున్నది! వేశ్యావృత్తి ననుకరించియున్న మీ పత్నీత్వము నాకభీష్టముకాదని పలికిన విని యామగువ లిట్లనిరి.

మనోహరా! మా పేరులట్టివేకాని వృత్తియట్టిదికాదు. మానవ సామన్యుండననియు బాలుండననియు వెఱవవలదు నీకు బదివేల

యేనుఁగుల బలముగలుగునట్లు చేయుదుము. మమ్ముఁ గలిసినపిమ్మట బరమేశ్వరుఁడైన నాకుఁ జాలఁడని నీకొకగరువము గలుగఁగలదు. ఇందు నవనిధులు గలిగియున్నవి భాగ్యంబున నీకుఁగుబేరుఁడు సరిప డఁడు నీకిందుఁగొదవయేమున్నది. మేము నీకేది యభీష్టమో అట్లు మెలంగువారము మన్మథసాంమ్రాజ్యపట్టభద్రుండవై క్రీడింపుమని ప్రార్థించుచు నతనిమెడలోఁ బూవుదండలువైచిరి. పరిజనులందఱు కరతాళంబులు వాయించిరి.

తాళధ్వజుని రెండవకుమారుఁడగుసుధన్వుండాకాంతాత్రితయముం బెం డ్లియాడి యపూర్వక్రీడావినోదములతోఁ గాలక్షేపముచేయుచుండెను.

అని యెఱింగించువఱకుఁ గాలాతీతమైనది పైకథ తరువాయి మజిలీయందిట్లు చెప్పందొడంగెను.

---

219 వ మజిలీ

## రత్నావతికథ.

రత్నావతి! సుధన్వుఁడరిగిన రెండుదినములదనుక వారికేమియుం జెప్పక మూఁడవనాఁడాహారముదీసికొనిపోయియంతలోగ్రమ్మఱవచ్చి అయ్యో! అయ్యో! ఆబద్ధపురుషుఁడేమయ్యెనో తెలియదు. అందులేడు తలుపులబీగములు పగులఁగొట్టఁబడియున్నవి. వచ్చిచూచుకొనుఁడని లోపలికివచ్చి కేకలువైచినది. ఆమాటలువిని శటాలునవచ్చి నరాంతకు డాగదులన్నియువెదకి వానింగానక పరితపించుచునక్కటా! వీఁడుగజ దొంగవలెనున్నాఁడు. సామాన్యునకీ కవాటములబీగములు విడఁగొట్టశ క్యమా? దొంగలతల్లికి నేడువ భయ మనినట్లీయవమాన మెవ్వరికిఁ జెప్పరాదు. అసమర్థుండ నాభార్యకోరికఁ దీరుపలేక పోయితినిగదా! రేపుసీమంతోత్సవ మాపిమటియొక ముహూర్తముంచిన లంబోదరి

మఱియొక నరకళేబరము సంపాదించునేమో అడిగివత్తుంగాక.

అనియాలోచించుకొనుచు మఱునాఁ డుదయముననే లంబోద రియొద్దకుఁబోయెను. అదివానింజూచిబావా! మీయింటనేఁడు సీమంతో త్సవముకాదా? తీరుబడిగానుంటివేమి? నాపంపినమాంసము నిలవయు న్నదా? వానినెప్పుడు చంపితిరి? అనియడిగినవాఁడు తెల తెల్లఁబోవుచు నోసీ! నీవుపంపిన మానిసినిఁజంపక పెంపుడు పశువునకుంబోలె నాహార ము దిట్టముగాఁబెట్టించితిని. ఆమిండఁడు తెగబలిసి గండుమిగిలి మాకు తెలియకుండ నిన్న తాళములు విరుగగొట్టిపారిపోయెను. మాకర్మము నకు నీవేమిచేయుదువు? ముహూర్తము మార్చెద మరియొక నరపల లము సంపాదింపగలవా? అనియడిగిన నాదానవి కటకటంబడి యిట్ల నియె. సీ. సీ. మీరెట్టిమూర్ఖులు వానికాలుసేతులు విరచి చావనీయక తగునాహారముపెట్టి పెండ్లికొడుకువలెఁ బోషించినఁ బాఱకుండునా? రెండుసారులు మీకొఱకై కష్టపడితిని. ఇఁక మీకుపకారము సేయ జాలను. వాఁడెందుఁబోఁగలడు రాజుగారికిఁ దెలియఁబరచి వానింబట్టి తెప్పింతు జూఁడుము కాని మీకు వానిమేనిమాంసము లభ్యము కాదు వేరొక తెరువాలోచించుకొనుఁడని పలికి నరాంతకునంపి యప్పుడేతేనికొక చీఁటియిట్లు వ్రాసినది.

జయము మహారాజా జయము.

నిన్న నొకమనుష్యుఁడు యంత్రశిలాఫలకముమీఁదఁబడిమెంట నేలేవబోయెను. అప్పుడు కుంభుండు దుడ్డుకఱ్ఱతో వానినెత్తిపైఁ గొట్టఁబోయిన వాఁడాదండములాగికొని కుంభునిఁజావమోది వాఁడు నేలంబడియుండ నాకుఁ గనంబడకుండ నెక్కడికో పారిపోయెను. ఇది పఱకిట్టి విచిత్రమెన్నఁడును జరిగియెఱుంగను. వాఁడెట్టిబలవంతుఁడో తెలియదు వానివెదకిపట్టించి తెప్పింపఁ గోరుచున్నదాన.

ఇట్లు మీపాదసేవకురాలు, లంబోదరి.

ఆజాబు కుంభునికిచ్చి రాజుగారియొద్ద కనిపినది. వాఁడాయుత్తరమును దీసికొనిపోవుచుండ దారిలో రాజపుత్రికయగు పద్మసేన పరిచారిక ద్విజట వానికెదురుపడినది. అదివానింగురుతుజూచి యోరీ! నీవు నాఁడుమాకుఁ దోటలోఁగనంబడినవాఁడవుకావా! నీకొఱకేపోవుచుంటిని భర్తృదారికనిన్నుఁదీసికొనిరమ్మన్నదిపోవుదమురమ్ము. అని పలికిన వాఁడు అమ్మా! నేనునాఁడుచూచినవాఁడనే అమ్మగారికి నా మాట జ్ఞాపకమున్నదా? నాపనియేమివచ్చినదో! అల్లేవచ్చెదను. ఈ యుత్తరము రాజుగారికిచ్చి వచ్చెద నంతదనుక గడువీయుఁడని వేడుకొనియెను. ద్విజట యాచీటీయేదీ యిటుతే? యేమివ్రాసినదోచూచెదంగాకయనిలాగికొని విప్పిచదివి రా రమ్ము. ఈకమ్మలోనంతయగత్యమైనపనికనిపింపదు తరువాతఁబోవుదువుగాక. అని వానిబలవంతముగా శుద్ధాంతమునకుఁ దీసికొనిపోయి రాజపుత్రిక కత్తెఱం గెఱింగించినది.

ఆబోఁటిచీటింజదివికొని కుంభా వధ్యశిలపైఁ బడినిన్నుఁజావమోదియెవ్వఁడో పారిపోయినట్లిందు వ్రాయఁబడియున్నది. వాఁడెన్నియేండ్లవాడు. పోలికయెట్లున్నది. నిజముచెప్పుము. లేకున్న నిన్ను దండింపఁజేయుదునుచుమీ యనియడిగిన వాఁడుగడగడలాడుచు జోహారుచేసితల్లీ! మీకడనబద్ధములాడుదునా? వాడుఅచ్చముగానాడు మీరుదీసికొని పోయినవానివలెనున్నాఁడు. వారిద్దఱు నన్నదమ్ములు గావచ్చును. అనియెఱింగిన రాజపుత్రిక విస్మయసంభ్రమములతో నిట్లనియె.

కుంభా! వాడుతాతిమీఁదబడినతోడనే యెట్లులేచినిన్నుఁగొట్టఁగలిగెను? వాఁడంత బలంవంతుఁడా యేమి? అచ్చముగా నేమిజరిగినదియో చెప్పుము మాకంతయుఁదెలిసినదిలే! నీవుదాచిన దాగునను కొంటివా యని అడిగినవాఁడు చేతులుజోడించి అమ్మా! నేనేమియుఁదప్పుజేసియెఱుంగను. మీరువలదనిచెప్పినతర్వాత నట్టిపని చేయుదునా? అంతయులంబోదరియేచేసినది మీరు తెలిసికొనవచ్చును. ఆమానిసి పది

దినములక్రితమే వధ్యశిలపైఁబడియెను. వాడుసగముప్రాణములతోఁగొట్టుకొనుచుండ బడియతో బాదఁబోయిన లంబోదరి వారించి చంపనీయక యాకళేబరము వెనుకటివలెనే నరాంతకునింటికిఁదీసికొనిపొమ్మని నాకాజ్ఞాపించినది. మీపాదములతోడు నేనంగీకరింపలేదు. ఆరాత్రితానే వానిందీసుకొనిపోయి వారింటియొద్దనప్పగించినది. వానిచేతులుకాళ్లు విఱువక యొకయింటిలోఁబెట్టి గట్టిగా మేసిరట. ఒకనాఁడు బీగముల విఱుగఁగొట్టి యాజెట్టి తలుపులఁదెఱచుకొని మాఱుదారి నెక్కడికో పాఱిఁబోయెనఁట. నరాంతకుఁడువచ్చియాకథ చెప్పినంతలంబోదరితనకు మాటవచ్చునని యీమాదిరిగా వ్రాసినది కాబోలు? ఇందునాతప్పేమి యున్నదో యాలోచింపుఁడు. మీశిక్షకుపాత్రుఁడనగుదునని పలికిన నాకలికి యొక్కింతవిచారించి కుంభా! ఇందు నీవేమియు నెఱుఁగవు కాని యీమాట దెలిసిన రాజుగారు నిన్నుఁగూడ శిక్షింపకమానఁడు. నీవీజాబాయనయొద్దకుఁదీసికొనిపోవలదు. ఇంటికిఁబొమ్ము. నేబుచ్చికొంటినని లంబోదరితోఁజెప్పుము. అనివానినదలించియింటికంపివేసినది.

పిమ్మట నాకొమ్మ ద్విజటతో నాలోచించియావార్త వీరవర్మ కెఱింగించి మీతమ్ముఁడు మీకంటె గండఁడువలెఁ దోచుచున్నాఁడు. ఱాతికట్టడములనడుమనుండి యెట్లుతప్పించుకొనిపోయెనో తెలియదు. వానివెదకి తెప్పింపకుండ నీచీటిలాగుకొంటిని. ఇఁకమీతమ్మునికేమి యుభయముండదు. అనియోదార్చినవిని రాజపుత్త్రుఁడిట్లనియె.

ప్రేయసీ! అతండు మాతమ్ముఁడగుట వాస్తవము వానిచేత నాయుధములేదు. ఆయింటిలోనుండి యెట్లు తప్పించుకొని పోఁగలఁడు? ఆమాట నాకు సత్యముగాఁ దోపలేదు. వానిం జంపితిని యిట్లు ప్రకటించిరేమోయని యనుమానముగానున్నది. వారింటనున్న యాప్తులవలన నీరహస్యము తెలిసికొనవలయునని బోధించుటయు రాజపుత్త్రిక యిట్లనియె.

మనోహరా! మీరిందులకుఁ జింతింపవలదు. నేనందలి రహస్యము దెలిసికొందును వారింట నాసఖురాలొకతెయున్నది. దానివలన సమస్తము విదితముకాఁ గలదని పలికి యప్పుడే రత్నావతిని దీసికొనిరమ్మని ద్విజటనంపినది. అది వోయి రెండుగడియలకు నాయెలనాగను దీసికొనివచ్చినది. ఇరువురు నిట్లు సంభాషించుకొనిరి.

రాజపుత్రి—సఖీ! రత్నావతీ! నీవీనడుమగనంబడుటలేదేమి? మననేస్తము మఱచితివా?

రత్నావతి—సరిసరి నీవట్లనరాదు. నీవు రాజపుత్రికవు మేము సేవకురాండ్రము నీతోమాకు సాటియా! నీసెలవైనచో నిత్యమువచ్చి పాదసేవ చేయకపోదునా?

రాజపుత్రి—సఖీ! ఇందు సేవ్యసేవకన్యాయముతోఁ బనిలేదు. నేస్తమేకావలసినది. నీవంతగామన్నించిన నాకుఁగష్టముగానున్నది.

రత్నావతి—రత్నమునకుఁ గాచమునకు నెంతభేదమున్నదో నీకును మాకునంత తారతమ్యమున్నది నీవుగర్వశూన్యరాలవు కావున నిట్లనుచున్నావు.

రాజ—మైత్రిలోని హెచ్చుతగ్గులు విచారింపవలదని చెప్పలేదా.

రత్నావతి—దేవీ! విద్యచే ధనముచే రూపముచేతఁ గూడ నీతో మేమీడుకానేరము నీయనుగ్రహకాంక్షులము ఆదరించి మాటాడితి విదియ పదివేలు.

రాజ-నన్ను దేవీయనవలదు సఖీ! అనిపిలువుము సంతసించెదను.

రత్నా—నీహృదయశుద్ధి యట్టిది.

రాజ—నరాంతకుఁడు నీకు మేనత్తభర్తకాడా?

రత్నా—అవును మేము వారింటనే యుందుము.

రాజ—నరాంతకుని భార్య గర్భవతియైనదఁట కాదా?

అవును ఇదియె ప్రథమగర్భము చిరకాలమునకు వచ్చినది.

రాజ—సీమంతోత్సవము జరిగినదియా?

రత్నా—లేదు. ఆగిపోయినది. మొన్న జరుగవలసినదే.

రాజ—ఆమె యేమికోరికలు కోరుచున్నది?

రత్నా—ఏమోతల్లీ! నాకంతగాఁ దెలియదు.

రాజ—ఇక్కడనే నీవు స్నేహభావము విడిచి మాట్లాడు-చుంటివి. మాట వరుస కడిగితిని.

రత్నా—(ఇంచుక సంశయించుచు) నాకు వారితో నంతగాఁ గలియదు నాతో వారి రహస్యములు సెప్పరు.

రాజ—చెప్పకున్నను నింటిలో మాటలు తెలయవా?

రత్నా—(అంతర్గతంబున) ఓహో! ఈమెకు నిజము తెలిసి నట్లున్నది. అందులకే గ్రుచ్చిగ్రుచ్చి యడుగుచున్నది. చెప్పకున్న మఱియొకలాగు తలంచును. కానిమ్ము (ప్ర) నరమాంసము కోరు చున్నదని సవసవగా విన్నాను.

రాజ—ఊఁ. ఆమాటవినియే నేనడిగితిని. నీవు నాఁతోఁ జెప్పటకు సంశయించుచున్నావు.

రత్నావతి—అసలు మా వాళ్ళకు నాయం దిష్టములేదు. నోరు మూసికొని యుందును. ఏమన్ననుతప్పే కనుక దాచితిని. దేవీ! నాయపరాధము సైరింపుము.

రాజ—భయములేదు మఱి నరమాంసము దొఱకినదియా?

రత్నా—దొఱకను దొఱకినది పోవనుఁబోయినది.

రాజ—ఎట్లుపోయినది?

రత్నా—వాఁడు బలవంతుడుతలుపులువిదళించి పాఱిపోయెను.

రాజ—సఖీ! ఆమాటయేనమ్మశీలులేకున్నది. ఆకథయంతయు వింటినికాని యామాటయె నమ్మదగిలేదు సగముచచ్చియున్న మను ష్యుఁడు ఇనుపతలుపుల విదళింపఁగలఁడా. ఇందేదియో రహస్య

మున్నది. ఆరాత్రి చంపివేయుట్లనుచున్నా రేమోయనితోచుచున్నది.

రత్నావతి—రామరామ! అదివట్టియబద్ధముఎట్లైననేమివాఁడు పాఱిపోయినమాట వాస్తవము.

రాజ—ఆరహస్యమే నాకుఁ దెలియవలసియున్నది.

రత్నా—కనుఁ గొని చెప్పెదనులెండి.

రాజ—నీకు వివాహమెక్కడ నిశ్చయింపఁదలచినారు?

రత్నా—ఆమాట సన్నడుగవలదు నాప్రారబ్ధ మెట్లుండెనో అట్లుజరుగును హ్రస్వపాదునిపుత్రునకీయఁదలంచిరికానినాకిష్టములేదు.

రాజ—నీవుగూడ నావంతలోనికే వచ్చితివే.

రత్నా—నీకేమి? రాజపుత్రికవు స్వయంవరమున నీయిష్టము వచ్చినవాని నేలుకొందువు. నాకెట్లు?

రాజ-నేనునీతో నిజముచెప్పుచున్నాను. రాక్షసులఁబెండ్లియాడను.

రత్నా—ఇఁక నాలుగుదినములలో స్వయంవరోత్సవ ముహూర్తమున్నదని చాటించుచుండ నట్లనియెదవేల?

రాజ-ఆచాటింపుచాటింపే. రాక్షసులవరింపను. ఇదియయథార్థము.

రత్నా—అసభకు రాక్షసులుగాక దేవతలు మనుష్యులు వత్తురాయేమి? అందెవ్వరినో యొకరిని వరింతువా?

రాజ—ముమ్మాటికిని వరింపను.

రత్నా—మఱియాస్వయంవరవిధి యేమిటికి?

రాజ—అది లాంఛనమునకే నీవు నాకత్యంతప్రియురాలవు కావున నీరహస్యము నీతోఁజెప్పితిని.

రత్నా—మన మప్సరోజాతివారమగుట రక్కసులు వెక్కసముగాఁ దోచుదురు.

రాజ—అందులకేమనమైత్రియవ్యాజమైనదని చెప్పుచున్నాను. ఆపురుషునివృత్తాంతము తెలిసికొని యెప్పుడుచెప్పెదవు?

రత్నా—ఎప్పుడోయననేల? ఇప్పుడే చెప్పెద. నీ కదాఁప నేమిటికి (అని చెవిలో నిటునిటు)

రాజ—అమ్మయ్య! నాహృదయ మిప్పటికిఁ జల్లఁబడినది.

రత్నా—నీకతనియందింత యనుకంప యేమిటికిగలిగినది. వాని నెఱుంగుదువా యేమి?

రాజ—ఆరహస్యమంతయు నీకు మఱొక్కప్పుడు తెలియజేసెదను. అనిమాట్లాడి యాచేడియవల్ల నారహస్యముదెలిసికొని సగౌరవముగా నామెననిపినది. ఇంతలో స్వయంవరమహోత్సవదివసము సమీపించినదనియు సన్నద్ధురాలవై యుండవలయుననియుఁదండ్రియొద్దనుండి చీటివచ్చినది. ఆచీటి తీసికొని వీరవర్మయొద్దకుఁబోయి నమస్కరించుచు రత్నావతివలనఁదెలిసికొనిన విషయంబులన్నియు నెఱింగించి నీతమ్ముఁడు నీకంటె నున్నతస్థితియందున్నాఁడు. అతనికొఱకువిచారింపఁబనిలేదు. మఱియు స్వయంవరము సమీపించినది. పాతాళలోకములలోనుండి పేరుపొందినదానవులందఱు వచ్చుచున్నారఁట. కర్తవ్యమేమి? అనియడిగిన నతండు నవ్వుచు నీయిష్టమువచ్చినమగని నేఱుకొనుటయేకర్తవ్యమని పరిహాసమాడుటయు నాయువతి చెవులుమూసికొని ఇదిపరిహాససమయముగాదు. ఈయాపద యెట్లుదాటునని నాహృదయము పరితపించుచున్నది తగినయుపాయ మెఱింగింపుఁడని యడిగిన నతండు ప్రేయసీ! నీకుఁ బదిసారులు చెప్పవలయునా. ఇదివఱకు నీకెఱిఁగించియేయుంటిని. అట్లేచేయుము కార్యసిద్ధియగునని యుపదేశించెను. ఆమెయంగీకరించి యందులగుఱించియే వితర్కించుచుండెను.

పద్మసేన మిక్కిలి చక్కనిదని పాతాళలోకములన్నిట వాడుక ప్రమోఁగియున్నది. రాక్షసులు సహజకామక్రోధావిష్టులు తత్స్వయంవర ప్రకటనము వినినతోడనే చతురంగ బలసంయుక్తులై యయ్యతలమున కరుదెంచిరి. వజ్రకంఠుడు తనవీటి కరుదెంచిన రక్క

సులకెల్ల భోజన భాజనాదివిధులకుఁ దగినసదుపాయము లపారముగాఁ గావింపఁజేసెను. దైవజ్ఞనిర్దిష్ట సుముహూర్తమునకు మహిషాసుర ప్రముఖులెల్ల వచ్చి యాసభ నలంకరించిరి. పద్మసేనయు సముచిత భూషాంబరధారిణియై ద్విజటవెంటరా యథాకాలంబున కాసభాంతరాళముఁజేరి రాక్షసశ్రేష్ఠులనెల్లఁ గలయఁగనుంగొని వారివారి వృత్తాంతములఁ దెలిసికొను కోరికతో నాసింహాసనశ్రేణీమధ్యమునుండి మెల్లగా నడుచుచుండెను. అప్పుడు సర్వజ్ఞుండను రాక్షసపరివ్రాజకుండు తత్తద్వృత్తాంతముల నాకాంతామణికిట్లు చెప్పఁబూనెను.

సీ. నాతి! యితఁడు కాలకేతుఁడు సర్వగీ
ర్వాణదుర్గర్వ నిర్వాపణాత్ముఁ
డతివ! యీతఁడు మహిషాసురుం డితని వి
ఖ్యాతి సర్వజగంబులందు వెలయు
చండముండులువీరె భండనంబున వీరి
నవఘటింపఁగలేరు హరిహరాదు
లువిద! శుంభ నిశుంభులురు బలాఢ్యులు వీరి
పేరెన్నికొని నిదురింబోరుసురులు

గీ. వీఁడుభండాసురుం డతివీరుఁడితని
తోడఁబోరాడు మగవాఁడులేడు మూఁడు
లోకముల వాఁడె కను బొమ్మలుండు మహిషు
మంత్రి సర్వస్వతంత్రప్రమాణవేది.

అని యీరీతి నానారీతిలకమున కాపరివ్రాజకుండందున్న దానవశ్రేష్ఠుల కులశీలనామవిఖ్యాతులెఱింగించుటయునాలించియాచంచలాక్షి క్షణకాలమూరకుండిసభాసదులెల్లరువినసఖిఁ ముఖముగానిట్లు తెలియఁజేసినది.

ఇందువచ్చిన రాత్రించరులెల్లఁ బ్రఖ్యాతులే కావచ్చును. ముఖ్యముగాఁ జూడఁదగినవి రూపము విద్య పరాక్రమము. రాక్షసజాతి

కేరూపము పూజ్యముగదా. విద్యమాట యటుండనిండు. పరాక్రమము వితర్కింపఁదగియున్నది. ఇందఱిలో లోకైకపరాక్రమశాలి యెవ్వఁడో లేచి నిలఁబడినచో వానికీరత్నమాల నర్పించుచున్నదాన నదియే మదీప్సితమని పలికించుటయు నారాక్షసవీరులెల్ల నొండొరులు మొగములు జూచుకొనువారును గుజగుజలాడువారును ఊర్ధ్వముఖులై యాలోచించువారునై యాకాలములో నెవ్వండు నేనని ప్రత్యుత్తరమిచ్చినవాఁడు లేకపోయెను.

అప్పుడు పద్మసేన యిందులకు మూడుదినములుగడువిచ్చితిని. ఈలోపలమీరాలోచించుకొని లోకైకవీరుండని యెల్లరు సమ్మతించిన వాఁడు నాకడకరుదెంచిన నన్మానింతునని పలుకుచు నారాజపుత్రిక ద్విజటతోఁగూడ నాందోళికమెక్కి యంతఃపురమునకరిగినది.

కాలకేతుఁడు—(లేచి) ఓరాక్షసమిత్రులారా! నాపరాక్రమము మీ రందఱు నెఱింగినదే నేనులోకైకవీరుండనని చెప్పినమీరంగీకరింతురా.

దుర్ముఖుఁడు—నీవు మహిషునికన్నను చండునికన్నను ముండునికన్న నధికుఁడవా యేమి? వారి మ్రోల నీవెంతవాఁడవు?

తామ్రుఁడు—శుంభ నిశుంభాసురులుండ చండముండాసురుల ముందుగాఁ బేర్కొంటివేల?

దుర్ముఖుఁడు—చండముండులకన్న మహిషునికన్న శుంభ నిశుంభులధికులనియా నీయభిప్రాయము?

త్రామ్రుఁడు—అవును సందేహమేల?

రక్తబీజుఁడు—మీయిరువురవాదములు నపరిజ్ఞాతృత్వంబును వెల్లడించుచున్నవి. జగదేకవీరుండు భండాసురుండుండ నొండువానిం బేర్కొందురేల?

చండుఁడు—రక్తబీజా! ఏమి నీక్రొవ్వు? మేమువీరులమనుట యపరిజ్ఞాతృత్వంబా? ఇంకొక్కమారట్లు పలుకుము.

భండాసురుఁడు—చండా! నిలు నిలు. నీయుద్ధపాండిత్యంబు మే మెఱుంగనిది కాదు. అనుచితప్రలాపంబు లాడక వెనుకముందు విచారించుము. (వాఁడామాటబదిసారు లనుచున్నాఁడు.)

మహిషాసురుఁడు—ఏమిరా చండా! ప్రేలుచుంటివి? జగదేకవీరుఁడనేనుగానా? మదీయనిశాతశృంగఘాతంబు రుచిచూపనాయేమి?

భండా—పశువా? అట్లన నీకుశృంగభంగంబు చేయకుందునా? రా రమ్ము. రా రమ్ము.

ముండా—భండా! శృంగమువలన భంగము నీకే కలుగును నీవనినమాటసత్యమే.

ముండా—మాటలతోనేమి. ఇదిగో కాచికొనుడు మదీయదోర్దండ ప్రచండబలపాండిత్యంబు తేటపడ గదాదండంబు వేయుచున్నానని లేచి భండాసురుంగొట్టెను. అదివానియురంబుఁ దాకిశకలములై పోయనది వెంటనేలేచి యతండు ముండాసురు నురంబునఁ బిడికిటంబొడిచి మూర్ఛనొందించెను. అతనిపాటుఁజూచి భండాసురుఁడు చండునిం గలియఁబడియెను. ఇద్దఱకు చెడ్డముష్టియుద్ధముజరిగినది. అంతలో మహిషుండు రక్తబీజుండు తలపడి యొండొరులం గొట్టుకొనఁదొడంగిరి. అట్లె యందున్న రక్కసులెల్ల రెండుతెగలై బాహాబాహియుద్ధంబునకుఁ బూనికొని దారుణముగా బోరఁదొడంగిరి. వజ్రకంఠునికిఁగూడ నందొకపక్షము జేరక తప్పినదికాదు. క్రమంబున నాసంగ్రామంబు సంకులమగుట స్వపక్షపరపక్షంబులు దెలియక దొరికినవానింబట్టుచుఁబట్టినవానింజంపుచు మిగిలినవానిం గవియుచుఁ జేరినవానిం బొడుచుచు నొక్కనినైనఁ బోనీయక చిక్కఁబట్టి రక్కసులెల్ల ఘోరముగాఁ బోరిపోరి యర్ధదివసములో నొండొరులచేఁ జంపఁబడి నామావశిష్టులైపోయిరి.

వీరవర్మ యత్తెఱంగరసి శరశరాసనంబులందాల్చి తురగారూఢుండై సంగ్రామరంగంబునకరిగి హతశేషులంబోనీక సాయకనికా

యంబులంబఱపి పరలోకాతిథులంగావించెను. కుంటి గ్రుడ్డి వృద్ధులుం దప్ప జేరుపొందినరక్కసుం డొక్కడును మిగిలియుండలేదు. వజ్రకంఠుడు గూడ వారితో మడియుటందెలిసి రాజపుత్రిక శోకింప వీరవర్మ నర్మాలాపములచే నూఱడించి యందుఁజచ్చినరాక్షసులగాత్రములనెల్లనగ్నిసాత్కృతము గావింపఁజేసి శుభముహూర్తంబున నాపద్మసేనతోఁ గూడ దద్రాజ్యలక్ష్మింబరిగ్రహించి మహావైభవముతో సింహాసన మెక్కెను. అనియెఱింగించి...ఇట్లుచెప్పఁదొడంగెను.



220 వ మజిలీ

# అతలరాజ్యము

వీరవర్మ యతలరాజ్యమునకుఁ బట్టభద్రుండైనతోడనే యాపట్టణమంతయుఁదిరిగి యందలి యంత్రరహస్యములన్నియుం దెలిసికొనియెను. అందుఁజేరుపొందిన రక్కసులెవ్వరునులేరు. ఉన్నవారతనిభుజబలమునకు మించినవారుకారు. కావునఁ బట్టణవాసులెల్ల నతనికిదాసులై యతనిపరాక్రమగ్గించి కొలుచుచుండిరి. అన్నగరము దిక్పాలుర నగరములకన్న నెక్కువశోభగలిగి విశాలమై ప్రకాశించుచున్నది. అతండు దినమునకొక్క వీధివడువునఁ దిరుగుచు నందలివిశేషములఁ దెలిసికొనుచుండెను.

మఱియు భూవివరాంతమునందలి యంత్రశిలాఫలకముకడకరిగి యందుఁగాపున్న లంబోదరీకుంభులవలనఁ దనతమ్ముఁడు సుధన్వుని వార్త కొంతవిని వారపకారము చేయఁదలంచినను నప్పుడు చంపకపోవుట యుపకారముచేసినట్లే తలంచుచు వాండ్రకుఁ గానుకలిప్పించి యందు దప్పించి మఱియొకచోటికనిపెను.

అందుఁబడినవారు మడియకుండ మెత్తనిపానుపులఁ బఱపించి

క్రొత్తనిబంధనల నేరుపరచి విశ్వాసపాత్రులగు దూతలఁగొందఱఁగాపు పెట్టించెను. నరాంతకుని మేనకోడలు రత్నావతి తనతమ్ముని వరించి యతనిమరణమునుండితప్పించినవార్త భార్యవలనవినియున్న వాఁడగుట వెంటనే యావాల్గంటి దనయింటికి రప్పించుకొనియాదరించుచుండెను.

ఒకనాఁడతండు కొల్వుకూటంబలంకరించియున్న సమయంబునఁ బ్రతీహారి యరుదెంచి మహారాజా! త్రికూటనగనివాసినియఁట కుటిలాలకయోర్తు, రాజభటవేషముతో వచ్చి ద్వారముకడనిలిచి యీకమ్మ మీకిమ్మని యిచ్చినది. అనుటయు నతండు దానినందుకొని విప్పియిట్లు చదివెను.

వజ్రకంఠా! నీవునరమాంసోత్కంఠుండవై మనుష్యలోకంబునఁ గపటమునిఁ బురికొల్పి బోనువంటి గిరికూటబిలమార్గంబున మనుష్యులఁ బడనేయించి యిందురప్పించుకొనుచుఁ గడుపునిండించుకొనుచుంటివి. ఆతిండియే యిప్పుడు నీకు మృత్యువైనది. పాపాత్మా! కాచికొనుము. ఎంతకాలమిట్లు చేయఁగలవు! మీపూర్వులగు పలలాశనులు లోకకంటకులై యేమైరో యెఱింగినవాఁడవై తేని యిట్టి ఘోరకృత్యములు సేయఁబూనవు. లోకైకవీరుండగు మాయన్న వీరవర్మను బిలమార్గమున రప్పించుకొని కడ తేర్చియుందువు.అంతటితో విడువక యాదారి నేనన్ను నీయింటికిం దెచ్చికొంటివి. అదియే నీకుముప్పైనది. నాకుగొప్పయైనది. క్షుద్రా! నేటి కేడవనాఁడు నీపురికరుదెంచి నిన్నుఁ బుత్రమిత్రకళత్రాదులతో నాశనముజేసి నీరాజ్యము గైకొందుఁ గాచికొనియుండుము ఇదియే నీకుఁగడపటిసందేశము. ఇట్లు, సుధన్వుఁడు.

ఆపత్రికఁజదివికొని వీరవర్మ సంతోషపారవశ్యంబున మేనెఱుఁగక యొక్కింతతడవునకుఁ దెలిసి కన్నుల నానందబాష్పంబులుగార నాకమ్మ గన్నులకద్దికొనుచు నా లిపింజూచి తమ్మునింజూచినట్లు సంతసించుచుఁ దక్షణము యాకమ్మదెచ్చిన పొన్నికొమ్మం దీసికొనిరమ్మని

ప్రతీహారి కాజ్ఞాపించెను. అతండరిగి యత్తైఅవక్శై నలుమూలలు వెదకిన నెందును గనంబడలేదు. అందలివార లాసుందరి యప్పుడే పోయినదని చెప్పిరి. ద్వారపాలుఁ డామాట వీరవర్మ కెఱింగించెను.

వీరవర్మ తనతమ్ముఁడా వీటిపై దండువత్తునని వ్రాసినదివసము లెక్కించుకొనుచు నాఁటియుదయమునఁ బొదలకడలేచితురగారూఢుండై యతండువచ్చుమార్గమున కెదురుగాఁబోయెను. అప్పుడేసుధన్వుఁడు యక్షసేనాపరివృతుండై వచ్చుచుండెను. ఇరువురు మార్గమధ్యంబునఁ గలిసికొనిరి. సుధన్వుఁ డన్నగారింగురుతుపట్టి యోహోహో నా ప్రియసోదరుఁడు వీరవర్మయే. నేఁడెంతసుప్రభాతము అని పలుకుచు గుబాలున గుఱ్ఱముడిగ్గనుఱికి యతనింగౌఁగిలించుకొనియెను. పెద్దతడవు నకు నెలుంగురాల్పడ అన్నా ! యెట్లుబ్రతికితివి? నీయునికి వజ్రకంఠుఁ డెఱుఁగునా! యీగుఱ్ఱమెట్లువచ్చినది? అనియడిగిన సంతసముతో నాతండు తనవృత్తాంతమంతయు నెఱింగించి యిప్పుడు నేనే యీభూమి పాలించుచుంటిని. నీవాదానవునిపేర వ్రాసినకమ్మఁ జూచి యిట్లు వచ్చి తినని యెఱింగించెను. సుధన్వుండును తనవృత్తాంతమంతయుఁ బూస గ్రుచ్చినట్లు తెలియఁజేసి యతనివిస్మయసాగరమున నీఁదులాడఁజేసెను.

తనకుఁ బ్రాణదాయినియైన రత్నావతి యన్నగారియంతఃపుర మునన్నదని విని మిగుల నానందించుచు యక్షకాంతలనెల్ల త్రికూట శైలాంతరమునకనిపి తా నన్న వెంట నగరిలోనికింజనియెను. వీరవర్మ తనభార్యకు దమ్మునింజూపుచు నతనిచరిత్రమంతయుఁ జెప్పెను. ఆమె యాశ్చర్యపడుచు రత్నావతిని దీసికొనివచ్చి యచ్చిగురుఁబోఁడిచేసిన యుపకార ముగ్గడించుచు సుధన్వునికిఁ జూపినది. సుధన్వుండా యెల నాగంజూచి సంతోషము పట్టజాలక తటాలున చేయిపట్టుకొని ముద్దు పెట్టుకొనుచు నాముద్దుగుమ్మను బెద్దగా నగ్గించెను. అదియే పాణి గ్రహణ మహోత్సవమని యెల్లరు చప్పటులుకొట్టిరి.

ఈసుపాణి నిదివఱకే గ్రహించితి నిది క్రొత్తకాదని యతం డుత్తరమిచ్చెను. నాడెల్ల యావృత్తాంతకథనముతో వెళ్ళించిరి.

నాటంగోలె రాజపుత్రు లిరువురు భూలోకమున కేగు మార్గ మరయుచు నొకనాఁడు బిలముఖంబున కరిగియందలి విశేషములు పరికించుచుండిరి. ఇంతలో లోపలిగంట మ్రోగినది. ఆమ్రోఁతవిని వారది యేమని యడిగిన నిప్పుడేదియో జంతువవచ్చి పడుచున్నది. అందులకే మ్రోగినదని కాపున్నవాఁడు చెప్పెను. అప్పుడప్పుడువాని జాగ్రత్తగాఁ గాపాడవలయునని పలుకుచు మెత్తని పాన్పులు సవరించి వేయించిరి. వారు చూచుచుండ జరజర జారి మునిశిష్యుండొకఁడందుఁబడియెను. వానికిఁదగిన యుపచారములు సేయించుటచే వెంటనే యతనికిఁ దెలివివచ్చినది. వానితో నొకయుంగరము కూడ జారిపడినది. దాని సుధన్వుండు కని అన్నా! చూడు. చూడు. ఇది మన తమ్ముఁడు ప్రతాపరుద్రునిదివలె నున్నది. ఇందలి విలాసము పరికింపుము. అని చూపుటయు నౌను వానిదే. వాఁడు గూడ నిందు జారిపడుచున్నవాఁడేమోయని తొందరపడుచు మెత్తని పఱుపులు సవరించి యందు వేయించెను.

పిమ్మట మునిశిష్యుంజూచి యోహో! వీఁడా కపటయతిశిష్యుఁడు నాఁడుమనలను బెదరించినవాఁడు వీఁడే. వీనింబట్టికొని నిర్బంధించిన నిజము దెలియఁగలదని తలఁచుకొనుచు వా రిరువురు వాఁడు విశ్రాంతి వహించిన పిమ్మట నీ వెవ్వఁడవు? ఇం దేమిటికి పడితివని యడిగిరి. వానికింకను బూర్తిగాఁ దెలివి రాలేదు. అట్లడిగినవారు వజ్రకంఠుని యాప్తులే యనుకొని మెల్లగా నిట్లు చెప్పెను.

మిత్రులారా! నేను భూలోకములోఁ జిత్రకూటనగపాదమున నున్న యలంబుసునిపరిజనుండ శిష్యరూపముతోఁదిరుగుచు మనుష్యుల నాగుహాంతరమునఁ ద్రోయుచుందును. ఇరువురు రాజకుమారుల

నిందుఁబడ వేసినది మీరెటిఁగియే యుందురు. వారితమ్ముఁడు ప్రతాప రుద్రుఁడట అన్నలజాడఁ దెలిసికొన నరుదెంచి యలంబసునొద్దకు వచ్చి నమస్కరించి తనయన్నల వృత్తాంతము చెప్పుమని యడిగెను. వాని కంఠధ్వని వినినంతనే వానికి నాకుఁ గూడ వెరపుగలిగినది. ఆవెరపు వెల్లడికానీయక మనయలంబుసుఁడు పన్నవలసిన వ్యూహమంతయుఁ బన్నిచివఱకు వాని నాకొండశిఖరమెక్కి గుహచూచుట కంగీకరింపఁ జేసెను. నాకుఁ గనుసన్నఁజేసి వానికా గుహజూపింపుమని నియమిం చుటయు నేను వాని వెంటంబెట్టుఁకొని కొండయెక్క దొడంగితిని.

వాఁడు దారిలో నన్ననేక ప్రశ్నములడిగి నాహృదయాశయ ము గ్రహింపవలయునని తలంచెనుకాని నేనేమియు నవకాశమిచ్చితిని కాను. వాఁడు మాకపటము మొదటనే గ్రహించెనని నేనెఱుంగకపో యితిని. వాఁడు కొండయెక్కునప్పుడు నావెంట నడుగులోనడుగువైచి యెక్కుచుండెను. శిఖరమెక్కి గుహావిశేషములు నేను జూపించు చుండ వానియందుఁజూపులు వ్యాపింపఁజేయక నేలయే పరిశీలించుచు నడుగులు వైచుచుండును. నేనాగినఁ దానుగూడ నాగును. వానిముం దుఁబెట్టవలయునని నేనెంతయో కపటము జేసితిని. వాఁడు నావలలోఁ బడలేదు. గుహాలోని మీటవఱకు నేనుముందునడిచి యందునిలువం బడి అయ్యా! మీయన్నలామళుపులో నున్నారు. ఆబల్లయెక్కి చూ డుఁడని నేను జెప్పఁగా నడునడు నీవేయెక్కి చూపుము. అని నన్ను బలాత్కారముగాఁబట్టి యాబల్లపైకిఁ ద్రోసివిడిచెను.

మీటసడలి నేను గుభాలున నీవివరములోఁబడితిని. పడునప్పుడు వానిచేయిబట్టికొంటి. అతఁడు కేలువిదళించుటచే వానియుంగరమూడి వచ్చినది. వాఁడు దొరకలేదు నేను జారివచ్చి యిందుఁబడితిని. ఇదియే నావృత్తాంతము తరువాత నతండు అలంబసుని నిజస్థితి గ్రహించెనో లేదో తెలియదు. అని తనవృత్తాంతమంతయు వాఁడెఱింగించెను.

ఆమాటలువిని సుధన్వుఁడు కోపముపట్టఁజాలక వానింజంప నుంకించుటయు వీరవర్మ వారించుచుఁ దమ్ముఁడా! వీఁడు మనకు శత్రు వైనను మనతమ్మునిక్షేమవార్తఁ దీసికొనివచ్చెను. వీనివలన మన మక్కడివృత్తాంతము దెలిసికొందముగాక తొందరపడకుమని వానికిఁ దెలియకుండఁజెప్పి యోరీ! నీకీయలయిక యెట్లునఁ బదిదినముల దనుక తీఱదు. నీకతంబున మనయేలిక వజ్రకంఠునికి నిత్యము నరమాంసము దొరకుచున్నది నీవుతిరుగా నందుఁబోవలయును. ఎప్పుడుపోయెదవు? అని యడిగినవాఁడు కన్నులు మూసికొనియే యిట్లు చెప్పెను.

మిత్రులారా! నాకు నోడలేమియు స్వాధీనములో లేదు. మీరు జేసిన యుపచారములవలనఁ బ్రతికితినికాని చావవలసినదే. బలము గలిగినపిమ్మట భూలోకములోని కరిగెదంగాక, నన్ను రాజునొద్దకుఁ దీసికొనిపొండు. నాబన్నమాయనకు నివేదించి యేగెదను. అని పలుకుటయు వీరవర్మ, నిన్ను నేలికయొద్దకిప్పుడే తీసికొనిపోయెదము. నీకష్టములన్నియుఁజెప్పెదము. నీకతనిచేఁ బారితోషిక మిప్పింతుము వెరవకుము నీవు భూలోకమున కేదారిఁబోయెదవు? ఈవివరములో నుండి పోవఁగలనా! అనియడిగినవాఁడు కన్నులఁ దెరచిచూచి రాజ కుమారులం గురుతుపట్టి వెరచుచు నది స్వప్నమేమోయని భ్రాంతి పడి క్రమ్మఱఁ గన్నులమూసికొనియెను. పిమ్మట వారేమియడిగి నను బ్రత్యుత్తరమియ్యడయ్యెను.

అప్పుడు వీరవర్మ వానిం బందీగృహంబునఁ బడనేయుఁడని యాజ్ఞాపించి తమ్మునితో వత్సా! మన పరితాపరుద్రుఁడు మన మీ గుహాలోఁ బడిపోయితిమని తెలిసికొనియుండును. అలంబసుఁడుచేయు కపటము గ్రహించియేకదా వీని నిందుఁబడఁద్రోచెను. అతండు మిగుల బుద్ధిమంతుఁడు మన వృత్తాంతము దెలిసికొనుట కేదియో సాధన మాలోచింపక మానఁడు. అలంబును నీపాటికిఁజంపి యాశొండ స్వాధీ

సము జేసికొనియే యుండును. కానిమ్ము మనల మృత్యుముఖంబునుండి తప్పించి రాజ్యపట్టభద్రులంగావించిన భగవంతుఁడిప్పు డెందుఁబోవును? అమ్మహాత్ముఁడే మనకాదారిగూడఁ జూపఁగలడని పలుకుచుఁ దమ్ముని యుంగర మంగముల నద్దికొని ముద్దుపెట్టుకొనుచుఁ దద్దయుఁబ్రీతితోఁ దనభార్య కత్తెఱంగంతయు నెఱింగించెను.

మఱియు వారిరువురు సంతతము బిలద్వారనికటంబుననే వసించి యందుండి యేదియైన వార్త వచ్చునాయని యాలోచించుచుండిరి. ఒకనాఁడందలి ఘంటాటంకారధ్వని వినంబడినంత వీరవర్మ సంతోషముతోఁ దమ్మునికిఁదెలిపి పానుపుసవరింప నియోగించెను. అంతలో నొక యినుపగొలుసు చివరగట్టిగా గట్టఁబడిన గుండొకటి జారి యాతల్పంబునం బడినది. రాజకుమారులు విస్మయముతోఁ జూచుచు నా యినుపగుండు గొలుసు విడదీసి విమర్శించిచూడ నందొక బిరడా గనంబడినది. దానిందీసినంత నందొకపత్రికయున్నది. ఉత్సాహముతో నా పత్రికందీసి వీరవర్మమేను పులకింపనిట్లు చదివెను.

అన్నలారా! మీదిగ్విజయయాత్రా వృత్తాంతము చిట్టచివరఁ గొన్ని దినములు వినక మన తలిదండ్రులు పరితపించుచుండ దండనాథుండు చిత్రకూట నగపార్శ్వమునందున్న సేనానివేశమునుండి తండ్రిగారికొక సందేశపత్రిక నంపించెను. అందు మీ యిరువురునొకమునీశ్వరుని ప్రేరణంబున నందలి గిరికూటమెక్కి తిరుగరాలేదనియుఁ బది దినములు వేచితానాఋషినడిగినఁ దనకేమియు సమాధానము చెప్పక శపింతునని బెదిరించెననియు నిటుపైనఁ గర్తవ్యమేమని తెలియఁజేయఁ గోరుచున్నానని వ్రాయఁబడియున్నది. ఆవార్త విని మనతలిదండ్రులు దారుణముగా శోకించుచుండిరి. అమ్మగారి జాలిగుండె తెఱంగు మీ రెఱింగినదియేగదా! పుత్రులందఱము మూఁగి యామెనోదార్చితిమి. వారి యాఱవకుమారుఁడు రాగవర్ధనుఁడు రౌద్రావేశము

తో ధనుర్బాణములుధరించి నన్నా సేనానివేశముఃకడకనుపుడు వారి సేమమరసివచ్చెద మీరిట్లు విచారించినఁ బ్రయోజనమేమని పలుకుటయుఁ దండ్రిగారనుమతించి యారౌతుల వెంటనతని నంపిరి.

అతండును దురగారూఢుండై యాసాదులవెంట నరుగుచుండ నొకనాఁడొక మార్గమధ్యంబున సంవర్తసమయంబునంబోలె మహారౌద్రముగా గాలివానపట్టి బిట్టుగా వానగురియ మొదలుపెట్టినది. వారావాతాఘాతంబునకు వగచుచు వానందడిసి దారితప్పి యెట్టకేఁ చీఁకటిపడునప్పటికి నతిప్రయత్నమున నాప్రాంతమందున్న జయపురమను పట్టణమును జేరికొనిరి.

తద్దేశాధిపతిజయదేవుఁడు మీచే సంగరమున నోడింపఁబడి తిరుగ స్థాపింపఁబడినవాఁడని యెఱింగినవారగుట నారౌతులతని నొకసత్రములోనిలిపి యావార్త కోటలోనికిం దెలుపనరిగి తిరుగవచ్చి చూచునప్పటి కారాగవర్ధనుఁడందుఁ గనంబడలేఁదట. అతనినారాత్రియెల్ల వెదకి మఱునాఁడువెదకి యతని జాడ తెలియక యాదూతలు వెండియు మనపీటికరుదెంచి యాయుదంతమెఱింగించి మన తలిదండ్రుల శోకవిహ్వలులఁ గావించిరి.

అప్పుడు నేనును జయమల్లుఁడునుధనుర్బాణములుధరించి వారినూఱడించుచు వారియనుమతివహించి బయలుదేరితిమి. కొంతసేనను సహాయముగానిచ్చి మనసోదరు జయమల్లుని జయపురంబున కనిపితిని నేను ఖడ్గమాత్రసహాయుండనై తురగమెక్కి సేనానివేశమున కరుదెంచితిని. అందున్నచమూపతి నన్నుజూచి యచ్చటివృత్తాంతమంతయు నెఱింగించెను. పిమ్మట నేనాలోచించుచు నాయతిరొయొద్దకుంబోయితిని. వానింజూచినతోడనే కపటాత్ముడని నాకు సంకోచముగలిగినది. నమస్కరించుచు నా కులశీలాదులెఱింగించి మీజాడ తెలుపుమని యడిగితిని.

అప్పుడు వాఁడు నన్నుఁ గన్నులెత్తిచూచి గౌరవించుచు రాజపుత్రా! మీయన్నలు మాశైలకూటమెక్కి యందలి గుహావిశేషములు పరికించుచు దిరుగరారైరి. అందుండిచూచిన దిక్పతుల నగరములన్నియుఁ గనంబడఁగలవు. అందులకు నేనేమి జేయఁగలను. అపూర్వవస్తుదర్శన మెట్టివారిచిత్తమునైన నాకర్షింపకమానదు. నీకు మాశిష్యుని సహాయముగానిత్తును. నీవుకూడ నాకొండనెక్కి యందలి వింతలుచూచి యన్నల వెంటబెట్టుకొనిరమ్ము పొమ్ము. అని పలుకుచు శిష్యున కేదియో కనుసన్నఁజేసెను. ఆసంజ్ఞలు జూచుటచే నాయనుమానము మఱింతబలమైనది. కొండశిఖరమున నేదియో కపటమున్నదని నిశ్చయించి యాశిష్యునివెంటఁ గొండయెక్కుచు వానితోఁ గొంతముచ్చటించితిని. వానిమాటలన్నియు నసత్యములని తెలిసికొంటి గుహలోనికింబోయితిమి. వాఁడునన్ను ముందునడిపింప వలయునని చూచెఁగాని నేనొప్పుకొనలేదు. గుహలో నొకచో నిలువంబడియాబల్లయెక్కిచూడుము మీయన్నలు దిక్పతులు నగరములు గనంబడునని చెప్పిన నేనదికపటమని గ్రహించి వాని మెడబట్టుకొని నీవచూడుమని యాబల్లమీఁదికి గెంటితిని. మీట సడలి యాబల్ల యొఱగినది. వాఁడాగర్తములోఁబడిపోయెను. మీరుగూడ నట్లుబడి యుందురని నిశ్చయించి పట్టరాని కోపముతో నాయతింజంపఁదలంచి ఖడ్గముచేతంబూని రెండు జాములెక్కినకొండ రెండు గడియలలోదిగి రౌద్రావేశముతోఁబోయి యహంకారము ప్రకటింపక వానిదాపునకుఁబోయి నిలువఁబడితిని.

నన్నుఁజూచివాఁడు భయపడుచు రాజపుత్రా! పోయివచ్చితివా మీయన్నలు గనంబడిరా! మాశిష్యుఁడేడీ? అనియడిగిన నేనిట్లంటి. స్వామీ! మీశిష్యుఁడు మాయన్నలజాడఁ బోయెను. ఆగుహాంతరమున నామీట యమరించితి రేమిటికి? మాయన్నలుగూడ నాబల్ల

యెక్కి వివరములోఁ బడిపోయిరి కాఁబోలు. ఆబిలమార్గము దిక్పతినగరములకుఁ దీసికొనిపోవునా? అని యెఱుంగనివాఁడుబోలె నడిగితిని. వాఁడు నామాట నిజమనుకొని యోహో! నీవాబల్ల యెక్కలేదా! అది యెక్కినతోడనే బల్ల యొఱిగి స్వర్గమునకుఁ దీసికొనిపోవును. నీవు మొదటినుండియే మరలివచ్చితివి. తప్పుపనిచేసితివి తిరుగఁబోయి యెక్కుమని పలుకుచుండఁగనే నేను తొత్తుకొడుకా! నీకపటమెఱుంగననుకొంటివిరా? ఆవివరమునంబడినవారేమగుదురు? నిజముచెప్పుము లేకున్న నిన్నిప్పుడే ముక్కలుక్రిందఁగోసెదనని యదలించుచు నెడమ చేతితో జటాకలాపముఁబట్టుకొని తిగిచితిని. అవియంటింపఁబడినవగుటఁ జేతిలోనికూడివచ్చినవి. వాఁడు మోసపోయని యఱచుచు నాపైఁదిరుగఁబడి యదలింపఁదొడంగెను. ఖడ్గంబు నుంకించుచు నొక్కవ్రేటున వానితలనఱికి పారవైచితిని అంతలో మన వీరులందఱు మూఁగికొనిరి. వాఁడు కపటాత్ముడనివిని దండనాథు డాశ్చర్యమందుచు నయ్యయ్యో తెలిసికొనలేకపోయితినే యెఱింగినచో వీనిమేను తునకలుగానఱికి కాకులకుఁ బాఱవేయకపోవుదునా అనిపలుకుచునాకపటము గ్రహించినందులకు నన్నుఁబెద్దగానగ్గించెను. పిమ్మట నందున్న వాని పరిజనము నెల్ల వెదకి వెదకి మన వీరులు హతముగావించిరి. సేనలతోఁ గొండయెక్కి స్వాధీనపఱచుకొని యందలి వింతలఁజూచుచు మిమ్ము గుఱించి వితర్కించుచు నాలుగుదివసములా గుహాముఖంబున వసించితిమి.

అప్పుడు నాకు భగవంతుఁడీ యూహతోపించెను. మీరుబ్రతికియుందురా ఈజాబుజూచి ప్రత్యుత్తరము వ్రాయుదురు. లేనిచో జేయఁదగినది లేదుకదా! ఇదియే కర్తవ్యమని యూహించి గుహాముఖంబున నొకయంత్రచక్రమమరించి దాని కీలొలుసు దగిలించి చివర బరువైన యీయినుపగుండు దగిలించి దిగవిడిచితిమి దీనివలన దీని లోతెంతయున్నదియుఁగూడఁ దెలియఁబడగలదు. దైవకృపచే మీరీకమ్మ

జూడగలిగితి రేని వెంటనే మీ క్షేమము తెలియఁజేయుఁడు. ఒక్కదివ సంబెల్ల నీనిగళంబిట్లుంచి తిరుగాఁ బైకిలాఁగికొందుము.

ఇట్లు మీ ప్రియసోదరుఁడు, ప్రతాపరుద్రుఁడు.

ఆపత్రికం జదివికొని వీరవర్మ తమ్మునితోఁగూడ నబ్బిగంతులువై చుచుఁ దమతమ్మునికట్టి యుపాయము తోఁపించినందులకు భగవంతున కనేక నమస్కారములుగావించుచు నానగరంబున మహోత్సవములు పెక్కు సేయునట్లు చాటింపఁబంపెను. మఱియు నప్పుడే మఱియొక పత్రికవ్రాసి మడిచి యాయినుపగుదెయరలోఁబెట్టి చీలబిగించెను. అందు మాముద్దుతమ్ముఁడు ప్రతాపరుద్రుని బ్రీతిపూర్వకముగా నాలింగనముజేసికొని వీరవర్మయు సుధన్వుఁడును వ్రాయునదియేమనఁగా, అతలమను పేరుగల యీపాతాళలోకమందు మేమిరువురమే యధిపతులమై భూలోకవిలక్షణములైన మహైశ్వర్యము లనుభవించుచుఁ ద్రిలోకాతీతసౌందర్యంబునం బ్రకాశించు భార్యలంబెండ్లియాడి మహానంద మనుభవించుచున్నారము కాని జన్మదేశపాణిబంధు వియోగంబునంజేసి యయ్యానందంబు రోగపీడితునకుఁ జేయు విందువలె హృదయరంజకంబుగాకున్నది. మనదేశమునకువచ్చుమార్గముదెలియక తొట్రుపడుచుంటిమి. మొన్న నీవు బిలంబునం బడనేసిన కపటముని శిష్యుఁడిందుఁబడియెను వానివలన నీవృత్తాంతము గొంత తెలిసికొంటిమి. నీవుజంపినవాఁ డలంబుసుఁడను రాక్షసుఁడు ఈయతలమును బాలించుచున్న వజ్రకంఠుని యాహారము నిమిత్తమై మనుష్యుల మాయఁజేసి యాదానవుఁడు మునివేషముదాల్చి యిందుఁద్రోయించుచుండును. ఈబిలముమయుఁడనువాఁడు నిర్మించెను. అని తానాబిలములోఁ బడినది మొదలు నాటితుదివఱకు జరిగిన కథయంతయు వ్రాసి మఱియు నిట్లు తెలియజేసిరి.

వినుమిందుఁగల రత్నములు, బంగారము, స్వర్గలోకమందైన

లేవని చెప్పవచ్చును. వానినన్నియు మనదేశమునకుఁ దీసికొని రాఁద లంచితిమి. కావున నీగొలుసుచివర బిలపరిమాణముకన్న తక్కువగా వర్తులములైన మందసములఁగొన్ని గట్టించి దిగవిడుచుచుందుము వానిలో నీవస్తువులుంచి పంపుచుందుము. ఈబిలమొక మనుష్యుండు మాత్రము పట్టునంత వైశాల్యము గలిగియున్నది. కావున వరుసగా నాలుగైదు సంచులంగట్టించి విడువుము వానిలో మేము దూరి వచ్చు చుందుము. గాలి తగులునట్లిందుండి చర్మభస్త్రికలచే నూదింతుము. మేము పైకివచ్చుటకు నింతకన్న మంచియుపాయములేవియైనఁ దోచి నచో నట్లుచేసి గొలుసు దిగవిడుచుచుందుము. ఎప్పటికప్పు డుత్తర ప్రత్యుత్తరములు దెలిసికొనుచుండవలయునని యెన్నియో విషయము లందు వ్రాసి పంపిరి.

ప్రతాపరుద్రుఁడు వ్రాసినరీతిగా నొకదివసమునమాత్ర మందు నిలిపి పిమ్మట నాగొలుసు లాగఁబడినది. పరమసంతోషముతో నా వింతజూచి రాజకుమారు లిరువురు నంతఃపురమునకరిగి భార్యలకుం జెప్పి కనకరత్నమండనాది విశేషముల మందసముల నెక్కించుచుఁ బ్రయాణసన్నాహములో నుండిరి.

అని యెఱింగించువఱకు వేళ యతిక్రమించినది మణిసిద్ధుండ వ్వలికథ పైమజిలీయందిట్లు చెప్పమొదలువెట్టెను.

---

## 221 వ మజిలీ.

# రాగవర్ధనునికథ

గోపా! వినుము తాళధ్వజుని మూఁడవకుమారుఁడు రాగవర్ధ నుఁడు తండ్రియాజ్ఞబూని యన్నలజాడఁ దెలిసికొనఁబయలుదేరి గాలి వానచే దారితప్పి జయపురంబుఁ బ్రవేశించెనని నీవెఱిఁగియుంటివిగదా.

అప్పుడు తన్నగరాధిపతి జయుదేవుఁ డూరలేఁడు. అతని భార్య దూత లవలన రాగవర్ధనునిరాకవిని తొట్రుపడుచుఁ దనకూఁతురు రతిమంజ రింజీరి యిట్లనియె.

పుత్రీ!వీరవర్మతమ్ముఁడు రాగవర్ధనుఁడను వాఁడు ఎందోపోవుచు గాలివానందడిసి తడిపుట్టములతోఁ బెద్దసత్రమునందు నిలువంబడి యున్నాడట. వానియన్న వీరవర్మ మనకుఁగావించిన మేలు వేయి జన్మములకైన మఱువఁదగినదికాదు. మీాదండ్రిగారూరలేరు. మంత్రి ప్రముఖులకు వార్తనంపునప్పటికిఁ బ్రొద్దుపోవఁగలదు. నీపరిచారిక లలోఁ దెలివిగలదానినందుఁబంపి వానిరప్పింపఁగలవా! అనియడిగిన రాజపుత్రిక నవ్వుచు నిట్లనియె.

అమ్మా! అంత తెలివిగలపరిచారిక లెవ్వరునులేరు అట్లుపోయి తీసికొనివచ్చినను నాతో మాట్లాడి గౌరవింపదగిన పురుషుఁడెవ్వఁడు నిందులేడుగదా. కావున నేనుపురుషవేషమువైచికొనిపోయి వానిందీసి కొనివచ్చెద రాత్రివిందుజేసి మఱునాఁడుపంపుదుముగాక అట్లైనమా టుదక్కఁగలదు. అందులకు నీకుసమ్మతమైనంజెప్పుమని యడిగిన నప్ప టికివేఱొక తెఱువు లేమింజేసి యట్లు చేయుట కంగీకరించినది.

రతిమంజరిత్రుటికాలములోఁ బురుషవేషమువైచిగుఱ్ఱము నెక్కి పాణిద్వారముననాసత్రమునకఱిగినది. ద్వారమునగుఱ్ఱమునుదిగిలోపలి కిఁబోయి యిందు రాగవర్ధనులెందున్నారని విమర్శించుచుఁదిరుగుచుం డఁ దడిగుడ్డలబిండుకొనుచు జలిచేవడకుచు నొకయఱుగుపయిఁ గూరుచు న్నరాగవర్ధనుండు ఆమెమాటలు విని నేనే రాగవర్ధనుండనని చెప్పెను.

రాజపుత్రికయతనియాకారసౌష్ఠవమునకచ్చెరువందుచుఁజేయి పట్టుకొని వయస్యా! నేనీనగరాధిపతిజయదేవునికుమారుండ మీారాక చారులనలనవిని యరుదెంచితిని. మాతండ్రియూరలేఁడు మీారుతడిసి యిందున్నవారని విని యరుదెంచితిని యీాపీతాంబరంబుల ధరింపుడు.

నా వెంటరండు పరదేశస్థులవలె నీసత్రమున వసించుట ధర్మమే? ఈ రాజ్యము మొన్న మీయన్నలు మాకిచ్చినదే కదా ముందుగా వార్త నంపిన నీమకడకెదురురాకపోవుదుమా లెండు లెండు. పుట్టంబులం దాల్పుఁడు అనిపలుకుటయు నతండేమాటయుఁ బలుకలేక సిగ్గుపడుచు దిగ్గునలేచి యామెయిచ్చిన పుట్టంబులంగట్టికొని వినయముతోఁగృతజ్ఞతఁ జూపుచు నిప్పుడేపోవుదము మాదూతలు రానీయుండనియుత్తరము చెప్పుటయునాయింతియిట్లనియె.

వయస్యా! మీదూతలెప్పటికివత్తురో. అంతదనుక నీసత్త్రమందిరములోనుండుట కష్టముకాదా! వారికి నేనువార్తనంపిరప్పించెదంగాక లెండు. నాగుఱ్ఱమునెక్కుడు నేను మీగుఱ్ఱమునెక్కెదననిపలుకుచు నతనిచేనట్లు చేయించి తానాతని గుఱ్ఱమెక్కి ముందు నడిపించుచు గడియలో నతని కోటలోనికిఁ దీసికొనిపోయినది.

అందుఁ గ్లేశనువాయ నభ్యంగనక్రియ నుష్ణోదకస్నానము మృష్టాన్నసంతృప్తియుఁ గావింపఁజేసి పిమ్మట ననర్ఘమణి భూషణాంబరంబులం దాల్పంజేసి లోపలి సభాభవనంబునఁ గూర్చుండఁబెట్టి కొంతసేపు వారాంగనానృత్య గానవినోదములచే నతని నారాధించినది. పిమ్మట రతిమంజరి యారాజకుమారుఁ దనయంతఃపురమునకుఁ దీసికొనిపోయి హంసతూలికాతల్పంబునం గూర్చుండఁబెట్టి ప్రక్కపీఠంబునఁ దాను గూర్చుండి వినోదముగా నిట్లు సంభాషించినది.

రతిమంజరి——వయస్యా 'సఖ్యంసాప్తపదీన' మనియున్నది కదా. మీకు నిద్రవేళయగుచున్నది. అయినను మీతోఁ గొంత ముచ్చటింపవలయునని వేడుక కలుగుచున్నది. మీదర్శనమందయాశక్తియున్నది. నాతప్పులు మన్నింప వేడుచున్నాను.

రాగవర్ధనుఁడు——(కృతజ్ఞతప్రకటించుచు) రాజపుత్రీ! నేఁడు నీవునాకుఁగావించిన యుపచారములు వేయిజన్మములకైన మఱవ

రావు. నాజీవితాంతమువనుక నీకుఁగృతజ్ఞుఁడనై యుండెద.

రతి—ఆమాటలు నే సహింపఁజాలను. మీయన్నలు నిల్పిన దివాణము మీకుఁబరిజనులమై యూడిగములు సేయఁదగినవారము మమ్మింతగాఁ గొనియాడఁదగదు.

రాగ—ఉత్తములిట్లే యాత్మగుణప్రస్తుతికి ననుమతింపరు కానిమ్ము. నీసుగుణములు నాకు సంతోషము గలుగఁజేయుచున్నవి.

రతి—మీతోఁగొన్ని పరిహాసవచనములాడఁదలంచితినిమన్నింతురుగాక! మీ మొగము పరీక్షించుచున్నాను. మీకు వేశ్యానృత్యగానప్రసక్తియందంత యభిరుచిలేనట్లున్నది యేమందురు?

రాగ—నవ్వుచు, అవును. సత్యమే నాకు వేశ్యలనిన నభిరుచి లేదు వినుము.

చ. గడుకొని మంత్రశక్తి నురగంబులఘోరవిషానలంబు పెం
పుడుపఁగవచ్చుఁ గానల మదోత్కట కుంభికృతప్రమాదము
న్గడువఁగవచ్చు నొక్కతటినక్రముఖస్థుఁడు దాటవచ్చు నె
వ్వఁడుఁగణికాముఖాగ్నిఁబడువాఁడుబయల్పడ నేరఁడెన్నఁడున్.

రతి—నవ్వుచు,

శ్లో. వేశ్యాజఘనరథస్థః కులనారీం కస్సచేతనోగచ్ఛేత్
నహిరథమతీత్య కశ్చిద్దోయానేనావ్రజేత్పురుషః.

ఇందుల కేమందురు?

రాగ—అందులకే తత్సంపర్కము కూడదనుచున్నాను.

రతి—పోనిమ్ము వయస్యా! నీవు శృంగారప్రబంధము లేవైనం జదివితివా.

రాగ—ఒహో నీకు శృంగారరసము చాలప్రీతివలెఁ దోఁచుచున్నదే.

రతి—అవును వయస్యా వినుము.

శ్లో. ఆయుస్సారో యౌవనమృతుసారః కుసుమసాయకవయస్యః
సుందర! జీవితసారో రతిభోగరసామృతాస్వాదః.

బ్రతికినదినములలో యౌవనకాలమే కాలము వసంతఋతు వేఋతువు. రతిభోగరసామృత మనుభవించుటయే జీవితమునకు ఫలమని విద్వాంసులు వ్రాసియున్నారు.

రాగ—మంచిరసికురాలవే! శృంగారప్రబంధములుచాలఁ జదివితివి కాఁబోలు.

రతి—చదువుటయేకాదు బహుదేశములు దిరిగి యాయాదేశస్త్రీల విశేషములఁ దెలిసికొనివచ్చితిని మీకునిద్రలేనిచో వినిపించెద.

రాగ—నీవిట్టిమాటలఁ జెప్పుచుండ నిద్రయెట్లువచ్చును వినిపింపుము తెల్లవారువఱకు మేలుకొనఁగలను.

రతి—శ్లో. చోళీచ్ఛన్నాయదికుచతటీదుర్లభా ఘూర్జరీణాం
కచ్ఛాభావాదలఘుజఘనంతహీ శక్యావమర్షం
తద్వ్యత్యస్తం ద్రవిడ సుదృశామంతతః కింతస్యాత్
దేకత్రైకంభవతి సులభంతద్వదన్యత్ర చాన్యత్.

ఘూర్జరస్త్రీలు జఘనంబున సన్నని వలువజుట్టి కుచతటంబు దృఢచేలంబుల బిగింతురు. ద్రవిడస్త్రీలందులకు వినిమయముగా జఘనంబు ఘనవసనావృతంబు గావించి కుచతటంబు పటావృతంబు గాకుండఁ జేయుదు రొకొక్క దేశంబుననొక్కొక్క విశేషంబుగలదు మఱియు,

శ్లో. వాచిశ్రీర్మాధురీణాం జనకజనపదస్థాయినీనాం కటాక్షే
దంతే గౌడాంగనానాం సులలితజఘనే చోత్కల ప్రేయసీనాం
త్రైలింగీనాం నితంబే సఘనఘనరుచా కేరలీకేశపాశే
కర్ణాటీనాంకపోలే స్ఫురతిరతిపతిః ఘూర్జరీణాంకుచేషు.

పాండ్యదేశస్త్రీ వాక్కులందును విదర్భ దేశస్త్రీల చూపులందును గౌడాంగనల దంతములందును నుత్కల త్రిలింగకర్ణాటదేశాంగ

వల జఘనమందును గేరళాంగనల కేశములందును ఘూర్జరాంగనల కుచంబులందును మన్మథుండు తాండవమాడుచుండునిదియునుంగాక.

శ్లో. ఆంధ్రీపీనపయోధరైణనయనా సర్వాగుణాధికా దక్షిణీ
కర్ణాటీసురతోపచారచతురా లాటీ విదగ్ధాప్రియా
క్రూరా మాలవి కాకలాసునిపుణా నిత్యం మహారాష్ట్రికా
సౌరాష్ట్రీమృగలోచనా సువచనా ద్రవ్యప్రియా ఘూర్జరీ.

రాజపుత్రా! ఈదేశములన్నియు నేనుదిరిగి చూచితిని. ఇట్టి శ్లోకములు వేయిచదువగలను.

రాగ—వయస్యా? ఏదేశస్త్రీయైననేమి తత్స్వభావమెట్టిదో తెలిసికొంటివా వినుము.

శ్లో. శ్రుతాపురాణె యాసాంచ చరిత్రమతిదూషితం
తాసుకో విశ్వసేత్ప్రాజ్ఞః ప్రజ్ఞావాంశ్చ గుణాశ్రయః.

శ్రుతులయందుఁ బురాణములందు స్త్రీ చరిత్రము దూష్యముగా వర్ణింపఁబడియున్నది. గుణవంతుఁడెవ్వఁడు నట్టిస్త్రీని విశ్వసింపఁడు.

రతి—సరిసరి మంచిమాటయే పలికితిరి.

శ్లో. ఫలం ధర్మస్య విభవః విభవస్య ఫలం సుఖం
సుఖమూలాని తన్వంగ్యః వినా తాభ్యః కుతస్సుఖం.

ధర్మఫలము విభవము విభవఫలము సుఖము సుఖమూలములు స్త్రీలుకారా స్త్రీలులేనిదే సుఖమేల విభవమేల వినుండు.

శ్లో. ప్రజ్ఞాకలా యౌవనజాతి సంపత్సౌందర్య విద్యా మదగర్వితాభిః
సుదుర్లభాభిర్వర సుందరీ భిస్సంభోగసంజాత సుఖం కథంస్యాత్.

రాగ—అవును నీవు చెప్పినట్లు ప్రజ్ఞ కళ యౌవనము కులము సంపద సౌందర్యము విద్య యిన్ని గుణములుగల కలకంఠులు లభించుట పూర్వపుణ్యమే. కానిచో

శ్లో. వరమగ్నౌస్థితిర్హింస్రజంతూనాం సన్నిధౌసుఖం

తతోపి దుఃఖదం పుంసాం దుష్టస్త్రీ సన్నిధౌ ధ్రువం.
హింసించు జంతువుల సమీపమునందు సుఖముగా నుండవచ్చునుగాని దుష్టస్త్రీ సన్నిధి వసించుట కడుంగడు కష్టమని చెప్పలేదా.

రతి—దుష్ట పురుషులకడ వసించుట స్త్రీలకు మాత్రము కష్టము లేదా వినుండు.

శ్లో. యేకామినీం గుణవతీంచసయౌవనాంచ
నారీం నరాః ప్రణయినీంచ విమానయంతి
తె భోఃకృషీవల వచః పరిదగ్ధ చిత్తె
గోఽభిస్సమం పృథుముఖేషు హలేషుయోజ్యాః.

గుణవంతురాలగు నిల్లాలి నవమానపఱచిన పురుషుని దుక్కిటెద్దుప్రక్క నాగలికిఁ గట్టి దున్నుమని బుద్ధిమంతులు చెప్పియుండలేదా.

రాగ—ఓహో రాజకుమారా! నీకు స్త్రీలయం దెక్కువ యభిమానము కలిగియున్నదే.

రతి—మనోహరా! మనోహరాకారముగల స్త్రీని జూచి మోహవివశుఁడు కాని పురుషుఁ డెవ్వఁ డున్నాఁడో చెప్పుము. మహర్షులుగూడ వారిం జూచి విహ్వలులైనట్లు పురాణములు ఘోషించుచుండలేదా! అది యట్లుండనిండు అడుగవలసిన మాట యడుగుట మఱచితిని. మీకు వివాహమైనదియా?

రాగ—లేదు.

రతి—మీకుఁదగిన లావణ్యవతి దొరకక యింతవఱకు వివాహము మానితిరి కాఁబోలు.

రాగ—ఎట్లనుకొన్నను సరే.

రతి—రాజపుత్రా! మిమ్మీరాత్రి నెట్లును నిద్రబోనీయను మాయింటఁ జక్కని గాయనీరత్నమున్నది. అనురూపరాగానులాపవిలాసములచే మిమ్మారాధింపవలయునని యభిలాష పడుచున్నది.

అనుజ్ఞయిత్తురే? అయ్యో! అమాట మఱచి యింతదనుక వృథాకాల హరణము గావించితిని గదా.

రాగ—ఈరేయి మీయధీనుఁడనై తి నెట్లుచేసినను సంతోషమే. అనుటయు నిదిగోపోయి దానిందీసికొనివత్తునని పలికిలోపలికిఁజని యరగడియలో దివ్యమాల్యానులేపన కనకమణి భూషాంబర విభూషితగాత్రియై జగన్మోహన విలాసములో గరంబున వీణందాల్చి యొక శుకవాణి యతనిచెంత కఱుదెంచి నమస్కరించినది. అతండా యెలనాగ సోయగము దిలకించి మేనుబులకింపఁ గుసుమశరసాయకములఁ బాటింబడి తానెవ్వఁడో యక్కడికెట్లువచ్చెనో యంతకుమున్నేమిచెప్పెనో యంతయుమఱచి తద్రూపాతిశయము నయనంబులఁ గ్రోలువాఁడు బోలె నూరక చూచుచు.

పొలఁతీ! నీవెవ్వతెవు? ఆరాజపుత్రుఁడు రాలేదేమి? ఆవీణాభారంబు భరింపలేకుంటివి. నేలంబెట్టరాదా? అందుఁగూర్చుండుము. అని గద్గదస్వరంబునఁబలికినసక్కలికి కలికిచూపులునతనింజూచుచునిట్లనియె.

మనోహరాకారా! మారాజపుత్రుఁడు తల్లిగారుపిలిపింపలోపలి భవనంబునకరిగెను. ఆయనవచ్చుదనుక సంగీతమునమిమ్మారాధించుచుండుమని నాకునియమించెను. నామాట మీతోఁజెప్పియున్నాడఁట కాదా? దేవర యనురాగప్రవృత్తి యెట్టిదో తెలిసికొని పాట ప్రారంభించెద సెలవే యనవుఁడు నుత్కంఠతో నతండిట్లనియె.

మీ రాజపుత్రుఁడీరాత్రి వచ్చునా నెపమునన్ని తల్లిగారియొద్ద కరుగలేదుకద. అని యడిగిన నప్పుడఁతి యేమో యెంతలో వచ్చునోనాకుఁ దెలియదు రాకున్న మీకేమికొదవ దాసురాలిందుండిసేవఁ జేయగలదు. మీయభీష్టమేదియో తెలుపుఁడని యడిగిన నతండు నీకేది ప్రియమో అదియే నాయభీష్టము.

రాగ—పరిబోధనము గానపరిక్రృతి ననుసరించి యుండు నీకుఁ

దోఁచిన గీతంబులంబాడుమని నియోగించుటయు నమ్మించుబోఁడి యందలి పీఠంబునంగూరుచుండి విపంచి మేలగించి పంచమస్వరానుకరణముగా నాలాపించి తనకుఁగల గాంధర్వవిద్యావిదగ్ధత్వంబుఁ దేటపడ బోయిగాఁబాడి యతని రాగసముద్రములో మునుంగఁజేసినది.

అప్పుడతం డాత్మగతంబున నాహా యీగాయనీరత్నము కర్ణరసాయనముగాఁబాడినది. ఈమెంజూడ నా రాజపుత్రిని చిహ్నములు గనంబడుచున్నవి. ఈయువతి యతని చెల్లెలు కాదుగదా చెల్లెలోయైనచోఁ గ్రొత్తవాఁడనగు నాకడ నిట్లు విస్రబ్ధముగానిలిచిపాడునా? నాచిత్త మీమత్తకాశినింజూచినతోడనే సంకల్పభవాయత్త మగుచున్నదేమి? అయ్యో! రాజపుత్రిఁడు నాబుద్ధింబరీక్షించుటకుఁ గపటముగా నీమెనిందుఁ బంపెనా! ఈమెతోనతఁడు రాకపోవుట శంకాస్పదముగానున్నది. ఈయేకాంతవాసంబు నా కుత్కంఠఁగలిగించుచున్నది. ఈలలన కులకాంతయైన నగుంగాక వేశ్యయైన నగుంగాక దీనింగలియ వేడుకఁబొడముచున్నది. అని తత్తఱించుచుఁ దటాలున నాకుటిలాలక చేయుపట్టుకొని జవ్వనీ! నీవెవ్వతెవో చెప్పితివి కావు. మనోహరముగాఁబాడి నాహృదయ మాకర్షించితివి. నీకుఁబారితోషిక మీయనున్నాఁడ గోరికదెలుపుమని యడిగిన నప్పడఁతి యించుక కపటకోప మభినయించుచు నిట్లనియె.

పురుషోత్తమా! మారాజపుత్రిఁడు మిమ్ము సత్కరించుటకై వినోదముగా నాచేఁబాడించెను. మీచే గానభృతినందుటకు నేను వేశ్యనుగాను మీరు పరస్త్రీపరాఙ్ముఖులని చెప్పుటచేఁ జెంగట నిలిచి పాడితిని. మీరు సంతసించితి రింతియ పదివేలు నాకుఁ గానుక లవపరములేదు మఱియుఁ బరాంగన కరంబుఁ బట్టవచ్చునా? ఇది మీ దేశాచారము కాఁబోలు చేయివదలుండు పోయివత్తునని పలికి లేవఁబోయిన వారించుచు నతండిట్లనియె.

నీవు మొదటఁజెప్పినమాట మఱచితివి. మీరాజకుమారుఁడు వచ్చుదనుక మిమ్మారాధించుచుండెదనని చెప్పి యిప్పుడు లేచిపోయెద ననెదవేల. అది స్వవచన వ్యాఘాతముకాదా. మఱియుఁ బాటకుమెచ్చి కానుక నిచ్చెదనన్నఁ దప్పుగాగణించితివి. ఈ విపరీతమెక్కడను జూడ లేదు. మీరాజకుమారుఁడురానీ అతండు తప్పనిన నొప్పుకొనియెద నని పలుకుటయు నక్కలికి యిట్లనియె.

సరిసరి. ఆయనకుఁజెప్పిన నన్నే మందలించును. అట్లైన మీ చిటికెనవ్రేలియుంగరము నాకీయుఁడుమీపేరు దలంచుచు ధరింతునని పలికిన పక్కన నవ్వుచు నక్కుమారుఁ డాయంగుళీయక మిచ్చెను. దానిం దాల్చుచు నాముదిత ముదితహృదయయై మనోహరా! నే నుంగరమడిగిన నవ్వితివేల? తప్పేమి? అనుటయు నతండు తప్పులు మాకుఁదెలియవు. పాటకుమెచ్చి కోరికొనుమన వేశ్యలమా? అనితప్పుఁ బట్టితివి. ఇప్పుడీ యుంగరమెట్లుకోరితివి. అంగుళీయకము భర్తవలనఁ గాని పరపురుషునివలన లలనలు స్వీకరింపరు. దీనినేమిటికి కోరితివో యనినవ్వితిని. తెలిసినదియాయని నుడివిననవ్వి యవ్వనిత యిట్లనియె.

అయ్యో! ఆసాంప్రదాయము నాకుఁదెలియక దానింగోరితిని. అదియునుంగాక మీరు నాకరగ్రహణము జేయుట మీరన్నమాట బలపరచుచున్నది. దీనివలన మీరునాకు భర్తలగుదురా యేమి సరిసరి మీయుంగరము మీరు తీసికొనుఁడు అని పలుకుచుఁ దన వ్రేలి యుంగరము మఱియొకటి తీసి యంతడు వలదనుచుండ బలవంతమున నతని వ్రేలందొడిగినది. అతండది చూచికొని యోహో ఇది నా యుంగరముకాదు. మఱియొక టిచ్చితివేల? ఈవినియమంబు నేనన్న మాట ధృవపరచినది కదా అని తెలిపిన నత్తన్వి దైవసంకల్ప మట్లు న్నది కాఁబోలు తెలియకయే యీకృత్యములు నిర్వర్తిల్లినవి. నన్ను మఱియొక పురుషుఁడు స్వీకరింపఁడు ఇఁక మీరే భరింపవలయునని

పలుకుచు నొకపుష్పమాలఁ దెచ్చియతని మెడలో వైచినది. అతండు మోహాంధుండై తదనుగుణ్యములగు చర్యల జరుపుచు రాజపుత్రుఁడు వచ్చునేమోయని సంశయించుచుండ గ్రహించి రాజపుత్రిక యాజడు పుడిపియాథార్థమంతయుం దెలిపి యతని క్రీడారసవివశుంగావించినది.

శ్లో॥ సద్భావరాగదీపితమదనాచార్యోపదిష్ట చేష్టానాం
కఃపరిగణనంకర్తుంరతి చక్రావిష్ట రమణయోశ్శక్తః.

అని యెఱింగించి......యిట్లు చెప్పందొడంగెను.

---

222 వ మజిలీ

## జయమల్లుని కథ.

పురుషుఁడు రాగవర్ధనుఁడు వనిత రతిమంజరి వారిద్దరికే వినోదము లెట్లుండునో చెప్పనవసరములేదు. కొన్ని యహోరాత్రము లొక్క గడియవలె గతించినవి. ఒక్కనాఁడు రతిమంజరి రాగవర్ధనునితోఁ బ్రాణేశ్వరా నాఁడు మీరెందుబోవుచు నీనగరమున కరుదెంచితిరి! నా నిమిత్తమే భగవంతుఁడు మిమ్మిందుఁ దెచ్చెనని తలంచెదను. అని ప్రస్తావముగా నడుగుటయు నతండు గుప్పున దనయన్నలవృత్తాంతమంతయు జ్ఞాపకమువచ్చి గుండెజల్లుమన నారా! నేనెంత మోహాంధుండనైతిని! అయ్యయో మా తలిదండ్రులకుఁ గ్రొత్త శోకము గలిగించినవాఁడనైతినే తన్వీ నేనిక్కడికివచ్చి యెన్నిదినములైనది? అనియడిగిన మూడుదినములైనదని చెప్పినది చాలుచాలు మూడుదినములా మాసము ఆహా! నెల దినములొక్క గడియవలెదోచినదిగదా చిత్రకూట నగరమునఁజిక్కుపడిన మాయన్నలజాడ దెలిసికొనుటకై పోవుచు దారిదప్పి యీయూరు నేరి యిందు మీవలపులఁ జిక్కుకొని ప్రపంచకము మఱచి పోయితిని. కానిమ్ము నేనిఁక నిందు నిలువరాదు

పోయివత్తు ననుజ్ఞయిమ్మని పలికిన నక్కలికి వగచుచు నిట్లనియె.

మీ రొంటిగాఁ బోవలదు. మీ వార్త మాతండ్రి కిదివఱకే చెప్పియున్నాను మంచియల్లుఁడు లభించెనని యతండు మురియుచున్నాఁడు కొన్ని సేనల వెంటఁబెట్టికొని పొండనిచెప్పినది అతండంగీకరించి యమ్మఱునాఁ డుదయకాలంబున నశ్వశాలకుఁబోయి తనకు దగినవారువము నరయుచున్న సమయంబున నిరువురు యోధులాదారిం బోవుచు రాగవర్ధనుని గురుతుపట్టి యందునిలువంబడి చూచుచుండిరి.

రాగవర్ధనుఁడొక ఘోటకము నేరి దానినాయత్తపఱచి తీసికొని రమ్మని రావుతులకు నియమించి యీవలకువచ్చినంత నాయోధులతనికి సలాములుచేసిరి. మీ రెవ్వరని యడిగిన భర్తృదారకా! మేము దేవర యోధులమే మిమ్ము వెదకుటకై మీతమ్ముఁడు జయమల్లునితో బయలుదేరివచ్చుచు మార్గమధ్యంబున నతండు జిక్కువడఁ దప్పించుకొని మేమిక్కడికివచ్చితిమని చెప్పుటయు నతండు తొందఱగా వారి కిట్లనియె. మీరుమాయోధులా? మీమాటలేమియునాకర్థముకాలేదు. మాతలిదండ్రులు క్షేమముగానున్నారా? జయమల్లుఁడు చిక్కువడెనంటిరి. ఆవృత్తాంతము సవిస్తరముగాఁ జెప్పుఁడనియడిగిన వాండ్రిట్లనిరి.

దేవా! మమ్మా నగరముజేర్చి సత్రములోనిలిపి వారువపు రౌతులు మీ రాక నగరిలోనికిందెలుఁప గోట సింహద్వారముకడకరిగి తిరుగవచ్చునప్పటికిందు మీరు గనంబడలేదఁట నాలుగు దివసంబులందు వసించి వాండ్రు మిమ్ము వెదకివెదకి మీ జాడఁదెలియక పరితపించుచుఁ గ్రమ్మఱ మన వీటికరుదెంచి యావార్తఁ దెలియఁజేసిరి. జయదేవుఁడు వెనుకటి పగ మనంబునంబెట్టుకొని మిమ్ము జంపించెనని నిశ్చయించి మీ తలిదండ్రులు పెద్దగా దుఃఖించిరి.

అప్పుడు జయమల్లుఁడును బ్రతాపరుద్రుఁడు వారి నూఱడించుచు మీజాడఁ దెలిసికొని వత్తుమనిచెప్పి వారి నొప్పించి సేనలతో

బయలుదేరిరి. అందుఁ బ్రతాపరుద్రుఁడొక్కఁడు సేనానివేశముకడ కరిగెను. సేనలతోఁగూడికొని జయమల్లుఁడు జయపురమునకు వచ్చుచు నొకనాఁడు సాయంకాలమున రామనగర సమీపంబున సేనతోవిడిసి పటకుటీరములు వైపించెను.

ఆ నగరాధిపతి దుందుమారుండనురాజు జయమల్లుఁడు తన పట్టణము ముట్టడింపవచ్చెనని తలంచి యర్ధరాత్రంబున సేనలతోఁ బోయి నిద్రావిద్రాణములై యున్న చతురంగబలములను బరిమార్చి జయమల్లునిఁ బట్టుకొని కట్టించి తీసికొనిపోయి కారాగారంబునం బెట్టించెను. హతశేషులు కొందఱు పాఱి మన నగరంబునకుఁ బోయిరి. మేమీదెనకుఁ బాఱివచ్చి యిన్నగరంబుసొచ్చి మీజాడ యేమైనఁ దెలియునేమోయని వీధులందిరుగుచుంటిమి దైవికముగా మీరిందుఁ గనంబడితిరి. ఇదియే యక్కడి వృత్తాంతమని యెఱింగించిరి.

రాగవర్ధనుండావార్తవిని క్రోధమూర్ఛితుండై యేమీ! దుందుమారుండక్రమముగా మన సేనలంజంపి మాతమ్మునిఁ జెఱసాలం బెట్టించెనా. కానిమ్ము వానిప్రాయశ్చిత్తము ముందుగాఁజేసి తరువాతఁ జిత్రకూట నగంబుకడ కరిగెదంగాక అని నిశ్చయించి యప్పుడే మామగారినడిగి చతురంగ బలముల సహాయము తీసికొని మంచివేళ బయలుదేరి కతిపయ ప్రయాణముల రామనగర సమీపమున కరిగి యందు శిబిరములవైపించి దండు విడిసి యానృపతికిట్లు రాయబారము వ్రాసిపంపెను.

దుందుమారా! నీవశ్వత్థామవలె నర్ధరాత్రంబున మాసేనలపైఁబడి పరిమార్చి నిద్రించుచున్న మాతమ్మునిఁ జయమల్లుని జెఱసాలం బెట్టించితివఁట నీవీక్షణమున మాతమ్మునిఁ వెంటఁబెట్టుకొనివచ్చి తప్పు చేసితి రక్షించి విడువుఁడని పలుకుచు నా పాదంబులంబడి గడ్డి గఱచి బతిమాలికొనిన నీవు బ్రతికిపోవుదువు. లేకున్న నిన్నుఁ బుత్ర మిత్రా

దులతో నాశనముచేసి నీకోటత్రవ్వించి కంటకములఁ బాఱవేయింతు-నిందులకు రెండు గడియలు గడువిచ్చితి గాచుకొనుము.

ఇట్లు రాగవర్ధనుఁడు.

ఆపత్రికం జదివికొని యాదుందుమారుండు గడగడలాడుచు-జయమల్లు నొక్కనినే యశ్వ మెక్కించి యతని చెంతకుఁబంపెను. సందేశమంపిన గడియకాలములోఁ దనకడకరుదెంచిన జయమల్లుం జూచి రాగవర్ధనుం డాశ్చర్యపడుచుఁ గౌఁగిలించుకొని గారవించెను. అతండు రాగవర్ధనుం జూచి వెఱగుపాటుతో నమస్కరించెను.

రాగవర్ధనుండు తమ్ముడా! దుందుమారుఁడు నిన్నుఁ గట్టించె నఁట సత్యమేనా యిప్పుడే వదలెనా? యేమి చేసె? యథార్థము-చెప్పుమని కారణము వినుదనుక నాకినుక చల్లాఱకున్నది. అని యడి గిన నతం డిట్లు చెప్పెను.

అన్నా! నీవు గాలివానం దారిదప్పి జయపురంబున కరిగితి వనియు నీతో వచ్చిన రౌతులు నిన్నొక సత్రంబున నిలిపి నీరాక నారాజున కెఱింగింప నరిగి తిఱుగవచ్చునప్పటికి నీవందు గనంబడ లేదనియు నీజాడనరయుచు నాలుగు దివసంబులం దుండి యాసాదులు-తెలియక మరలి యింటికివచ్చి యావార్త తండ్రిగారి కెఱింగించిరి.

రాజుల హృదయములు క్రౌర్య పూరితములై యుండును. అవమానింపఁబడినవారు నమ్మినట్లే యుండి యదనువచ్చిన తఱి పరిభవింపక మానరు. జయదేవుఁడు చిన్నవారలచే నోడింపఁబడిన-వాఁడగుట నీసుబూనియుండును. రాగవర్ధనుం డొంటిగా నాపురి కరుగఁగూడదు. అరిగెఁబోఁ దనరాక రౌతులచేఁ బతికేల తెలియఁ జేయవలయును? జయదేవుఁడు రాగవర్ధను నవమానపఱచియుండు-నని విచారించుచుండ నేనును బ్రతాపరుద్రుఁడును వారి నూఱడించి మమ్ముఁ బంపుమని కోరితిమి.

అతం డట్టకే నంగీకరించి మీరనన్యసామాన్య ప్రతాపగర్వి తులని నే నెఱుంగుదును. అయినను వేగిఱించి యుద్ధమునకు దిగ రాదు. సామమున నే కార్యము నెఱవేరునట్లు ప్రయత్నింపవలయును. జాగరూకులై కార్యము సాధించుకొని రండు పొండని పలికెను.

ప్రతాపరుద్రుఁ డొక్కరుఁడు సేనా నివేశము కడకుఁ బోయెను. నేను బలముతో జయపురమునకు వచ్చుచు నొకనాఁడు రాత్రి యీనగరప్రాంతమునందు సేనలతో విడిసితిని. ఈదుండుమా రుండు చారులవలన నా రాక తెలిసికొని తెల్లవారిన మేము తమ్ముఁ బరిభవింతుమని జడియుచు మంత్రులతో నాలోచింపక యర్ధరాత్రం బున కొన్ని సేనలంగూర్చికొనివచ్చినిద్రించుచున్న మా పయింబడి మాబలములఁ జీకాకు పఱచి నన్నుఁ బట్టుకొని చెఱసాలఁ బెట్టించిన మాట వాస్తవమే మఱియు దఱువాత చరిత్రవినుము.

అతని మంత్రి మిక్కిలి బుద్ధిమంతుఁడు మఱునాఁడావార్త విని రాజునొద్దకుఁ బోయి మహారాజా! రాత్రినత్యుపద్రవమైనపని గావించితిరి గదా! తాళధ్వజుండు లోకైకవీరుండు అతని కుమారుల బలపరాక్రమములు మొన్నఁటి సంగరములో మనము చూచి యున్నాము. వారి తమ్ముఁ డీతఁడును సామాన్యుఁడు కాడఁట నివ్వా నొడిగట్టినట్లా రాచపట్టిం గట్టించితివి హతశేషులీపాటి కావీటికి బోయి వారి కీవార్తఁ దెలిపియుందురు. వారు దాడివచ్చిన మన మోపఁగలమా! అవి మృశ్యకారిత్వము హాని హేతువగునని యెన్ని యోదృష్టాంతములుసూపియాభూపునిబశ్చాత్తాపతప్తునిఁగావించెనఁట

మధ్యాహ్నంబున నారాజుకూఁతురు ప్రభావతియను యువతి యుపహారములు తీసికొని నేనున్న గదితలుపులు తెఱపించుకొని లోప లికివచ్చినది. ఆరమణీమణి సౌందర్యము లోకాతీతమైయున్నది. విస్మయముతో నేనా మెంజూచు చుండ నావే దండగమన నాదాపునకు

వచ్చి రాజపుత్రా! నేనీ ధాత్రీపతి పుత్రికను నాపేరు ప్రభావతి యండ్రు మాతండ్రి నిన్న రాత్రి మిమ్ముల నెవ్వరో శత్రువులనికొని తెలియక కట్టించి యీచెఱసాలం బెట్టించిరి. తఱువాత మీకథవిని పశ్చాత్తాపముం జెంది మీ మొగముం జూడ లేక సిగ్గుపడుచు మీ సత్కారమునకై నన్నుం బంపిరి.

ఈచెఱసాల కేళీభవమనికొని నన్నుం బ్రియురాలిగా నెంచి నామాట మన్నించి యీతప్పు సైరింపవలయును. మీ రాఁకలిఁ గొనియుంటిరి. భుజింతురుగాక మాశుద్ధాంతమునకు రండని వినయముగాఁ బ్రార్థించినది. దాని యనునయవచనోదకము మదీయ కోపానలముజల్లాఱఁ జేసినది. అచ్చిలుకలకొలికి చిత్తము నొచ్చునేమో యని యేమాటయు నాడనేరక నేనామె చెప్పిన ట్లొప్పుకొని యప్పుడే యప్పడఁతి వెంట నంతఃపురమున కరిగితిని.

అయ్యిందువదన నాకందు గావించిన విందు లిట్టివని చెప్పఁ జాలను పిమ్మట నమ్మనుజపతి మంత్రిహిత పురోహితాదులతో వచ్చి నా పాదంబులంబడి శరణు వేఁడుకొనియెను. నే నభయహస్త మిచ్చితిని. వెంటనే యా వాల్గంటిని నాకిచ్చి వివాహముగావించెను. నేన త్తరుణీ రత్నము సల్లాపనైపుణ్యమునకుఁ జొక్కి ప్రస్తుత కార్యాంశము మఱచి నాలుగు దివసములొక్క గడియవలె వెళ్ళించితిని.

ఇంతకుఁ బూర్వమే నీవు పంపిన సందేశ పత్రికం జూచి జడియుచు దుందుమారుండది కూఁతునొద్దకనిపెను. ఆకొమ్మ యాకమ్మం జదివికొని యురముపైఁ జేయువైచికొని మనోహరా! మీయన్నల తెఱంగే నెఱుంగనిదికాదు. వారు సెప్పినంత సేయుదురు. మీరు వేగఁ బోయి వారి కోప ముపశమింపఁజేయుఁడని ప్రార్థించినది. వెంటనే గుఱ్ఱమెక్కివచ్చితిని. ఇది నావృత్తాంతము అనిచెప్పి నీవిన్నినాళ్లెక్కడనుంటివి? జయదేవుఁడునిన్నుఁ భరిభవించుట యసత్యమాయనియడి

గిన నతండు తన యుదంతము సాంతముగా నెఱింగించెను. ఇట్లొండొరుల ప్రవృత్తులొండొరుల కెఱింగించుకొని యారాజకుమారు లిరువురు సంతోషముతో దుందుమారుని కోటలోనికిం జనిరి.

రాగవర్ధనుని మిక్కిలి వినయముతో నర్చించి యా తేఁడు తానుజేసినతప్పును గాపాడుమని వేఁడుకొనియెను. అతండతనియెడఁ బ్రసన్నుండై తన సేనలనెల్ల జయపురముకనిపి జాగుసేయక వెంటనే తమ్మునితో గూడ పేరుగలవారువములనెక్కి సముచిత పరివారము సేవింప నన్నలజాడ తెలిసికొనఁ జిత్రకూటగిరి పరిసరమున కరిగెను.

అం దుండి యిరువురు యోధులు తురగములెక్కి కన్యాకుబ్జపురంబున కరుగుచు దారిలో వీరికిఁ గనంబడి గుఱుతుపట్టి సలాములు సేయుచు భర్తృదారకులారా! మీరు సేమముగా వచ్చుచుంటిరా! మీయన్నలు సేమముగానున్నారు. పాతాళలోకమునుండి బైటికి వచ్చుచున్నారు. ఈశుభవార్త తలిదండ్రుల కెఱిగింపఁ బ్రతాపరుద్రుఁడుగారు మమ్మందుఁబంపుచున్నారు మీరు గూడ నందుఁ బొండు. మేము పోయివత్తుమని చెప్పి యాసాదులు వెళ్లిపోయిరి.

ఆవార్తవిని రాజపుత్రులిరువురు ప్రహర్షపులకితగాత్రులై యత్యుత్సాహముతో నాశైల శిఖరమున కరిగిరి. ప్రతాపరుద్రుఁడు వారి రాకఁ జూచి సంతోషించుచు రాగవర్ధనుని వృత్తాంతంబడిగి తెలిసి మురియుచు జయమల్లుఁడు పెండ్లికొడుకయ్యెనని యెఱింగి తమకు మంచికాలము వచ్చెనని యానందించుచు నచ్చటి వార్తలన్నియు వారికిం జెప్పి పాతాళలోకమునుండి బంగారు రత్నములు మందసములతోఁబంపిరి. వీరవర్మభార్య పద్మసేనయు సుధన్వుని భార్య రత్నావతియు ద్విజటయు మఱియొక పొన్నికొమ్మయు నమ్మకమగు దాసదాసీజనంబులు పైకివచ్చి నాశిబిరములోనున్నారు చూడుఁడు. అనిచెప్పి యచ్చటికిఁదీసికొనిపోయి వేఱువేఱువారివారి పేరులుచెప్పి చూపెను.

అత్తరుణీమణులును మఱందులం గాంచి వారి నమస్కారము లందుకొని దీవించుచుఁ బెద్దగా నాదరించిరి. ఇంతలో గొలుసంతయుఁ బైకివచ్చినది. మందసములు దాపున నున్నవని పరిజనులువచ్చి చెప్పిన తోడనే యందఱు నాగుహాంతరమునకరిగిరి.

నిగళాంతమునందలి మందసములు నాలుగు గుహాంతరము చేరినతోడనే పరిజనులు తలుపులువిడఁదీసిరి. వీరవర్మ సుధన్వుఁడు మఱియిరువురు వీరులు నందుండి యీవలకువచ్చిరి. మృతిజెందినవారు బ్రతికివచ్చిన నెంత సంతసింతురో యట్టి ప్రీతితోఁదమ్ములు మువ్వురు వారిద్దఱం గౌగలించుకొనుచు నానందభాష్పములచే శిరంబులం దడియఁ బెద్దతడవెలుంగురాక కంఠములు డగ్గుత్తికఁజెంద నానందపర వశులై యుండిరి.

పిమ్మట వీరవర్మ తమ్ములనెల్ల నాదరించుచు నగ్గిరికూట శృంగాటకమునకుంజని యందొకచో విశ్రమించి వారుచేసినకృత్యము లన్నియు గ్రమ్మఱఁదమ్ములకడ నుపన్యసించెను.

అన్నదమ్ము లొండొరులుపడినకష్టసుఖము లెఱింగించికొనుచుఁ గొన్నిదివసములా గిరిశిఖరంబున విశ్రమించిరి. సుధన్వుఁడు తాను వరించిన దేవకన్యకల సౌందర్యాతిశయంబు, నాలోక రామణీయకము, వర్ణించుచుఁ దమ్ములనెల్ల విస్మయసముద్రములో నీదులాడఁజేసెను. వారినేమిటికిఁ దీసికొనివచ్చితివికావని యడిగిన నమ్మగువలు త్రికూ టాంతర్భాగమునుండి యీవలకు రారు. నాకెల్లకాలము నందుండుట కిష్టములేదు. విదేశమెంత సౌఖ్యప్రదమైనను స్వదేశవాసానందము నకు సరిపడదు. అప్పుడప్పుడువచ్చి పోవుచుందునని సమాధానపఱచి తిని. అందలి యైశ్వర్య మీరత్నములే తెలుపుచున్నవి చూడుఁడు పెక్కేల యగ్గిరిశిలలన్నియు బంగారము మణులేకాని పాషాణములు కావు. ఒక్కరత్నము వెలకు మనరాజ్యము సరిపడదు. అప్పుడప్పుడు

పోయి మనకుఁగావలసినన్ని మణులు తీసికొనిరాగలను. మనమంద రము సుఖముగా ననుభవింతమనియచ్చట ముచ్చటలెఱింగించి నవియే పలుమారు చెప్పుచుండఁ దనివి తీరక వినినవార్తలే మరలనడుగు చుందురు.

వీరవర్మ ప్రతాపరుద్రునితోఁ దమ్ముఁడా. మీవదిన చిత్రసేన కఁబినతల్లికూఁతురు తేజోవతియను యువతి మిక్కిలి చక్కనిది. అదియు నప్సరస్సంజాత పద్మసేనతో సమముగాఁ బెనుపఁబడినది మీతమ్ములలో నెవ్వరికైనఁ బెండ్లిచేయుఁడని నన్ను బద్మసేన గోరి నది. అందులకై యాయిందువదన నిందు దీసికొనివచ్చితిని. మన తమ్ము లిరువురు తరుణుల స్వీకరించిరి. నీవే యస్వీకృతదారుండవై యున్నావు. తేజోవతిం బరిగ్రహింపుమని చెప్పెను. ఆమాట కందరు ననుమోదించిరి. నాఁడే యాకొండశిఖరమున వారికి వివాహముఁ గావించిరి. అయ్యుత్సవములతోఁ బ్రొద్దులు పుచ్చుచున్న సమయం బునఁ గన్యాకుబ్జమునకరిగిన దూతలు పటురయంబున నరుదెంచిరాజ దంపతుల సేమముదెలిపి మీరాకకై వారు గడియలు లెక్కపెట్టుచు న్నారు. మావాచకశ్రవణసమయమే ప్రయాణసమయముగాఁ జేయ వలయునని కోరిరి. అనిచెప్పినంతఁ దొందరపడుచు వీరవర్మ యప్పు డే ప్రయాణసన్నాహము గావింపుఁడని యాజ్ఞాపించెను.

అచలమునుండి తెచ్చిన మణికనక వస్తువిశేషము లన్నియు నేనుంగులపై నెక్కించిరి శుద్ధాంత కాంతల నాందోళికా యానముల నధిరోహింపఁజేసిరి. రాజపుత్రులు గుఱ్ఱములెక్కిరి. భేరీ భాంకారాది భూరిధ్వానంబులు భూనభోంతరాళములునిండఁ జతురంగబలముల కోలాహలములు జలధి ధ్వానంబు ననుకరింప మహావైభవముతో బయలుదేరి యెడనెడ శిబిరములువైచి విడియుచుఁ గతిపయ ప్రయా ణంబుల నిజనగరమున కరిగిరి.

గీ. వారిరాక రాక వారిరాశియుఁబోలెఁ
బొంగు చనఁజు లెదురు వోవుటయును
ఆదరించి ప్రేమ నాలింగితులఁజేసి
సేమమడిగి ప్రీతి జెందిరపుడు.

రతిమంజరియుఁ బ్రభావతియు నంతకుఁ బూర్వమే యన్నగరంబుఁ జేరియుండిరప్పుడు

కం. రాకొమరులు వెస నిజభా
ర్యాకరములు గొనఁజుంబోయి రహి మకుటమణుల్
సోకఁగ మ్రొక్కిరి పితృపద
కోకనదంబులకు బంధుకోటుల కెలమిన్.

సౌభాగ్యసుందరియుఁ బ్రహర్షాతిశయంబునఁ గొంతసేపు మేనెఱుంగక యానందాశ్రువులచేఁ బుత్రులశిరంబులు దడుపుచు నక్కునం జేర్చికొని మూర్ధాఘ్రాణంబు సేయుచుఁ గోడండ్రఁ దీవించి తత్తద్వృత్తాంతమంతయు విని వారివారికులశీలనామంబు లడిగిన వీరవర్మ నిరూపించి చూపుచు

సీ. అతలాధిపతి యపత్యం బీ సరోజాక్షి
కడుసాధ్వి నీ పెద్దకొడుకు పత్ని
యిది సుధన్వుని కూర్మి యిల్లాలు కృప వాని
దాచి కాపాడిన ధన్యురాలు
జయదేవుపట్టి ముచ్చటఁబట్టి రాఘవ
ర్ధనునిఁ జేపట్టిన రమణియదియ
జనకు తప్పు సడల్ప జయమల్లుఁ గైకొన్న
దుందుమారుని ముద్దు దుహిత యిదియ.

గీ. పద్మసేనకుఁ జినతల్లి పట్టియీామె
దివ్యగుణధామ తేజోవతీ సునామ
నీదు నైదవ పుత్ర పాణినిగ్రహించె
నమ్మ చూడుము కోడండ్ర నైదుగురను.

అని తెలుపుటయు నామె త్రిలోక సుందరులైన కోడండ్రం బడసితినని మురియుచు వారు దెచ్చిన కనక మణివస్తు విశేషంబులం జూచి యానందించుచుఁ బుత్రులుగావించిన పౌరుష చర్యలు తెలిసి కొని యుబ్బుచుఁ బాతాళలోక విశేషములడిగి నవియే పలుమారలడుగుచు నందుఁబోవుటకుత్సహించుచు నాలోకము కుమారుల స్వాధీనములోనున్నదని గర్వపడుచు సుధన్వుని భార్యల దేవకాంతలఁ గూడఁ ద్రికూటగిరిమధ్యనుండి రప్పింపుఁడని కోరుచు గొన్నిదినము లాత్మజవృత్తాంతశ్రవణ తత్పరయై మహాసంతోషముతో వెళ్లించినది.

తాను నారదుఁడననియు సంసారమాయా విలాసములఁ జిక్కితిననియు నించుకయు దెలిసికొనలేక కుటుంబసక్తయై యొప్పుచుండెను.

అని యెఱింగించి...ఇట్లు చెప్పందొడంగెను.



223వ మజిలీ

## ఉత్తరదిగ్విజయము.

విద్యాసాగరుఁడు కళాభిరాముఁడు హరివర్మసుధర్ముఁడుసులోచనుఁడు వీరేవురు ప్రతాపరుద్రుని తరువాతివారు తాళధ్వజుని కుమారులు వారొకనాఁడు తండ్రి నికటమున కరుదెంచి నమస్కరించి యిట్లనిరి. జనకా! క్షత్రియులకు భుజబలార్జితమైన సంపదల ననుభవించుట యశస్కరము మాయన్న లేవురు పూర్వదిక్కాంతయు జయించుటయేకాక లోకాతీత సౌదర్యంబునం బ్రకాశించు నించుబోఁడులఁ బెండ్లియాడి నిరుపమానమగు విభవముతో నింటికివచ్చిరి.

మే మమ్మహావీరులకు సోదరులము మీకుమారులము నగుట మాకుఁగూడ విజయ యాత్ర సేయవలయునని యభిలాష గలుగుచున్నది. నాలుగు దిక్కులలో నుత్తరదిక్కు మిక్కిలి పెద్దది. అం

దనేక దేశములు ప్రఖ్యాతములగు పర్వతములు ప్రసిద్ధములగు నరణ్యములు నతి పవిత్రమగు పుణ్యక్షేత్రములు పెక్కులు గలిగియున్నవి. తద్దిగ్విజయము సేయ వేడుకగలుగుచున్నది. సెలవిండని కోరిన నవ్వాచు నవ్వసుమతీశుం డిట్లనియె.

వత్సలారా! మీరింకను ధనుర్వేదము బూర్తిఁజేయలేదు. అన్నలు దూర్పుదెసకరిగి మణికాంతా వస్తువాహనములు సంపాదించి కొనివచ్చిరిగదాయని మీరుకూడనట్లేయాపనికిఁ బ్రయత్నించుచున్నారు. ఒకరియదృష్ట మొకరికెన్నఁడును రాఁజాలదు విజయమనునది మాటలతో లేదు. మీయన్నలుపడ్డకష్టములుమరణ ప్రాయములుకావా? వారి పూర్వపుణ్యము శరణ్యమై మర్మములఁ గాపాడినది. అందఱికి నన్ని వేళలు సమముగానడువవు. అదియునుంగాక మీయన్నలు తెచ్చిన ధన మనంతముగా నున్నది పది తరముల దనుక ననుభవించినను దఱుగదు ఇంటికడ సుఖంబుండుఁడని యుపదేశించిన విద్యాసాగరుం డిట్లనియె. తండ్రీ! భ్రాతృవిత్తమున జీవించువా రథములుకారా? మత్తమాతంగ కుంభపాటన దక్షంబగు హర్యక్షంబు క్షుద్రమృగమాంసమున గాసించునా? నిర్వక్రపరాక్రమంబున విజృంభించి చక్రవర్తుల బాదాక్రాంతులఁ గావించి తద్దత్తములగు విత్తముల విత్తములెన్న నీవసుమతియే రాజన్వతియని పేరువంద ననుభవింతుముగాక. అనుజ్ఞ యిందు మాతల్లిగారియాజ్ఞ గైకొని వచ్చితిమని పలికిన నతండు వారి యుద్యమము వారింపజాలక యెట్టకే ననుమతించెను.

వారేవురు వీరవేషముదాల్చి చతురంగ బలములు సేవింప శుభముహూర్తమున నిల్లువెడలి యుత్తరాభిముఖులై పోయిపోయి

సీ. మాళవ నేపాళ మగధ కాశ్మీర కో
సల కురు ప్రముఖ దేశములకరిగి

తదధీశులను బ్రవిదారణంబునఁ గాంది
శీకులఁగావించి చేవమీర
శరణాగతుల నాత్మ శరణాగతులఁజేసి
దురభిమానులనెల్లఁ బరిభవించి
కప్పముల్గట్టి విక్రమగర్వితులకెల్ల
విజయవార్తలఁ దెసల్వ్రాలయఁజేసి
గీ. తనివిసనకంత నుత్తరాంతము గనంగ
దలఁచి చతురంగ బలసమేతముగ వెడలి
చనిరి ప్రాలేయనగపరిసర ధరిత్రి
కక్కుమారకు లధిక సాహసముతోడ.

పరమహిమాస్పదంబులగు నయ్యుత్తర దేశారణ్యంబుల సంచరించు చుండ నందలి వాతదోషంబునంజేసి పదాతులు రోగపీడితులై యొక్కరొక్కరుగా నీల్గుచుండిరి. మాతంగంబులు మదమెక్కి మావటీలఁ బరిమార్చుచుండునవి. గుఱ్ఱములు క్రమంబునక్షీణించుచుండెను. ఆదుర్దశంగనిపెట్టి యా రాచకుమారులు జనపదంబులకు మరలఁదలఁచు చున్నంతలో నొకనాఁడొక జంఝూవాతంబు ప్రళయమారుతంబో యన శరవేగముగాఁ బాంసు దూషితమై వీవఁదొడంగినది.

ఆరాజపుత్రులప్పుడు భయపడుచుఁ దమతమ గుఱ్ఱములెక్కి యెక్కడికైన చాటునకుఁ బోవలయునని ప్రయత్నింపుచు భగ్నములైన శిబిరంబులఁ జెల్లాచెదరైన బలంబులఁజూచి పరితపించుచు నిలువఁబోటుగానక నిటునటు తిరుగుచుండ సముద్రతరంగమువలె నొక్క పెద్దగాలితోపువచ్చి వారిని దలయొక చోటునకు గుఱ్ఱములతోఁగూడ నెగయఁజేసినది. అందు

—:విద్యాసాగరుని కథ:—

విద్యాసాగరుండా వాతఘాతంబున వాజివముతోఁగూడఁ జొప్పాకువలె నొకదెసకుఁ గొట్టుకొనిపోవుచుఁ జేతికిందొరికిన వృక్షు

లతాగుల్మాదులఁ జుట్టుకొనినను నాగలేక గుఱ్ఱముపై పోయి పోయి సాయంకాలమునకుఁ బర్వతమువంటి యొకగోడ యడ్డమువచ్చుటయు నొడ్డుతగిలిన యోడవలె నాబాడబంబాగి నేలంబడినది. అంతలో గాలియుఁ జల్లారినది.

విద్యాసాగరుఁడు గుఱ్ఱమునుండి నేల కొఱుగుటచేఁ గొంచము దెబ్బతగిలినది. సవరించుకొనుచు మెల్లనలేచి గుఱ్ఱమున కాయాసము దీర్చి నలుమూలలు సూచెను. చీఁకటులు దెసల నావరించుచుండెను. అప్పుడేమూలనుండి యెంతదూరము వచ్చెనో యతనికిఁ దెలిసికొనుట శక్యముకాలేదు. ఎటుసూచినను మహారణ్యమే కనంబడుచుండెను. తన్నాపినది పాషాణమో పర్వతమో గోడయో తెలియఁబడలేదు. ఏమిచేయుటకుఁ దోచక గుఱ్ఱపుజీనునకుఁ జేరఁబడి యిట్లుతలఁచెను.

అయ్యో! ఇట్టి యుపద్రవ మెప్పుడును గనివిని యెఱుఁగను. ప్రళయకాలంబున మహావాతంబు బయలుదేరి పర్వతముల దూదిపింజలవలె నెగరగొట్టునని పురాణముల వినియుంటిమి. నేటి కామాట సత్యముగాఁ దోచినది. అబ్బా! ఆగాలివేగము దలంచికొనిన గుండె ఝల్లుమనుచున్నది. నాగుఱ్ఱము మిక్కిలి బలముగలది కావున నింత దూరము పరుగిడఁగలిగినది. ఆయుశ్శేషంబుండఁబట్టి నేనుదానిపై నిలువఁ గలిగితిని లేకున్నఁ జావవలసినదే. మాతమ్ములేమైరో తెలియదు. నేఁటితో మాదిగ్విజయయాత్ర పూర్తియైనది. తండ్రిగారు జెప్పినట్లే యైనది. పులింజూచి నక్క వాతలుపెట్టికొనునట్లుగా మాయన్నలునలె వత్తుమని బయలుదేరితిమి. మంచిప్రాయశ్చిత్తమైనది. దేశాధిపతులంజయించి యింటికిఁబోక యుత్తరదేశారణ్యములఁ జూడవలయునని బుద్ధియేమి టికి బుట్టవలయును? ఈకాంతారములలో నేమియున్నవి? సీ! మే మే పురముగూడ వట్టి మూర్ఖులమైతిమి. కానిమ్ము ఇప్పుడువగచినంబ్రయో జనం బేమి? భగవంతుని సంకల్ప మేమియో తెలియదు. జంతువులకు

స్వతంత్రమేకలిగియున్నచోఁదలచినట్లుజరుగుచునే యుండును. కావున నిఁక దైవముపై నాధారపడవలసినదే స్వప్రయత్నమేమియుఁబ్రయోజనకారికాదు. అని తలంచుచు నారాత్రియెల్ల నిద్దురబోవక పలు విధంబుల దలపోయుచుండెను.

అంతలోఁ బద్మినీకాంతుండు ప్రాగ్గిరికూటశృంగాటకం బధిరోహించెను. అప్పుడతండు కన్నులెత్తినలుమూలలు చూచుచు నోహో! ఇది నేనొక పర్వతమనికొంటిని కోటగోడవలెఁ గనంబడుచున్నది. ఇందు మహారాజులెవ్వరైనఁ గాపురముండిరేమో దీనిద్వారదేశ మెందున్నదియో చూచి లోపలికిఁ బోయెదంగాక అని తలంచుచు దన వాజువము నేదదీరినవెనుక నధిష్టించి యాగోడనంటి యుత్తరముగాఁ గొంతదూరముపోయెను ద్వారదేశము గనంబడలేదు. అటుపైఁ బోవుటకు కంటకలతా గుల్మాదు లాగోడనంటి యల్లుకొని యుండుటచే శక్యమైనదికాదు.

తిరుగా వెనుకకు వచ్చి రెండవదెన గోడననుసరించి కొంతదూరమే పోఁగలిగెను. పిమ్మటఁ బోవశక్యమైనదికాదు వెనుకకు మరలి మొదటి తావునకువచ్చి యాగోడ యుచ్ఛ్రాయము పాటజూచెను. అక్కోట దనగుఱ్ఱము దాటగలదాయని యాలోచించెను. శక్యముగాదని నిశ్చయించి యందుగనంబడిన తెరపిని దనగుఱ్ఱమును నడిపించెను. కొంతదూరము బోవునంతఁ బిమ్మట దారిలేకపోయినది. వెండియు మొదటి చోటునకువచ్చి యచ్చటనే నిలిచి గుఱ్ఱమునుదిగి యందలి ఘాసముచే దానిం దృప్తిపడఁజేసి తానేవియో ఫలములుదిని యాఁకలి యడంచుకొని యాకోటగోడదాటు నుపాయ మాలోచించు చుండెను.

చూడంజూడ నాగోడకొకచోఁ బైరాళ్ళు దొర్లుటచే రెండు బారలమెట్టి గనంబడినది. అందలి కుడ్యోచ్ఛ్రాయము కొలిచికొనిఁ దానిఁ దాటవచ్చునని నిశ్చయించెను. అతని వాజువ ముత్తమజాతి

లక్షణములుగలది. అతనిమనసు ననుసరించి నడుచునది ఱెక్కలుగలది వోలె నెగయఁగలదు.

అతండాతావు గుఱిజూచికొని గుఱ్ఱమెక్కి దూరముగాఁదీసికొని పోయి యందుండి పరుగెత్తించి కళ్లెము పైకిలాగి యాగోడదాటింప నూతచాలక రెండుసారులువెనుకకు మరలవలసివచ్చినది.మూడవ తేప నతండు కళ్లెము బిగ్గరగాలాగి మడమలతో గొట్టుచుఁ బ్రాణములు వోయినను నీమాటు కోటదాటక తప్పదని సంజ్ఞచేయుచు వేగముగాఁ దోలుటయు నాసప్తి తనకున్నశక్తియంతయు జూపి ఱెక్కలుగలది వోలె నెగసి యతికష్టముమీఁద నాగోడపై లంఘించినది.

పాప మాతురంగము రెండునిమషములు మాత్రి మాగోడపై నిలువంబడి వెంటనే లోపలదూకుటచే నలయిక యెక్కువయగుట గిల గిలఁ దన్నుకొని ప్రాణములు వదలినది. దానిపాటుఁజూచి రాజకుమారుఁడు దుఃఖించుచు నయ్యో! యుచ్చైశ్శ్రవంబుతోఁ బ్రతిఘటింపఁ జాలు నాతత్తడి యిట్లు మిత్తిపాలగుటచే నీలోపలఁజేరిన సంతోషము విఫలమైనది. అక్కటా! దుర్ఘటంబగు పనిచేయించినా ప్రాణబంధువుం గోలుపోయితినిగదా? ఆహా యిట్టియుత్తమజాతి వీతి నాకీ జన్మమున లభించునా? నానిమిత్తమై తనశక్తియంతయుంజూపి మిత్తివాతంబడిన యీ జంతువుఋణంబెట్లు తీర్చుకొందును? ఆ మహావాతంబునంబడి కొట్టుకొనివచ్చునపుడు నాకించుకయు నొప్పితగులకుండ వెన్నునంగట్టి కొనికష్టపడి తలపూవు వాడకుండ నన్నిందుఁ దీసికొనివచ్చి కాపాడిన యీపుణ్యాత్మురాలిట్లు సమసినంజూచుచున్న నావంటి కృతఘ్నుండెం దైనంగలఁడా! హా! తురంగరత్నమా! హా! పరమోపకారీ హా! హరి ప్రవరా! నన్నువిడచిపోయితివా!నీప్రాణములర్పించి నాఋణముతీర్చి కొంటివా! యీలోపల నాకేమిపనియుండి నీచే నిట్టి దారుణక్రియ జేయించితిని? నిరర్థకవ్యాపారమున నిన్నుఁబరిమార్చిన నాపాపమెట్లు

బాపికొందును. అనిదానిపయింబడి పెద్దయెలుంగున దుఃఖించుచు నవ
యవయముల ముట్టి ముద్దుపెట్టుకొనుచుఁ జెమ్మటలు వాయవీచుచు
గొంత సేపున్న త్తక్రియల గావించెను. తనకుఁదాన యుపశమించు
కొని మొలలోఁజొనిపియున్నకత్తిచే నందొకగర్తముత్రవ్వి దానినందు
దొర్లించి దానిమేను బూవులచే బూజించి కన్నుల నీరుధారగాఁగారఁ
బూడ్చి వేదికగాఁగట్టి దానిపైఁ దురగాకారముగా గీచిపలురకములఁ
బూవులేరితెచ్చి హరిసహస్రనామములుచ్చరించుచుఁ బూజించి ప్రద
క్షిణ నమస్కారములుగావించి దేవునివలె నర్చించెను.

నాఁడెల్లఫలమైనందినక యుపవాసముండిమఱునాఁడుక్రమ్మఱఁ
బూవులఁబూజించి ధ్యానించి యాకలి యడంగ నేవియోపండ్లుభుజిం
చెను. రాత్రుల నావేదికపై శిరంబిడుకొని యాహరింధ్యానించుచు
నిద్రపోవును. పదిదినంబులట్లు జరిపినంత నొకనాఁడురేయి నతనికలలో
నాహరివరంబు గనంబడి రాజపుత్రా! నీవు నా నిమిత్తమై వగవం
బనిలేదు నాకుత్తమలోకంబుకలిగినది. నీకృతజ్ఞతకు వేలుపులు మెచ్చి
కొనుచున్నారు. నీవిట గదలి పడమరగాఁ బొమ్ము నీకుమేలయ్యెడు
గాక అని చెప్పినది.

అదరిపడిలేచి యాచిన్నవాఁడు కలతెఱంగరసికొని యోహో
నావాహనము మృతిజెందియు నాకుపకారము సేయఁదలంచుచున్నది.
నాజన్మావధిలో దీనిపేరు మఱచువాఁడనా! ఇందుఁబోయిన నాకేదియో
మేలగునఁట తదుపదేశంబు గురూపదేశంబుగాఁ దలంచి పోయి చూచె
దంగాక. అనితలంచి యప్పుడాచుట్టుప్రక్కలనున్న వృక్షులతావిశేషం
బులం బరిశీలించి చూచెను.

కుసుమ కిసలయ ఫలదళ విలసితములగు నందలి పాదపలతా
విశేషముల కాలవాలములు గట్టఁబడి నీరుపెట్టఁబడుచున్నది. అదివఱ
కతండా యాలవాలములనీరు గ్రోలియు ఫలంబులఁదినియుఁ బుష్పం

బులఁ గోసియు శోకావేశంబున దచ్ఛోభావిశేషంబు లేమియు గ్రహింపలేక పోయెను. అప్పుడా యారామ వినోదంబు లతని మానసమున కాశ్చర్యము గలిగించినవి.

ఓహో! ఇదియొక యుద్యానవనము. ఇందలి కుసుమవాసన లపూర్వనాసాపర్వముగావింపుచున్నవి. యేమహారాజో యిందుఁగాపురముండి దీనింగాపాడుచున్నాఁడని తోచుచున్నది. పోయిచూచెదంగాక అనియాలోచించు మెల్లనలేచి యావేదికకు ముమ్మారు ప్రదక్షిణముజేసి పూవులుజల్లి నమస్కరించుచు నటకదలి కుసుమఫలభారసమ్మితరు లతా విశేషములఁజూచుచుఁ బడమరగా గొంత దూరము పోయెను. అక్కడనొక తటాకము మధురజలపూరితమై యతని కాహ్లాదము గలిగించినది.

అతండందు స్నానముజేసియాప్యాయనముగా నీరు గ్రోలిఫలములచే నాకలి యడంచుకొనియందొక చూతవృక్షముక్రిందఁ గూర్చుండి చల్లగాలిసేవింపుచు నందలి విశేషంబులం బరికించుచుండెను.

అప్పుడు పడమరదెస మిక్కిలి దవ్వులో నెవ్వరో గుఱ్ఱమెక్కి తనదెసకు బరువెత్తుకొని వచ్చుచున్నట్లు కనంబడినది. అతండులేచి నిదానించిచూచి యోహో నేనీకోటలో దూకితినని యెఱింగినన్నుఁ బట్టుకొనుటకిట్లు వచ్చుచున్నారు కాబోలు కాచికొని యుండవలసినదే అనియాలోచించి మొలలోనున్న యడిదము సవరించి చూచుచుండెను. దాపునకువచ్చినకొలఁది యావాజివముపైనున్నవారు పురుషులా స్త్రీలా అని యనుమానముగలిగినది. అంతఁబదినిమిషములలో వచ్చి యవ్వాజివ మానృపకుమారునిచేరువ నిలువంబడినది. అందు

గీ. జారుజడ యర్ధచంద్రునిమీరు నుదురు
పెద్దకన్నులు లేగాను ముద్దుమొగము
గబ్బిగుబ్బలు గలిగి చొక్కపు మిటారి
నారి యొప్పారె స్వారి చిన్నారిగతుల.

చ. వలిపపు చీర బంగరు లవంగపుటంచుల పైఁట గాలిచే
దొలఁగ మిటారి గబ్బిచనుదోయి బయల్పడ జేర్చికొంచుఁ బై
వలువ నెలంత వాజువముపైఁదగనిల్చిమె విస్మయంబుతోఁ
గలికి మెఱుంగుచూపు లెసగంగనె నానృపసూతి నయ్యెడన్.

అట్లు కనుంగొని మనంబుహ్వాంగ నయ్యంగన తురంగమంబు డిగ్గ నజికి కలికీ! నీ వెందుండి వచ్చితివి? నీపేరేమి? ఇంతకుమున్నెం దుంటివి? నిన్నుఁజూడ వేడుకగలుగుచున్నది. నీకొఱకే కాఁబోలు నేఁడు నాబాడబము కళ్లెమెంతలాగినను నిలువక నీకడకు లాగికొని వచ్చినది. మామేడకుఁ బోవుదము రమ్ము. నీకు గుఱ్ఱమెక్క పాట వము గలదా? అని యడిగిన మఱియు నాశ్చర్యమందుచు విద్యా సాగరుండిట్లు తలంచెను.

ఆహా! ఈమోహనాంగి నన్నంగనగాఁ దలంచి కలికీ యని పిలుచుచు సిగ్గువిడిచి మెలంగుచున్నది. కానిమ్ము అందులకుఁదగినట్లే యుత్తరముజెప్పెదంగాక అని తలంచి పొలతీ! నాతెఱఁగవ్వలఁ జెప్పెదంగాక ముందుగా నీయుదంత మెఱింగింపవలయును. నీపేరేమి? ఎవ్వని కూఁతురవు? నీకుఁ బెండ్లియైనదియా? ఈమహారణ్యమధ్యంబున నేమిటికి వసించితివి? అని యడిగిన నప్పడంతి యిట్లనియె.

చెలీ! నీ వడిగినమాటలేమియు నాకుఁదెలిసినవి కావు. నా పేరు పద్మదర్వర యందురు. నాసఖురాండ్రిందున్నారు రమ్ము. నీమాటలకు వారు సమాధానము చెప్పువారు. ఈవాజువ మెక్కుము పోవుదమని పలికిన నతం డనుమోదించెను. ఆమె ముందెక్కి యతని నెక్కించి కొని తన నడుము బట్టుకొనుమని యుపాయము చెప్పినది. అతండట్లు చేసి తదంగస్పర్శంబున మేనం బులకలుద్భవిల్ల నోహో యీహరిణా క్షికి స్త్రీ పుం వివక్ష తెలియదాయేమి? కానిమ్ము. ఏమిచేయునో చూచెదంగాక అని యాలోచించుచుండ నవ్వేదండగమన రమణీ!

గుఱ్ఱమును వడిగాఁ దోలవచ్చునా భయములేదుగద అని యడిగినది. అతఁడు నవ్వుచు నీయిష్టమువచ్చినంతవడిగా నడిపింపుము నా కేమియు వెఱపులేదని యుత్తరమిచ్చెను.
అప్పు డప్పడఁతి మడమలతో నించుక సూచించినంత నాహయం బతి రయంబునఁ బరుగిడఁదొడంగినది. కొంతదూర మేగునప్పటికిఁ గొందరు సుందరు లెదురుగాఁ బరుగెత్తుకొనివచ్చుచుండిరి. లలనా! నిలు నిలు నిన్నీ వాఱువ మెంతదూరము లాగికొనిపోయినది? అయ్యో నీవు పడితి వేమో యని యడలుచుంటిమి. నీజాడఁ దెలియక సఖులు నలుమూలలకుఁ బరుగిడిపోయిరి. నీవెనుకఁ గూర్చున్న జవ్వని యెవ్వతె? మన కోటలోని కెట్లువచ్చినది? అని యడిగిన నాపఁడుమద్వర యి ట్లనియె.

బోటులారా! నా ఘోటక మింతవిపరీతముగా నెప్పుడును లాగికొనిపోలేదు. ఖలీన మెంతలాగినను నిలిచినదికాదు. ఈచిన్నది యెవ్వతియో నాకునుం దెలియదు. ఈకిసలయపాణి యొక రసాల పాదపమునీడ గూర్చుండఁ నా బాడబమీచేడియ సనీడమునకుఁ దీసికొనిపోయి నిలువంబడినది. ఈమె నన్నేదియో యడిగినదికాని నా కేమియుం దెలిసినదికాదు. అంతయు నాసఖులు వక్కాణింతురు రా. రమ్మని గుఱ్ఱమెక్కించి తీసికొనివచ్చితిని. మీరు వేగరండు. మాటాడుదురుగాక. అని చెప్పి యప్పడఁతి గుఱ్ఱమును దోలినది. గడియలో నాహయంబు గమ్యస్థానము జేరినది అందు,

సీ. నానాప్రసూనప్రతానసీ కమనీయ
కాయమానాఢ్యప్రఘాణకంబు
నవరత్నఘటిత సుందరకవాటద్వార
దేహళీకుడ్య సందీపితంబు
శుకపికోత్క్రోశ సంశోభితమణిభర్మ
పంజరాఢ్యకపోత పాలికంబు

సుకులీనచటుల ఘోటకఖురస్ఫుటిత భూ
రచితాస్తరణమందురాయుతంబు
గీ. మణిరుచిభ్రాజితానేక మంటపంబు
కాంచనాభ్రంలిహాంచితాగ్రప్రకాశ
మగు మహాసౌధవరమొక్క డతనికందు
భ్రాంతిగలిగించె నవ్వైజయంతమనఁగ.

అత్తురంగము మా మేడముంగలి ద్రాక్షపందిరికడ కరిగి నిలువం బడినంతఁ బెక్కండ్రు తరుణు లరుదెంచి రందుఁగొందఱుకళ్లెము పట్టుకొనిరి. కొందఱు కై దండలిచ్చి యచ్చిగురుఁబోఁడిం దింపిరి. కొందఱు పాదుకలు దొడిగిరి. కొందఱు వింజామరల వీచిరి. కొందఱు క్రొత్త పుట్టంబుల గట్టించిరి. ఇట్లు సఖుఉపచారంబులఁ గావింపుచుండ నంది కొనుచు నారాజకుమారుని కై దండగొని సఖీ! వీరందఱు నాసఖురాండ్రే. మనము మేడమీదకుఁ బోవుదము రమ్మా. పాపము నీవు బడలియుంటివి. భుజించి విశ్రమింతువుగాక యని పలుకుచుఁ నక్కలికి జిటికనవ్రేలుఁ బట్టికొని యతని మేడమీఁదికిఁ దీసికొనిపోయినది. ఆమె సఖురాండ్రందఱు నతని వింతగాఁ జూడఁదొడంగిరి.

విద్యాసాగరుఁ డాస్త్రీమండలమునుజూచి యాశ్చర్యమందుచు నయ్యారే! ఈతొయ్యలుల చరిత్రము కడు విచిత్రముగా నున్నది. వీరందఱు నన్ను స్త్రీఁగానే భావించుచున్నారు. కారణము తెలియదు. వీరికి నెనట్లగుపడుచున్నానేమో పరిశీలించెదంగాక అని తన్నుఁజూచుకొని తనరూపమున మార్పేమియుఁ గానక వారే పొరపడుచున్నారని నిశ్చయించెను. మఱియు నందున్న స్త్రీలకందఱకు నా సుందరియే యధికురాలని తెలిసికొని యాత్మగతంబుననిట్లుతలంచెను.

ఆహా! ఇది యింద్రజాలమో స్వప్నమో భ్రాంతియో కావలయును. ఇందున్నవారందఱు నన్ను స్త్రీగానే సంబోధించుచున్నారు.

ఒకవేళ నే నిట్టునివలెఁ గలిక్కినైతినేమో యనికొనిన నదియుం గాను పింపదు. ఇందుఁ బురుషుండెవ్వఁడు గనంబడఁడు. ప్రమద్వరకు లోక జ్ఞానమున్నట్లు తోఁచదు. తల్లిదండ్రులెవ్వరనినఁ జెప్పలేకపోయినది. ఇది కపటమేమో యనికొనిన నన్నుఁజూచి యిందెవ్వరు నవయవము లఁ గప్పికొనక సిగ్గుపడకున్నారు. మఱికొంత చనువుజేసికొని వీరి వృత్తాంతము తెలిసికొనియెదంగాక యని యాలోచించుచుండెను.

అంతలో మఱికొందఱుకాంత లాశుద్ధాంతమున కరుదెంచి యక్కాంచనగాత్రితో ముచ్చటించుచు నీమె యెవ్వతె? నీకీమెతో మైత్రి యెట్లు కలిసినదని యడిగిన విని ప్రమద్వర యీామెవార్తమీా కిందాక దారిలోఁ జెప్పితినికాదా? ఈమె యెవ్వతెయో నాకునుం దెలియదు. ఈమెంజూచినతోడనే నాకు వేడుక గలిగినది. సఖురాలి గానెంచి తీసుకొనివచ్చితిని. నాకుఁబోలె నీమెకుఁగూడ మీా రూడిగ ములు సేయుచుండుఁడని నియమించినది.

అప్పుడప్పడఁతుకలు తమ కుపాధ్యాయునిగానున్న యొక వృద్ధాంగనయొద్దకుం బోయి క్రొత్తమత్తకాశిని రాక యెఱింగించు టయు నాజరఠ తొందరగా నయ్యంతఃపురమునకు వచ్చి యతనిం జూచి యిట్లనియె.

సుందరీ! నీవెందలిదానవు? ఈకోటలోని కెట్లువచ్చితివి? నీ వృత్తాంతము చెప్పుమని యడిగిన నతండు జిఱునగవుతో నిట్లనియె. అవ్వా! యిందున్నయన్నువలెల్లఁ జిన్నవయసువాండ్రే. వీరిలో నీవా క్కరితవే పెద్దదానవుగాఁ గనంబడుచుంటివి. వీరందఱు నాతోఁ బరి హాసమాడుచున్నారను కొన్నాను. నీవుగూడ నట్లేయడిగితివి? కా నిమ్ము. ముందుగా నాప్రశ్నముల కుత్తరమిమ్ము. తరువాత నాకథఁ జెప్పెదంగాక. ఈమహారణ్యమధ్యంబునఁ బురుష సహాయములేకమీా రందఱు నుండుటకుఁ గారణమేమి? అని యడిగిన నాముసలిది నోరు

మూయుచు మెల్లగా బోటీ! యిందిట్టిమాట పలుకఁగూడదు. చాటునకుఁబోయి మాటాడుకొందము రమ్మని అని చేయిపట్టుకొని యతని నొక విజనప్రదేశమునకుఁ దీసికొనిపోయి కూర్చుండఁబెట్టినది. అతండు వెండియు నిట్లనియె.

అవ్వా! ఇందుఁ బురుషనామోచ్చారణమే పనికి రాదనుచున్నావు. తత్కారణము తెలిసికొన మఱియుఁ దొందరగానున్నది. అది యట్లుండె నీప్రమద్వర తలిదండ్రు లెవ్వరు? ఆమెకు వివాహమైనదియా? మీకందఱకు నీమెయే యేలికయని తోచుచున్నది. ఈమెయేకాక యీమె చెలికత్తియలకుఁ గూడఁ బెండ్లి కానట్లున్నది. మీకథ యెఱింగించి నాకు శ్రోత్రానంద మాపాదింపుమని కోరిన నావృద్ధ తమవృత్తాంత మిట్లు నివేదించినది.

అని యెఱింగించి......తదనంతర వృత్తాంతమిట్లు చెప్పెను.



224 వ మజిలీ.

# ప్రమద్వర కథ.

కాశ్మీరదేశ ముత్తరదేశములలో నెల్ల ధనసంపన్నమని ప్రసిద్ధి వడసినది. ఆదేశమునకు రాజధాని శ్రీనగరము. దాని శ్రీవర్ధనుఁడను రాజు పాలించుచుండెను. కుబేరతుల్యుఁడగు నమ్మహారాజునకుఁ బెద్దకాలము సంతానము కలిగినదికాదు. ఆనృపుని భార్య నిత్యము సావిత్రీపూజ గావించుచుండునది. అద్దేవి ప్రసాదంబునఁ గొంత కాలమున కాభూకాంతున కొక యాఁడుపిల్ల కలిగినది. ఆశిశువుజాతకర్మోత్సవమునకు శ్రీవర్ధనుఁడు తనకు మిత్రులుగానున్న చక్రవర్తులకుఁ బెక్కండ్రకు నాహ్వాన పత్రికలు పంపి రప్పించుకొనియెను. అయ్యుత్సవసమయంబున నమ్మహారాజు కోటిదీనారములు దానధర్మ

ములక్రింద వ్యయపెట్టెను. మహారాజులనెల్ల నధికవ్యయమున కోర్చి గౌరవప్రతిపత్తులతో సత్కరించెను. మఱియు నద్భుత తేజంబునఁ బ్రకాశించు నాబాలికామణికిఁ బ్రిమద్వరయను పేరుబెట్టెను.

క్రమంబున వచ్చిన బంధువులు ప్రభువులు సామంతులు తమ తమ దేశములకుఁ బోయిరి. వసుప్రియుఁడను నేపాళచక్రవర్తి మాత్ర మానృపతి కత్యంతమిత్రుఁడగుట నతని నిర్బంధమున మఱికొన్నిదివసము లందు వసించెను. ఆడుపిల్ల పుట్టినతోడనే తలితండ్రులు దానికి సంబంధము లాలోచించుచుందురు. అందుఁ జక్రవర్తుల బిడ్డలకు దగిన సంబంధము దొరకుట మఱియుఁ గష్టము. శ్రీవర్ధనుం డొకనాఁడు వసుప్రియునితో ముచ్చటించుచు నిట్లనియె.

మిత్రమా! యిప్పుడున్న రాజులలో మనకున్న మైత్రి యవ్యాజమైనది. ఇంటికిఁ బోయెదనని నీవూరక తొందరపడియెదవు. నీకుమారుని బారసాలకువచ్చి నేనాఱుమాసములు వసించితి జ్ఞాపకమున్నదియా? మఱియు నీతో నొకసంగతి ముచ్చటింపఁ దలంచుకొంటిని. అప్పుడే తొందరయేమని ? పరిహాసమాడెదవేమో నాకిప్పటికి డెబ్బదియేండ్లు దాటినవి. నేఁటికిగదా యుత్సవమని పేరుపెట్టి మిమ్ముల నందఱిని రప్పించుకొంటి. నీకుమారునకై దేండ్లున్నవి. నాకు నీతో వియ్యమందవలయునని యభిలాషగానున్నది. ఆమాట నీతోఁ జెప్పుటకు నేటికి గదా నాకధికారము గలిగినది. వివాహమునకిప్పుడే తాంబూలములు పుచ్చుకొందము. అన్నివిధముల మన యిరువురకు సరిపోవును. మనమైత్రి దీన మఱింత బలమగు నీయభిప్రాయమేమనవుఁడు నవ్వుచు నానరేంద్రుఁడిట్లనియె.

వయస్యా! నీయభిలాష నాకానందము గలుగఁజేయుచున్నది, కాని నెలయైన నిండకుండ పెండ్లికిఁ దాంబూలములు బుచ్చికొనిరనిన నొరులు నవ్వకమానరు. అదియట్లుండె. ప్రతిపురుషునకు నేదియో

కొంతపిచ్చి యుండకమానదు. నీవుమంచిసమయములోనే ప్రస్తావము దెచ్చితివి కావున జెప్పెదవినుము. నాకుమారునకుఁ జేసికొనదగిన గుణములుగల కన్య దొరకుట కష్టము. నీకూఁతు నిప్పటినుండియు నట్టిదానిగాఁజేయ దలంపుగలిగియుంటివేని నాకుమారునకుఁ బెండ్లిజేకొనియెదను.

శ్రీవ—నీకోడలి కెట్టిగుణము లుండవలయునో చెప్పు మిప్పటినుండియు శిక్షించి యట్టిదానిగాఁ జేసెదను.

వసు—జనసంఘమందుఁ దిరిగిన కన్యకల నెట్లు శిక్షించినను సంపర్కదోషంబునఁజేసి దుర్గుణము లలవడకమానవు.

శ్రీవ—ప్రత్యేకము పండితుల నుపాధ్యాయులుగా నియమించి కావ్యనాటకాలంకార గ్రంథములుచదివింతును.పతివ్రతాచరిత్రముల బోధింపఁజేయుదును. ఇష్టమున్న సంగీతముగూడఁ జెప్పింతు వలదనిన మానిపింతును. ఏమందువు?

వసు-సరి సరి. మంచిమార్గమే. పురుషులకడఁ గావ్యనాటకాలంకార గ్రంథములు చదివించినచోఁ గన్యకలకు వేరేకామతంత్ర రహస్యము లుపదేశింప నవసరములేదు. బిల్హణచరిత్రము నీవు చదివియుంటివా?

శ్రీవ—స్త్రీలు పురుషులకడఁ జదువఁగూడదనియా, కావ్యములే చదునఁగూడదనియా, నీయభిప్రాయ మేమియో నాకుఁ దెలియకున్నది.

వసు—వయస్యా! నాయభిప్రాయము వినుము. పురుషసహవాసంబునఁ గన్యకలకుఁ గామాది దుర్గుణము లుదయించును. అలవడిన గుణము బోఁగొట్టుకొనుట నరుంధతికిని శక్యముకాదు. పైకి మహాపతివ్రతలవలెఁ దోచుచుందురు కాని మనసుచేతను వ్యభిచరింపని స్త్రీయుండదు. నేను స్త్రీ చిత్తదోషముల బాగుగ నెఱుంగుదును సుందరుఁడైన పురుషుం జూచినప్పుడు స్త్రీకి బుద్ధిమారును..

శ్రీవ—అందుల కేమందువు? స్త్రీలందరు వ్యభిచారిణులనియే

నీయభిప్రాయము ?

వసు—అవును. నందియ మేల ? కాయము చేతఁ గాకున్నను మనసు చేత వ్యభిచరింపని వారుండరని శపథము జేసి చెప్పఁగలను.

శ్రీవ—మఱి నీకుమారున కాఁడుదానం బెండ్లి జేయ వాయేమి?

వసు—అందులకే నీకూఁతు నిప్పటినుండియు శిక్షింపుమని చెప్పుచుంటిని.

శ్రీవ—ఎట్లు శిక్షింపవలయునో నీవే చెప్పుము.

వసు—నాయభిప్రాయము వినుము. కన్య జ్ఞానమువచ్చినది మొదలు భర్తమొగము జూచువఱకుఁ నీనడుమ బురుషుం జూడఁగూడదు. పురుషజాతి యున్నదనికూడఁ గన్యకుఁ దెలుపఁ గూడదు. నీకూఁతు నిగూఢ స్థలంబున నునిచి యిప్పటినుండియు నట్లు శిక్షింతు వేని గోడలిగాఁ జేసికొనియెదను. నాయభిప్రాయము తెలిసినదియా?

శ్రీవ—బళీ. బాగు. నీకోరిక లెస్సగానున్నది. బాలిక పురుషశబ్ద మెట్లు వినకుండును ? తండ్రియు నన్నయుఁ బురుషులుగారా ? వారిం జూడకుండ నెట్లుండును ? అట్లున్నచో లోకజ్ఞాన మేమియుండును ? అట్టిదానిం బెండ్లియాడిన నేమి యానందము ?

వసు—వయస్యా ! నాకున్న యనుభవము నీకులేదు. సహజానురాగముతోఁ గూడిన చేడియంగూడిన వేడుక యనిర్వాచ్యమైనది. పెక్కేల. నీకూఁతు నట్టిదానిగాఁ జేయఁగలిగితివేని నాకుమారునకుఁ జేసికొందను. లేకున్న నీప్రస్తావము కట్టిపెట్టుము.

శ్రీవ—మిత్రమా ! నీయభిప్రాయము వడువున నాబాలికం గాపాడెద. స్త్రీలచేతనైన విద్య చెప్పింపవచ్చునా?

వసు—భాషాభివృద్ధికొరకు జదివింపవలసినదియే కాని పురుషుఁడున్నాఁడను విషయముఁగల గ్రంథములు చదివింపఁగూడదు. సంగీతము చెప్పింపవచ్చును.

శ్రీవ—అట్లైన వినుము. మాదేశములో నుత్తరభాగమున మహారణ్యము గలదు. అందు స్వాదుజలఫలతరు మనోహరంబగు నుప వనం బొండు నందనవనంబునుబోలి యొప్పుచున్నది. అవ్వనంబుజుట్టును బ్రహారిఁబెట్టించి యావనము వచ్చుదనుక నాపుత్రిక నందుంచి సమ ప్రాయముగలకన్యకలనూర్వురతోఁబోషింపించెదను. అనుమతింతువా?

వసు—(చెవిలో నేదియోచెప్పి) అట్లు చేయుము. దానివలనఁ బ్రమాదమేమియు జరుగదు. అని చేయఁదగిన నియమములన్నియు బోధించెను. వసుప్రియుఁ డంగీకరించి యట్టి యేర్పాటుఁ గావించెను. మహారణ్యమధ్యమందున్న యావనముచుట్టు పెద్దగోడ పెట్టించి పడమ రదెస నొక్కటే సింహద్వార మేర్పరచెను. ఇందనేక విచిత్రభవ నముల నిర్మింపఁజేసెను.

ప్రమద్వరకు మూఁడేండ్లు దాటినతోడనే నూర్వుర ధాత్రే యుల దాసీసహస్రముల సమప్రాయము గలబాలికల వేయిమంది సహా యముగానిచ్చి చేయవలసిన కృత్యములన్నియుఁ బోధించి వీరందఱకుఁ జదువుచెప్పునట్లు నన్నుపాధ్యాయినిగా నియమించి యిందుఁజేర్పిం చెను. ఇందున్న జవరాండ్రందఱు నామెతోఁ బెరిగినవారే. తలి దండ్రుల నెఱుంగనివారే. పెద్దదాసీలందరు దేశమునకుఁ బంపఁబడిరి సంవత్సరమున కొకసారి శ్రీనగరమునుండి శ్రీవర్ధనుఁడు సంభారములఁ బంపుచుండును. స్త్రీలే తీసుకొనివత్తురు.

ఈవార్తలన్నియు నెఱింగినదాన నేనొక్కరితనే యిందుంటిని. తక్కినవారి కెవ్వరికి నీరహస్యము తెలియదు. శ్రీవర్ధనుఁడు వసుప్రి యుని యుపదేశంబున నీప్రాంతమందున్న యొక మహాయోగి నాశ్ర యించి యేవియో వరములు వడసి వచ్చెనఁట. దానంజేసి మాకు వ్యాఘ్రులవలన మృగములవలనఁ జోరులవలన బాధగలుగుటలేదు. ప్రమద్వర సంప్రాప్తయౌవనయై యున్నది. వసుప్రియుని కుమారుఁ

చును నీసుకుమారిం బెళ్లియాడుట కుట్రాటలూగు చున్నాడఁట. ముందరి వసంతములో వీరికి వివాహముఁ కాగలదు నీవు క్రొత్తదానవు గావున నింత చెప్పవలసి వచ్చినది.

మఱియు నీరాక మాకాశ్చర్యము గలిగించుచున్నది. మాకోట సింహద్వార మెప్పుడు మూయఁబడియుండును. నాసెలవులేనిదే తెఱచుటకు వీలులేదు. నీవిందుల కెట్లువచ్చితివో నీవృత్తాంతము చెప్పవలసియున్నది. మా రాజపుత్రికకు నీయందింత ప్రేమ యెట్లుకలిగినదియో! యెఱింగింపుమని యడిగిన నతండు వెండియుఁ దనయవయవములు చూచుకొని పురుషుఁడుగానే యుండుట దెలిసికొని ఔరా! "ఇంతకథ జెప్పిన యీముసలిదికూడ నన్నాఁడుదానిగానే సంబోధించినది. కానిమ్ము. ఇదియునుపకారమైనది. నేనుగూడఁ గపటముగానే మాట్లాడెదనని తలంచి" యామెకిట్లనియె.

అవ్వా! నారాక మీకు విచిత్రము కలుగఁజేయకమానదు. మాది దక్షిణదేశము. నేను క్షత్రియవంశంబున జనించితిని. అశ్వారోహణాది వీరధర్మముల నాకు మిక్కిలి పాండిత్యము కుదిరినది. నేను తురగమెక్కి దేశసంచారముచేయుచుఁ బెక్కుదేశములుతిరిగి తిరిగి దైవప్రేరణంబున నీయరణ్యంబున కరుదెంచితిని. ఇందు మీకోట గోడ గనంబడినది.

ఉచ్చైశ్శ్రవస్తుల్యమగు నాఘోటకము లంఘనపాటవంబున నన్నీ కోటలోఁ బ్రవేశపెట్టి తానునాకమున కరిగినది. తరువాత మీ రాజకుమార్తె గనంబడి తీసికొనివచ్చినదని తత్సమయోచితములగు మాటలచే నామె సందియమును వోగొట్టెను. ఆవృద్ధ తల్లంఘన ప్రౌఢిమకు వెఱఁగుజెందుచు సుందరీ! నీకింకను వివాహముకాలేదా! ఈతొలిప్రాయంబున దేశయాత్ర సేయుచుంటివేమి? రాచవారికిది తగునా? బంధువు లాక్షేపింపలేదా? అని యడిగిన నతండిట్లనియె.

అవ్వా ! నీయెఱుంగని ధర్మములుండవు. స్త్రీలకు గోటలూ పగడ్తలు శుద్ధాంతములు వస్త్రములు ఆవరణములుకావు. వృత్తమే యావరణమని చెప్పఁబడియున్నది. వసుప్రియునకుఁబురుషశబ్దమేవినని కన్యకం గోడలిగాఁ జేయుతలంపు గలిగినది. నాకు దేశసంచారము జేసి యాత్మేచ్ఛావిహారంబునం బెండ్లియాడువలయునని బుద్ధిపుట్టినది. ఇట్లే లోకులకు భిన్నాభిప్రాయములు గలిగియుండును. నే నింకను వివాహమాడలేదు. మీరాజపుత్రికతో మైత్రి గలిసినదికాదా. సజ్జనసహవాసంబు శోభనంబులఁ గూర్పకమానదు. ఆమెతో నేను వివాహమాడెదనని యుత్తరముచెప్పెను.

ఆమాటలువిని యావృద్ధ ముద్దియా నీసుద్దులువినినఁ బెద్దయు జదివినదానివలెఁ గనంబడుచుంటివి. నీకు లోకజ్ఞానము లెస్సగా నుండును. మారాజపుత్రికడ నెన్నఁడును బురుషచర్యాప్రసంగము తేవలదుసుమీ. ఈమాటయే జ్ఞాపకముంచుకొనవలయునని చెప్పు చుండఁగనే యొక పరిచారిక వచ్చి అవ్వా! ప్రమద్వర యుప్పరిగపైఁ గూర్చుండి సంగీతము వినుచున్నది. ఆమె పేరేమియో నాకుఁ దెలి యదు క్రొత్తగా వచ్చినదఁటకాదా! ఆమెను వేగముగాఁ దీసికొని రమ్మన్నది. అనిచెప్పిన విని వృద్ధకొమ్మా! పదపద ప్రమద్వర నీకొఱకుఁ వేచియున్నదట మఱచితివైన నామాట పలుకకుమీ యని యుప దేశించిన వల్లెయని యతండు పరిచారికవెంట మేడమీఁదికిబోయెను.

అతనింజూచి ప్రమద్వర తటాలునఁ బీఠమునుండిలేచి నాలు గడుగులెదురువచ్చి చేయిపట్టుకొని తనప్రక్కపీఠముపైఁ గూర్చుండఁ బెట్టుకొని సఖీ! మాయుపాధ్యాయిని వృద్ధాంగనం జూచితివా? మాట్లాడితివా? నీకుఁ దగిన సమాధానమిచ్చినదా? అని యడిగిన నతండు చూచితిని. మాటాడితిని. నీయుపాధ్యాయిని మంచితెలివి గలదని యుత్తరము జెప్పెను. అప్పు డప్పడఁతి యతని రంజింపఁద

లంచి కొంతసేపు సఖులచే వీణమీఁద బాడించినది. తానును గొంత సేపు పాడినది. రాజపుత్రుఁ డందలిలోపంబు లుగ్గడించుటయు వెఱఁగు పడుచుండ నాబిడ బోఁటి! నీవు లెస్సగాఁ బాడఁగలవని తోఁచు చున్నది. ఏదీ యీవీణనందుకొని మంచిరాగము లాలాపింపుము అని యొకవీణ నతని చేంత నునిపించినది.

అతండావీణయందలి లోపంబులం దెలుపుచు మెట్ల సవరించి చీలల బాగుఁజేసి తంత్రులఁ బ్రయోగించి మెఱుఁగు దుడిచి యద్భుతముగా మేలగించి మహామోహాజనకంబులగు రాగంబులం బాడి యందుఁగల చేడియలనెల్లఁ బరవశలం గావించెను.

వైణికమహామహోపాధ్యాయుఁడని బిరుదునొందిన నారద మహర్షి రూపాంతరయగు సౌభాగ్యసుందరిచే శిక్షింపఁబడిన విద్యా సాగరుని వీణాగానము విని యందలికాంతలు మోహాక్రాంతస్వాం తలైరనుట యబ్బురముకాదు. తద్గాన మభూతపూర్వము, అశ్రుత పూర్వమునగుట నెట్టివారిని రాగవ్యాప్తులం జేయకమానదు.

ఆగానము విని ప్రమద్వర లేచి గంతులువైచుచు నతని గౌఁగ లించుకొని మోము ముద్దుపెట్టుకొనుచు ముద్దియా నీ వీగాన మెందు నేర్చికొంటివి? నాచే నిట్లు పాడింపఁగలవా? ఏదీ ఆమోహానరాగము మఱియొకసారి పాడుము అని సంభ్రమమోద్వేగంబున మీఁదఁబడిగడ్డ ముబట్టికొని బ్రతిమాలుకొనియెను. అత్తఱి నతని చిత్త మెట్లుండునో విమర్శింపవలసియున్నది. క్రొత్తది, యౌవనవతి, రూపవతి, విద్యా వతి యగుయువతి వచ్చి పైఁబడిన యప్పుడు కుసుమశరాసనవిలాస లాలసుండుగాకుండుట కతండు శుకుఁడా భీష్ముఁడా హనుమంతుఁడా? ఆమె దేహసంపర్కంబున నతనికిని నతని దేహసంపర్కంబున నామె కును ననిర్వాచ్యమైన యానందముతోఁ గ్రొత్తవికారములు చిత్తం బులం బొడసూపినవి.

అతం డామెపాడుమన్న రాగము పాడుచు నేర్పుమన్న గీతమూ నేర్పుచు శృంగారముచిలుకు పలుకులతో నక్కలికిని మరుములుకులఁ బారిం బడనేసెను. అతండు స్త్రీయనియే భావించుచుండియుఁ దదంగ హేళనంబు హృదయంబునఁ గొత్తయనురాగము గలుగఁజేయుచుండ నయ్యండజగమన సంతతము నతనితోఁ గలసిమెలసి వర్తింపుచుండును. ఇరువురకు నొక్కటియే భోజనము ఒకటియే తల్పము ఒక్కటియే యభిలాషగాఁ గొన్ని దినములు గడచినవి. ప్రమద్వర యతనింజూడక గడియ తాళదు. అతనిమాట జెప్పనవసరమేలేదు.

శ్లో. వినోపదేశం సిద్ధోహి కామోనాఖ్యాతశిక్షితః
స్వకాంతా రమణోపాయే కోగురుర్మృగపక్షిణాం.

అంత నొకనాఁటిరేయి యత్తలోదరి యారాజపుత్రునితో నిట్లనియె. పడఁతుకా! ఇది యేమిగొడవ యిదివఱ కిట్టిపని సేసియెఱుంగమే మాబోఁటులీవిద్యయెన్నఁడుం జెప్పిరి కారేమి? వాండ్ర కిది తెలియదా? ఇది మిక్కిలి వినోదము గలుగఁ జేయుచున్నది చుమీ! అని పొగడుచుఁ దత్క్రీడావిశేషములచేఁ దన్మయత్వము నొందినది.

అందున్నవారిలో నొక్కవృద్ధతక్క తక్కిన కన్యకలందరు ప్రమద్వరవలెనే శిశుతనంబుననె యందుఁ జేర్పఁబడినవారగుటయుఁ బురుషోపసృత్తముల నేమియు నెఱుంగరు. అనుదినప్రవర్ధమానరాగాభివృద్ధితోఁ బ్రమద్వర తత్కేళీవినోదములం జొక్కుచుండ నొక్కనాఁడక్కుమారుం డామె కిట్లనియె.

రాజపుత్రుఁడు—ప్రేయసీ! మనకేళీవిశేషము లెన్నఁడును మీయుపాధ్యాయినితోఁ జెప్పకుమీ!

ప్రమద్వర—చెప్పినం దప్పేమి?

రాజ—చెప్పకుండ నుండలేవా!

ప్రమ—ఉండలేను. నన్నామెయు మందలించదు. దీనిలో

నేమి తప్పున్నది?

రాజ—లేదు లే, పోనిమ్ము నీతలిదండ్రు లెందున్నారు?

ప్రమ—తలిదండ్రులనఁగా

రాజ—నిన్నుఁ గన్నవారు

ప్రమ—కనుట యన నేమి?

రాజ—మీయుపాధ్యాయి నడుగుము

ప్రమ—అడిగిననునామెలోకరహస్యము లేవియు నాకుఁజెప్పదు.

రాజ—నేనువచ్చిచాలదినములైనదిపోయివచ్చెద ననుజ్ఞయిమ్ము.

ప్రమ—ఎక్కడికిఁ బోవుదువు?

రాజ—ఎక్కడనుండివచ్చితినో అక్కడికి.

ప్రమ—ఆమాటలేవియు నాకు దెలియవు. నీవులేకున్న నిమిషము జీవింపనని యెఱుంగుము.

ఆమె ముగ్ధత్వంబున కతండు నవ్వుకొనుచుఁ గొన్నిదినంబులు మోహసాగరమున మునింగి తేలుచుండును. ఒకనాఁ డావృద్ధాంగన మేడమీఁద కరుదెంచి తొలుత రాజపుత్రుం గాంచి కాంచనగాత్రీ! నీచరిత్రము కడువిచిత్రముగా నున్నది. మాప్రమద్వర నీకతంబున మాతో ముచ్చటించుట మానినది. అంతకుమున్ను నిత్యము నన్నొకసారిచూడక మానునదికాదు. నీవు వచ్చినదిమొదలు నన్నుఁజూడక పోవుటయేకాక వాహ్యాళి మానినదఁట. బయటకురాదఁట, వనవిహారముసేయదఁట. సంతతము నంతఃపురములోనుండి నీతో ముచ్చటించు చుండునఁట. ఇతర కన్యకలతోఁగూడఁ తిన్నగా మాటాడదని చెప్పుచున్నరు. నీవామెతో వింతమాటల లేమైనఁ జెప్పలేదుగదా? అని యడిగిన నతండు నవ్వుచు నవ్వా! ఆమాటలు నన్నడుగనేల? ఏమి చెప్పితినో ప్రమద్వరనే యడుగుమని యుత్తరమిచ్చెను.

అప్పుడు ప్రమద్వర లోపలిగృహంబునఁ బండుకొనియున్నదని

విని యావృద్ధ మెల్లగా నామెయున్న గదిలోనికింబోయి మంచముపై గూర్చుండి, అమ్మా! ప్రమద్వరా! పండుకొంటివేల? నీయొడలిలో నారోగ్యముగా నున్నదియా? అని మీదఁ జేయివైచి రాచుచు నడిగిన నదరిపడిలేచి యాచిగురుఁబోఁడికన్నులు నులిమికొనుచునామెకు నమస్కరించి కడుపులో వికారముగానుండ నిప్పుడే పండుకొంటి నీవు వచ్చి యెంతసేపైనది? అయ్యో! తెలిసికొనలేక పోయితినే అని పలికిన నామె కావృద్ధ యిట్లనియె.

పుత్రీ! నీకిప్పుడు నాతోఁ బనియేమున్నది? క్రొత్తస్నేహితులు వచ్చి ముచ్చటింపుచుండఁ బాతవారిమాట జ్ఞాపకముండునా? పది దినములనుండి నిన్నుఁ జూడవలయునని తలంచుచు నీమేడ లెక్కలేక యిప్పటి కతికష్టముమీద వచ్చితిని. నీవు నన్నెప్పుడైన నిన్నినాళ్లు చూడకుండనుంటివా? క్రొత్తగాడవలోఁ బడిపోయితివి. పోనిమ్మ, వికారమేమి? ఏదీ! వెలుఁగునకుఁ రా? బరీక్షింతు నని పలుకుచు ద్వారము దాపునకుఁ దీసికొనిపోయి పరిశీలించినది.

గీ॥ మోము తెల్లనయ్యె ముగుదకుఁ బాలిండ్లు
వలములయ్యెఁ గొనలు నలుపుఁజెందె
మేనికాంతి వింతమెఱసెఁ బిరుందులు
బలసె నడల మాంద్య మలరె నతికి॥

ఆలక్షణంబులు బరీక్షించి యావృద్ధ యుదరముపైఁ జేయివైచికొని, అమ్మయ్యో! కొంపమునిఁగినది. ఆక్రొత్త మగువ మగవాడు కాఁబోలు. నాఁడురూపునవచ్చి యిచ్చిగురుఁబోఁడిని మోసపుచ్చె. అక్కటా! నేనేమి సేయుదును? ఈవార్తవినిన రాజు నాకు శిరచ్ఛేదము సేయింపఁడా? ముందునెలలో వివాహముహూర్త ముంచితిమని నిన్ననే శ్రీవర్ధనుఁడు వార్తనంపియున్నాఁడు. అని పలుకుచు గుభాలున నేలంబడి మూర్ఛవోయినది. ఆవార్తవిని పరిజనులంతయు వచ్చి,

మూఁగికొని వెఱపుతో నుపచారములు సేయుచుండిరి.

ప్రిమద్వర కారణము తెలియక తెల్లబోయిచూచుచు నవ్వా! అట్లు పరితపించితి వేమిటికి? నాయొడలిలో దోష మేమియును లేదు. ఊరక పండుకొంటి. వెఱఁపులేదు. లెమ్మ్మ. లెమ్మ్మ అని పిలచిన నామె యెట్టకేలకు లేచి యాప్రియాలు చూలాలగుట నిశ్చయించి ముక్కుపై వ్రేలిడికొని యారా! ఆమహారాజు గ్రామములోనుంచినఁ బురుష సంపర్కంబు గలుగునని మహారణ్యమధ్యంబున నిడి సంరక్షింపుచుండ నిట్లు జరిగినగా! సెబాసు! నేనీవార్త రాజునకుఁ దెలయఁజేయక తప్పదు. అతండేవచ్చి వీని శిక్షించుగాక. అని ధ్యానించుచుఁ గన్నుల నీరుగార్చుచుండ బ్రిమద్వరయు నితరకన్యకలు తత్కారణము జెప్పు మని గుచ్చిగుచ్చి యడుగఁ దొడంగిరి.

అప్పుడా ముసలిది రాజపుత్రిక నేకాంతస్థలంబునకుఁ దీసికొని పోయి అమ్మా! నిన్నొక్కమాట టడిగెదను జెప్పుము. ఆకొత్తదియు నీవు నేకశయ్యయందుఁ బండుకొనుచుంటిరిగదా? అప్పుడది యేమిచేయు చున్నదియో నిజము చెప్పు మని యడిగినఁ బ్రిమద్వరఁ అవ్వా! నా కది యేమియు హానిచేయుటలేదు. నీతోడు. వేడుకలు గలుగఁజేయు చున్నది. అని యదార్థమంతయుఁ దెలియ జేసినది. ముసలిది యా మాటలువిని కోపస్ఫురితాధరయై నీకు లోకజ్ఞానము లేకపోవుటయు ముప్పునకే కారణమైనదని కసరుచు వెంటనే రాజపుత్రునొద్దకుం బోయి చురచురం జూచుచుఁ దులవా! నీవెట్టిపని సేయుచుంటివి? ఆఁడుదానవని చెప్పి యంతఃపురద్రోహము సేయుదువా? నీగుట్టు బయలు బెట్టి నిన్నేమిచేయింతునో చూడుమని యదలించిన నతండు నవ్వుచు నిట్లనియె.

అవ్వా! నేనాఁడుదానవని నీతోఁ జెప్పితినా? మగవాఁడనని చెప్పితినా? మీరే నన్నాఁడుదానిగాఁ జేసితిరి. ఇప్పుడుమాత్రము

నేనాఁడుదాననుగాక మగవాఁడ నెట్లగుదును? మీరంత తెలియని వారా? విమర్శించి మాట్లాడుమని యుత్తరమిచ్చెను. నీవు పైకాఁడు దానివలెనే కనంబడుచుంటివి. తక్కినవిషయ మెవ్వరెఱుంగుదురు? ఎట్లైననేమి? యిప్పుడు నాశిరచ్ఛేదము కాఁగలదు. ఈభారమంతయు నాశిరంబునఁ బెట్టి యారాజు దూరమందున్నవాఁడు. ఇప్పుడు నేనేమి చేయఁదగినది? ప్రమద్వర గర్భవతి యైనది. అక్కడ పెండ్లి ప్రయత్నములు సేయుచున్నారు. ఈవార్తవినిన నాయిద్దరి చక్రవర్తుల మనోరథములు వ్యర్థములై పోవునుగదా! వారిక్కడికి వచ్చి యపరాధులఁ దండింపకుందురా? అని కినుకతో శోకముతో విస్మయముతో నేమేమో పలికినవిని యతం డిట్లనియె.

అవ్వా! నీవిప్పు డీవార్త మారాజునకుఁ దెలియఁజేయుము. అతండువచ్చి పరీక్షించుఁగాక. నేనాడుదాననైతినా నాదోషము లేదుగదా. మగవాఁడనైతినేని యప్పటికిఁ దగినట్లు చేయఁగలవాఁడ. ఇందులకు చింతయెందులకు? అనుటయు నాయవ్వ ఔను నీవెంత వాఁడవు గాకున్న నీశుద్ధాంతమునకువచ్చి పగలెల్ల నాఁడుదానవై రాతిరి మగవాఁడ వగుదువా? మారాజపుత్రిక నాతో నిజముచెప్పినది. నీబొంకులు నిలువవు. కానిమ్ము. ఆరాజువచ్చి యడిగిన నిట్లే చెప్పుము. అని బెదరించుచు నప్పుడే యొక పత్రికవ్రాసి కోటతలుపులు తీయించి యవ్వల నిగూఢముగానున్న భటునిచే నాపత్రిక శ్రీవర్ధనునొద్ద కనిపినది.

ప్రమద్వర, ముసలిది తన నెచ్చెలితోఁ గలహించుచున్నదని విని సఖుంతో నచ్చటికిఁబోయి అవ్వా! నీతగవేమియో నాకుఁ దెలియకున్నది? ఆమెతోఁ బోట్లాడుచుంటివఁట ఏమిటికి? ఆమె ఏమితప్పు జేసినది. నీగొడవ యేమియో నాఁకుదెలియదు. చెప్పుమన్న జెప్పవు? నేనేమి జేయుదును? అని యడిగిన ముసలిది అంతయు నీకు నాలుగు

దినములలోఁ దెలియఁగలదు, పొమ్ము. మేడమీఁదకుఁ బొమ్మని యలుకతో నుత్తరము జెప్పినది.

ప్రమద్వర యతని చేయిపట్టుకొని సఖీ! రమ్ము రమ్ము. ఈ ముసలిదాని మాటలు లెక్కసేసికొనకుము. మేడమీఁదకుబోయి సంగీతము పాడుకొందము. రమ్మని పలుకుచుఁ దీసికొనిపోయినది.

శ్రీనగరంబున శ్రీవర్ధనుఁడు ముసలిదిపంపిన పత్రికం జదివికొని గుండెలు బాదుకొనుచు నేలంబడి మూర్ఛిల్లెను. నికటమున నున్న యతనిభార్య యాపాటుఁజూచి యడలుచు శైత్యోపచారములు సేసి యెట్టకే దెప్పరిల్లఁజేసినది. అయ్యయో! నాప్రయత్నమంతయు వ్యర్థమైపోయినదిగదా! ఏమిచేయుదును. వివాహముహూర్తము సమీపించుచున్నది. వసుప్రియుఁ డీపెండ్లికిఁ పెద్దప్రయత్నము చేయుచున్నాడు. హా! దైవమా! నాకెట్టి యపకారము గావించితివి? అని యూరక దుఃఖించుచున్నఁ జూచి భార్య యిట్లనియె.

ప్రాణేశ్వరా! బిడ్డదగ్గఱనుండి విపరీతవార్తయేమైనవచ్చినదా? అమ్మాయి కుశలముగ నున్నదియా? వేగము చెప్పుఁడని యడిగిన నతండు కన్నీరు దుడిచికొనుచు నిట్లనియె. ప్రేయసీ! మనుష్యప్రయత్నము లెప్పుడు వృథలు. వృథలు. ప్రమద్వరను బురుషశబ్దము వినకుండ నరణ్యములోఁ గోటలో నునిచి కాపాడుచుంటిని. ప్రమాదమునఁ బురుషు లెవ్వరైన నందు జేరినచో స్త్రీలుగానే కనంబడుచుందునట్లు సిద్ధులవలనఁ వరములందితిని. అదియేముప్పైనది. స్త్రీలుగానే కనంబడుదురనుటకంటె స్త్రీలగునట్లు చేయుమని కోరిన నీప్రమాదము జరుగక పోవును.

గుఱ్ఱముతోఁ గోటదూకి యెక్కడనుండియో రాచకుమార్తె యొకతె లోపలఁబ్రవేశించి ప్రమద్వరతో మైత్రిజేసినదఁట. ఇరువురు నేకశయ్యాగతులై క్రీడించువారఁట. ఇఁకఁ జెప్పవలసిన దేమున్నది?

నీకూఁతురు గర్భవతియైనదఁట. అందున్న ముసలిది వ్రాసినది. అది మగవాఁడు కాదు ఆఁడుదియేయనియు గర్భవతి యగుటకుఁ గారణము తెలియకున్నదనియు యేమేమో వ్రాసినది. ఈవరముమాట దానికి నేనుజెప్పలేము. ఎవ్వఁడో యాకోటలోఁబ్రవేశించెను. వారికి స్త్రీవలెఁ గనంబడియెను. ఆముగ్ధ కేమి తెలియును? ఛీఛీ! వసుప్రియుని మూలమున బంగారమువంటి పుత్రికను భ్రష్టజేసికొంటిని. అయ్యయ్యో! అతం డట్లు చెప్పినంతనే అది వెఱ్ఱి యూహయని యాక్షేపించక ముద్దులపట్టి నై దేండ్లు దాటకమునుపే యడవిపాలు గావించితిని గదా! ఛీ. ఛీ. నావంటిమూర్ఖుం డెందును లేఁడు. లేక లేక గలిగిన బిడ్డకుం దగిన మగనిం దేలేక యొకానొక మూఢునివశము జేసితిని. అని యనేక ప్రకారముల దుఃఖించుచు గోపము పట్టఁజాలక యప్పుడే గుఱ్ఱము నాయత్తపఱుపుండని నియమించి సముచితయోధ పరివృతుండై యాపురుషుం బరిమార్చుటకై యాయరణ్యమున కరిగెను.

క. అనియెఱింగించి యతీశ్వరుఁ
డనుమోదముతోడ సమయమగుటయుజని గో
పునితో నవ్వలి నెలవునఁ
దనరఁగ విడిసెం చెనిటు కథాశేష మొగిన్.



225 వ మజిలీ.

# చిలుకమువ్వలకథ.

ఉత్తరదేశమున దేవకూటమను పర్వతము కూట సముల్లిఖితగగనంబై యొప్పుచున్నది. అన్నగంబున కుత్తరభాగమున గిరివ్రజమను గొప్పపట్టణము యలకాపురసదృశంబై ప్రకాశించుచున్నది. అప్పురంబునకు దేవకూటమే మూడుభాగముల కోటవలె నొప్పుచున్నది. ఆశైలశిఖరమెక్కినవారు పక్షులై యెగిరిపోవుదురని జనశ్రుతి

యుండుటంబట్టి యెన్నఁడును గట్టియలకైన పౌరు లాకొండయెక్కరు. ఎక్కకుండ నధికారులుగూడఁ బెద్దప్రహరి పెట్టించిరి.

సోమదత్తుఁడనురాజు ఆదేశమును ధర్మంబునఁ బాలింపుచుండెను. గోపురద్వారమునఁ గావలియున్న యధికారులయనుమతిలేక చీమకైన నావీటిలోఁ బ్రవేశింపశక్యముకాదు. ఒకనాఁడావీటి నడివీధినుండి

క. పలురంగులపూసల భూ
షల మేనందాల్చి లలిత సమధిక తేజః
కలిత యొక కోయనెలఁతుక
చిలుకం దలదాల్చి ప్రీతి చెలువారంగన్.

మాటలం బలికించి ముద్దువెట్టుకొనుచు బైడిమువ్వగుత్తులుగల తట్టఁ జంక నిడికొని చిలుకమువ్వలు చిలుకమువ్వలో యని కేకలు వెట్టుచు రాజమార్గంబునఁ దిరుగఁజొచ్చినది. పౌరు లాధ్వనివిని దాపునకుం బోయి యాయెలనాగ సోయగమున కచ్చెరవందుచు నీదే కులము? నీ పేరేమి? ఈమువ్వల వెల యెంత? నీ మగఁ డెవ్వఁడు? అని యడిగిన కోయస్వరముతో బాబులార! మేము కోయవారము. కొండవాండ్రకులగోత్రములతో మీకేమి పని? కావలసిన మువ్వలం దీసికొనుఁడు వీనివెల కొంచెమే కాని ఫల మధికముగానుండును. ఈ మువ్వలు గట్టినంత మాటలు రాని చిలుకలైనను వాచాలముగాఁ బలుకఁగలవని యెఱింగించినది.

ఆచిన్నది మాటాడినంజాలునని కొందఱు గోవాల్లుకమకక్కర లేకున్నను మువ్వల బేరమాడి కొనుచుండిరి. కొందఱు మాయింటికి రమ్ము మువ్వలం గొనియెదమని కేకలువేయుచుందురు. చిలుకలున్న వారికేగాని యీమువ్వ లమ్ముటకు మాయజమానుని సెలవులేదు. అని పలుకుచు సందుగొందులకుఁ బిలిచినను బోవక యాకోయత నడివీధింబడి తిరుగుచుండెను.

ఆకాంతను వింతగాఁ జూచుచుఁ బౌరు లూరక మూగి వెను వెంట దిరుగుచుండిరి. సాయంకాలమునకుఁ దట్టలోనున్న మువ్వగుత్తు లన్నియు నమ్మినది. చీఁకటిపడినతోడనే బసలోని కరిగినది. మఱు నాఁడు బయదేరి క్రమ్మఱ నూరంతయుఁ దిరిగి నాఁడు జాము పొద్దువేళకే మువ్వల నమ్మినది.

మూఁడవనాఁడు రెండుజాములకే మువ్వలగుత్తులై పోయినవి. నాలుగుదివసములు లట్లు పట్టణమంతయుఁ దిరిగి మువ్వలమ్ముచుండ నా యండజగమున సోయగము మాటలు చేష్టలు పౌరు లద్భుతముగాఁ జెప్పికొనుచుండిరి. ఆపట్టణప్రభువగు సోమదత్తుని కూఁతురు ప్రఫుల్ల యను చిన్నది మిక్కిలి చక్కనిది. చాల చదివికొన్నది. తొలిప్రా యము లోనున్నది. అప్పడఁతి యెప్పుడును వింతవస్తువులం జూడ వేడుక పడుచుండును.

భద్రిక యను పేరుగల యామెపరిచారిక యొకనాఁడామెకడ కంబోయి దేవీ! ప్రఫుల్లా! మనయూరొక కోయెదివచ్చి చిలుకలకు నగలుగాఁ గట్టదగు మువ్వలగుత్తులమ్ముచున్నది. దానిచక్కదనము నీవు జూచిన మిక్కిలి మెచ్చుకొనియెదవు. తదవయవములన్నియు మొలచినట్లు పోసినట్లు దిద్దినట్లొప్పుచున్నవి. ఆహా!

ఉ. కోయదియంచు దాని ననుకోఁదగదమ్మక చెల్ల! యద్భుత
శ్రీయుతముల్ తదంగములు జేరలుమీరుఁ గనుల్ గళంబు సం
కోయనఁబోల్చుఁ దేనెలొలుకుం బలుకం నగినంత వెన్నెలల్
గాయుఁ గనం గుచద్వయవికాసము మోసము సేయు మానులన్.

అక్కలికిచక్కఁదనం బటుండనిమ్ము. అక్కొమ్మ యమ్ముచున్న పైడిమువ్వలు చిలుకకాలికిం గట్టిన వింతగాఁ బలుకునఁట. మాటలు రాని చిలుకలఁ బలికించునఁట. మనము మొన్న క్రొత్తగాఁగొన్న కొండచిలుక లెస్సగాఁబలుకనేరదు. ఆకోయెతను మన హజారముకడ

నిలిపివచ్చితిని. మనచిలుకం జూపింత మకాకంతం దీసికొనిరానాయని యడుగుటయు నవ్వుచు నారాజపుత్రిక భద్రికా! దీనికింత యుపన్యాసమేల? వేగఁబోయి తీసికొనిరమ్మని యాజ్ఞాపించినది. అది వోయి త్రుటిలో నాకుటిలాలకం దీసికొనివచ్చి రాజపుత్రికముందు నిలిపినది.

ప్రఫుల్ల యప్పల్లవపాణిపోయగ మాపాదమస్తకము విమర్శించి చూచుచు నాశ్చర్యపడి కూర్చుండ నియోగించి,

ప్రఫుల్ల—కోయెతా! నీపేరేమి?

కోయెది—నాపేరు కామాక్షి.

ప్ర—నీకాపుర మేయూరు?

కో—అమ్మా! కొండవాండ్రకు నొకచోఁ గాపురముండునా? అన్నియూళ్ళు మాకాపురములే.

ప్ర—నీకుఁ బెండ్లియైనదియా?

కో—మాకుఁ బెండ్లియేమిటి? మగని వరించుటయే పెండ్లి.

ప్ర—పోనీ నీవు మగని వరించితివా?

కో—ఈచిలుకయే నామగఁడు చిలుకయే దైవము చిలుకమూలముననే యీయేసము. మాకులమునకుఁ జిలుకయే జీవము చిలుకనే వరించితిని.

ప్ర—బోటీ! నీమాటలు మాకుఁ దెలియలేదు. మీకు జిలుకవలన జీవనమంటివి లెస్సయే చిలుక మగఁడెట్లగును?

కో—అమ్మా! కోయమాటలు కొండమాటలుమీకెట్లు తెలియఁగలవు? మగఁడనఁగా నెవ్వఁడు ప్రాణమిచ్చునో వాఁడే మగఁడు. నేను జిలుకను. నాకీచిలుక మగఁడు.

ప్ర—కోయెతా! నీవు నిజముచెప్పక కపటముగా మాట్లాడుచుంటివిగదా.

కో—అమ్మా! కోయవాండ్రకుఁ గపటములు దెలియవు.

మీయింటఁ జిలుకలున్నవఁట చూపుఁడు వేగఁ బోవలయు.

ప్ర—కోయసానీ! కొలదిదినములక్రిందట మేమొక కొండ చిలుకం గొంటిమి. అది పండ్లుతినదు. మాటలాడదు. బెంగబెట్టుకొన్నది కాఁబోలు దానికి మాటలు నేర్పుము నీకు మంచి పారితోషిక మిప్పింతును.

కో—మాముద్దుల(?)ంగొని చిలుకలకుఁ గట్టుటయేమాకుఁబారితోషికము. అమ్మా! ప్రొద్దుపోయినది. ఏదీ! మీచిలుక నిటు తెప్పింపుఁడు. మువ్వగుత్తికట్టి పలికించి పోయెదను.

ప్ర—కలికీ! చిలుకపలుకులకన్న నీపలుకులు విన ముచ్చటగానున్నవి. మాయింటఁ గొన్నిదినములుందువా? నీకు మంచిపుట్టములు వస్తువులు దాల్చ నిప్పింతును.

కో—అమ్మయ్యో! మే మొరులపుట్టములు గట్టము. ఈరే యిందుండిన మాజట్టువాండ్రు శంకింపరా? చీకటిపడువేళ యగుచున్నది. తల్లీ! చిలుకం జూపవా? నేనింటికిఁ బోవలయును.

ప్ర—అబ్బా! సాని! ఊరకపోయెదనని తొందరపడియెదవేల చీఁకటిపడిన సాయమిచ్చి పంపుదునులే. నీతలిదండ్రు లెందున్నవారు! ఇందువచ్చిరా?

కో—ఇంకురాలేదు. వా రేదేశమో పాలించుచున్నారు. ఎందున్నారని చెప్పుదును?

ప్ర—కోయతా! మఱియొకమాట యడిగెదఁ జెప్పుము. మీకులములోని యాఁడువారందఱు నీవలెనే యుందురా?

కో—అమ్మా! ఆమాట నే జెప్పఁగలనా? మీవంగడమువారందరు మీవలె నుందురేమో చెప్పగలరా?

ప్ర—అబ్బో! కోయసాని గడుసుదియే. ఏమోయనుకొంటిని.

కో—అమ్మా! అడవివాండ్రము గడుసుఁదన మెట్లువచ్చును?

ప్ర—నీకుఁ బిల్లలా?

కో—నేనే పిల్లను. నాకేటి పిల్లలు?

ప్ర—నీమగనికి నీయందిష్టమేనా?

కో—ఇష్టముకాకేమి? ఇదిగో నామగఁడు సంతతము నానెత్తిపైనుండును.

ప్ర—ఈచిలుక నమ్మెదవా?

కో—అమ్మా! ఈచిలుక నామగఁడని చెప్పుచుండ నమ్మెదవా యని అడుగవచ్చునా?

ప్ర—సానీ! నీవు నిజము చెప్పక దాచుచున్నావు గదా.

కో—లేదు తల్లీ! లేదు నిజమే చెప్పితిని. ప్రొద్దుపోయినది చిలుకం దెప్పింపవా? పోవలయును.

ప్ర—సానీ! నీ కీతొందర యేల. నీమువ్వలన్నియు నీవు చెప్పిన వెలయిచ్చి నేనే కొనియెదను. నీవు వీనినమ్ముటకై మఱియొక వీధికరుగ నవసరములేదు. పోవలసియున్న రాత్రి భోజనము సేసి పోవుదువుగాని నీమగఁడు నీవెంటనే యున్నాఁడుగదా? ఏవి! నీబుట్టలో నెన్నిమువ్వగుత్తులున్నవియో చూపుము. అన్నియుం దీసికొందుము.

కో—అమ్మా! మీయొద్ద నొక్కచిలుకయే యున్నదఁట. అన్నిగుత్తులు నేమిసేసికొందురు. ఇదిగో యీగుత్తుమాత్రమే మీకిచ్చుచున్నాను. మీరే దానికాలికిం గట్టుఁడు. నేను పోయివచ్చెద.

ప్ర—సరిసరి. అదియా నీయభిప్రాయము. మాయింటఁ జాల చిలుకలున్నవి. ఇవికాక మామంత్రికూఁతురు పినతల్లికూఁతురుగూడఁ జిలుకలం బెంచుచున్నారు. మాకు చాలగుత్తులు కావలసియున్నవి. అన్నియు నీయవలసినదే.

కో—అట్లైన వీనినన్నిటిఁ దీసికొనుఁడు. నాకు సెలవిండు పోయివచ్చెద.

ప్ర — సామ్మెంత యీయవలయునో చెప్పుము.

కో — మీకుఁ దోచినంత యీయుఁడు గోపోపురు. మీకడ బేరములాడుదునా రేపు వెండియువచ్చి సొమ్ము పుచ్చుకొనియెద నీరాత్రి వీనినెల్ల మీ చిలుకలకుఁ గట్టుఁడు.

ప్ర — సానీ! మంచిమాట చెప్పితివి. రేపుపెందలకడ రమ్ము. నీతోఁ జాల ముచ్చటింప వలసియున్నది. నీనిమిత్తము ఈభద్రికనుద్వారము కడ నిలిపెదను. నీవు రేపురాకున్న నీకే నష్టముసుమీ! సొమ్ము చేరదు.

కో — మీకొఱకువత్తునా తల్లీ! ఈరాత్రి మువ్వలఁ జిలుకలకుం గట్టి యెట్లుపలికినదియుఁ బ్రొద్దున జెప్పవలయుంజుడీ. ఇఁక నసుజ్ఞయిండు పోయివచ్చెదనని లేచి బుట్ట జంకనిడుకొని చిలుకను ముద్దాడుచు భద్రిక గోటగుమ్మముదనుక సాగనంపి తప్పక రేపు పొద్దున రమ్మని చెప్పుచుండ వల్లెయని పలుకుచు వీధింబడి పోయి పోయి బాటసారులు నివసించు నూరిబయలునున్న పెద్దసత్రమునకుం జని యందొకగదిలోఁ బ్రవేశించి తననెత్తిపైనున్న చిలుక కేదియో యోషధి తగిలించినది. అది యంతలోఁ జక్కనిపురుషుండై నిలువం బడినది. ఆకోయత తానుగావించిన పనులన్నియు నాపురుషున కెఱింగించుచు నారాత్రిఁ తృటిగా వెళ్ళించినది.

---

226 వ మజిలీ.

# చిలుకపురుషుడైనకథ

కోయది యఱిగినవెనుక రాజపుత్రిక భద్రికతో దానియంద మునుగుఱించి ముచ్చటించుచు మాటలు వర్ణించుచు సాహసము పఖి నందించుచు నిరపేక్షిత్వ మగ్గింపుచుఁ బైడిమువ్వల విమర్శించి అవి కేవలము సువర్ణముతోఁ జేయఁబడినవిగాఁ దెలిసికొని వెల తక్కువగా

వేయుటకు శంకించుచుఁ బలువిధంబుల నాలోచించుచుండెను. మఱియు నాయూర నామెకుఁ గాళిందియు రుక్మవతి యను సఖురాండ్రు రుపురుగలరు. కొన్నిమువ్వగుత్తులిచ్చి భద్రికను వారికడకుఁ బంపుచుఁ గోయదాని వృత్తాంతమంతయుం జెప్పి యామువ్వల వాకుపెంచుచున్న చిలకలకుఁ గట్టమనుము. అది వచ్చువేళకు వారింగూడ నిందు రమ్మనిచెప్పుమని నియమించుటయు భద్రిక మువ్వగుత్తులందీసికొనిపోయి వారికిచ్చి యాపందేశ మెఱింగించినది.

ఈలోపల రాజపుత్రిక కొన్నిమువ్వగుత్తులఁ దీసికొని పంజరమునొద్దకుఁబోయి యందున్న రామచిలుకనీవలకుఁదీసి ముద్దాడుచుఁ గీరరాజమా! నీకలంకారములు గొంటిమి తాల్తువా? ఒకపద్యము పాడుము. నీముద్దుపలుకులు విన వేడుకకలుగుచున్నది. ఎప్పుడు మౌనమే వహింతువు. అని పలుకుచు నామువ్వల మెడకును గాలికినిఁ గట్టుచుండ గుభాలున నాకీరము పురుషుండై నిలువంబడియె. రాజపుత్రిక జడిసికొని అమ్మయ్యో! అని యఱచుచు నేలంబడి మూర్ఛవోయినది.

ఆపురుషుం డాపూఁబోడిపాటు తెలిసికొని నలుమూలలు సూచుచు నయ్యో! ఈచిన్నది యెవ్వతియో తెలియదు. నన్నుఁజూచి వెఱచిపడిపోయినది. నేనిక్కడి కెట్లువచ్చితినో యెఱుఁగను. ఈభవనము శుద్ధాంతమువలె నున్నది. మాసోదరులేమైరి. నేనిద్రబోయితినా. మేమాగిరికూటమెక్కి చెరువులో స్నానముచేసితిమిగదా. తరువాత నేమిజేసితిమో జ్ఞాపకములేదు. ఇది నాకు స్వప్నమా యేమి? నేను కళాభిరాముఁడనే? అంతయు నీకాంత నడిగెదంగాక. అని వితర్కించుచున్నంతఁ నయ్యింతియు నొక్కింతసేపు మైమఱచి యట్టె లేచినది. అభినవమదనుండోయన నొప్పుచున్న యప్పురుషుంజూచి మోహపరవశయై హృదయము దృఢపరచుకొని నమస్కరించుచు నిట్లనియె.

ఆర్యా! మీయాకారముసూడ నుత్తమవంశ సంజాతులవలెఁ గనంబడుచున్నారు. మీరీ చిలుకరూపు ధరించుటకుఁ గారణమేమి? మిమ్మెవ్వరైన శపించిరా? లేక విలాసమున కిట్టిరూపు దాల్చితిరా? కంతువసంతజయంతాదులలో నొక్కరగుదురని తలంచితిని కాని మీ కన్నులుజూడ ననిమిషులుకారని తెలిసికొంటి. మీకులశీలనామాదు లెఱిగించి నాకు శ్రోత్రానందము గావింతురే యని వినయముగా నడిగిన నతం డిట్లనియె.

పడతీ! నావృత్తాంత మిదమిద్ధమని చెప్పుటకు నింకను నాకు బోధపడకున్నది. పిమ్మట జెప్పెదంగాక నీవెవ్వని కూఁతురవు. ఈ గృహ మెవ్వరిది? నేనిక్కడి కెట్లువచ్చితిని. నీ పేరేమి? నీవృత్తాంతము జెప్పుమని యడిగిన నమ్మగున యిట్లనియె. సౌమ్యా! ఈనగరమునకు గిరివ్రజమనిపేరు. మాతండ్రిపేరు సోమదత్తుఁడు. ఆయనయే యీదేశ మునకధికారి. నాపేరు ప్రఫుల్లయంద్రు. ఇది నాయంతఃపురము. రెం డునెలలకిందటఁ గొండవాండ్రు మూడుచిలుకలనమ్మఁదెచ్చిరి. అందు నేనొకటియు నాసఖురాండ్రు కాళిందీ రుక్మవతులిరువురు చెఱియొకటి యు గొనినారము. ముద్దుగాఁ బెనుచుచు మాటలనేర్పుచుంటిమి. నేఁ డొకకోయది పైడిమువ్వలుదెచ్చివీనిఁజిలుకలకుగట్టినగట్టిగామాటాడఁ గలవనిచెప్పియిచ్చిపోయినది. వానింగట్టినంతమీరీరూపముదాల్చితిరి. ఇదియే మీయాగమనవిధానము. తరువాతి వృత్తాంతమునకు మీరే ప్రమాణమని పలికి యూరకున్న నొక్కింతధ్యానించి యతండిట్లనియె.

నాతీ! నేనొక దేశాధిపతి కుమారుండ. నాపేరు గళాభిరాము డందురు. మే మేవురము సోదరుల ముత్తరదిక్కు జయింపబయలు దేరి పెక్కండ్రురాజుల జయించితిమి. ఒకనాఁడొక పెద్దకొండగాలివిసరి గట్టములతోఁగూడ గొట్టుకొనిపోయి యొకకొండయెక్కి యందలి తటాకజలంబులఁ దీర్థమాడితిమి. అది స్వప్నమో నిజమో తెలియ

కున్నది. మాసోదరుల మాట జ్ఞాపకములేదు. అదియొక యింద్రజాల మువలెనున్నది. నావృత్తాంతము నాకు లెస్సగాఁ స్ఫురణకు రాకున్నది. ఈశుకరూపము నాకెట్లువచ్చినదో తెలియదు. నేనాకొండవాని చేతి కెట్లు వచ్చితినో తెలియదు. కోయది యిచ్చిన మువ్వలు గట్టినంతనే నిజరూపముదాల్చుట చిత్రముగానే యున్నది. ఆపుణ్యాత్ము రాలెవ్వతియో తెలిసికొనవలయు. దానియునికి యెందున్నదియో చెప్పుము. పోయి తెలిసికొని వచ్చెదనని యడిగిన నమ్ముదిత ముదితహృదయయై యిట్లనియె.

సౌమ్యా! మీరందుఁ బోనక్కఱలేదు. మాకు మువ్వలిచ్చిపోయిన కోయది రేపుప్రొద్దున యిక్కడికి రాఁగలదు దాని కింకను పీనివెల యీయలేదు. దానివలన మీవృత్తాంతము తెలిసికొనవచ్చును. అంతదనుక భద్రముగా మీరిందు వసింపుఁడు మీ కే కొఱంతయునుండదు. మీరు కళాభిరాములుగదా. అన్నివిధములఁ బూజ్యులే. మాయతిథిసత్కారములఁ గైకొనుఁడని పలుకుచు నపూర్వోపచారములచే నారాధించుచు సుధురాలాపములచే నతనిహృదయము గరుగఁజేసినది. అని యెఱింగించువఱకుఁ గాలాతీతమైనది. తదనంతరోదంత మవ్వలిమజిలీయం దిట్లు చెప్పందొడంగెను.

---

227 వ మజిలీ.

## చిలుకలుగుఱ్ఱములైనకథ.

మఱునాఁ డుదయకాలంబునఁ భద్రిక రాజపుత్రికయొద్దకు వచ్చి భర్తృదారికా! రాత్రి నీదర్శనమే యైనదికాదే. లోపలగదిలో నేమిచేయుచుంటివి? ఆమువ్వలు తీసికొనిపోయి కాళిందీరుక్మవతుల కిచ్చితిని. తమచిలుకలకుఁ గట్టెదమని చెప్పిరి. మఱియు తేపా

కోయది వచ్చినప్పుడు కబురుచేయుమనిరి. మనచిలుక కా మువ్వలూ గట్టితివా ? అని యడిగిన నయ్యువతి నవ్వుచుఁ గట్టితినికాని నీవు పెంపలకడబోయి యా కోయసానిం దీసికొనిరావలయును. దానితోఁ జాల మాటాడవలసియున్నది. ద్వారముకడ వేచియుండుము పొమ్మని నియమించుటయు భద్రిక వల్లెయని యల్లన సింహద్వారముకడకుఁ బోయి కోయదానిజాడ నరయుచుండెను.

అంత కొంతసేపటి కొక కోయదొర చిలుకను బుజముపై నెక్కించుకొని చిలుకమువ్వలో యని యరచుచుఁ వీధింబడి వచ్చుచుండెను. భద్రిక వానింజీరి, కోయదొరా! నిన్ననొక కోయసాని యీలాటి మువ్వలే యమ్మఁదెచ్చినది. దాని నీవెఱుంగుదువా? అది నీకేమి కావలయునని యడిగిన వాఁడు అది నాపెండ్లామే. నేఁడు పనియుండి బసలో నిలిచినది. పైడిమువ్వ లేమైనం గొంటిరా ? చిలుకలకుఁ గట్టితిరా ? అని యడిగిన భద్రిక యిట్లనియె.

అయ్యో! నేఁడా కోయదిరాలేదా ? దానికొఱకే యిందు వేచియుంటిని. నిన్న మాయంతఃపురమునకు వచ్చి చాలమువ్వ లమ్మినది. వానివెల నింకను నియ్యలేదు. నేఁ డుదయముననే వత్తునని చెప్పిపోయినది. మారాజపుత్రిక దానితోఁ ముచ్చటింపఁ జాలవేడుకపడుచున్నది. మంచి కానుకలీయఁ గలదు. ఇంటికిఁబోయి తీసికొని వత్తువా ? అని యడిగిన వాఁడు సానీ! నేఁడువచ్చుటకు తీరికలేదు. రేపు ప్రొద్దున దప్పక పంపువాఁడ. నిందే వేచియుండుము అని పలుకుచు నాకోయదొర యవ్వలకుఁబోయెను.

భద్రికయుఁ జిన్నవోయిన మొగముతోఁబోయి రాజపుత్రికతో నావార్త చెప్పినది. దాని మగని చక్కఁదనము పెద్దగా నామెయొద్ద నభినందించినది. ఆమాటలు విని రాజపుత్రిక, అయ్యో! వానినిందు దీసికొని రాలేకపోయితివా ? అడవివాండ్రకడ మనకు( ఘోషా) యవ

సరము లేదుగా. అనుటయు నట్లేచేయఁదలచితిని గాని నీవేమందు వోయని సంశయించితిని. రేపు కోయదిరానిచో వానినే తీసికొని వచ్చెదనని చెప్పినది.

రాజపుత్త్రిక యంగీకరించి నేఁడు మధ్యాహ్నముగూడ వీథిం గాచికొని యుండుమని చెప్పి దాని నంపినది.

కోయదొర చిలుకముచ్చలోయని యఱచుచు రాజవీథులం దిరుగుచుఁ గ్రమంబున నొకకోమటివీధికింబోయెను. ఆవీధిని వరుసగా సుబ్బిశెట్టి, రామిసెట్టి, పాపిసెట్టి, పెద్దిసెట్టి, అను పేరుగల నలుఁవురు వర్తకుల దుకాణములున్నవి. సుబ్బిసెట్టికోయదొర కేకవిని తటాలున నంగడిదిగి వానికడకు బోయి వానిచేతనున్న ముచ్చలబుట్ట బట్టుకొని కోయదొరా! నిన్నవచ్చిన కోయది నీకేమగును? మాకుఁ గొన్ని పైడిముచ్చలమ్మినది. మీకడనున్న ముచ్చలన్నియుఁ దీసికొనిరా? ఏక ముగాఁ దీసికొనియెదమని చెప్పితిమి అంగీకరించి పోయినది. మేము మారుబేరపు వర్తకులముగదా? ఏదో కొంచెము వెలతగ్గించి ఈము చ్చలన్నియునాకిచ్చివేయుము తీసికొందును. అనియడుగుచుండ రెండవ యంగడివాఁడు రామిసెట్టి యట్టెలేచి యటవచ్చికోయదొరా!నీముచ్చ లకు నేనిబ్బడి వెలయియ్యఁగలవాఁడ. నన్నియునాకిమ్మని కేకపెట్టెను.

పోపొమ్ము. నేనిదివరకే ధ్రువపరచుకొన్నాను.: వీనిభార్యయే నిన్న బేరమిచ్చిపోయినది. తట్టవదలుమని సుబ్బిసెట్టి రామిసెట్టితోఁ బోట్లాడుచుండెను. ఇంతలో మూడునాలుగు దుకాణముల వర్తకులు వచ్చి కోయదొరా! యిటురా. నిన్నడవివానిఁజేసి వీరు మాయజే యుచున్నారు. సుబ్బిసెట్టికి నీభార్య జట్టి యిచ్చినదను మాట బూట కము వీని నెవ్వరికి నీయవలదు. పాటవేయుము. ఎవ్వరెక్కుడుసొమ్మి త్తురో వారికిత్తువుగాఁక. నీలాభమేలపోగొట్టుకొనియెదవు? అనిచెప్పిరి.

కోయదొర నవ్వుచుఁ జిలుకలున్న వారికిఁ గాని నేనీ ముచ్చ

లమ్మను. మీకడఁ జిలుకలున్నఁ దీసికొనిరండు. వానికిగట్టి వింతగా మాటలాడింతునని చెప్పిన విని సుబ్బిసెట్టి కోయదొరా! చిలుకలు మా బంధువులయిండ్లలోనున్నవి. వారికొరకే కొనఁదలంచితిని. లేకున్న మా కవసరమేల? అని యడిగినఁ దక్కినవారు నట్లే పలికిరి. అప్పుడు కోయ దొర యాలోచించి కానిండు. మీరు తగవులాడవలదు. మీానలువు రకు సమముగాఁ బంచియిత్తు. నిన్ననిచ్చిన వెలయే యిండు. మీాబం ధువుల చిలుకలకుఁ గట్టుఁడు. అని పలుకుచుఁ దనయొద్దనున్న మువ్వల వారికి సమముగానిచ్చి తగినవెలఁ దీసికొనియెను. కోయవాఁడు వెఱ్ఱి వాఁడులోకజ్ఞానములేనివాఁడని వాండ్రుతలంచిమువ్వలఁదీసికొనిపోయిరి.

తరువాత సుబ్బిసెట్టి వాని నేకాంతముగాఁజీరి, కోయదొరా! నీకుఁ జిలుకమంత్రమేనా గుఱ్ఱముమంత్రలేమైనా తెలియునా? అని యడిగిన నబ్బో! మాకుఁ జిలుకమంత్రములకంటె గుఱ్ఱపుమంత్రములే యెక్కువగాఁ దెలియునని చెప్పెను. మేమొక గుఱ్ఱమును దెప్పించి తిమి. దాని సుడులు లక్షణము పరీక్షించి యెంతవెలచేయునో చెప్పఁగలవా? అని యడుగుటయుఁ గోయవాఁడు సందియమేలా? నాకా గుఱ్ఱమునుజూపుము. గుణదోషము లెఱింగింతునని చెప్పెను.

అప్పుడు సుబ్బిసెట్టి కోయదొరను రహస్యముగాఁ దన పెరటి లోనికిఁ దీసికొనిపోయి పలుపుత్రాటిచేఁ గట్టివేయఁబడిన యాజానే యమగు నొకగుఱ్ఱమును జూపించెను. దానింజూచి కోయవాఁడు సం భ్రమముతో దాపునకుఁబోయి జూలుదువ్వుచు మేనునిమురుచు ముద్దు పెట్టుకొనుటయు నది హేషారవము చేయుచు నతని ముట్టెతో మూరొకొనుచుండెను.

సుబ్బి—కోయదొరా! ఈగుఱ్ఱము లక్షణములు పరీక్షించి తివి గదా. మంచిదేనా?

కోయ—సెట్టిగారూ! దీని మీారెక్కడనుండి తెప్పించితిరి?

సుబ్బి—అబ్బో! మాఅల్లుఁడు తూర్పురాజ్యమునుండి దీనిం గొనివచ్చెను.

కోయ—దీనికివెల యెంత యిచ్చెను?

సుబ్బి—నీవు వెలగట్టిన పిమ్మటఁ జెప్పెదను.

కోయ—దీనికింత వెలయనిలేదు. లక్షరూపాయలు లిచ్చినను ఇట్టి గుఱ్ఱము దొరకదు.

సుబ్బి—సంతస మభినయించుచు, ఆలాగేమి? మంచి మాట చెప్పితివి. మాయల్లుఁడు చిన్నగుఱ్ఱము తెమ్మనిన దీని నెక్కువ సొమ్మిచ్చి తెచ్చినాఁడు. దీని మేము భరింపజాలము. దీని నమ్మి పెట్టుము. నీకు బహుమతి నిత్తుము.

కోయ—అట్లే చేసెదంగాని లెస్సగా మేపుచుండుము. అని వారు మాట్లాడుచుండఁగా నాప్రక్కఁ గాపురమున్న రామిసెట్టి తన గోడకు నిచ్చెన వేసికొని చూచుచు నామాటలన్నియు నాలించెను. కోయవాఁ డాయింటి గుమ్మము దిగినతోడనే రామిసెట్టి వానిం దన యింటికి రమ్మని సంజ్ఞచేసెను. ఆసన్న గ్రహించి యాసన్నవర్తియగు సుబ్బిసెట్టి వాని నందుఁబోవలదని యాటంకపరచెను. ఆవిషయమై వారిరువురును జేతులెత్తి తిట్టుకొనిరి. వారిజగడములు జూచి నవ్వుచు గోయదొర సుబ్బిసెట్టి మాట వినిపించుకొనక రామిసెట్టి యింటికిం బోయెను!

రామిసెట్టి కోయదొరను మెల్లగా లోపలికిఁ దీసికొనిపోయి పారశీక జాతంబగు గుఱ్ఱము నొకదానిం జూపెను. కోయదొరం జూచి యావాఱువము గంభీరముగా సకిలించినది. అతఁడు దానిందువ్వుచు సెట్టిగారూ! మీరీగుఱ్ఱము నెట్లుసంపాదించితిరని యగిడిన నతండు సుబ్బిసెట్టి గుఱ్ఱమును నీవు జూచితివిగదా. అదియు నిదియు నొక్కచోటనే కొంటిమి. వీనిలో నేదిమంచిదియో వెల చెప్పుఁడని యడిగినఁ

గోయవాఁడు సామీ! మీరు దీనింగొంటిరిగదా. వెలమీకుఁ దెలి యదా? ఎఱుఁగనట్లు అడిగెదరేల? అని యుత్తరమిచ్చెను. సరే. నీవుసుబ్బిసెట్టి గుఱ్ఱము నమ్మెదననియొప్పుకొంటివిగదా. దీనిగూడన మ్మిపెట్టుము. వానికన్న నెక్కుడు సొమ్మిత్తునని చెప్పెను. అతం డొడంబడి యావలకువచ్చి అట్టే తక్కిన వర్తకుల యిండ్లకుగూడఁబో యియందలి గుఱ్ఱములఁజూచి సంతసించుచుఁ గోయదొర రేపువచ్చి వాని నమ్మెదనని చెప్పి యానాఁటి కింటికింబోయెను.

లోక మసూయాపరతంత్రమైనదిగదా! మఱునాఁడు సూర్యో దయముకాకమున్న యిరువురుభటులతో యవనకులస్థుఁడు దండనా థుఁడు సుబ్బిసెట్టి యింటికివచ్చి వీధి నిలువంబడి.

దండ—అరే! సుబ్బిసెట్టికి ఎవడూరా యిక్కడ.

సుబ్బి—(గుండెఝల్లుమన నెదుటకువచ్చి సలాముచేయుచు) సాహేబుగారాండి నేనే సుబ్బిసెట్టిని.

దండ—అరే. బాంచోత్. నీవేనా! నీకీ ఘోడాకు చోరీ చేశావని న్హిపైఁ మాకు హుకుంవచ్చింది. నీకీ ఏమి సెప్తావోయ్.

సుబ్బి—సాహేబుగారూ! మామర్యాద మీ కెఱుఁగరా! మేమాలాటి ఝూటాకోరుపనులు సేసేవారముకాము కిట్టనివారెవ్వ రో మీకిట్లు తెలిపియున్నారు.

దండ—అరే. బాంఛోత్ మీకీఘుఱ్ఱాలో ఘోడాకియున్న దాలేదా? అది సెప్పువోయి?

సుబ్బి—మాయింట్లో యుండడమేమిా? రామిసెట్టి, పాపిసె ట్టి పెద్దిసెట్టిగార్లింట్లో మాత్రము గుఱ్ఱములులేవా? నన్నొకక్కనినే నిర్బంధింతురేల?

దండ—అరే. వాడికిజోలీ నీకీఏల? నీమాట సెప్పువోయి.

సుబ్బి—మేము చోరీచేయలేదండీ. మాఅల్లుఁడు కొనితెచ్చిందియుండదండి.

దండ—దానికి మాకు సూపూవోయి.

సుబ్బి—సాహేబుగారూ! వారిదికూడా సూడక నాదేసూడడమేమండీ?

దండ—అరే. అందరిది చూస్తామోయి. పదపద లోపలకు

సుబ్బి—సాహేబుగారూ! పులావులోకి మంచి సన్నబియ్యంమున్నవి. తమయింటికి పంపనాండి?

దండ—అరే పులావుగిలావు ఇప్పుడు పనికిరావు. పదవోయి. నీఘుర్రు సూడాలి. అని వానిం గెంటుకొని లోనికింబోయి పెరటిలో నాజానేయమైన గుఱ్ఱమును జూచి యాశ్చర్యపడుచు, అరే! కోమటీ! ఈఘోడా నీకీయెక్కడిది?

సుబ్బి—ఇది మాయల్లుడిదండీ. మాదికాదు. అతఁడు చాలభాగ్యవంతుఁడు మొన్న దీనినెక్కి యిక్కడకు వచ్చినాడఁడీ. ఎక్కడకొన్నాడో మాకుఁ దెలియదఁడీ.

దండ—అరే కోమటీ! నీమాటలు ఝూటాగా నున్నవి. నీకీ అల్లునికీ ఈలాటిఘోడాలూవోయి అని పలుకుచు నాగుఱ్ఱమును వీధిలోనికిఁ దోలించుకొనిపోయి నిలబెట్టి పరీక్షించుచుండెను.

సుబ్బి—సాహేబుగారూ! ఈలాటి గుఱ్ఱాలు వాళ్లయిళ్లలోగూడ నున్నాయిగందా. వారి నడుగరేమీ? నన్నొక్కండనే నిర్బంధింతురా?

దండ—అరే నీకీతొందరయేలా? వారికి ఘుర్రులుచూస్తామోయి.

ఆమాటలు విని యావర్తకులుముప్వురు తమ పెరటికొని గుఱ్ఱముల విప్పి రెండవదారిని వీధిలోనికిఁ దోలి తలుపులువైచి యీవలకు వచ్చి నిలువంబడిరి. అప్పుడు దండనాథునితోఁ సాహేబుగారూ!వారే

గుఱ్ఱములున్నవారు. వారిల్లు చూడండని సుబ్బిసెట్టి బోధించెను. ఆమాటలు విని యావర్తకులు మువ్వురు సుబ్బిసెట్టినిదిట్టుచు సాహేబు గారూ! మాయిల్లు వచ్చి చూడండి. గుఱ్ఱములు కనంబడనిచో వీఁడు జుట్టు గోయించుకొనునేమో యడుగండని తెలియపరచిరి.

అట్లు వారు మాట్లాడుచుండఁగనే యామూడుగుఱ్ఱములు వీధి తిరిగివచ్చి సకిలింపుచు మొదటిగుఱ్ఱముకడవచ్చి నిలిచినవి. సుబ్బిసెట్టి సాహేబుగారూ! చూచితిరా? ఇవిగో వాండ్రగుఱ్ఱములు మీవాడా విడి చూచి పెరటిమార్గమున విడిచివేసిరి. వారి పెరటిలోనికిఁబోయి చూచిన వీని చిహ్నములు గనంబడును పదుఁడని ప్రబోధించెను.

అప్పుడు సుబ్బిసెట్టి భార్య గుమ్మముమీఁద నిలువంబడి మగని నుద్దేశించి నీవెప్పుడు నిట్లే తెలివిమాలినపనులు సేయుచుందువు. తోడివారు పెరటిలోని గుఱ్ఱములఁ బెరటిదారి నవ్వలకు దోలివేసి యేమియు నెఱుఁగనివారివలె వచ్చి నిలంబడిరి. నీవొక్కడవే దొంగతనము చేసినట్లు పట్టుపడితివి. ఈగొడవలు మనకేల? నిజము చెప్పరాదూ! దీని నెక్కడనైన నెత్తికొనివచ్చితివా యేమి. మనము చిలుకంబెంచితిమి. కోయమంత్రమువలన నది గుఱ్ఱమైనది. మావలెనే వారికిగూడ గుఱ్ఱములైనవికాని వారు వానిం దాటించిరి. ఆమాట సాహేబుగారితోఁ జెప్పరాదా? ఊరక గందరగోళము జెందెదవేమిటికని మందలించినది.

దండనాథుఁ డామాటలు విని అరే ఏమిరా అది మాకీ అట్లు కూయుచున్నది. చిలుక ఘోడా సేస్తుందీరా ఏమి. మాకీ అదియేమిటీ పనికిరాదు. పదపద. రచ్చకు పద. అని ఆగుఱ్ఱములతోఁగూడ సుబ్బిసెట్టిని న్యాయస్థానమునకుఁ దీసికొనిపోయెను.

అని యెఱింగించువఱకుఁ గాలాతిపాతమైనది. పైమజిలీయందవ్వలికథ మఱియుఁ జెప్పందొడంగెను.

---

# చిలుక బ్రహ్మరాక్షసుడైనకథ.

ప్రఫుల్ల—సఖీ! కాళిందీ! ఆకోయది శ్రీవిష్ణుని జగన్మోహనావతారమేమో యని తలంతు నయ్యారే! దానిసోయగ మేమని చెప్పుదును? నేను పంపిన మువ్వలు మీ చిలుకకుఁ గట్టితిరా! విశేషము లేమైనఁ గనంబడినవియా?

కాళింది—(నవ్వుచు) నేనుగూడ నిన్నిట్లే యడుగుచున్నాను. నీమాట చెప్పినతరువాత మామాటఁ జెప్పెదము.

ప్ర—రుక్మిణీవతియు నట్లే యనునా.

రుక్మిణీవతి—సందియమేలా మేమిరువురము నిన్నామాట యడుగుటకే వచ్చితిమి.

ప్ర—చెప్పెద వినుండు. నాచిలుక నామువ్వలు గట్టినతోడనే మనోహరత్వమున నొప్పినది. తెలిసినదియా?

కాళిం—తెలియ కేమి? విను మని మాచిలుకలకును గట్టినంత మా కత్యంత ప్రియతమములై యొసంగినవని యెఱుంగుము.

ప్ర—బళాబళి! ఇట్టిచోద్యము లెన్నఁడును కని విని యెఱుంగముగదా! కానిందు మీప్రియతముల ప్రతిబింబములు తీసికొని వచ్చితిరా?

కాళింది—ఆ. ఇవిగో చూడుము. నీమనోహరరూపము గూడ జూపింపుము అని పలికినది.

ప్రఫుల్ల వారిచ్చిన చిత్రఫలకములు రెండును జూచి యాశ్చర్యపడుచుఁ దాను వ్రాసిన కళాభిరాముని చిత్రఫలకము వానిప్రక్కఁ జేర్చి మూడును నొక్కపోలికగానుండుట పరిశీలించి యౌరా! యీకోయది యింద్రజాలవేదినివలెఁ దోచుచున్నది. చిలుక లేడ యీదివ్య

పురుషు లేఁక, అని విస్మయమందుచుఁ బ్రఫుల్ల సఖులారా! మీరు వారివృత్తాంతము లడిగితిరా యేమనిరనియడిగిన కాళింది యిట్లనియె.

సఖీ! అడిగితిమి. ఒకఁడు సుధర్ముఁడఁట. ఒకఁడు సులోచనుఁడఁట. పేరులుమాత్రము సెప్పిరి. తమవృత్తాంతము కొంతచెప్పిరికాని యాపక్షిరూప మెట్లువచ్చినది యెఱుంగరు. నీచిలుక యేమన్నది ముప్పురు నన్నదమ్ములని తోఁచుచున్నది. అనుటయు ప్రఫుల్ల ఔను. నీవన్నమాట సత్యయే. మాచిలుకయు నట్లే చెప్పినది. నేఁడు కోయదాని గట్టిగా నిర్బంధించి యడిగిన నంతయుం దెలియఁగలదు. మీ చిలుకల నేమిజేసి వచ్చితిరి? ఎగిరిపోవుదుమని చెప్పలేదా. అని యడిగినది.

కాళింది సరిసరి ఱెక్కలువచ్చిన పక్షులు పోవుటకుఁ బ్రయత్నింపక నిలుచునా? బలవంతమున నాపితిమి మేము వేగఁబోవలయు నాకోయదానిం జూడవచ్చితిమి. దానిజాడ దెలిసినదియా? అని వారు దాపుననున్న పరిజనులకుఁ దెలియకుండ సాంకేతికముగా మాట్లాడు కొనుచుండ నింతలోఁ గోయదానిం దీసికొని భద్రిక యరుదెంచినది. ముప్పురు వింతగా దానిం జూచుచుండిరి. రాజపుత్రిక దానిఁ గూర్చుండనియమించి వీరె నాసఖురాండ్రు కేవలము నిన్నుఁజూచు వేడుకతో నరుదెంచిరి. నిన్న నీవు వత్తునని చెప్పి రాక మాకాశాభంగము గావించితివి. నేఁడు నీచిలుకమగనిం దీసికొనివచ్చితివికావేమి? అని యడిగినఁ గోయది యిట్లనియె.

అమ్మా! నామగఁ డింటికడఁ బనిగలిగి నిలిచెను. నేను నిన్న రాలేకపోయితిని. మీచిలుకలకు మామువ్వాలు గట్టితిరా. వింతమాట లాడుచున్నవియా. అని యడిగిన వారు నవ్వుచు వింతలేకాదు. మనుష్యులవలె స్పష్టముగాఁ బలుకుచున్నవని చెప్పిరి.

అంతలో భద్రిక యవ్వలికిఁబోయి వచ్చి సఖులారా! వింత

లపై వింతలు వినంబడుచున్నవి. నీంద్రిచ్చిన మువ్వలు కోమటియింట నున్న చిలుకలకుఁ గట్టిరఁట. అవి గుజ్జుములైనవఁట. ఆవర్తకులాగుజ్జుముల నమ్మంజూపిన దొంగిలించిరని వారి నిర్బంధించి రాజపురుషులు చెరసాలం బెట్టించిరఁట. ఆమాటలు వింతగాఁ జెప్పికొనుచున్నారు. వింటిరా. అని చెప్పిన విని కోయది అమ్మా! అది యేవీధిని? చిలుకలు గుజ్జుములైనవియా నాలుగా అని సాభిప్రాయముగా నడిగినది. భద్రిక అవునని యుత్తరము చెప్పినది.

రాజపుత్రిక—దొరసానీ! నీవు మాయావినివివలె నున్నావు. నీ వమ్మిన మువ్వలగట్టిన జిలుకలు గుజ్జుములే కాదు. మనుష్యులుగూడ నగుచున్నారు. ఇందలి కారణ మేమియో చెప్పినంగాని నిన్నుఁ బోనీయను అని పలికిన విని కోయసాని అమ్మా! ఏచిలుకయైన మనుష్యుడైనదియా? తెలిసినఁ జెప్పుమని కోరినది. చెప్పిన నేమిచేయుదువని రాజపుత్రిక యడిగిన ఆమ్మా! మాతంత్రము సఫలమైనదని సంతసింతు మిదియ మాయభిలాష యని పలికినది. వారట్లు మాట్లాడుకొనుచున్నంతలోఁ బురములోఁ గోలాహలధ్వని వినంబడినది. ఆయల్లరి యేమియో తెలిసికొనిరమ్మని రాజపుత్రిక భద్రికనంపినది.

అది సింహద్వారముకడ కరిగి వచ్చి యురముపైఁ జేయిడికొని, అమ్మయ్యో! భోగముదానియింటనున్న చిలుకకుఁ గోయలిచ్చిన మువ్వలు గట్టినతోడనే అది యొకబ్రహ్మరాక్షసుండై కనంబడినవారినెల్ల మ్రింగుచున్నాడఁట. జనులూరక పాఱిపోవుచున్నారు. కోటతలపులు వేయించివచ్చితిని. నయమే! మనచిలుక లట్లైనవికావు. అని చెప్పినది.

ఆమాటలు విని కోయది బాబో బ్రహ్మరాక్షసుండనిన నాకు మిక్కిలి భయము. వాడిక్కడికి రాడుగద అని వెఱపభినయించుచున్నది. రాజపుత్రిక యీయింద్రజాలమంతయు నీవలనం గలుగుచున్నది. ఇంద్రజాలపింఛికవు నీవే వెఱచిన మే మేమందుము. నీవిఁక నిజము

చెప్పినంగాని నిన్నిక్కడినుండి కదలనీయమని పలికినది.

అంతలో మఱికొందఱుపరిచారిక లుప్పరిగలెక్కి చూచి వచ్చి అయ్యో! అయ్యో! ఆరాక్షసుఁడు స్త్రీలమీఁదఁబడి పరిభవించుచున్నాఁడు. వాని కెగరుటకు సామర్థ్యముండుట గోడలు, కోటలు వాని నాటంకపెట్టఁజాలవు. కోయదొర గుఱ్ఱమెక్కి వానిం దరిమితరిమి కొట్టుచున్నాఁడు. పక్షివలె నెగసి వాని కందకున్నాఁడు. మీరందఱు లోపలకుఁబోయి తలుపులు వేసికొనుఁడు. వాఁడిందు రాఁగలఁడని చెప్పిన విని కోయదొరసాని అమ్మయ్యో నామగఁడే వాని దరుముచుండుట స్వామీ! వెంకటేశ్వరుఁడా! నాభర్తం గాపాడుమని ప్రార్థించినది.

అంతలోఁ నారక్కసుఁ డెగిరివచ్చి కోటలోబడి యల్లరిసేయుచుఁ గ్రమంబున రాజపుత్రికయున్న యంతఃపురమున కరుదెంచెను. అందున్న దాసీజన మాక్రందనము సేయుచుండెను. కోయది తటాలున నందున్న గదిలోదూరి తలుపులువైచికొన్నది. వాఁడు వచ్చి కాళిందిం బట్టుకొని యీడ్చుకొనిపోవుచుండెను.

రాజపుత్రిక మొఱ్ఱోయని యఱచుచు వారి వెంటబడినది. అయ్యో హాహాకారరవంబు లాలించి యాగదిలోనున్న కళాభిరాముఁ డీవలకు వచ్చి

క. కైదువు కైదువు తెండో
   యేదేనిం గలిగియున్న నిట వీనిశిర
   చ్ఛేదము గావించెద నిం
   దాదిసురల్ ముదముజెంద నాహవకేళిన్.

అని పలికిన విని భద్రిక యందున్న కరవాలమొండు దెచ్చి వాని కిచ్చినది. అతం డది గైకొని యసురమీఁదికురికి,

క. నిలునిలుదైత్యా! యబలం, గలచెద వేమిటికి? రమ్ము కయ్యము సేయం
   గలవాఁడవేని నాఁతో, బలముం జూపించిపొమ్ము ప్రాణంబులతోన్.

అని పలుకుచు రాదాఁ వేశంబున నతండా నక్తంచరుం డాకుటయు వాఁడచ్చేడియను విడిచి రాజపుత్రు నమాంతముగా నెత్తికొని బుజముపై నిడికొని యందున్న సుందరులెల్ల నాక్రందనముసేయ నెగసి కోటదాటి యవ్వలకుఁ బోవుచుండెను. అప్పుడా రాజపుత్రుఁడు వాని బుజంబుననుండియే కరవాల ముంకించి కుడికరంబు నఱికి పారవైచెను. వాఁడు మేనంతయుఁ గ్రొత్తనెత్తురుగార గర్జించుచుఁ బరిటీలు తిరుగుచుండెను.

వానినిమిత్తమై గుఱ్ఱములెక్కి తిరుగుచున్న మువ్వురు మహావీరులు ఆకసమున వానిఁజూచి శరములనేసి నొప్పించిరి. మఱియు గళాభిరాముఁడు సమయమరసి యయ్యాడిదమున రెండవచేయి గూడ నరికినంత ఱెక్కలువిరిగిన పక్షివలె వాఁడు పెద్దధ్వనిచేయుచు నేలం గూలెను. అప్పుడు కోయదొరయు మఱియిర్వురు వీరులును వాని దాపునకువచ్చి కళాభిరాముని గ్రిందఁబడకుండఁ గాపాడియారక్కసుని యవయవములన్నియు ఖండించి వానిం గతాసుంజేసిరి.

అప్పుడు కళాభిరాముఁడు గుఱ్ఱములపైనున్న సుధర్మ సులోచనులం గురుతుపట్టి సోదరులారా! మీతో దిరుగుచున్న యీకోయవాఁడెవ్వఁడు. హరివర్మ యేమయ్యె? విద్యాసాగరునివార్త యేమైనం దెలిసినదియా? మన మెందువిడిపోయితిమో జ్ఞాపకములేదు. మీ రెప్పుడిక్కడికి వచ్చితిరి? ఈరక్కసుఁ డెవ్వఁడు అని యడిగిన వారు, అన్నా! మనవృత్తాంతము చాలగలదు. ఆనక జెప్పుకొందముగాక. అదిగో నీగుఱ్ఱము అందున్నది ఎక్కుము. ఇక్కడికి మనము ధన్యులమే! అని పలికిన విని సంతసించుచుఁ గళాభిరాముఁ డాగుఱ్ఱమెక్కి వారితోఁగూడ నగరమువీధులఁ దిరుగఁజొచ్చెను. పౌరులు రాక్షసభయంబునఁ దలుపులుమూసి తీయకుండిన వీరునలువురు నాలుగువీధులకుంబోయి.

గీ. పౌరులార! వెఱవఁబనిలేదు క్రవ్యాదుఁ
డీగ్గె నిందు నస్మదీయహ_స్త
కలిత హేతిధారఁ గాతుకమేపారఁ
దెఱుఁగుడింక వీధి తెరవులందు.

అని పలుకుచుఁ బౌరుల భయమువాపి యంతకుముందు హత శేషులైన పురరక్షకుల కుదుటుగఱపి రాక్షసదేహంబు గాల్పుఁడని నియమించి "యావీరులెవ్వరో భగవంతులై వచ్చి తమ్ము రక్షించిరని" పౌరులు స్తుతియించుచుండ నాసత్రంబునకరిగి యొండొరుల వృత్తాంత మొండొరులకుఁ జెప్పికొని యానందించిరి. అని యెఱిగించి—

---

229వ మజిలీ.

## బ్రహ్మరాక్షసునికథ.

అన్నగరాధిపతియగు సోమదత్తుండు వేటకుఁ బోయివచ్చుచు వార్తాహరులవలన నయ్యుపద్రవము విని నాఁటి సాయంకాలమునకే పురముజేరి యాయుత్పాతమునకుఁ బరితపించుచుఁ గోటలోనే చిన్న సభజేసి ప్రధానితో నిట్లనియె. అమాత్యశేఖరా! మనవీట నెన్నఁడు ను నిట్టి విపరీతము జరిగియుండలేదు. చిలుకలు గుఱ్ఱములగుటయు బ్రహ్మరాక్షసుఁడగుటయు మనుష్యులఁ జంపుటయు జాలవింతగా నున్నది. తంత్రవేత్త లెవ్వరైన వచ్చి నగరముపైఁ బ్రయోగము సలి పిరా? ఆరక్కసుం బరిమార్చిన మహావీరు లెక్కడనుండివచ్చిరి? ఆవార్తయంతయు సవిశేషముగాఁ జెప్పుమని యడిగిన నామంత్రియంత కుమున్న రప్పించియుంచిన భోగముదాని ముందుకుద్రోసి నీవెఱింగిన కథ నీయింట నేమిజరిగినదియో చెప్పుమని యడిగిన నావేశ్య రాజు నకు నమస్కరించి యిట్లనియె.

మహారాజా! నేనాఱుమాసముల క్రిందట నొక కొండవాఁడు చిలుకనమ్మదేగా నుంచిపుట్టంబు లిచ్చి దానిఁగొంటిని. బంగారు పంజరములోఁబెట్టి మాటలు నేర్పి ముద్దుగా బెంచుచుంటిని. మూఁడుదినముల క్రిందట నొక కోయది చిలుకల కలంకారములని పైడిమువ్వలు దెచ్చి యమ్ముచుండెను. చిలుకయందలి ప్రేమచే నేనా మువ్వలం గొనిమంచివేళజూచి దానికంఠమునకుఁ గట్టింపుచున్నంతలోనాచిలుక యొక బ్రహ్మరాక్షసుఁడై యఱచుచు నెదురునున్న నాదాదినిమెడఁ గరచి నెత్తురుపీల్చి చంపి నాట్యముసేయుచుండెను. అప్పుడు నేను గదిలోఁ దూరి తలుపువేసికొంటిని. లేకున్న నేనీపాటికిఁ బెద్దలలోఁ జేరియుండుదాననే. పిమ్మటఁ జావడిలోఁ బండికొనియున్న మాయమ్మను నెమ్ములువిరుగఁజఱచి పరలోకగతంజేసెను. వీధిగదిలోఁ బండుకొనియున్న యొక భాగ్యవంతుని కుమారుని విటధర్మమునకై యరుదెంచినవాని మెడ జెఱుకుముక్కవలె విఱచి రక్తముద్రావెను. పాఱిపోవుచున్న నలువురదాదులం దరిమి చంపినది. తరువాత మాయిల్లు విడిచి నడివీధిం బడినది. ఇంతవట్టు నేనెఱుంగుదు. స్వామీ! మా తల్లిం బూవులలోఁబెట్టి పోషించుచుంటి. అట్టి మాతంగోలుపోయితినని గోలున నేడువఁ దొడంగినది.

ఓహో! ఈచిచ్చు నీయింట బుట్టినదా? కానిమ్ము. పెద్దది మీయమ్మకేమి? నీవు బ్రతికితివిగదా. పొమ్మని పలుకుచుఁ దరువాతి వృత్తాంతము జెప్పుమని యడిగినఁమంత్రియా సుబ్బిసెట్టినెదురకు బంపెను. అతండు నమస్కరించుచు దేవా నేనేపాపము నెఱుఁగను. నాయుసురా దండనాథుఁనకుఁ గొట్టినది. కొన్నిదినములక్రిందటమావర్తకులతో పాటు నేనొక చిలుకం గొంటిని. ఆమాయ కోయసాని ఎక్కడినుండి వచ్చినదియో పైడిమువ్వలమ్మిపోయినది. నాచిలుకకుఁగట్టినఁ బెద్దగుఱ్ఱమైనది. దానివలెనే మాదాయుల చిలుకలు గుఱ్ఱములైనవి.

నాకర్మము. ఆసాహేబు నేనాగుఱ్ఱముఁ దొంగిలించి తెచ్చితినని రచ్చ్రా కులాగికొని పోయి చెరసాలలోఁ బెట్టించెను. లంచము గొని నా దాయాదుల ముగ్వుర జోలికిఁ బోడయ్యెను. చిలుక రాక్షసుఁడై నప్పుడు గుఱ్ఱమగుట యసత్యమగునా? తండ్రీ! నామాటనమ్మక నన్నన్యా యముగా బందీగృహంబునం బెట్టించినందుల కాతురక బాలిశునకు మంచి ప్రాయశ్చిత్తమైనదఁట. ఆరక్కసుని నోటఁబడెనని చెప్పికొని రని దీనుండై తనయుదంత మంతయు విన్నవించెను.

సోమదత్తుఁ డావర్తకుని నూరడించుచు మంత్రితోఁ దరువాత నేమిజరిగినది. ఆమహావీరు లెక్కడినుండి వచ్చిరి. పిమ్మట నేమైన దని యడిగిన నతండిట్లనియె. మహారాజా! కొన్నిదినముల క్రిందటఁ గోయవాండ్రు మూడు కొండచిలుకల నమ్మదెచ్చిరఁట. కొండ చిలు కలు గుజ్జురెక్కలతో నొప్పుచుఁ జూడ మిక్కిలి సొంపుగానుండును. వానిలో నొకదాని భర్తృదారికయు నొకదాని నాకూతుఁరు కాళింది యు నొకదాని సామంతరాజు కూఁతురు రుక్మవతియు గొన్నారఁట. మొన్న కోయవాఁడమ్మఁదెచ్చిన పైడిముద్దలు ముగ్వురుకొని తమ చిలుకలకుఁ గట్టించిరి. తత్సంపర్కంబున మూఁడు చిలుకలు మహావీ రపురుషులై నిలువంబడినవి. అది యట్లుండ నాముద్దలమ్మం దెచ్చిన కోయవాఁడు వీధులం దిరుగుచుండగనే భోగముదాని చిలుక బ్రహ్మ రాక్షసుఁడై యూరంబడి మహామారియుంబోలెఁ బ్రజలఁ గసిమసఁగు చుండుటయు నెఱింగి యాకోయవాఁడు రయంబున రచ్చలోనున్న చిలుక మార్పు హయంబు నొక్కదాని నెక్కి కరవాలంబు బూని యాదానవుని దరుమఁజొచ్చెను.

అంతకుఁ బూర్వమే యవన దండనాధుండు వానియలజడి విని కొందఱు వీరభటులతో నెదుర్కొని గడియలో వానిచే జంపఁ బడియెను. దానంజేసి యుద్ధభటు లెవ్వరు వాని నెదుర్కొన వెఱచి

పారిపోయి గుప్తస్థలంబులం దాగికొనఁ జొచ్చిరి. అప్పుడా కోయదొర యడ్డుపడకున్న గ్రామమంతయు నరణ్యమైపోవును.

ఆదానవుఁడు కోయదొరను సామాన్యుడనుకొని చులకనగా మీఁదబడి కరవఁబోవుటయు నావీరుండు అడిదంబున వ్రేలాడుచున్న వాని నాలుక రెండుచీలికలుగాఁ గోసి పారవైచెను. అప్పుడువాఁడు వికృతస్వరంబున నార్చుచు నాదొరకు వెరచి వెన్నిచ్చి పాఱఁటొడంగెను. ఆరాతు విడువక వాని వెన్నంటి తరిమి తరిమి వీథులన్నియుం ద్రిప్పుచు నిలుచుట కవకాశము లేకుండఁ గొట్టుచుండ వాఁడాగ లేక యెగసి మాయింటిగోడ దుమికి లోపలఁ బడియెను.

లోపలివారెల్ల నాక్రందనము సేయుచు గదులలోదూరి తలుపులు వేసికొనుచుండిరి. దేవా! అప్పుడు నేనుగూడ దాగికొనక తీరినదికాదు. మాయింటఁ జిలుక పురుషుఁడై యున్న వీరుండా యలజడి విని జడియక యడిదముగొని వానిందరిమికొని వీథిలోనికిఁ బోయెను. కోయదొర వానికొఱకు గుఱ్ఱముపై వీథిలో నిలువంబడి యుండుటఁజూచి యాదానవుండు వెఱచుచు నెగసి యాప్రాంతమందలి సామంతనృపతి గేహంబునం బ్రవేసించెను.

అందున్న రెండవవీరుఁడు వానిపయింబడి యడిదంబున వాని ముక్కుచెక్కి వీథిలోనికి దరిమివైచెను. కోయదొరయు రెండవవీరుండును గుఱ్ఱములెక్కి వాని వెదకుచు వీథిలో నిలువంబడిరి. మూఁడవ వీరుండు గూడ వారితోఁ గలసికొని మూఁడవగుఱ్ఱమెక్కి ముప్వురు వాని నిలువనీయక వేటకుక్కలు మేటి వరాహముంబోలెఁ వెన్నంటి తరుమఁజొచ్చిరి. అప్పుడు వాఁడేమియుం దెలువుగానక యెగసి దేవర కోటలోఁబడిఁ దాములు మొకవెట్ట వాఁడు గాళిందిం బట్టికొని యెత్తుకొనిఁబోవఁ దొడంగుటయు మాయింటనున్న నాలుగవవీరుండు కైదువుగొని వాని మీఁదంబడి బాదుటయు వాఁడా చేడియను విడచి మూ

వీరునిసందిటంబట్టి బుజముపైఁ బెట్టుకొని యెగసిపోవుచుండెను. అంతఃపురస్త్రీ లందరు హాహాకారరవంబులు గావించిరఁట.

అప్పుడా వీరుండు రెండుచేతులు తెగనరికి పారవైచుటయు వాఁడు రెక్కలు విరిగిన పక్షివలె నేలంగూలెను. వానింగాచి తిరుగుచున్న మువ్వురు వీరులు తచ్ఛిరంబు ఖండించి గతాసుగావించిరి. నాలుగవవీరుండు గూడ వారితోఁ గలసికొనియెను. నలుగురు గుఱ్ఱములెక్కి పౌరుల కభయము దెలుపుచు బిమ్మటఁ బెద్ద సత్రము నకుఁబోయిరఁట. రెండువేలభటులతో దండనాథుడు మడసెను. ప్రజలు మూడువేలు నష్టమైనట్లు లెక్కలు తేలినవి. అంతఃపురముల నా వీరులులేకున్న స్త్రీలందరు మడియువారే. మహారాజా! క్షీరాబ్ధిలో మొదట హాలాహలము పుట్టి తరువాత నమృతము జనించినట్లు చిలుక నుండి రక్కసుఁడు మహావీరులుగూడ నుదయించిరి. ఇట్టి చోద్యమెన్నఁడును వినియుండలేదు. ఆగుఱ్ఱములునాలుగు నలువురకుఁ బరిచయముగలవివోలె మనసు కనిపెట్టి రెక్కలుగలవివోలె నాదానవుని వెంట నెగయఁ జొచ్చినవి. ఆమహావీరుల దర్శనముజేసి యీజాలి విషయము లన్నియు దేవర తెలిసికొనవలసి యున్నదని మంత్రియావృత్తాంతమంతయు నెఱింగించెను. ఆకథ విని పృథివీపతి యించుక యాలోచించి కానిమ్ము రేపు మనమందరము వారి బసకరిగి యేనుగనెక్కించి యూరేగింపుచు నింటికిఁ దీసికొనివచ్చి గౌరవింతము గాక. అందులకుఁ దగిన సన్నాహము గావింపుమని నియోగించి సోమదత్తుఁ డంతఃపురమున కరిగెను.

అతనిభార్య సంతోషమిశ్రితమైన శోకమును గద్గదకంఠయై భర్తయొద్దకువచ్చి మేమందరము తల్లికడుపున వెండియుం జనించితిమి. ఆమహావీరుఁ డడ్డపడకున్న నీపాటికి గాటిలో భస్మమైయుందుమని పలుకుచు నచ్చటివృత్తాంతమంతయు నెఱింగించినది. అప్పుడా

రాజు భార్యనూరడించుచు నావీరులెవ్వరో తెలిసికొనవలసియున్నది. అందులకు రేపు సభగావింపుచుంటిమి. వారిఁ బెద్దగా గౌరవింతుమని పలికిన విని రాజపత్ని వారికథ మాకుఁ జాలభాగము తెలిసినది. కోయదొరభార్య మనయింటనే యున్నది. అమ్మాయి దానివలననిజ మంతయుఁ దెలిసికొనినది. పాండవులవలె వారు మారురూపులు ధరించి మన వీటికివచ్చిరి. అయత్నోపలబ్ధముగా మీకును మంత్రికిని సామంతరాజునకు నల్లుండ్రులభించిరి. ఆకథయంతయు నమ్మాయి చెప్పఁ గలదని యేమేమో చెప్పి యతని కానందము గలుగఁ జేసినది.

తరువాత ప్రఫుల్లవచ్చి తండ్రితోఁ గొంతసేపు ముచ్చటించి చేయఁదగిన కృత్యము బోధించినది. మరునాఁ డరుణోదయంబున మంత్రిసామంత హిత పురోహితసహితముగాఁ దూర్యనాదములు భూనభోంతరాళంబునిండ దాసదాసీ సహస్రములుగొల్వ నలంకరించిన భద్రదంతావళములతో బయలుదేరి సోమదత్తుఁ డామహావీరులున్న సత్రంబున కరిగెను. అందుఁ బౌరులు గుంపులుగావచ్చి తమ్ము దైవములని స్తోత్రములు సేయ వారితో ముచ్చటించుచున్న యావీరులు నల్వురు రాజుగారి రాక విని యెదురేగిరి.

రాజు దూరమునుండియే మోడ్పు చేతులతోఁ బోయి వారి పాదములమ్రోల సాష్టాంగముగా నమస్కరించుచుఁ దానుదెచ్చిన పుష్పమాలలు వారిమెడలోఁ వైచి వినయముతో నిట్లనియె. మహావీరులారా! మీచరిత్రము కొంత వినియున్నాఁడను. మీరు సత్కులప్రసూనులు, మీపరాక్రమము వేరే యుగ్గడింపఁబనిలేదు. మొన్న మీరు మాదేశమునకుఁగావించిన యుపకార మేతన్మాత్రమని నిరూపించి చెప్పఁజాలము. మీరుచేసిన మేలునకు గృతజ్ఞులమై మీనిమిత్త మొక సభ జేయుచున్నారము. అంగీకరించి యీభద్రగజమెక్కి రావలయునని సోమదత్తుఁడు ప్రార్థించుటయు హరివర్మ యిట్లనియె.

మహారాజా! మీప్రజలకు మావలననే యీయుపద్రవము తటస్థించినది. స్వకార్యసాధకమగు ప్రక్రియ ప్రమాదమున నన్యబోధకమైనను దోషము కానేరదను నార్యోక్తి ననుసరించి మాతప్పు క్షమింపవలయునని మీప్రజలను మిమ్మునుగూడ వేడుకొనుచున్నారము.

అట్లు జరిగించుటకుఁగల కారణము ముందు మీకు వివరింపఁగలమని పలుకుచు నానృపతి ప్రార్థన మంగీకరించి తద్దత్త సత్కారములందికొనుచు సోదరులతోఁగూడ నేనుఁగనెక్కి వారాంగనానృత్యగాన వినోదములతో జనపతిప్రముఖులు ముందు నడుచుచుండ మహావైభవముతో నూరేగుచు నత్యంతాలంకార రమణీయమగు సభామండపము జేరెను.

ఆవీరుల నలువుర రత్నసింహాసనములం గూర్చుండబెట్టి కొందఱు పూవులు జల్లిరి. కొందఱు గీతములం బాడిరి. కొందఱు పద్యముల రచించిరి. వారు పౌరులకుఁ గావించిన యుపకారము లుగ్గడించుచు విద్వాంసు లాశీర్వదించిరి. మాకత్యంతోపకారకులైన మీచరిత్రము విన సభ్యులు వేడుకపడుచున్నారని మంత్రిలేచి యుపన్యసించుటయు నందు హరివర్మ లేచి యెల్లరువిన నిట్లెఱిఁగించెను.

## హరివర్మాదుల కథ.

నాపేరు హరివర్మయందురు. వీరు నాతమ్ములు. మాయన్న విద్యాసాగరుఁడు. మేము తాళధ్వజుం డను చక్రవర్తి బిడ్డలము. మేమేవుర ముత్తరదిగ్విజయము సేయఁ బయలుదేరి పెక్కండ్రురాజులఁ బాదాక్రాంతులఁ గావించి యంతటితోఁ దృప్తిఁబొందక దిగంతము జూడవలయునని యౌవనమదంబున బయలుదేరి సేనలతోఁగూడ జనపదంబులం దాటి పెద్దదూరము మహారణ్యములో సంచారము గావించితిమి. మే మొకచో గుఱ్ఱములెక్కి పోవుచుండ నొక జంఝూవాతంబు

ప్రళయప్రభంజనమువలె వీచివీచి మమ్ముఁ జొప్పాకులవలె నెగరఁ గొట్టినది. మాయన్న విద్యాసాగరుండొక దెసకును మేము నలువురము నొకదెసకుఁ గొట్టుకొని పోయితిమి. గుఱ్ఱములతోఁగూడ మేము దూది పింజలవలెఁ బెద్దదూరము పోయిపోయి యొకమహాపర్వతం బవరోధము గలుగజేయుటయుఁ బ్రవాహవేగంబునఁ గొట్టుకొనిపోయిన కట్టియలు తటంబు జేరునట్లు మేము తత్తటం బూతగా నిలువంబడి తొట్రుపడు చుండ నంతలో నాగాలి చల్లారినది. అప్పుడు మేము వాజువములఁ దిగి యలయికదీరఁ గొంతవడి విశ్రమించితిమి. ముందుకర్తవ్య మేమని యాలోచించితిమి. తిరుగా నట్టి వాతంబు వీచునేమోయని వెఱపు జెందుచు నెట్లుపోవుటకుం దోచక పరితపించుచుంటిమి.

మాతమ్ముఁడు సుధర్ముఁడు మనమిప్పుడీ పర్వతశిఖరమిక్కి నలుమూలలు పరికించి నదులు, గ్రామములు, నరణ్యములు నేమూల నున్నవియో యెట్టిపరిమాణము గలవియో తెలిసికొందము పిమ్మట నప్పటికిఁ దోచిన మార్గంబునం బోవుదమని యుపాయముజెప్పెను. అందుల కందఱము నను మోదించితిమి.

గుఱ్ఱంబులఘాసకబళంబులఁ మేసితృప్తిపరచి నీరుద్రావించి మేము ఫలాహారములఁదృప్తులమై మంచివేళయనితోచినసమయంబునగుఱ్ఱము లనెక్కి జయపరమేశ్వరా యని యుచ్చరించుచు నొకనివెనుక నొకఁడు తత్తడిని నడిపించుచు నక్కొండ యెక్క ప్రారంభించితిమి. కొంతదూ రము సులభముగా నెక్కఁగలిగితిమి. పోయినకొలఁది నిడుపుగానుండు టచేఁ బ్రక్కప్రక్కగా నడిపించుచుంటిమి.

మామావులు తావులెఱింగి యొక్కొక్కచోఁ బక్షులవలె నెగు రుచు నొక్కచోఁ గోతులవలె దాటుచు నొక్కచోఁ బురుగులవలెఁ బ్రాకుచు మోకాళ్ళ నానియాని డెక్కలఁ జిక్కఁబట్టి క్రోధంబుదెచ్చి కొని పోరంబులఁ జఱియలనంటియంటి నడుములువంచి పొదలదూరి

కంటకపాషాణాదులవలన మేనులు జీరికొనిపోయి రక్తము గారుచున్న ను లక్ష్యము సేయక యతి ప్రయాసముతో నాపర్వత మెక్కఁ దొడంగినవి.

ఆఘోటకముల పాటుజూచి మే మాత్రపడుచు నడుమనడుమ గుల్మములుదిగి యడ్డుపడిన కంటకలతాగుల్మాదుల నరికివైచుచు నాగ చేయు రాల నేలఁదొర్లించుచు జీజీకొని పోయి రక్తముగారు వాజువ ముల గాత్రములకు నాకుపసరు లంటించుచు వాని కాళ్ళు తోమి త్రోమి యలయికలఁదీర్చి తటాంతరముల మొలచిన గరికిపరకల మేపించుచు రాత్రిపడినంత నిరవగుపాషాణతలంబులఁ బండికొని వేగించుచు నైదుదినంబులకుఁ బ్రాణావశిష్టులమైయాకొండశిఖర మెక్కఁగలిగితిమి.

అందునిలువంబడి దక్షిణదిక్కంతయుఁ బరికించితిమి. ఇది యరణ్యము, ఇవి గ్రామములు, ఇవి గిరులను భేదమేమియుఁ దెలియఁబడలేదు. పెద్దనదులు వెండితీగెలవలె జూపట్టినవి. అంతయుఁ బచ్చగా నలికికొని పోయినట్లు కనంబడినది. మఱియునగ్గిరికూటము శృంగాటకమువలె విశాలసమభూతల విరాజమానమై యొప్పుచుండెను. ఇందేదేని వింతలు గనంబడకపోవునా యని తలంచి గుల్మముల కలయిక తీరినవెంటనే యుత్తరముగాఁ బోవఁ దొడంగితిమి. పోవునప్పుడు.

సీ. ఈప్రసూనవిశేష మీక్షించితిరె? వన్నెఁ
బద్మరాగప్రభ పరిహసించె
నీపూవుతావి నాసాపర్వమొనరించెఁ
గంటిరే! మణికర్ణికల నెసంగి
యీఫలంబుల రుచులెఱిఁగితిరే క్రోలి
యమృతంపురుచిఁ గేరియవఘటించు
క్రొత్తపూఁదేనె యీకొమ్మనంటె భుజింత
మిటు రారెయళుల రేపుటకు ముందు

గీ. భళిర మనమెప్పుడిట్టి పుష్పముల ఫలము
లను సువాసనలను దేనెలను విచిత్ర
లలిత పాదపదళలతావులను జూచి
యెఱుఁగమనుచు వచింతు మొండొరుల మేము.

అమ్మార్గంబున నదృష్టపూర్వములగు వృక్షలతాగుల్మాదుల నాలోకించుచు వింతలతాంతంబులఁ గోసి నాసాపర్వము గావించుకొనుచుఁబోయి పోయి.

క. జలవిహంగంబులు నళినీ
దళములు మత్స్యములులేక తటముల నోరయం
గల సలిలముతోఁ దగునొక
కొలనుంగనుగొంటి మేము కుతుకంబమరన్.

పద్మినీజలచరవిహంగమ మండూకశూన్యంబగు తటాకంబు గాంచి పిపాసాలసులమగుటఁ దత్తటనికటంబున ఘోటకంబుల దిగి జీనులవిప్పి గఱికిమేయుటకై వాని విడిచి తెరవునడచిన బడలికబాయ జలక్రీడలాడఁదలఁచి గుభాలున నాజలాకరంబునంబడి మునిఁగి తేలుచు డప్పికి నిలువలేక మాతమ్ములుముగ్గురును దోసిళ్లతో నీరువట్టిమూడు గుక్కలుగ్రోలుటయు నేను జూచుచుండ వారు ముగ్గురు చిలుకరూపముదాల్చి గగనంబున కెగసి యుత్తరమార్గంబుగాఁ బోయిరి.

అయ్యనర్థము గన్నులారజూచి నేను గుండెలు బాదుకొనుచు లేచి యాచిలుకలుపోయినదారిం బరుగిడికొనిపోయి తమ్ములారా! నన్ను విడిచి పోవుచున్నారా? నాదెస జూడరా? ఆప్రేమయంతయు నేమిజేసిరి? రండు రండు. చూడుఁడు. అని కేకలువైచుచు నవిపోయినదారిని కొంతదూరముపోయితిని. అంతలో నాచిలుక లదృశ్యములై దూరముగాఁ బోయినవి. పక్షులతో నేను బోవఁగలనా? నిరాశజెంది పిమ్మటఁబోక మరలి తటాకంబునకరుదెంచి తచ్చిహ్నములఁ బరికించి

దుఃఖించుచు నేమిచేయుటకుం దోచక అయ్యో! నాతమ్ములు చిలుక లై పోయిరి. ఇఁక వారి నీజన్మంబునఁ జూడఁజాలను. ఈతటాకజలం బున నిట్టిదోషముండఁబట్టియే జలచరశూన్యమైనది. మాకర్మమిక్కడి కీడ్చికొనివచ్చినది. మాదిగ్విజయయాత్రఫలం బిట్లు పరిణమించినది. అన్నగారేమైరో తెలియదు. తమ్ములిట్లైరిగదా. నేనొక్కరుండ మిగిలి యేమిచేయువాఁడ బ్రతికినను ఫలమేమి? నేనుగూడ నీనీరు ద్రావి చిలుకనై యీదుఃఖము మఱచి వానితోఁగలసికొనియెదంగాక. ఇంతకన్న వేఱొకమార్గమునుపోవదగినది కాదు. అనినిశ్చయించినీటిదరి కరిగి దోసిట నీరుపట్టి నోటియొద్దకుఁ జేర్చికొని యంతలో మఱల దింపి యిట్లు తలంచితిని.

మ. అకటా! సర్వగుణాభిరాముఁడగు లోకాధీశు పుత్రుండనై
సకలక్ష్మాతలనాథ సన్నుతయశఃపాత్రంబునం బొల్చు వా
రికిఁ దమ్ముండననొప్పి నిర్జితమహారివ్రాతుఁడై నట్టి నే
నొకకీరాధమరూప మూనఁదగునొక్కో? నీచుచందంబునన్.

ఇప్పుడు నేనీజలంబు ంగ్రోలి శుకంబునై యెగసిపోయిన నాజీవిత మింతటితో సమాప్తినొందెడిని. అంతకన్న మృతినొందుటయే శ్రేయ ము "జీవన్ భద్రాణిపశ్యతి" అనునార్యోక్తియు విమర్శింపఁదగినదియే. నేనుగూడఁ బక్షినగుటకంటె సోదరుల పక్షిరూపము మార్చు ప్రయ త్నముచేయుట లెస్సయని తలంతుఁ గొంత ప్రయత్నము జేసి చూచె దంగాక యత్నము సఫలముకానినాఁ డీపనిచేయవచ్చును మనుష్యుల బక్షులఁజేయు సామర్థ్య మీతటాకమున కెట్లువచ్చినదో తెలిసికొన వలసియున్నది. యూరకచచ్చినఁ బ్రయోజన మేమియున్నది. అని తలంచి నాదోసిటనున్నజలం బవ్వలఁ బారజిమ్మితిని.

వెంటనేలేచి యా తటాకమునకు మూడు ప్రదక్షిణములుచేసి తిని. ముకుళితకరకమలుండనై యో కాసారరాజమా! నీ ప్రభా

వమే మహానదులకులేదు. గంగాది తరంగిణులు సేవించిన వారికి మరణానంతరమునఁగాని ముక్తి నీయఁజాలకున్నవి. జలపాన మాత్రమున నే సద్యోదేహవిముక్తి నిచ్చుచుంటివి. నీకు నమస్కారము నీకిట్టి సామర్థ్యమెట్లు వచ్చినదియో తెలుప బ్రార్థించుచున్నాను.

అని పలుకుచు నేదియో ధ్యానించుచుండ దత్తటంబున మేయుచున్న మా గుఱ్ఱములు నాలుగును దప్పిగొని తటాలునవచ్చి యా చెఱువునీరు రెండు గుక్కలు గ్రోలి చిలుకలై యెగసిపోయినవి. ఆమార్పుజూచి అయ్యయ్యో నేనెంత మఱపుజెందితిని. భ్రాతృవియోగశోక వేగంబున నీనిమాట మఱచిపోయితిని. మాతోఁగూడఁ గష్టసుఖంబు లనుభవింపవచ్చిన యీగుఱ్ఱములు తమ్ములలోఁ గలిసిపోయినవి, కానిమ్ము. ఎన్నిటికి విచారింతును! తలిదండ్రుల మాట వినని నిర్భాగ్యులిట్లే కష్టముల పాలగుదురు. వీరి యాకారములు మారుట కేదేని యాధారము దొరకిన సరే. లేకున్న సరస్తోయంబు లుండనే యున్నవి. మఱికొన్ని దినంబు లీకూటశృంగాటకంబున సంచారము గావించి చూచెదంగాక యని తలంచుచుఁ దత్ప్రదేశము లన్నియుం దిరిగి చూచుచు నందందు సంచరించు చిలుక గుంపుల దాపునకరిగి తమ్ములారా! అని పిలుచుచు బ్రతివచనంబు బడయక పూర్వ వృత్తాంతము దలంచుకొని దుఃఖించుచుఁ బదిదినము లతికష్టము మీఁద వెళ్ళించితిని నాయరణ్య రోదనమునకు ఫలమేమియుఁ గనంబడ లేదు సీ! నేనువట్టి మూఢుండనై యిట్లు తిరుగుచుంటి దైవము మమ్మిచ్చటఁ గష్టములుపాలు సేయఁదలంచెను. తదాజ్ఞ నతిక్రమింప నేనెంత వాఁడను ప్రారబ్ధశేషమున నాకీ పదిదినములు బ్రతికి శోకించుటకుఁగారణమైనది. నేను నాఁడెచిలుకనైతినేని యీశోకముండునా. ఇఁక నాకు వేరొక తెరవులేదు. ఈ జన్మమున నాకన్నదమ్ములతోఁ గలియు భాగ్యముపట్టదు. వట్టియాస బెట్టుకొని తిరిగితిని.

అని యాలోచించి తటాకమునకరిగి స్నానముచేసి కన్నులు మూసికొని దోసిలితో జలంబులెత్తి పరమేశ్వరుని ధ్యానించుచు మహాత్మా! నాకు నిరుపమానసౌందర్యకళాబలపరాక్రమాది విశేషములొసంగియుఁ జివర కీయడవినడుమ దిక్కులేక యొక్కరుఁడ దేహమువిడుచునట్లు చేసితివే? ఏమిపాపముజేసితిని. మాతమ్ము లీకష్టము లేమియు నెఱుంగకుండ చిలుకలై యెగసిపోయిరి. నాకీజ్ఞాన మేల కలుగవలయును? నన్నుఁగూడఁ దెలియకుండఁ జిలుకంజేసిన బాగుండునే! నాప్రారబ్ధమునునీవెట్లుమార్చుదువు?ముందుజన్మమునందైననిట్టి కష్టములు లేకుండ జేయుమని ప్రార్థించుచు జలపానంబుసేయ నుద్యుక్తుండనగునంతలో నత్తటాకజలాంతరమున గుభాలుమని యొక పెద్ద చప్పుడైనది. అదరిపడి కన్నులం దెరచి చూచితిని. ఆజలమధ్యమునుండి సుడిగుండములువోడమ దోయంబుపొంగి తటంబనగొట్టుకొన

గీ. మూరెడేసిగోళ్లు మోకాళ్లదనుక వ్రే
లాడుజడలుగల్గి చూడ భీతు
గదుర నొక్కసత్వ ముద కాంతరమునుండి
పైకివచ్చెఁ గచ్ఛపంబుపగిది.

ఆసత్వంబు మకరమత్స్య కచ్ఛపాదుల బోలక వేఱొక విధంబున నుండుటంగాంచి నేను వెరఁగందుచు నన్నిది గడతేర్చు నేమోయని వెరపుతోనుండి తచ్చర్యలం బరికించుచుంటి. ఆసత్వంబు క్రమంబునఁ బశ్చిమతటంబుజేరి కూర్చుండెను. అప్పుడు చూడంజూడ మనుష్యాకృతిగా తోచినది సూర్యున కర్ఘ్యప్రదానమిచ్చినంత నేనతండొక దిగంబరియోగియని తెలిసికొంటి. అయ్యోగి కొంతసేపు జపముచేసుకొని యట్టె లేచి తత్ప్రాంతమందు నెరయఁబడిన తరునికటంబునకరిగిదోయిలిపట్టుటయు నందలిఫలంబులు జలజలరాలి కొన్ని వాని దోసిటంబడినవి. వానిం దెచ్చికొని తీరంబునం గూర్చుండి

దేవతా నివేదనము గావించి కొన్ని భక్షించెను.

నేనావింత కన్నులార జూచి యోహో! ఈమహాముని యెవ్వఁడో జలస్థంభనజేసి తటాకములో జపము జేసికొనుచున్నాఁడు. ఇప్పు డేకారణముచేతనో బాహ్యప్రచారముగలిగి బయటకువచ్చెను. ఇమ్మహాత్ముని జలచరమనకొంటి నాపాపము శమించుఁగాక. నే నిప్పు డీతని చెంతకరిగి పాదంబులంబడి వేడికొనియెదను. కృపా దృష్టులు నాపై బరగించెనేని మనుష్యులలోనన్నుఁ బోలు పుణ్యాత్ముఁ డుండఁడు. ఇంతవఱకు నిష్ఫలమని తలంచిన మాప్రయాణము సఫల మగును. అలిగి శపించెనా కృతార్థుఁడనే యగుదును. అని తలంచుచు నంజలినున్న నీరుపారఁజిమ్మి మెల్లనలేచి కరయుగంబు శిరంబునంజేర్చి మందగమనంబున నవ్వలితటంబున కరిగి దూరంబునుండియు సాష్టాం గముగా నేలంబడి పాకుచుంబోయి అతనిచరణ పంకజంబులం బట్టు కొంటిని అమ్మునిపతి యదిరిపడి యెవడవురా! ఈవిజనస్థలంబున కెట్లువచ్చితివి? తటాకజలంబులఁ గ్రోలలేదా! అని యడిగిన నేనల్లన లేచి వినయ భయభక్తి విశ్వాసములు ప్రకటించుచు నిట్లంటి.

మహాత్మా! అతి పవిత్రములగు మీదృష్టి ప్రసారములు నాపై వ్యాపింపఁజేసితిరి. నా పాపములు పటాపంచలైనవి. నేను గడుపుణ్యాత్ముండనైతి నాపురాకృత సుకృతములు ఫలించినవి. ఆహా! పామరుండనగు నేనెక్కడ? పరమహిమాస్పదంబగు నీ పరత్వ శిఖర మెక్కడ? దేవతలకైన పడయ శక్యముగాని మీ దర్శనమెక్కడ! నాకు నేఁడెట్టి సుప్రభాతమైనది! నా జన్మావధిలో నిట్టి శుభ వాస రములేదుగదా! ఇఁకనే జచ్చినను ధన్యుండనే. అని యనేక ప్రకారము లగ్గించుచు నా వృత్తాంత మంతయు సంక్షేపముగా నెఱింగించితిని మత్పూర్వకృత సుకృత విశేషమువలన నా నుడివిన నాలుగుమాటలు నెన్నినాళ్లకోగాని బాహ్యప్రచారములేనియామహాయోగిచెవింబడినవి.

ఒక్కసారినన్నుఁ బవిత్రుంజేయువాఁడుంబోలె నా దెసఁజూచి స్తుతివచనములకేమి ? నీ కోరికయేదియో చెప్పుమని యడిగిన నేను దొందరపడుచు నేమికోరవలయునో తోచక నేను మా సోదరులతోఁ గూడికొని సుఖముగానింటికింపోయి తలిదండ్రులకు నమస్కరించు వట్లనుగ్రహింపు డింతకన్న నధికమేమియు నీయనక్కరలేదని కోరితిని. ఆ సిద్ధుండట్టలేచి యేదియో మూలిక పెరికికొనివచ్చి నాకిచ్చి చేయఁ దగిన విధానము బోధించి పోపొమ్ము నీ తలంచినట్లగునని పలుకుచు నా యోగి గుభాలునం దటాకములో నఱికి మునిఁగిపోయెను.

అయ్యోగి మూలమున నా కర్మసూత్రంబు బయటఁబడినదని సంతసించుచు నమ్మూలికను బదిలముగా మూటగట్టికొని చిలుకలనర యుచుఁ గ్రమ్మర నాశిఖరప్రదేశమంతయుఁ దిరుఁగఁజొచ్చితిని. చిలుకలు గనబడినను నేనుదాపునకుఁబోయినంత నెగిరిపోవుచుండునవి. చెట్ల శాఖలనున్న చిలుకలకీ మూలిక దగిలించుటయెట్లు? అని యాలోచించి మట్టియుండలఁ గొన్నిటంజేసి పచ్చిగానున్న యామూలికబెరడు ఆయుండలో గలిపి కనంబడిన చిలుకకుఁ దగులునట్లు విసరుచుంటిని.

## చారుమతికథ.

ఒకనాఁడొక తరు శాఖపై నిలువంబడి మధురముగాఁ బలుకు చున్న యొక చిలుకంగాంచి పొంచి పొంచి దాపునకుంబోయి గుఱి జూచి యా మట్టి దాని పాదంబులకుఁ దగులునట్లు గొట్టితిని తత్సం పర్కంబు గలినంత.

చ. కలకల నవ్వునెమ్మొగము గంతుశరంబులఁబోలు సోగ క
 న్నుల వెలిచూపు లద్భుత తనూద్యుతి చక్కని కౌను తళ్కు చె
 క్కులు మృదుపాదముల్ గులుకు గుబ్బలుగల్గి మనోహరాకృతిం
 చిలుక నెలంతయై నిలిచెఁ జెంగట విస్మయమాత్మఁదోపఁగన్.

నే నాయెలనాగం గాంచి వెరగుపాటుతో బోటి! నీవెవ్వని కూఁతురవు?

నీపేరేమి? మాతమ్ముల వలె నీవీతటాక జలంబులఁ గ్రోలి చిలుక వైతివాయేమి? ఈదుర్గమ శిఖరంబున కెట్లువచ్చితివి? నీవృత్తాంతము చెప్పుమని యడిగిన నప్పుడతి నాకు నమస్కరించుచు నిట్లనియె.

మనోహరాకారా! నే నవంతీశ్వరుని కూఁతురను. నా పేరు చారుమతి యండ్రు. మా తండ్రికి నే నొక్కరితనే పుత్రికనగుట నాకుఁ బెండ్లిచేయు తలంపుతో వరాన్వేషణము నిమిత్తము భూమండలంబంతయుఁదిరిగి యెందును దగిన పురుషుం గానక స్వయంవర మహోత్సవము చాటించెను. ఆ యుత్సవమునకు రూప యౌవన మదగర్వితులగు రాజకుమారు లనేకులువచ్చి సభ నలంకరించిరి.

అప్పుడు నేను దివ్యభూషాంబర మాల్యానులేపనాదుల నలంకరించుకొని యంతఃపురమునుండి బయలుదేరి సఖీహస్తావలంబనంబు గావించి మెల్లగానడుచుచు సభాభవనము చేరునంతలో నొక్క బ్రహ్మ రాక్షసుం డెక్కడనుండియోవచ్చి గ్రక్కున నన్నుక్కునం జేర్చికొని యందున్న వారెల్ల హాహాకారంబులు సేయుచుండ నురగింబట్టికొనిన గరుడ పక్షియుంబోలె నాభీలవేగంబున నెగసి యాకాశ మార్గంబునం బడిపోవఁదొడంగెను.

అప్పుడు నేనుకురరియుంబోలె వాని బుజంబుననుండి వాపోవుచు శోక వేగంబున నొడలెఱుంగక మూర్ఛవోయితిని.కొంత సేపటికి వాఁడు నన్నీ శిఖరముమీఁదకుఁ దీసికొనివచ్చి యిందు దింపి సేద దీర్చుచు నిట్లనియె. సుందరీ! నేను మధుండను దానవచక్రవర్తిని. గగనంబునం బోవుచు నిన్నుఁజూచి మోహపరవశుండనై యెత్తికొనివచ్చితిని. భుజబలంబున నాకీడగువాఁడు మూడులోకములలో లేడు. ఇగ్గిరికూటంబు మిథునవిహారమునకువాటమైయున్నది. యథేచ్ఛముగా మన మిందు సుఖింపవచ్చును. నన్నంటియున్న మదనుం దృప్తిపరచితివేని నీకు దాసుండనై పరిచర్యలఁ జేయువాఁడఁ గన్నులెత్తినన్నొకః

సారి చూడుము తలోదరీ! నీచిలుకపలుకుల నాచెవి సోకింపుము అని యేమేమో దుర్భాషలాడ వినిపించుకొనక నోటికివచ్చినట్లు వానిం దిట్టుచుఁ బెద్దయెలుంగున విలపించితిని.

నాలుక యెండి యెలుంగురాక తొట్రుపడుచుండ నాదాన వుండు అయ్యయ్యో! ప్రేయసీ! వెక్కివెక్కి యిట్లేల యేడ్చెదవు? శోకతాపంబున నీనాలుక యెండిపోయినదిగదా. తటాకజలంబులం దెచ్చి యిచ్చెదఁ ద్రాగెదవా? అని పలుకుచు వాఁడాసరోవరములోఁ దిగి యేమిచేసెనో తిరుగా వాఁడు నాకడకు రాలేదు. ఎంతసేపటికి వాఁడురాకున్న వెఱఁగుపడుచుఁ గన్నులెత్తి నలుమూలలు చూచితిని. ఎందును వానిజాడ గనంబడలేదు. ఆతటాకములోఁ గాలుజారి పడె నేమో యని తలంచితిని. ఏది యెట్లైనను నానాలుక యెండిపోవు చున్నది. నీరుత్రాగి తరువాత వానిసంగతి విచారింతమని తలంచి నేను మెల్లన జలాకరమున కరిగి జానుదఘ్నంబగు నీట నిలిచి చేతు లతో జలోపరిభాగంబునందలి మలినంబు ద్రోయుచు మొగముగడిగి కన్నులఁ దుడిచికొని యంజలిచే రెండుగ్రుక్కలు నీరు ద్రావితిని. సౌమ్యా! అంతలో నాదేహము చులకనై చిలుకనైపోయినట్లు కొంచెము జ్ఞాపకమున్నది. తరువాత నేమిజరిగినది తెలియదు. నాకీరూప మెట్లువచ్చినదియో దేవరయే చెప్పవలయును అనియాత్మీయవృత్తాం తమంతయు నెఱింగించినది.

ఆకథ విని నేను మిక్కిలి యాశ్చర్యమందుచు రాజపుత్రీ! నీ చరిత్రముకొంతమమ్ముఁబోలియున్నది. మాతమ్ములుముప్వురీచెఱువు నీరు త్రాగి నీవలెనే చిలుకలై యెగిరిపోయిరి. వారినిమిత్తమే నేనిం దు గ్రుమ్మరుచున్నవాఁడ. ఈతటాకాంతరమున నొకసిద్ధుండు తపం బుజేసికొనుచు జనసంబాధమునకు వెరచి యీనీరుత్రాగినవారు చిలు కలై యెగసిపోవుదురని నియమముజేసెను. నేను తమ్ములపోకకుఁజిం

తించుచు మరణకృతనిశ్చయుండనై యుండ నమ్మహాత్ముఁడ దర్శనమైనది. అతనివలన నీమూలిక గ్రహించితిని. దాని సంపర్కంబున నీవు కలికి వైతివని నావృత్తాంతమాద్యంత మెఱింగించుటయు నాచంచలాక్షి సంతోష మభినయించుచు నాకిట్లనియె.

మహారాజపుత్రా! నీవు నాకుఁజేసిన యుపకారమునకుఁబ్రతి యేమియుం జేయఁజాల. క్షుత్పిపాసావ్యసనగ్రసితమగు పక్షిరూపము వాయఁజేసి తొంటిరూపు గలుగఁజేసితివి. లేకున్న నాజన్మాంతము యీయడవులలో దిరుగవలసినదియేకదా. జీవితాంతమువఱకు నీపాద సేవజేసి మీఋణము తీర్చికొనఁదలంచితిని. అందుల కంగీకరించితి రేని నన్నెత్తికొనివచ్చినయీనక్తంచరునిఁబరమోపకారిగాఁ దలంచెదనని పలికిన విని నే నిట్లంటి.

తరుణీమణీ! నేనీయుపకృతి నీకుఁ జేయవలయునని చేసినది కాదు. యదృచ్ఛముగా నీ కుపచరించినది. అందులకు నీవునన్నింతగాఁ గొనియాడఁబనిలేదు. నిన్నుఁ బూవులఁబెట్టి తీసికొనిపోయి మీతలి దండ్రుల కప్పగించెదను. అందు నీనిమిత్తమై క్రమ్మఱ నీతండ్రి స్వయం వరము చాటించును. నీయిష్టమైనభర్తను వరింతువుగాక. ఇప్పుడనన్య గతికవని యాలోచింపవద్దు. ఇది కపటముగాఁ జెప్పిన మాటగాదు. యథార్థవచనమని పలికితిని.

ఆచిన్నది నామొగముపై దైన్యదృష్టుల వ్యాపింపఁజేయుచు మనోహరా! పదిమాటలాడుటచే నాకు మీకడఁ జనువుజిక్కినది. మీమాటల కే నంగీకరించితిని. మీరుగూడ నాస్వయంవరమునకు వత్తురుగదా. అందు మిమ్మే వరించితిననుకొనుఁడు. సరిపడినదియా? మాటల కుత్తరముజెప్పలేనిదానను గాను. నాయీవేషము నాఁటిదే. ఈదామము నాఁడు బూనినదే. త్రికరణములచేత నిదివఱకెవ్వరిని వరించియుండలేదు. దైవసాక్షిగఁ జెప్పుచున్నాను. మీనిమిత్తమే

నన్నా రక్కసుఁ డిక్కడికిఁ దీసికొనివచ్చినాఁడు. మీరేనాభర్తలు. అని పలుకుచు నానందాశ్రువులతో నాదామము నామెడలో వైచినది. నేనును దత్ప్రీతి త్వమున కనుమోదించి యాదరించితిని. ఇరువురము కొండశిఖరంబునఁ జిలుకలగుంపులఁ బరిశీలింపుచుఁ గొన్ని దినములు వసించితిమి. ఒకనాఁడు నే నిట్లంటిని. రమణీ! మాసోదరు లీకూటంబున నున్నట్లులేదు. ఇప్పర్వతమున కుత్తరభాగంబున నొక్కపట్టణా మున్నదఁట.ఇందు లేకున్న నందుఁబోయి వెదకుమని యాసిద్ధుండానతిచ్చియున్నవాఁడు. కావున మనమందుఁ బోవలసియున్నది. నీ వెట్లు దిగుదువో యని యాలోచించుచున్నవాఁడ నికొండ దిగు పాటవము నీకుఁ గలదా? అని యడిగితిని. ఇట్లు చేయరాదా? అని యాచిన్నది నాకుపాయము చెప్పినది. దానిబుద్ధినైపుణ్యమునకు నేను సంతోషించుచు నప్పుడే యొకవెదురుగొట్టము బాగుజేసి దానినిండ నాతటాకజలంబెక్కించి చీల బిగించి యామూలికలు దానితోఁ జేర్చికట్టి చారుమతిచే నాకొలనినీరు ద్రాగించితిని. అక్కలికి చిలుకయై నిలువంబడినది. దాని కాలికిఁ ద్రాడుకట్టి చేతికిఁ గట్టికొంటిని.

ఆవెదురుగొట్టముకట్ట బుజముమీఁద బెట్టుకొని దానిపైఁ జిలుక నెక్కించి యొకప్రక్కనుండి యక్కొండదిగుటకుఁ బ్రారంభించితిని. అప్పుడు నాకుఁ గొండదిగుటకంటె నెక్కుటయే సులభమని తోచినది. క్రిందుఁజూచిన నగాధముగాఁ గనంబడును. ఒక్కొక్కచోట నూఁతివలె నుండుటచే నతికష్టముమీఁదఁ దిగఁగలిగితిని. క్రిందికి దుమికి కాలుజారిన వృక్షశాఖలం బట్టుకొని యాగుచుండెడివాఁడను. ఈరీతి నతికష్టంబున నక్కొండ దిగగలిగితిని. కొంతదూరమందుండఁగనే యా నగరము నాకుఁ గన్నులపండువ గావించినది. దగ్గిరఁ జేరినకొలఁది పురిచుట్టు ప్రాకారి గలిగియుండుటంబట్టి యుత్తరముగాఁ బోయి గిరిదిగి పాటలోఁ జేరితిని. వీరవేషంబుతోఁ బోయిన నగరములోనికి బోనీయ

రని తెలిసికొని కోయవానివేషము వైచితిని. తరుచు జిలుకలు రాణి వాసములలో స్త్రీలచేఁ బెంపఁబడుచుండును కావున నాభార్యచే గోయసానివేషము వేయించితిని. నాచేతినున్న రవ్వయుంగర మొకటి యమ్మి బంగారముకొని కరగించి యామూలిక దానిలోఁగలిపి మువ్వ లుజేయించితిని.

వీఁటిసత్రములోఁ జేరినపిమ్మటఁ జిలుకగానున్న నాభార్యను మువ్వలు తగిలించి స్త్రీనిజేసితిని. చేయఁదగినకృత్యములు బోధించి కోయమాటలు నేర్పి యూరిలోనికిఁ బంపి మువ్వలమ్మించితిని. దైవ కృపచే మాతమ్ములును గుఱ్ఱములును యథారూపము వహించినవి. చారుమతి నెత్తికొనివచ్చిన రక్కసుఁడు ఆనీరుద్రాగి చిలుకయై కొండ వాండ్రచేతిలోఁ జిక్కి బోగముదానికమ్మఁబడియుండెను. మామువ్వల సంపర్కంబున నాఁడు నిజరూపము దాల్చి యంతయల్లరి గావించెను. ఇదియే మాచరిత్రము. భగవంతుని యెత్తికోలు ఎవ్వరికిం దెలియదు గదా. ఇప్పటికి మేమందర మొకచోటికిఁ జేరుకొంటిమి. సిద్ధునికృపచే నీసంఘటనము గలిగినది. ఆచారుమతియే కోయదొరసానివేషము వైచికొని మువ్వలమ్ముచు నీరాజుగారి యంతఃపురముకరిగి రాజపుత్రి కలు పెనుచుచున్న చిలుకలకుఁ గట్టించి మాయుద్యమము సఫలము జేయించినది. తరువాతివృత్తాంతమంతయు మీాపౌరు లెఱింగినదియే కదా. మిమ్మును మీానగరస్థులను శ్రమపెట్టినందులకు మాతప్పులు క్షమింపవలయునని కోరుచున్నాను. అని చెప్పి హరివర్మ పీఠముపైఁ గూర్చుండెను.

అవృత్తాంతము విని సభ్యులెల్లరు నాశ్చర్యసాగరంబున మునిం గిరి. పిమ్మట సోమదత్తుండు వారి నలువుర నగరిలోపలకుఁ దీసికొని పోయి గౌరవించుచు హరివర్మ కిట్లనియె. మహావీరా! మీాతమ్ములు మువ్వురు శుకరూపమున మాయంతఃపురములఁ బ్రవేశించి యుండే

స్వ స్వరూపముఁల దాల్చిరి. ప్రఫుల్ల నాపుత్రిక. కాళింది మంత్రి పుత్రిక. రుక్మవతి సామంతరాజు పుత్రిక. మీతమ్ములపోలిక గ్రహించుట గ్రొత్తవారికి గష్టముగానుండును. కావున వారే యెవ్వరేకన్యక యంతఃపురమున వెలసిరో యాకన్యకం బాణిగ్రహణము జేసికొనవలయును. ఇది మాయభిలాష యని వినయముతోఁ బ్రార్థించుటయు హరివర్మ యంగీకారము సూచించెను.

అంత నమ్మహారాజు శుభలగ్నంబునఁ గళాభిరామునకుఁ దన పుత్రిక, ప్రఫుల్లను, మంత్రిపుత్రిక కాళిందిని సుధర్మునకుఁ, రుక్మవతిని సులోచనునకు యిచ్చి వివాహము గావించెను. మరియు నవంతీశ్వరుఁడు దూరమందున్నవాఁడగుటఁ జారుమతీకన్యాదాన సంస్కారము తానే గావించెను.

రామలక్ష్మణ భరతశత్రుఘ్నులువలె నా రాజకుమారులు నలువురు నేక కాలమున వివాహమహోత్సవముల నానందించి భార్యలతోఁ గూడఁ గొన్ని దినంబు లందు నిరవధిక కేళీవిలాసములతో వెళ్ళించిరి.

అని వినిపించి తరువాతనగు కథ నిట్లు వచియించెను.

230 వ మజిలీ.

రాజపుత్రులు నిత్యము స్వదేశమున కరుగఁ దొందరపడుచున్నను సోమదత్తుని నిర్బంధమునఁ గొన్ని నెల లాగిరివ్రజపురంబున నుండక తీరినది కాదు. అక్కడినుండి కాశ్మీరదేశమునకు మార్గము కడు సంకటముగా నుండును. ఆ దేవకూటశైలము తిరిగిపోవలయును. మంచి దారులులేవు. కొండలనడుమనుండి యడవులమీఁదుగాఁ బోవలయును.

సోమదత్తుఁడు సుముహూర్తమున వారికిఁ బ్రయాణము నిరూపించి దాసదాసీసహస్రము లరణముగా నిచ్చి యేనుఁగులు గుఱ్ఱములు లొట్టియలమీఁదను సారెవస్తువు లెక్కించి పుత్రికల నందలము లెక్కించి చతురంగబలముల సహాయమిచ్చి యంపకము గావించెను.

హరివర్మాదిరాజకుమారులు నలుఁవురు తమగుఱ్ఱములెక్కి యాశ్వికులు పెక్కండ్రు చుట్టుకొనిరా మజిలీలుజేయుచు మృగముల వేటాడుచు నదీసైకతప్రదేశముల విహరింపుచు విచిత్రవృక్షలతాగుల్మాదులనవలోకింపుచు నిరువదిదినము లయ్యరణ్యమార్గంబునం బ్రయాణముసాగించిరి.

ఒకనాఁడొక మహారణ్యమధ్యంబున నిర్మలకుల్యాతీరసైకతలంబున విడిసి పటకుటీరంబుల వెలయించి యందలి ఫలతరులతావితానంబులు వినోదము గలుగఁజేయ భార్యల ప్రోత్సాహంబున మూఁడుదివసంబు లందు వసించిరి. మఱియు వారు ప్రొద్దున లేచి వారువంబులెక్కి స్వారిచేసి రెండు గడియలలలోఁ దిరిగి వచ్చువారు.

మూఁడవనాఁడు హరివర్మ తూర్పుగాఁ బెద్దదూరము పోయి తిరుగా వచ్చునప్పుడు దారితప్పి దిగ్భ్రమజెంది వచ్చినదారియేదియో పోవలసినదారి యేదియో తెలియక మధ్యాహ్నముదనుక కనంబడిన దారినెల్లఁ బోవుచుండెను. అట్లు కొంతదూరము పోవఁ దూర్యనాదములు వినంబడినవి. అందులకు శంకించుకొనుచు నాప్రాంతమం దేదియో గ్రామమున్నదని నిశ్చయించి యాధ్వని ననుసరించి తన గుఱ్ఱమును నడిపించెను. పోయినకొలఁది యానాదములు హెచ్చుగా వినంబడుటయేకాక మనుష్యుల కోలాహలముతోఁ గూడ తౌర్యత్రికరవంబు శ్రోత్రపర్వము గావించినది.

అతం డది గ్రామమని నిశ్చయించి వేగముగా గుఱ్ఱమును దోలుటయు నొక కోటగోడ యగుపించినది. దానిచుట్టునుం దిరిగి సింహద్వారము దాపునకువచ్చెను. అందు విచ్చుకత్తులతో రాజభటులు పహారాయిచ్చుచుండిరి. ఆకోటలో నేదియో శుభముజరుగుచున్నట్లు తెలిసికొని హరివర్మ ద్వారపాలురతో గుఱ్ఱముపైనుండియే యీకోట యెవ్వరిది? లోపల జరుగుచున్న యుత్సవమేమని యడిగిన నతనిమాట యెవ్వరును వినుపించుకొనరైరి.

ఇంచుక యలుకజెంది హరివర్మ గుమ్మము దాపుగా గుఱ్ఱము నుదోలి యొకనితో నోయీ! ద్వారపాలుర కింత యవివేకము తగదు. బాటసారితో మాటాడినంతనే యధికారము కొరంతయగునా? నామాట వినిపించుకొంటిరి కారిది మర్యాదయే యని యడిగిన స్థానబల గర్వంబున వారిట్లనిరి. అబ్బో! గుఱ్ఱమెక్కినవారందఱు రాతులే కాఁబోలు. మమ్ము ధిక్కరించి యడుగుచుంటివి? నీవెవ్వఁడవు? నీమాటల కుత్తరము చెప్పుటకు మాకవసరములేదు. గుఱ్ఱము దిగి మాటాడుము. నిన్నుఁ బరీక్షించికాని పోనీయమని పలికిన, నతండు రౌద్రావేశముతోఁ దులువా! యేమంటివి? నిలువుమని పలుకుచుఁ దనచేతనున్న కొరడాతో వాని నొకదెబ్బ గొట్టెను.

అప్పు డందున్నవా రందఱులేచి గుఱ్ఱమును జుట్టుకొని యతని నదలింపఁబోయిరి. అతండు మొలలోనున్న కత్తితీసి గుఱ్ఱమును వారిపైకిఁదోలి త్రొక్కించుచుఁ గొందఱి శిఖలగోసి కొందఱి ముక్కులం జెక్కి కొందఱ చెవులు నరికి వారినందఱుం బారఁదోలెను. అప్పుడు కొందఱుభటులు లోపలికిఁ బరుగెత్తుకొనిపోయి జాతకర్మోత్సవముజూచుచున్న తన యేలికతో మహారాజా! మనసింహద్వారముకడ కెవ్వఁడో గుఱ్ఱమెక్కివచ్చి ద్వారపాలురం జంపుచున్నాడు. తగినవారిం బంపినగాని వాని యౌద్ధత్యము మానుప శక్యముగాదని తెలియఁజేసిరి.

అప్పుడు కూఁతురు నల్లుఁడు పీటలపైఁ గూర్చుండి శిశువునకు జాతకర్మ చేయుచుండిరి. ఒకమూల వారాంగన లాడుచుండిరి. యొకమూల బ్రాహ్మణులు వేదములు చదువుచుండిరి. సామంతులా యుత్సవముజూచి యానందింపుచుండిరి. అట్టితఱి నీవార్త వచ్చుటయు రాజు ప్రక్కనున్న మంత్రితోఁ గనుసన్నఁ జేసెను.

ఆసచివుండు దండనాథుం బంపెను. ఆసేనాధిపతి పదుగురు కింకరులతోఁ బోయి ద్వారపాలురపాటు జూచి రోషముదెచ్చుకొని

హరివర్మగుఱ్ఱమునఁజుట్టుకొని కొట్టఁబోవుటయు నతండవలీల వారి నందఱ గుఱ్ఱముచేఁ ద్రొక్కించి కాందిశీకులఁ గావించెను. దండనాథుండు దెబ్బలుతిని గొబ్బునలోపలికిఁబోయియీవీరుఁడుసామాన్యుఁడు కాడు. గొప్పప్రయత్నమునంగాని వాఁడు పట్టుబడఁడు. మఱికొందఱ యోధులం బంపుఁడని నృపతి కెఱింగించుటయు నందున్న వారినందఱ దీసికొనిపొమ్మని యాజ్ఞాపించెను.

దండనాథుఁడు పెక్కండ్రయోధులం దీసికొనిపోయి హరివర్మతో నాయోధనముజేయఁదలపెట్టెను కాని గడియయైన నాతనిముందర నిలువలేకపోయిరి. వారినందఱ గుఱ్ఱముచేఁ ద్రొక్కించి పారిపోవ జేసెను. రాజు యతండసాహాయశూరుండని తెలిసికొని మంత్రితో నాలోచించి యీయుత్సవమున కంతరాయముగాకుండ నల్లునికిఁ దెలియకుండ మనము పోయి వానిపౌరుష మేపాటిదియో చూతము గాక అని నిశ్చయించి యేదియో నెపమున్ని యిరువురు నట కదలి కవచంబుల దొడిగి శరశరాసనఁబులం దాల్చి గుఱ్ఱములెక్కి సింహద్వారముకడకుఁ బోయిరి.

అందు యోధులు పెక్కండ్రు మూర్ఛజెందియుండిరి. రాజు వారింజూచి కోపమాపలేక నీవెవ్వండవని యడుగకయే తనగుఱ్ఱమతనిమీఁదికిఁ దోలెను. వెంటనే మంత్రియు గొందఱు భటులు వానిం జుట్టుకొనిరి. అప్పుడు హరివర్మయం దొకభటుని చేతనున్న కరవాలము లాగికొని రౌద్రావేశముతో వాఱువమును బెండెములు త్రిప్పుచు రాజమంత్రిధానుల కిరీటముల శకలములగాజేసి భుజకీర్తుల నరికి వారి నిరువురఁ దురంగములనుండి క్రిందఁబడనేసి మూర్ఛ నొందించెను. లోపల రాజుగారి యల్లుఁడు బ్రాహ్మణాశీర్వాదమంది పీటలమీఁదనుండిలేచి మామగారికి నమస్కరింప నెందున్నవారని యడుగుచుండఁగనే కొందఱు భటులు పటురయంబున హాహాకారము

లతో వచ్చి మహాప్రభూ! రాజప్రధాను లిరువురు పడిపోయిరి. ఆ వీరుఁడు గుఱ్ఱముచేత వారిం ద్రొక్కింపఁ బ్రయత్నించుచున్నాఁడని తెలియఁజేసిరి. జామాత ఆవార్త యంతకుమున్ను వినియుండలేదు. వీరుఁ డెవ్వఁడు? రాజప్రధానుల ద్రొక్కించుటయేమి? అని విస్మయముతో నడిగిన కథయంతయుఁ జెప్పిరి.

అయ్యో ఇంతసేపు నాకుఁ దెలియనిచ్చితిరికారేమి? ఆవీరుఁ డెవ్వఁడు? ఈ యడవి నడుమ కెట్లువచ్చెను? వానికులసీల నామంబులుదెలిసికొనిరా? అని యడిగిన నవి యెవ్వరికిం దెలియవని యుత్తరము జెప్పిరి. అప్పుడతండు యొక గుఱ్ఱమెక్కి చంద్రహాసముబూని విల్లమ్ములఁదాల్చి యతి వేగముగా సింహద్వారముకడకుఁ బోయి యందున్న గుఱ్ఱముపైఁగూర్చుండి ప్రతివీరుని రాక నరయుచున్న హరివర్మంజూచిచూచి సంగరంబునకు దొడంగక యోహో! మహావీరా! నీ వెవ్వఁడవు? ఇక్కడి కెట్లు వచ్చితివి? ఊరక వారితోఁ గయ్యమేల చేసితివి? నీ వృత్తాంతముఁ జెప్పుమని యడిగిన నతండతని నెగాదిగఁ జూచి స్వరముదెలిసికొని యోహో! నీవు మా విద్యాసాగరుఁడవు వలె నుంటివే? యనుటయు నతని గురుతుపట్టి తమ్ముఁడా! హరివర్మా! నీవటోయి! నేఁడెంత సుదినము! అని గుఱ్ఱము దిగ్గనురికి యతని దాపునకు బోయి చేయందిచ్చెను. హరివర్మయు సంతోషముతోదిగి యతనిం గౌఁగలించుకొని యానందాశ్రువులచే నతని శిరము దడిపెను. గాఢాలింగనముల చే నొండొరుల ప్రేమదెలిపికొనిరి. విద్యాసాగరుఁడు హర్ష గద్గద స్వరముతోఁ దమ్ముఁడా! మనతమ్ము లెందుండిరి? నీవెట్లిక్కడికి వచ్చితివి? నీ వృత్తాంతము జెప్పుమని యడుగుటయు హరివర్మ విపరీత వాతంబునఁ దాను గొట్టుకొనిపోయి నది మొదలు నాఁటి వఱకు జరిగిన కథయంతయు నెఱింగించి యతనికి విస్మయ సంతోషములు గలుగఁజేసెను.

వారట్లు మాటాడుకొనుచుండఁగనే హరివర్మను వెదకికొనుచు దమ్ములు మువ్వురు గుఱ్ఱములెక్కి యక్కడికివచ్చిచేరి యన్నల నిద్దరఁ జూచి యోహో! పెద్దన్న విద్యాసాగరుఁ డిక్కడికెట్లు వచ్చెను నీకొఱకు నడవియెల్ల వెదకికొనుచు దైవికముగా నిక్కడికివచ్చితిమే అని పలుకుచు మువ్వురు నతనిపాదంబులఁబడి నమస్కరించిరి. వారిం గ్రుచ్చియెత్తి యాదరించుచుఁ బదుఁడు లోపలకుఁ బోవుదము. మా పుత్రుఁ జూతురుగాక మంచి సమయముననే కలిసికొంటిమి. నా కథ చాలకలదు. ఆనక జెప్పెదంగాక యని పలుకుచు రాజప్రధానులపై నీళ్లుజల్లించి సేద దీర్పించిరి. ఇరువురులేచి కూర్చుండి హరివర్మఁజూచి సిగ్గుపడుచుండ నూరడించి విద్యాసాగరుఁ డిట్లనియె.

మామా! వీరు నలువురు నా తమ్ములు నిజము దెలిసికొంటి. మీద్వార పాలునివలన నాకయ్యము బొడమినది. మీ్వారైనను నీ వెవ్వండవని యడుగక తొందరపడి కయ్యములో దిగితిరి. వానిగెలువ మీ తరమా! మంచివాఁడుకావున మిమ్ము గడ తేర్పక యవమాన పరచి విడిచి వేసెను. రండు! రండు! లోపలకుఁ బోవుదము అని వారి వృత్తాంతమంతయు వారికింజెప్పెను. హరివర్మతన తప్పు క్షమింపుమని రాజుఁగోరికొనియెను. ఆనృపతివారినెల్లలోపలకు దీసికొనిపోయిమిగుల గౌరవించుచు సంతోషముతో వారికథ తమబంధువుల కందఱకుం దెలియఁ జేసెను. విద్యాసాగరుండు తగువారింబంపి యడవిలోనున్న తమ్ములభార్యలను సపరివారముతో రప్పించి ప్రమద్వార యంతః పురమున కనిపెను. కుమారునికి తాళధ్వజుఁడని పేరుపెట్టిరి. ఆశిశువును లాలించుచు నాఁడెల్ల వారందఱు తమ పడిన కష్ట సుఖంబుల నొండొరులకుఁ దెలియఁ జేయుచుండిరి.

చ. అని యెఱింగించి యత్తపసి యీర! ప్రయాణపువేళమించిపో
యినదిగదా? కథాగత సమీాద్య లసత్ప్రతిభా చమత్కృతిం

జనవలె నింక లెమ్మనుచు ధాతురినితోఁ దదనంతర ప్రదే
శనిలయమేగి చెప్పె సరసంబుగ నవ్వలివార్త క్రమ్మఱన్॥

---

231 వ మజిలీ.

## స్వగ్రామప్రయాణము.

తమ్ములారా! వినుండు కీడుగూడ మేలునకే యొకప్పుడు కార ణమగుననుమాట మనయందు నిర్బాధమైనది. అమ్మహావాత పాతం బున గుఱ్ఱముతోఁగూడ నేనాదెసకు గొట్టుకొనివచ్చి యీకోటగోడ కు దగిలికొంటిని. మీకుఁబోలె నాకు మన గుఱ్ఱముజేసిన సహాయమె యీవైభవమునకుఁ గారణమైనది. కోటలోఁజేరిన పురుషులు స్త్రీల వలె నందున్నవారికిఁ గనంబడునట్లు కాశ్మీర దేశాధిపతి యొకసిద్ధు నాశ్రయించి వరముగాఁ బడసెనఁట! నన్నీ ప్రమద్వర యాఁడుదాన నకొని తన యంతఃపురమునకుం దీసికొని పోయినది. మత్సంప ర్కంబున గర్భవతియైనది. ఇందున్న కన్యకలందఱు పురుషోపసృత్త ముల నెఱుంగని వారగుట మాక్రీడల తెరంగెఱుఁగలేక పోయిరి. ఇందున్న ముసలిది ప్రమద్వర గర్భచిహ్నముల గ్రహించి నన్నుబెద రించుచు నామె తండ్రికి వార్తనంపినది. ఎవ్వఁడో పురుషుఁడు స్త్రీ వేషముతోవచ్చి నీపుత్రికం గలసికొనియెను. ఇప్పుడు గర్భవతి యైనది. నీకూఁతురు నామాట వినక సంతతము వానితో దిరుగు చున్నది. కాపాడుకొనుమని వ్రాసిన యుత్తరము జదివికొని ప్రమద్వర తండ్రి చతురంగబలములతోవచ్చి యీకోట ముట్టడించి నన్నుఁ బట్టుకొనుటకుఁ బ్రయత్నించెను. ఖడ్గప్రహారముల వారినెల్ల నేను కాందిశీకులగావించితిని. రాజు నా పరాక్రమము మెచ్చికొని యా సిద్ధుని యుపదేశమున నే నల్లుఁడగుట సంతసించుచు నాతో సంధి

చేసికొని వివాహమహోత్సవంబు గావించి నన్నుఁ దనరాజధానికి రమ్మని వేడుకొనియెను. నే నంగీకరింపక యిందే యుంటిని. ప్రమద్వర సకాలమునఁ బ్రసవమ్తై యీపుత్రరత్నముఁ గనినది. నేఁడే వానికి జాతకర్మోత్సవము చేయుచుంటిమి. లగ్నబలంబున మనమందరము నిందుగలిసియుంటిమిఅనితనవృత్తాంతమంతయుఁ దమ్ముల కెఱింగించెను.

ఆకథ వినిహరివర్మ అన్నా! మనుష్యుల శుభాశుభకర్మంబులు దైవాయత్తములై యుండును. మనుష్యులకంటె మృగములకు భావి శుభాశుభకర్మగ్రహణశక్తి యెక్కువగానుండును. నాగుఱ్ఱము దారితప్పి యిట్లు రాకున్న మనము కలిసికొనలేకపోవుదము. ఇఁక మనమింటికిఁ బోవలయును. అట్టిప్రయత్నము చేయుమని కోరికొనియెను. విద్యాసాగరుని మామగారగు శ్రీవర్ధనునితో దమయభిలాష తెలియఁజేసెను.

అన్నృపతి యంగీకరించి రెండువేల యేనుఁగులు నాలుగువేలు గుఱ్ఱములు దాసదాసీసహస్రములు చీనిచీనాంబరములు ధనకనకవస్తువాహనాదికముల గానేయముగా నరణమిచ్చి శుభముహూర్తంబున వారికిఁ బ్రయాణము సాగించెను.

రాజపుత్రులు మహావైభవముతో బయలుదేరి నడుమనడుమ శిబిరంబులువైచి విడియుచు దేశవిశేషముల సంగ్రహించుచుఁ నాయా మహీపాలు రర్పించుకానుక లందికొనుచు నీరీతిం బోయిపోయి యొకనాఁడు సాయంకాలమున మార్గవశంబునఁబరమ బవిత్రమైనద్వారవతీ పుణ్యక్షేత్రము జేరికొనిరి.

క. అని మణిసిద్ధుఁడు దెల్పిన
విని గోపాలుండు కడు వివేకముతో ని
ట్లను స్వామి! యీకథాంతర
మున నాకొక సందియంబుబొడమె వినుఁడొగిన్.

మహాత్మా! ప్రమద్వరయున్నకోటలో మగవారు ప్రవేశించి

నచో నందున్న యాఁడువారి కాఁడువారువలెఁ గనంబడున ట్లివ్వరో వరమిచ్చిరని చెప్పితిరి. అట్లె జరిగినది. లెస్సయే కాని తరువాత విద్యాసాగరుని కుమారుని జాతకర్మాద్యుత్సవంబుల కనేకులు మగవారు వచ్చినట్లుగాఁ జెప్పియుంటిరి. వారందఱు నందలివారికి మగవారుగనే కనంబడినట్లు చెప్పియున్నారు. మొదటినియమ మేటికిమారినది? యీసందియము తీర్పుఁడని యడిగిన నవ్వుచు గురుఁడు వత్సా! గట్టి శంకలే చేయుచుంటివి. ఔను. ఆమాట నడుగఁదగినదే. మొదట వర మిచ్చిన సిద్ధుఁడు ప్రమద్వరరక్షణార్థ మట్లు వరమిచ్చెను. వివాహము వఱకే యానేమము చెల్లునని యాసిద్ధుం డానతియిచ్చియున్నాఁడు దానంజేసి జాతకర్మోత్సవంబున నావ్యత్యయము లేక యథాప్రకారమే జరిగినదని చెప్పి శిష్యునితోఁగూడ నవ్వలిమజిలీ చేరిరి.

అందుఁ జేరినది మొదలు గోపాలుఁడు స్వామీ! నారదమహర్షి చరిత్రము గొడవగానుండుననుకొంటి. వరప్రసాదుల కథకన్న నదృష్టదీపుని కథకన్న విజయభాస్కరుని కథకన్న చాల మనోహరముగా నున్నది పాపము నారదమహర్షి తానాఁడుదియై పిల్లలఁగంటినని యెఱుంగఁడుగదా! అతండు తిరుగా మహర్షియై యేమిచేసెనో వినవలయును. అతని తరువాతిపుత్రుల వృత్తాంతము జెప్పుఁడని ప్రార్థించిన సంతసించుచు శిష్యునకు గురుం డిట్లు చెప్పందొడంగెను.

---

232 వ మజిలీ.

# పశ్చిమ దిగ్విజయము.

శ్రీముఖుఁడు విజయుఁడు విక్రముఁడు చిత్రభానుఁడు నలుఁడు వీరేవురు తాళధ్వజుని కుమారులు. సులోచనుని తరువాతివారు. ఉత్తరదిగ్విజయముసేయ నరిగిన యన్నలు రాకమున్న వీరు తలిదం

పుత్రులకుఁ జెప్పకయే పశ్చిమదిగ్విజయముసేయఁ బయలుదేరి కంకణ కొంకణసౌరాష్ట్రాదిదేశముల కరిగి యందలిభూపతులచేఁ బూజింపబడు చుఁబుణ్యతీర్థంబులసేవించుచుఁగొన్నిదినములుదేశాటనముగావించిరి.

మహారాష్ట్రదేశాధిపతి శ్రీధరుండనుమహారాజు తనకూఁతురు కమలావతికి స్వయంవరమహోత్సవము చాటించుటయు నయ్యుత్స వమునకుఁ బేరుపొందిన రాజకుమారులు చతురంగబలములతోఁ దద్రాజధానియగు సుమాపురంబున కరుగుచుండిరి. అవ్వార్త విని తాళధ్వజునిపుత్రు లేవురు ప్రహర్షాతిశయముతో నవ్వింతజూడఁ గతి పయప్రయాణంబుల నన్నగరమున కరిగిరి.

రాజశాసనప్రకార మానగరము చేరినవారినెల్ల గౌరవింపుచు దగిన విడిదలం బ్రవేశపెట్టి వారివారి కులశీల నామాదులం దెలిసి కొని నృపతికిందెలియఁజేయుచుండును. శ్రీముఖాదులంగూడసత్కరించి మంచి సౌధంబున బ్రవేశపెట్టి వారిపేరులు బిరుదములు గ్రామము కులము వ్రాసికొనిపోయిరి.

ప్రఖ్యాత విద్యాసౌందర్యవిభవాభిరామలగు వామలకుఁగాని స్వయంవరము చాటింపరు. కన్యకకుఁ దగిన వరు నరయ తిరిగితిరిగి విసిగి యనుహూపం బడయజాలక శ్రీధరుం డారమణీమణికి స్వయం వరవిధి నిరూపించెను. ఆరాజు పూర్వాచారపరాయణుఁడు. ధర్మశీ లుఁడు బలశాలి, విద్యాధన గర్వితుఁడు. ఆయుత్సవమునకు వచ్చిన రాజపుత్రుల చారిత్రములఁ దెలిసికొని యనుకూలసాంప్రదాయ విద్యాబలశీల సంపన్నులని నమ్మకముదోఁచిన వారినిం దప్ప నితరుల నాయుత్సవమునకు రానిచ్చుటలేదు.

అట్టివారిం బెక్కండ్ర నిషేధింపుచుండెను. వారితోఁ జేర్చి తాళధ్వజుని పుత్రులఁగూడ నాసభకు వచ్చుట కంగీకరింపక వారికిట్లు ప్రత్యుత్తరము వ్రాసిపంపెను. రాజపుత్రులారా! మీరాజ్య మే

మూల నున్నదియో మాకుఁ దెలియదు. మీకులశీల నామాదులు మాకంతగా నచ్చినవి కావు. మీకాహ్వానపత్రికలు మేము పంపియుం డలేదు. నాకూఁతుం బరిగ్రహించుటకు మీరర్హులుకారని నాకుఁ దోచినది. మీరిందువచ్చినందులకు మాకుఁదోచిన కనకాంబర వస్తు విశేషములిందుతోఁ బంపితిమి. వీనిం గైకొని మీరు మీగ్రామం బున కరుగవచ్చును. ఇట్లువ్రాసినందులకు మాపైఁ గినియకుందురుగాక!

అనియున్న పత్రికం జదివికొని వారేవురు నౌరా! యీరాజు నకెంత పొగరున్నది? మన కులశీలాదులు తనకు నచ్చలేదఁట. తమ పిల్లను జేసికొనుటకు మనమర్హులము కామఁట. ఏమి? యీగర్వ ము! ఏమి యీస్వాతిశయము! రాజులు స్వయంవరము చాటింపరో! రాజకుమారులు పోవరో! తనకుమాత్రె కిష్టములేకున్న వరింపక పోవచ్చుంగాని యిట్లు సభకే రాఁగూడదని నిషేధించుట యెందును జూచి యెఱుంగము. మమ్మేకాక యిట్లు పెక్కండ్ర నిరాకరించినట్లు తెలియుచున్నది. రాజవంశసంజాతున కింతకన్న యవమానము మఱి యొకటి కలదా? ఇట్లు చేయుట తప్పని యప్పతిం బట్టికొని కాలి క్రిందఁ ద్రొక్కిపెట్టి యణుగుదుముగాక. అని రౌద్రావేశముతోఁ సర్ప ములవలె బుసకొట్టుచు వారూహించుకొను చుండిరి.

అట్లు నిరాకరింపఁబడిన రాజపుత్రుల పెక్కండ్రు శ్రీధరుని బలాధిక్యమునకుఁ వెఱచి తామేమియుఁ జేయఁజాలక సిగ్గుతో నొకరి తోనొకరు జెప్పికొనక తమ తమ నగరములకుఁ బోయిరి. మఱి నాలుగు దివసములకు స్వయంవర సభ జరిగినది. ప్రఖ్యాతసంపత్కుల విద్యాయౌవనబలగర్వితులగు రాజపుత్రులెల్ల నాసభ నలంకరించిరి. అప్పుడు కమలాదేవి కమలాదేవివలె నొప్పుచుఁ బుష్పదామంబు చేతంబూని సఖినివేదితములగు రాజపుత్రుల చరిత్రము లాకర్ణిం పుచు నాసింహాసన శ్రేణీమధ్యమునుండి దేవదానవులనడుమ దిరిగెడి

జగన్మోహినివలె మెల్లగాఁ దిరుగుచుండెను.

అట్టి సమయంబునఁ దాళధ్వజుని కొడుకు లేవురు వీరవేషము లుదాల్చి గుఱ్ఱములెక్కి ఖడ్గంబులం ధరించి రౌద్రావేశముతోఁ జూపఱకు వెఱపుదోప నతిరయంబున నాసభామంటపద్వారంబున కరిగి యందు గుఱ్ఱంబుల డిగ్గనుఱికిరి.

శ్రీముఖుండు నలువురు తమ్ములు జుట్టును బరివేష్టించి నడువ ఖడ్గహస్తుఁడై లోపలఁ బ్రవేశింపఁబోవుఁడు ద్వారపాలు రడ్డమువచ్చి భర్తృదారకులారా! నమస్కారము. మీరిందుఁబోవుట కీయబడిన పత్రికలంజూపి పోవలయు. రాజశాసనమట్టిది. ఏవీ చూపుఁడని యడుగుచుండ పో, పొండు. మమ్మాటంకపరుప మీరెవ్వరని యదలించుచు వారిం ద్రోసికొని సభాభవనంబునం బ్రవేశించిరి. వారుకూర్చుండ దగిన పీఠంబు లెందున్నవని రాజపురుషులు సభాంతరాళ ముపలక్షింపుచుండిరి. భయభ్రాంతస్వాంతులై రాజకుమారు లాలోకింపుచుండిరి. రండు. రండు. అందుఁగూర్చుండుఁడని పరిజను లాహ్వానింపుచుండిరి.

ఎవ్వరిమాట వినిపించుకొనక యెవ్వరిదెసం జూడక శ్రీముఖుఁడు తమ్ములతోఁగూడ సింహగమనంబునఁ దివ్వగా నారాజపుత్రికయున్న నెలవునకుఁజని యాజవ్వని విస్మయముతోఁ దన్నువలక్షింపఁ బుండరీకాక్షుండు రుక్మిణింబోలె నవలీల నాబాలికారత్నమును గుభాలునం సందిటం జిక్కబట్టి యొక్క పెట్టు సభాసదులు హాహాకార రవంబులుసేయ గిరాలున మఱలి చనుచుండెను.

అప్పు డడ్డువచ్చిన రాజభటులనెల్ల నతని తమ్ములు నలువురు కటారి ధారంబరిభవించుచుండ నేయాటంకము లేక శ్రీముఖుఁడు వడివడి నడచుచుఁ ద్వారముల దాటి ఘోటకములకడ కరిగి తన గుఱ్ఱముపై నెక్కించుకొని యక్కలికి భయభ్రాంతయై యొడ లెఱుంగక తడబడుచుండ నుపలాలించుచు దమ్ములు గుఱ్ఱములెక్కి చుట్టునుం బరివేష్టించి

యడ్డుపెట్టినవారినెల్ల భల్లంబుల నేయుచుండ నతిరయంబున దమ నెలవునకుం దీసికొనిపోయి యంతర్భవనంబునం బ్రవేశపెట్టెను.

అరెరే! ఎంతమోసము జరిగినది. ఆత్మమిత్రులు కన్యనెత్తుకొని పోవుచుండ నడ్డుపడ కూరక చూచుచుంటిమేల? అది మన కవమానముగాదా? అని రాజకుమారులెల్ల హల్లకల్లోలముగా రొదజేయుచు లేచి యాయుధంబులందాల్చి వాండ్రెందున్నవారో చూడుఁడు, పట్టుఁడు, కొట్టుఁడు. అని వీరాలాపము లాడుచు వీథిం బడిరి.

శ్రీధరుండును సెలవీయనిదే వాండ్ర లోపలి కేమిటికి రానిచ్చితిరని ద్వారపాలుర నిందించుచు నానీచులఁ బట్టి కట్టి తెండని వీరభటుల నియోగించుచు నుత్సవభంగము గలిగినదని బంధువులతో విచారించుచు నావీరపురుషు లెవ్వరు? ఎట్టివారని మంత్రులతో నాలోచించుచు యుద్ధోన్ముఖులగు రాజపుత్రుల వలదని యనునయించుచుఁ బుత్రికావియోగదుఃఖితులగు నతఃపురకాంతల నూరడింపఁదగిన వారిఁ బుచ్చుచు నేమిచేయుటకుఁ దోచక వారెందున్నవా రెక్కడికి దీసికొనిపోయిరో తెలిసికొనిరండని కొందఱ వార్తాహరుల ననిపెను.

వాండ్రు పోయివచ్చి దేవా! వారాపల్లపువీథి సత్రముదాపుననున్న పెద్దమేడలో మనరాజపురుషులచేఁ బ్రవేశపెట్టబడినవారే. వారి నా స్వయంవరసభకు రావలదని మీరు నిషేధించినారఁట. భర్తృదారిక నాయింటిలోఁ బ్రవేశపెట్టి వారేవురు గుఱ్ఱములెక్కి ద్వారమునఁ గాచికొనియుండిరి. ఇంతలో నీస్వయంవరమునకు వచ్చిన రాజకుమారులు దేవరపంపిన వీరభటులు పటుకోపముతోఁ బోయి యావీథి ముట్టడించి వారిపై నాయుధములఁ బ్రయోగించుచుఁ బోరుగావించుచున్నారు.

ఆవీరపురుషులైదుగురు గుఱ్ఱముల జిత్రగమనంబుల నడిపించుచు సింహనాదములు సేయుచు నిర్వక్రపరాక్రమంబున విజృంభించి

తమ్ముఁ జుట్టుకొనిన రాజకుమారవర్గంబు నెల్ల నిరర్గళ ప్రహారంబుల గొట్టియుఁ జుట్టియు నేసియు ద్రోసియుఁ బొడిచియు గెడపియు రెండు గడియలలో నామూకలనెల్లఁ జీకాకుఁబడఁజేసి పాండవులు కురుసేనను వలెఁ బీనుఁగపెంటలు గావించుచున్నారు. వీధులన్నియు మేదో రుధిర మాంసకర్దమములై చూడ భయంకరముగానున్నవి. వారిముందర నిలి చెడి వీరుఁడెవ్వఁడును గనంబడఁడు. దేవర విచ్చేయవలయునని చెప్పినంత నమ్మహీకాంతుఁడు కవచంబుదొడిగి ఖడ్గాది సాధనంబులం దాల్చి పేరుగల వాజివనెక్కి యొక్కఁడుగులో నాసంగరరంగమునకుఁ బోయెను.

అప్పు డవ్వీరు లేవురు రాజపుత్రులం దరిమికొనిపోవుచు మా ర్గముబెట్టి పారిపోవుచున్న వారినుద్దేశించి సీ! సీ! మీబ్రతుకేల? ప్రాణముల కాసపడి శత్రువులకు వెన్నిచ్చి పాఱుట యపఖ్యా తికాదా? నిలుఁడు. పోకుఁడు అని కేకలువైచుచు లేళ్ళగమిందఱుము పెద్దపులులవలె విజృంభించిపోవుటయుఁ దత్ప్రతాపవాతాహతి దూది పింజలవలె శత్రుసేనలు పలాయనము గావించినవి. అప్పుడు శ్రీధ రుండు వారిం బురికొలుపుచు గుఱ్ఱముతో నావీరులయెదుటంబడి పోరు టయు శ్రీముఖుఁడు తనగుఱ్ఱము నతని గుఱ్ఱముమీఁదికి దోలి గదా దండంబున నతనిం గొట్టుటయు నాదెబ్బ భరింపఁజాలక యతండు గుఱ్ఱ మునుండి నేలఁబడియెను.

ఆభూపతిపాటు జూచి తద్బలంబులు హాహాకారమిళితముగా రోదనధ్వని వెలయఁజేసిరి. అతనిం గాపాడ దాపునకువచ్చు వీర భటులనెల్ల భల్లంబుల నాపి శ్రీముఖుండు దిగ్గున గుఱ్ఱము డిగ్గనుఱికి యతనిం బట్టికొని గుఱ్ఱముపై కెక్కించితన నెలవునకుం దీసికొనిపోయి నడివీధిని నిలువంబెట్టెను.

అతనికి తెలివివచ్చినది. రెక్కలు గట్టబడియున్నవి. యమా త్యాదివీరయోధులెల్ల వారి పరాక్రమమునకోడి దూరదూరముగా

నిలిచి చూచుచుండిరి. అప్పుడు సిగ్గుపడి తలవంచికొనియున్న శ్రీధరుని చేయిపట్టుకొని శ్రీముఖుం డిట్లనియె.

చ. బలములు మేటిగుఱ్ఱములు భద్రగజంబులు లేవు శీలముం
గులమును రాజ్యసంపద లగోచరముల్ ప్రభవం బదెట్టిదో
తెలియ దనర్హ్యలంచు మముఁ దేలికజేసి వచించి తా సభా
స్థలి దరిజేరకుండ వసుధాధన! జ్ఞాపకమున్న దే మదిన్.

చ. ఇపుడు గ్రహించినాఁడవె? మదీయపరాక్రమశీలవృత్తముల్
నృపవర! యర్హ్యలంచపుడు నీసభజేర్చిన రాజనందనుల్
త్రపయొకయింతలే కనుఁ బరాఙ్ముఖులై చనిరేమి? నీప్రతా
పపువిభవంబువోవ నిటు పట్టువడం బనియేమి? చెప్పుమా?

క. పోలఁగ నీవెంతటి బల
శాలివొ యని తలఁతు మొక్కతుణమని సేయం
జాలితివి కా విదేమి నృ
పాలా! యీమాత్రమున కే పలికితివటు మేల్.

క. నీకూఁతుం గైకొనఁగా
మాకర్హతగలదె తెల్పుమా యిపుడైనం
గాకున్న విడిచివైతుము
భూకాంతా! యనుడు సిగ్గుఁబొందుచు నతఁడుర్వ.

తలవంచుకొని మహాత్ములారా! మీచరిత్రము తెలియక కేవలము పత్రికలో వ్రాసినవిషయంబులం జదివికొని చులకనగాఁ జూచి యట్లాజ్ఞాపించితిని. నన్ను మన్నింపవలయు. మీరుత్రిలోకైకవీరులు. మాపుణ్యవశంబుననిందు వచ్చితిరి. అయత్నోపలబద్ధముగా మీతో మాకు సంబంధము గలిగినది. మేము ధన్యులము. మీరు నన్ను జయించితిరని యించుకయు విచారములేదు. సంతోషమే కలుగు చున్నది. మాకమలాదేవి రాక్షసవివాహంబున మీచే స్వీకరింపబడి

పది. రక్షింపుఁడు రక్షింపుఁడని ప్రార్థించెను.

శ్రీముఖుండతని దీనాలాపములు విని జాలిపడి కట్టులు విప్పి గౌరవించుచు లోపలికిఁ దీసికొనిపోయి యతని కొమార్తెం జూపించెను. కమలాదేవి తండ్రింజూచి సంభ్రమముతో నానందాశ్రువులు గ్రమ్మఁ దన నిర్బంధముగుఱించి పరితపించుటయు నతండు అమ్మా! వీరు మిక్కిలి బలశాలులు. వీరివృత్తాంతము దెలియక మొదట నిరాకరించితిని. అదియే మన కుపకారమైనది. శ్రీకృష్ణుండు రుక్మిణినిం బోలె వీరిలో శ్రీముఖుఁడు నిన్నెత్తికొనివచ్చెను. నీయదృష్టము ఫలించినది. నీవు విచారింపవలసిన పనిలేదు. దివ్యరూపసంపన్నుండు పరాక్రమశాలి భర్త నీకు లభించెనని యోదార్చుచు వారియానతి వడసి యప్పుడతని నప్పుడే యందలముపై నెక్కించి కోటలోనికిం దీసికొనిపోయెను. పిమ్మట వారినెల్ల నేనుఁగుల నెక్కించి మంచివిడిదలలోఁ బ్రవేశపెట్టించెను.

శ్రీధరుఁడు శుభముహూర్తంబునఁ గమలాదేవిని శ్రీముఖునికిచ్చి వివాహము గావించెను. అమ్మహోత్సవమునకు శ్రీధరుఁడు పారిపోయిన రాజకుమారులనెల్ల రప్పించి సత్కరించుచు నల్లుండ్ర విద్యాబలపౌరుషాదు లెక్కువగా వారికడ స్తోత్రము గావించెను.

ఆరాజకుమారు లాస్తుతివచనములు విని మీయల్లుండ్రు పాండవులవోలె లోకైకవీరులని యొప్పుకొనియెదము. వరుణద్వీపాధిపతి యగు క్రోధనునితో వీరికిఁ బోరుతటస్థించిన నెవ్వరు గెలుతురోయని సందియముగా నున్నది. వీరతనిం జయించినచో భూమండలంబున వీరికిఁ దుల్యులు లేరని చెప్పవచ్చునని ప్రస్తావముగా ననువదించిరి. అతండు యంత్రబలసంపన్నుఁడు. భుజబలంబున వీరిం జెనకఁజాలఁడు యంత్రసామర్థ్యంబు మనుష్యబలము మించియుండకపోదని శ్రీధరుఁ డుత్తరము జెప్పెను.

వారిమాటలు విని శ్రీముఖుఁడు ఆక్రోధనుఁ డెవ్వఁడు? ఎందున్నవాఁడు? వాఁడు యంత్రబలసంపన్నుఁ డగుంగాక! మాకు లక్ష్యము లేదు. వేగఁబోయి వానిం బరిభవింపగలము. వాని వృత్తాంతము చెప్పుమని యడిగిన శ్రీధరుం డిట్లనియె.

వత్సా! ఇక్కడకు నూఱామడదూరములో సముద్రమధ్యంబున వరుణద్వీపము గలదు. అందు వరుణావతియను నగరంబున క్రోధనుఁడను రాజు యంత్రబలగర్వితుండై యొప్పుచున్నాడు. వానికి దేవతలుగూడ వెరచుచుందురు. ఆనగరముచుట్టు ననేకయంత్రములమరింపఁబడియున్నవి. ప్రాణాత్ముండు వానినగరము సొరఁజాలఁడు. చొచ్చినవాఁ డెవ్వఁడు చావక తిరిగివచ్చినవాఁడు లేడు. వాని జోలి మీకేల? పెండ్లికొడుకవు సుఖంబుండుమని బోధించిన విని శ్రీముఖుండా వార్త తమ్ములకెఱింగించెను.

అందు విక్రముఁడు అన్నా! నీవు క్రొత్త పెండ్లికొడుకవు కొన్ని దినములిందుండుము మేమా దీవికిబోయి క్రోధనునింజయించి మహావీరులని బిరుదములంది వత్తుముగాక. ఆవీటికి మార్గమెట్లో తెలిసికొనుము. మీ మామగారితోఁ జెప్పి మమ్మందుఁబంపుమని కోరిన నతండు తమ్ములారా! క్రోధనుఁడు యంత్రశక్తిగలవాఁడట వానినగరమెట్టి వీరుఁడు చేరలేఁడట. చేరిన వాఁడు తిరుగా రాఁడట. అట్టి దుర్ఘటకార్యమునకు బూనుకొననేల? అప్పయనము శ్రీధరున కిష్టము లేదని మందలించిన విని విక్రముండిట్లనియె.

అన్నా! మన మింటికడ సుఖంబుండక యిక్కేమిటికి బయలు దేరివచ్చితిమి? నిర్వక్రపరాక్రమంబున విక్రమ గర్వితులఁ బరిభవించి ప్రఖ్యాతి నొందుటకేకదా! పిటికిపందల నెండఱంగొట్టిన నేమి యున్నది! క్రోధనునివంటి మహావీరుని జయించినప్పుడే మన పేరులు పైటికివచ్చును. యంత్రబలము తంత్రబలముగూడ మనభుజబలమును

మించజాలదు. మీ మామతోఁ జెప్పి మాపయినము సాగింపుము తూరుపుదెసకరిగిన మనయన్న లెట్లింటికివచ్చిరో జ్ఞాపకమున్నదా! పోయిన నల్లె యింటికిఁ బోవలెను. లేకున్న నదిలోఁ జావవలసినదే. అని సాటోపముగాఁ బలుకుటయు శ్రీముఖుఁడు మామగారితో వారి యుద్యమప్రకార మెఱింగించెను.

వారు క్రోధనుని జయింపఁజాలరని యెఱింగియు నల్లుఁడు పోవుట మానెంగావున శ్రీధరుఁడట్లకే వారి పయనమున కొప్పుకొని పదుగురఁ గర్ణధారుల రప్పించి యిట్లనియె.

మీరు వరుణావతీ నగరంబునకు నోడలఁ దీసికొని పోవలసి యున్నది. మా బంధువుల సేనలతో వరుణ ద్వీపము జేర్పవలయును. సముద్రములోఁ గ్రోధనుఁడు వైపించిన యంత్రపుగనుల స్థానములు మీకుఁ దెలిసియే యుండును. వానికిఁ దగులకుండ జాగరూకులై వీరిని వరుణావతికిఁ బదియోజనముల దూరముగా దక్షిణపువైపు దీరమున దింపవలయును. వారక్కడనుండి యెట్లో సాధనము జేసి కొని పురిలోఁ బ్రవేశింపఁగలరు. వాతాగ్నిజల ప్రమాదము లెఱిఁగి యోడల నడిపింపుఁడు. ఎప్పటికప్పుడు మాకు వార్తల దెలుపుచుండ వలయునని యామార్గ ప్రవృత్తియంతయు నెఱింగించినవిని నావికులు సంతసించుచుండ తదనుజ్ఞవడసి మూఁడు దినములతో బయనమునకు బదియోడల నాయత్తపఱచిరి. ఉమాపురంబు సముద్రతీరమునందే యుండుటచే వెంటనే వారిపయనము సాగినది. శ్రీధరుఁడు కొంత సేనను వారికి సహాయమిచ్చి పంపెను. శ్రీముఖుఁడు తమ్ములమంచి ముహూర్తమున నోడ లెక్కించి యింటికి మరలునప్పుడు తాను వినిన వరుణావతీ యంత్రరహస్యములన్నియుఁ దమ్ములకుఁ దెలియఁజేయుచు దన కెప్పటివార్తలప్పుడు పంపుచుండవలయు నందులకుఁ బ్రత్యేక మొకయోడ మీ వెంటఁ బంపఁబడుచున్నది. వాని మర్మము లన్ని

యుండెలిసినపిమ్మటఁగాని పోరఁదొడంగరాదు చుఁడీ. అని యెన్నియో నీతి వచనము లుపదేశించి యెట్టకే వారిని విడిచివచ్చెను.

నావికులు నేర్పరులగుట గాలి ననుసరించి సముచిత వేగంబున నావల నడిపించు చుండిరి. రాజపుత్రులు నలువురు నాలుగు తరులపైఁ గూర్చుండిరి. విక్రముండు ముందు నడుచు నోడపైఁ గూర్చుండి కర్ణధారులలోసమయ వేదియనుప్రధాననావికునిఁదనకడనుంచికొనివరుణావతీ వృత్తాంతమున విశేషముగా నెఱింగింపుమని యడిగినవాఁడిట్లనియె.

అయ్యా! నేను బిన్నటినాటినుండియు నీయోడలమీఁదఁ దిరుగు చుంటిని. అనేకద్వీపములకుఁ బోయితిని కాని వరుణావతీ నగరంబున కెప్పుడును బోవలేదు. ఆరాజు కడు క్రూరుఁడు. రావణాసురునివంటి వాఁడట. భూపతులెల్ల నతనిపేరువినిన గడగడలాడుచుందురు. వరుణ ద్వీపము నూఱామడ వైశాల్యము గలదఁట. సముద్రములోఁ జుట్టును గనులువైచి యుంచెను. వానియునికిఁ దెలియక యోడలనడిపించినచో నవి తగిలి భగ్నములై పోవుచుండును. క్రోధనుని యోడలు వానిం దప్పించుకొని యెల్లదీవులకు సంచారము సేయుచుండు. మా శ్రీధరుఁడా క్రోధనునకుఁ బన్నుగట్టు చుండును. వానిజయించు వారి నిప్పటికిఁ జూచియుండలేను. మీరెట్లు జయింతురో తెలియదు. మీరు బాహుబల సంపన్ను లగుదురుగాక. ఒకయంత్రము గడియలో వేలకొలఁది జనమును నాశనము చేయఁగలదు. ద్వంద్వ యుద్ధములో మీరు వాని నోడింతురుగాని వాని దాపునకు మీరెట్లు పోఁగలరు? పట్టణమే చేరుటకష్టము. వరుణావతికిఁ బదియోజనముల దూరములో మిమ్ము తీరము జేర్తుము. మీ రాయూరిలోని కెట్లు పోవుదురో తెలియదు. మీ సంకల్పమేమియో నాకుఁ దెలియకున్నది. అని యా కర్ణధారుం డెఱింగింప నాకర్ణించి విక్రముఁడిట్లనియె.

ఓయీ! నీమాటలు నాకు సంతోషము గలిగించినవి. క్రోధ

నుండెట్టి దుర్గముననున్నను గాలవ్యత్యయమునఁ బట్టుపడక మానఁడు. రావణుని లంకాపట్టణ మెందున్నదియో దేవతలకైనఁ దెలియునా? అట్టినగరము కోఁతి మూకలచే నాశనము జేయఁబడలేదా? ఎట్టివాఁడును గాలమును గెలువలేడు. వానికిఁ గాలము మూఁడినదనియే తలంపుము. లేకున్న మాకిట్టి సంకల్పము పుట్టనేరదు. అప్పటికిఁ దోఁచిన యుపాయమునుంబట్టి మేమా క్రోధనునిపట్టణము ముట్టడింపఁగలము. వేగముగా నా దీవింజేర్పుమని ప్రోత్సాహపరచెను.

ఆ కర్ణధారుఁడు గనిస్థానములఁ గనిపెట్టి మూఁరు త్రోవల నోడల నడిపించుచుండెను. విక్రము డున్న యోడ ముందు నడిపించుచుండెను. దాని ననుసరించియే తక్కిన యోడలువచ్చుచుండెను. దక్షిణముగాఁ బోయిపోయి ద్వీపము పదియోజనముల దూరములో నున్న దనఁగాఁ బడమరగా నడిపించిరి. అందుఁ గ్రోధనుఁడు క్రొత్తగనులవైపించిన రహస్య మా నావికుఁడెఱుంగఁడు. మఱికొంత దూరమవ్వలఁబోయిన నా గనులు తగులక పోయెడిదే. ఆమర్మమెఱుంగక యూతఁడీవలగా నడిపించినంత మొదటియోడ గనికిఁదగిలి గుభాలున వ్రేలి యక్కలము వికలమై శకలముగా విడిపోయి సముద్రములో మునిఁగిపోయినది. ఆవెంటనే తక్కిన యోడలుగూడ గనులకు దగిలికొని పెటపెటార్పటులతో విడిపోయి సముద్రము పాలైనవి.

అప్పుడు హాహాకార రవంబులు సేయుచునందున్నజనులుతమకు దొరకిన సాధనంబులంగైకొనిసముద్రములోఁబడి కొట్టుకొని పోయిరి.

అని యెఱింగించిన విని గోపాలుండు గుండెలు బాదికొనుచు నయ్యో! పాపము తాళధ్వజుని పుత్రుల యుద్యమమంతయు గడియలోనటమట మైనదిగదా? స్వామీ! వారుకర్మముజీవించి వత్తురా? ఏమి జరిగినదియో యవ్వలికథ వేగముగాఁ జెప్పుమని యడిగిన నమ్మణిసిద్ధుండు పక్కున నవ్వెను. గోపాలుండందలి యర్థము

గ్రహించి స్వామీ! కల యసత్యమైనను గలలోనున్నప్పుడప్పటి చర్యలా ననుసరించి సుఖదుఃఖములు గలుగుచుండును. నాప్రవృత్తియునట్టిదే యనుకొనుఁడు. మీరు నవ్విన కారణము గ్రహించితినా! కరుణించి యవ్వాలి కథ జెప్పుఁడని వేడుకొనియెను. అప్పుడు వేళమిగులుటయుఁ బయిపయనము సాగించి యతిపతి పైమజిలీయం దవ్వాలి వృత్తాంత మిట్లు చెప్పం దొడంగెను.

---

233 వ మజిలీ.

# దేవకన్యకలకథ.

గీ. జలధి మునిఁగిన బావక జ్వాలఁ గూలి
నను మహీధ్రమునుండి దొర్లినను బుడమి
ఫణులచే బల్మిఁ గరవంగఁబడినఁ జావఁ
డాయు వించుక మిగిలిన యతఁడు జగతి.

సముద్రపుటోడలకుఁ బ్రమాదమువచ్చునప్పుడు దప్పించుకొనుటకై ప్రక్కను జిన్నదోనెలంగట్టి యుంచుదురు. గనికిఁ దగిలి గుభాలునఁ జప్పుడై యోడమునుఁగుటయు నరనిమిషములో జరిగినది అప్పటికి రాత్రిజాము ప్రొద్దుపోయినది. అందున్నవారికి సాధనములఁ జూచుకొనుటకైన నవకాశము గలిగినది కాదు. అందు విక్రముడున్న యోడ శకలములై మునింగినది. ప్రక్కగట్టఁబడిన జిన్నదోనెలు దానితో విడిపోయి సముద్రజలంబునఁ దేలి కొట్టుకొని పోవుచుండెను. దైవికముగా విక్రమునిచేతికొక దోనె దొరకినది. అది ప్లవమువంటిదే. నీరెక్కినను మునుఁగదు. తెప్పకంటెఁ బెద్దదిగానుండును విక్రముఁడు దానిపై కెక్కి కూర్చుండి యించుక యాయాసముదీరిన వెనుక వెన్నెల గాయుచున్నది. కావున నలుమూలలు పరికించి పొంగుచున్న సముద్ర

తరంగములుగాక మఱియేమియుంగానక తన్ను మృతప్రాయునిగాఁ దలంచికొని యిట్లు ధ్యానించెను.

సీ! పురుష కారము ప్రధానముగాఁ జేసికొని కార్యములు సేయ బూనెడు వారాపదలఁ బొందకమానరు. మేము ప్రతాపగర్వితులమై క్రోధనుండు యంత్రబలయుక్తుఁడు, యందుఁ బోవలదని యెందఱుచెప్పినను వినిపించుకొనక బయలుదేరుట మాకఁడకొర్వ్వగాక మఱియేమి? క్రోధనుండు మా జోలికివచ్చెనా? మమ్ము నిదించెనా? అకారణ వైరముఁబూని పోరఁబోయిన నాపదలు జెందకుండునా? క్షత్రియ ధర్మమే గర్హితమైనదని తలంచెదను. మా యోడలలో నొక్కటియైన మిగిలినట్లులేదు. మేమన్నదమ్ములము నలువురమేకాక మా నిమిత్తము శ్రీధరుని బలములుగూడ సముద్రముపాలైనవి. మా యన్నకీ వార్త జెప్పువారెవరైనలేరు. మా జీవిత మీసముద్రజలంబుల ముగిసినది. దరిజేరుట కల్ల. ఆహా! కాలమెంతలో మారినది. జాముక్రిందట నోడమీఁదఁ గూర్చుండి మిత్రులతోఁ గ్రోధనుం జయించు నుపాయమేమని యాలోచించు చుంటిని. ఇంతలో నాజీవితమే యస్థిరమైనది. నన్నీ దోనెతోఁగూడ నే జలచరమో భక్షించును. నాకీఁక యాయువు గడియయో రెండు గడియలోనున్నది. ఇఁకపరమేశ్వరునిధ్యానించుటయే లెస్స. ఐహిక విషయంబులం దలంచిన ఫలములేదని నిశ్చయించి కన్నులు మూసికొని యిష్టదేవతనిట్లు స్మరించెను.

ఉ॥ ఏమియుఁజేయనట్టి పరమేశ్వరు సన్నిధిఁజేరి తత్ప్రస
క్తామల దీప్తిలాగికొని యన్నియుఁ దా నొనరించుచుండి మా
యామయమైన లోకములనాతఁడె కర్తగ దోపఁజేయు సా
ధ్వీమణి నాదిశక్తిఁ బ్రకృతిన్ బ్రణుతింతున నంత భక్తితో.

అని స్తుతియించి తదర్థ మవఘటించుకొని అయ్యోనేను భక్త

జన పరాయణుఁడైన నారాయణుని ధ్యానింపఁబోయి యాదిశక్తి నభి నుతించితినేమి! ఔను పరదేవత నా కభీష్టదేవత యగుట సంకల్పింపక పోయినను నాబుద్ధి యామాతమీఁదఁ బోయినది. అదియు శుభ సూచకమే. అని మఱియును

శా॥ సంసారాంబునిధి న్మునుంగుచు సుహృజ్జాయాదివాస్స్వత్వముల్
హింసింపం గడగాన కూర్మిచయముల్ హృత్ప్రజ్ఞ సర్వంబుని
ధ్వంసంబుం బొనరింపఁ బూర్వ సుకృతవ్యాప్తిన్మురారే! హరే!
కంసారే! యనినిన్ దలంపఁ దరి జక్కంజేర్పవే యీశ్వరా॥

అని ధ్యానించుచు నాదోనెను విడువక గొట్టుకొని పోవుచుండెను. నిద్రాహారములులేక రెండుదినము లాసముద్ర జలంబునం దేలియాడుచు నతండు పెద్దదూరము గొట్టికొని పోయిపోయి క్రమంబున నీరసము బలసి స్మృతిదప్పి కన్నులు దెరువలేక యాపట్టెనంటి పండుకొని యుండెను.

మూఁడవనాఁటి యుదయమున కాదోనె యొకచోఁ దీరమునకు జేరి యలలరాపిడి తలక్రిందగుటయు నతండు నీటిలోఁబడ కాలికి నేల దగిలిన నతని కించుక తెలివివచ్చినది. కన్నులు దెరచిచూడ భూమియు నందు వృక్షలతాదులు నతనికి నేత్రపర్వము గావించినవి. అప్పుడతని కెక్కడలేని బలమువచ్చి యట్టెలేచి నిలువంబడియెను. తీరభూమి కొంతదూర మిసుకగానుండెను. ఒడ్డుచేరి యతం డాలోచించి యాయిసుకలోఁ జిన్న చెలమ దీయుటయు నందు మంచినీ రూరినది. ఆనీటిచే స్నానముజేసి కడుపునిండ నీరుగ్రోలికొంచెము సత్తువజేరగనే కట్టుగుడ్డ లారవైచుకొని యాభూమి పరికించి చూచెను.

జన సంచారమేమియును లేదు. తీరభూమియంతయు మహారణ్యముగాఁ నొప్పుచున్నది. అప్పుడతం డాహా! పరమేశ్వరుని విలాసములు కడుచిత్రములు. మదభీష్టదేవత నామొర నాలించి తీరమును

జేర్చినది. ఇది వరుణద్వీపమో మఱియొకటియో తెలియదు. మా సోదరులు తీరము జేరియుండిరో మృతినొందిరో యెఱుంగరాదు. వారు లేని నాజీవిక దుఃఖమునకే కారణముగాదే అని తలంచుచు సముద్రముదెస జూచి గుండెలు చెదర నమ్మయ్యో నేనీ మహార్ణవములోఁ బడి బ్రతికి గట్టెక్కితినా? కొండలవలెఁ బొంగి పాతాళమున కరుగుచున్న తరంగముల నడుమమునుఁగుచు నేనెట్లు బ్రతికివచ్చితినో! దైవకృపనుమా సోదరులుగూడనిట్లువచ్చిన నత్యానందముగదా. కానిమ్ము. నన్ను బ్రతికించిన భగవంతునిసంకల్పమెట్టిదో యట్లు జరుగుంగదా. పడమరగాఁ గొంతదూరము పోయి చూచెద. నీయడవిలోఁ దినుటకుఁ బండ్లైననఁ దొరకకపోవునా? అని యాలోచించుచు లేనిబలము దెచ్చికొని కొంతదూరము నడచెను. అడుగులు తడఁబడ దొడగినవి. జాము ప్రొద్దెక్కినది. యెండవేడిమి సహించలేక యతం డొక చెట్టుక్రిందఁ గూర్చుండి యటునిటు జూచుచుండెను.

పదిబారల దూరములో నొక వెలగచెట్టు కనంబడినది. అందు ఫలము లున్నట్లు తోచినది. మెల్లగా దానికడకుఁ బోయి క్రిందరాలిన పండ్ల నేరియాసక్తితో భక్షించెను. కొంత యాకలి యడింగినది. ఆప్రదేశమున మనుష్యులెన్నఁడును సంచరించినట్లు తోచలేదు. కంటకలతాగుల్మమను లలముకొని పోయినవి. మృగములు నడచిన బాటలక్కడక్కడ గనంబడుచుండెను. అతనిచేత నాయుధమేదియునులేదు. సత్వకృతమార్గంబుల దూరిదూరి మఱికొంతదూరము పోఁగలిగెను. నీటిజాడ లేమియుఁ గనంబడలేదు.

అందొక వటవృక్షంబు శాఖాసమాచ్ఛాదితదిగంతంబై యతనికాహ్లాదము గలుగఁజేసినది. దాని నీడఁ గొంతసేపు విశ్రమించి యతండాలోచించి యూడ లూతగాఁ జేసికొని యాచెట్టెక్కి మధ్యశాఖాగ్రమున నిలువఁబడి నాలుగుదిక్కులు పరికించి చూచెను.

తూర్పుదెస మహాసముద్రము వెలుపు గలుగజేసినది. తక్కినమూడు దిక్కుల నరణ్యమేకాని మఱేమియుఁ గనంబడలేదు. కనుచూపుమేర లో గ్రామమేదియుఁ నున్నట్లు తోచదు. పడమరగా విమర్శింపఁ గొంతదూరములో నీలమేఘాంతరమున మెఱయు మెఱుపుతీగవలెఁ దరులతాదళాంతరమునఁ దళుక్కురని మెరయుచు బంగారు దీప్తియొ కటి యతనికి నేత్రపర్వము గావించినది.

గాలిచే గదలుచున్న యాకులనడుమ మెఱయుచున్న యాతే ఘుకంజాఁచిచూచి యదియేదియో తెలిసికొనజాలక దాని నికటంబు నకుఁ బోయి చూడవలయునని యభిలాషగలుగుటయుఁ నాప్రదేశ ము గురుతువెట్టుకొని తటాలున వటవిటపి దిగి తదభిముఖముగాఁ నడువఁ జొచ్చెను. అడుగు వెట్టుటకు సందులేని యాకాంతారములో నొక దండము సంపాదించి దానిసహాయముచే డొంకలు దాటుచు ముల్లు కంపలు తప్పించుకొనుచు బొదలదూరుచు నతి ప్రయత్నమున సంజ వేళకల్లో నాలక్ష్యప్రదేశమునకు శరీరమును జేరవైచెను.

అప్పుడతని కపూర్వపుష్పసౌరభ్యముఁ ఘ్రాణతర్పణముగావిం చినది. దాని ననుసరించి మఱినాలు గడుగులు నడిచినంతఁ గొంత తెరపి గనంబడినది. అందొక దేవాలయము బంగారు రేకులచే గట్టఁ బడి సమున్నతప్రాకార మంటపాదులచే నొప్పుచు నతని హృదయ మునకు వికాసము గలుగఁజేసినది. అంతకుమున్న తనకుఁ గనంబ డిన కాంతిపుంజ మాగుడి పసిండికుండల దీప్తియని యతండు తెలిసికొని యెను. పెన్నిధిఁగన్న పేదయుంబోలెఁ దద్దర్శనంబు తపఃఫలంబుగా దలంచుచుఁ బరదేవత ప్రత్యక్షమైనట్లు సంతసించుచుఁ త్రిదివసోప వాసపక్లేశ మంతయు నటమటమై పోవ నాకోవెల సమీపమున కరిగి ప్రదక్షిణపూర్వకముగాఁ బ్రిహారిచుట్టు తిరిగి తూర్పుముఖముగానున్న సింహద్వారముకడకు వచ్చెను. అందుఁ బెద్ద గోపురమొప్పుచున్నది.

దాని గోడలయందు శక్తి విగ్రహములు వ్రాయంబడియున్నవి. తలుపులు మూయఁబడి యుండుటచే లోపలికిఁ బోవుట యెట్లోకో యని యాలోచించుచు నతండు గంటల కవాటములు పట్టి త్రోసినంతలోప లిగడియ వేయఁబడనవగుటఁ దటాలునఁ దెరువఁబడినవి.

తన యదృష్టము ఫలించినదని ముఱియుచు నతం డల్లనలోప లనడుగు పెట్టెను. లోపలి యావరణము విశాలముగా నున్నది. గట్టి మొలవక పుష్పలతలు పెక్కులు నాటఁబడియున్నవి. ఈశాన్య భాగమున కళ్యాణమంటపము నాగ్నేయమునఁ జిన్నతటాకము ముందు బంగారు సింహ ధ్వజస్తంభము నొప్పుచున్నవి. ఆలయమంత పెద్దది గాకున్నను పైడి రేకులపై నగిషీపని విశేషముగాఁ జేయఁబడి స్థాపింపఁ బడుటచేఁ గన్నులకు మిఱుమిట్లు గొలుపుచున్నది. ముఖమంటపము స్ఫటికశిలలచేఁ గట్టబడి మెఱయుచున్నది. ద్వారశాఖలయందు ద్వార పాలికా విగ్రహములు స్ఫటికశిలలచేతనే చేయఁబడియున్నవి. వాని గుప్పిళ్ళలోఁ దళతళలాడు నినుపకత్తు లునుపఁబడియున్నవి. తలుపులు మూయఁబడియుండుటచే లోపలి దేవతయెవ్వరో తెలిసికొనలేకపోయెను.

స్తంభముల మంటపములఁ గుడ్యములఁ దఱుచుగాఁ మూడు కన్నులుగల శక్తివిగ్రహములు వ్రాయఁబడియుండుట సింహధ్వజము గలిగియుండుట నరసి యతం డద్దేవళము దుర్గాలయమేమో యని యాలోచించుచుండెను.

అప్పుడు సూర్యాస్తమయమగుచున్నది. ఏది యెట్లైననేమి చీఁకటిపడకమున్ను తటాకములో స్నానముజేసి జలంబులఁ గ్రోలుట లెస్సయని తలంచి తిన్నగాఁ దటాకముకడ కరిగి సోపానములు క్రొత్తగాఁ గట్టఁబడినట్లొప్పుచుండుటకు విస్మయమందుచు నింద్రనీల చ్ఛాయాసదృశంబులై పుష్పవాసనావాసితములగు తజ్జలంబులమునింగి యవగాహనస్నానము గావించి వార్చి యమృతమును దిరస్కరించుఁ

బానీయమును గడుపునిండ గ్రోలెను.

దానంజేసి పంచభక్ష్యపరమాన్నములు భుజించునట్లుగాఁ దృప్తిగలిగి యాకలియంతయు నడంగి యతని కుత్కృష్టమైన బలము గలిగినది. అందులకు వెరగంది యతండాత్మగతంబున నిట్లు తలంచెను. ఇది దేవభూమివలెఁ దోచుచున్నది. మనుష్యసంచారము లేకున్నను యెవ్వరోవచ్చి పుష్పలతలకు నీరుపోసినట్లు వేదికలలికి ముగ్గులుపెట్లుచున్నట్లు మంటపములు తుడుచుచున్నట్లు కనంబడుచున్నవి. ఇందలి పూవుల వాసనలు భూలోకవిలక్షణముగానున్నవి. నేనిదివఱకిట్టి తావి యాఘ్రాణించియుండలేదు. ఈతటాకము మానససరోవరము కాదుగద. ఇందలిజలంబు లమృతముకన్న రుచికలవగుటయే కాక గ్రోలినంత నాకలియడంచి మిక్కిలి బలముగలిగించినవి. గర్భాలయకవాటములుగూడఁ దీయ శక్యమయ్యేనేని లోపలి దేవతదర్శనము జేసి కృతార్థుండ నయ్యెదంగాక. అప్పుడే చీఁకటులు దెసల వ్యాపించుచున్నవి. ఇంచుక వెలుఁగు కలిగియుండఁగనే దేవతం బరికింపందగునని నిశ్చయించి యటఁ గదలి దేవళము మంటపములోనికిం జనునప్పటికి ద్వారశాఖలం జెక్కఁబడియున్న హారతివిగ్రహముల చేతిలోనున్న పైడిపాత్రిలయందలి రత్నములు దీపములవలె మెఱయుచు వెలుఁగు గలుగఁజేసినవి. అతండావింత జూచి యోహహో! ఈదీపముల నెవ్వరు వెలిగించిరి? ఇందెవ్వరు వచ్చినజాడఁ గనంబడలేదే అని యాశ్చర్యమందుచు విమర్శించి చూచుచు నందు వత్తిగాని చమురుగాని లేకుండుట నవి మణిదీపములని తెలిసికొని మఱియు వింతపడుచుఁ దత్కవాటములు బిగ్గరగా నొక్కి త్రోసెను. తటాలున విడిపోయినవి. మణిదీపములచేఁ బట్టపగలుగా నొప్పుచున్న యాగర్భాలయములో దివ్యతేజంబునం బ్రకాశించు దేవీవిగ్రహ మతనికన్నులకు మిఱుమిట్లు గొలిపినది. అతం డద్దేవతాస్వరూపచిహ్నముల పరిశీలించుచు,

శ్లో॥ ముక్తావిద్రుమహేమ నీలధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తామిందునిబద్ధ రత్నమకుటాంత త్వార్థవర్ణాత్మికాం
గాయత్రీం వరదాభయాంకుశకశాశ్శుభ్రంకపాలంగదాం
శంఖంచక్రమధారవిందయుగళం హస్తైర్వహంతీంభజె.

సీ. మూడుకన్నులఁగల్గు మోముల్లైదు సితాది
పంచవర్ణముల దీపించుచుండ
బాలేందుచేఁ గట్టఁబడి పొల్పెసగు రత్న
పుం గిరీటము మస్తమున వెలుంగ
శంఖచక్రగదాది సాధనాబ్జంబులె
న్మిదికరంబులను నెన్మిదియు మెఱయ
నొకచేయి వరముల నొసగు చిహ్నముదెల్ప
నభయప్రదత్వ మన్యమువచింప

గీ. గరిమ తత్వార్థవర్ణాత్మకత నెసంగి
కళల బ్రహ్మాండముల వెలుఁగంగఁజేయఁ
జాలుదేవత యామ్నాయసమితిఁ గన్న
తల్లి గాయత్రి విప్రసంతతుల సురభి.

అద్దేవతను సకలబ్రహ్మాండనాయకురాలగు గాయత్రిమహాదేవిగాఁదెలిసి కౌనియఁతం డానందపరవశుండై చేతులు జోడించి యిట్లుస్తుతియించెను.

గీ. జపముజేయకయున్నను జనని యధిక
మహిమ నీమంత్ర ముపదేశమాత్రముననె
బాడబుల కిచ్చుచుందు బ్రాహ్మణ్యమీవు
ద్విజులపాలిఁటి వేలుపు ధేనువవుగా.

క. నీ నిజరూపముగనిన, ట్లే నేనెద ముఱియుచుంటి నిపుడంబా! నీ
ధ్యానము సేయఁగనుంటిమ,హానందమునాకుఁగూర్ప వాదయతోడన్.

గీ. పాసె నంబుధినీదు నాయాసమెల్ల
నడఁగె నుపవాసములు సేసినట్టి యార్తి
నడలె భ్రాతృవియోగసంజాతఖేద
మంబ! నీమూర్తినిజూచినయంత నాకు

తల్లీ! నే నాపత్సముద్రంబున మునుంగుచు శ్రీవల్లభుని ధ్యానింపఁబూనిన నానోటినుండి యప్రయత్నముగా భవదీయస్తుతి వచనంబులు వెలువడిన నీ వస్మదభీష్టదేవత వగుట నామొర నాలించి నన్నొట్టె గట్టునం బారవైచి యిందుఁ బ్రత్యక్షంబై నన్నుఁ గృతార్థుంజేయఁబూనితివి. అంబా! నీదయకు మేఱయున్నదా? అని యనేకప్రకారంబుల స్తుతి యించుచుఁ దత్పాదపీఠంబునఁ బూజింపబడియున్న వింత లతాంతంబు లం జూచి యాయద్భుతసౌరభ్యంబు తత్కుసుమసంజాతంబని యెఱింగి యాపూవులు వాడక యవ్వాడేకోసి పూజించినట్లుండుట కాశ్చర్య పడుచు నవి కల్పతరుప్రసూనములేమో యని యాలోచించుచుఁ దత్పాదపీఠమున సాష్టాంగనమస్కారము గావించి యాపుష్పంబుల నెత్తి విమర్శించుచుఁ బరిమళము వెదజల్లుచుండఁ గ్రమ్మఱ నామహా దేవీనామంబు లుచ్చరించుచుఁ బూజించి మఱియుమఱియు వినుతిం చుచు భక్తివివశుండై యారాజకుమారుండు పెద్దతడ వాగర్భాలయ ములోనే వసించెను. కొంతసేపుండి వెలుపలకు వచ్చి ముఖమంట పంబునందలి మణిదీపములు పండువెన్నెలలుగాయ నిండువేడుకతో నాలోకింపుచుఁ గొంతతడ వందు విశ్రమించి తరువాత వినోదముగా గుడియావరణములోఁదిరుగఁజొచ్చెను. కౌముదీసముదయంబు దెసలసమ ముగా నెఱజిమ్ముచుఁ గల్పతరుప్రసూనవాసనాచోరకములగు సమీరకి శోరములు మేనికి హాయిసేయ నెందుగడియ లాగుడిచుట్టును దిరిగితిరిగి యానందపరవశుండగుచు స్ఫటికశిలాఘటితంబగు ముఖమండపపు మొ దటి సోపానమునఁగూరుచుండితన రాకనుగుఱించి యిట్లువితర్కించెను.

నేను దాళధ్వజుని కుమారుండఁగదా! మేమేవురమన్నదమ్ము లము పశ్చిమ దిగ్విజయము సేయఁ బయలుదేరినమాట వాస్తవమే? యుమాపురంబున శ్రీధరునిం జయించి యతనికూఁతుం గమలాదేవిని మాయన్న శ్రీముఖుఁడు పెండ్లియాడినమాట యబద్ధముకాదు గదా! తరువాత క్రోధనునిం జయింప నోడలెక్కి మేమునలువురము సముద్రములోఁ బ్రయాణముసేసినపని యదార్థముగానే తోఁచుచున్నది. సంద్రములోఁ గని తగిలి యోడ మునుఁగుటయు నిక్కువమే. అక్కడి నుండి జరిగినచర్య యంతయు నిజముకాదు. స్వప్నమనుకొనియెదను. ఆ! ఏమి! ఒకవేళ మొదటినుండి జరిగిన చర్యలన్నియు స్వప్నపలబ్ధము లేమో! అన్నియుంగావు తెలిసినది. నేను సముద్రములోఁబడి మృతి నొందితిని. 'యాం తెమతిస్సాగతిః.' అను నార్యోక్తి ననుసరించి నా బుద్ధి యప్పుడు నాయభీష్టదేవతయగు గాయత్రీమహాదేవిపై వ్యాపించు టంజేసి యిట్టి వినోదములన్నియు నాకుఁ గనంబడుచున్నవి. ఇదియే తథ్యము. నేను సమసి గాయత్రీ సాయుజ్యము నొందితిని. ఇఁకనాకుఁ బునర్భవదుఃఖములేదు. ఇదినాకు సాలోక్యముక్తియని తలంచెదను. ఇఁకఁ గర్తవ్యమేమియున్నది. ఆకోనేటిలో స్నానముజేసి యాపుష్ప ములచే నిత్యము గాయత్రీదేవింబూజించుచుఁ గాలక్షేపముజేసెదం గాకయని యాలోచించుచుఁ గూర్చుండియే కునుకుపాట్లుపడఁజొచ్చెను.

నిశ్శబ్దముగానున్న యాసమయంబున నాకశమునుండి యెవ్వరో యక్కడికివచ్చుచు మాట్లాడికొనుచున్న సందడివినంబడినది. ఆరొద విని యతండదరిపడి లేచి నలుమూలలు పరికించెను. ఆధ్వని యాకాశ మునీఁదుగా వచ్చుచున్నట్లు తెలిసికొని బయలకుఁ బోయి తల యెత్తి చూచెను. ఆకసమునుండి యెవ్వరో క్రిందికిఁ దిగుచున్నట్లు తెలియబడినది. తద్ధారితములగు రత్నమండపములఁ బ్రతిఫలించి నక్షత్రపుంజములవలె మెఱయుచున్న వెన్నెలతళుక్కులతని కన్నులకు

మిలమిట్లు గొల్పినవి. వారు దాపునకు వచ్చినకొలంది వారిమాటలు కొంచెము తేటగా వినంబడఁజొచ్చినవి. వారిభాష సంస్కృతముగా గ్రహించి వారు గీర్వాణులని నిశ్చయించి యతండు విస్మయ సంతోషములతోఁ దదర్చకులు వారేయని తలంచి వారిచర్యలు బరీక్షించు తలంపుతో నందొక గూటిలో నొదిగి చూచుచుండెను.

అంతలో నతని కపూర్వ సౌరభ్యము నాసాపర్వము గావించినది. గుడిలో నమ్మవారింబూజించిన పూవుల తావియు నా తావియు నొక్కటిగాఁ దెలిసికొని వారే తదర్చకులని నిశ్చయించి పంచేంద్రియ వ్యాపారములు నేత్రముల యందే వ్యాపింపఁజేసెను.

అప్పుడు నలువురు దేవకాంతలు దివ్య భూషాంబర ధారిణులై వికసితారవింద గంధంబులఁబరిహసించు మేని తావులు నలుమూలల ఘుమఘుమాయమానంబులై వ్యాపింప నల్లన నాకసమునుండి యా తటాకము తూరుపు తటంబున డిగి కట్టు పుట్టంబులు విప్పి గట్టునంబెట్టి వింతమాట లాడుకొనుచుఁ గొంతసేపు జల క్రీడలుగావించిరి.

అప్పుడు విక్రముఁడు వారింజూచి యౌరా! యీ నారీరత్నములు సురాంగనలు కావలయును. నిత్యమువచ్చి కల్పపాదపప్రసూనములచే నిమ్మహాదేవి నర్చించుచుందురు కాఁబోలు దివ్యకాంతా దర్శనంబు నంజేసి నేను ధన్యుండనైతి. మత్పూర్వకృత సుకృత విశేషంబునంజేసి వీరు నాతోమాటాడిరేని నావంటి సుకృతి యొందును లేఁడని చెప్పఁ గలను. నాకట్టి భాగ్యము పట్టునా? సరిసరి నేను గ్రమ్మఱ మోహమందు చుంటినేల. ఇదంతయుసత్యమనుకొను చునిట్టియూహబొందుచున్నాను.

మిథ్యావ్యాప్తికిఁ గృతకసంకల్పముతోఁ బనిలేదు. స్వప్న భ్రాంతి యెంతవఱకుఁబోవునో చూచెదంగాక. ఆ దేవకాంతలు తీర్థము లాడి యీగుడిలోనికివచ్చి యమ్మవారి నర్చింతురుగదా? అప్పటి వీరి కృత్యములు పరీక్షించెదనని తలంచి యప్పుడే గర్భాలయములోనికిఁ

బోయిఅమ్మవారివెనుకపాదపీఠముక్రిందనణఁగివండుకొనిచూచుచుండెను అంతలో నా కాంతారత్నములు జలకమాడి పుట్టంబులంగట్టికొని గుడిచుట్టును ముమ్మారు ప్రదక్షిణములుసేసి మోడ్పుచేతులతోనాలయములోఁ బ్రవేశించి సాష్టాంగ నమస్కారములు గావించి లేచి శ్రేణిగా నిలువంబడి మనోహర స్వరగీతంబుల నమ్మహాదేవినిట్లుస్తుతియించిరి.

మాలిని. జయజయ సురమస్త స్థాన విన్యస్త భూషా
చయ మణినిక రోత్ర స్ఫారభాస్వత్పదాబ్జె
జయజయ శ్రుతి మాతః సర్వలోకైకపూజ్యే
జయజయ నిజభక్త స్తావకాసక్త చిత్తే॥

శ్లో॥ బ్రహ్మాపి వాంఛతి తథైవ హరో హరశ్చ
సేంద్రాః సురాశ్చ మునయో విదితార్థతత్వాః
యద్దర్శనం జనని తేద్యసదా దురాపం
ప్రాప్తం వినా శమదమాదిభి రంబ సత్యం.

ధ్యానానంతరమున నత్తరుణులు నలువురు తత్పాద పీఠము మ్రోల శ్రేణిగాఁ గూర్చుండి నిర్మాల్యంబు తబ్బిబ్బగుటకు శంకించుకొనుచుఁ గాలిచే నక్కెడదని సమాధానపడిఁ క్రమంబున నమ్మహాదేవిని షోడశోపచారములచేఁ బూజించి మంగళగీతంబులంబాడి లేచి నిలువంబడి చేతులు జోడించి యిట్లు ప్రార్థించిరి.

సీ. ప్రతిశుక్రవారంబు రాత్రియిం దరుదెంచి
యతిభక్తి జాగరవ్రతముసలిపి
గురునాజ్ఞ నాఱువత్సరములనుండి ని
న్నర్చించుచుంటిమో యంబ మేము
రాఁబోవు శుక్రవారముతోడ వ్రతము పూ
ర్ణంబగు మాయభీష్టము నెటుల
తీర్చెదానవో? మహాదేవి! గాయత్రి! ని
న్నే నమ్మియుంటిమో నిగమజనని

గీ. నాకముననో తలంప భూలోకముననో
నాగలోకంబుననో దేవ నర ఫణాధ
రులకులంబులనో బ్రాహ్మణులనో క్షత్రి
యులనో యెటువంటి పతులసేయుదువో మాకు.

అని ప్రార్థించి యించుబోఁడులు నలువురు మబ్బు వెల్వడిన మెఱుఁగుఁ దీగియలభాతి నాగర్భాలయము వెడలి ముఖమంటపము ముందలనున్న స్ఫటికశిలావేదికం గూర్చుండి యిట్లు ముచ్చటించుకొనిరి.

ఇంద్రుని కూఁతురు మధుమతి—గంధవతీ! మన యాచార్యుండు సెప్పిన విధానంబున నాలు సంవత్సరములనుండి యీజగన్మాత నారాధించుచుంటిమిగదా. రేపు రాఁబోవు శుక్రవారముతో వ్రతము పూర్తికాఁగలదు. నాఁటి దివసంబు రాత్రి మనయభీష్టము లీయవలసి నదియేకదా. మనమిప్పుడే మనకోరికలు నివేదించినచో నాఁటికవి సిద్ధముజేసి యుంచఁగలదు. నీకెట్టి భర్తగావలయో చెప్పుము. భర్తలకన్న మనకుఁ గోరఁదగు వస్తువేమి యున్నది?

యముని కూఁతురు గంధవతి—నవ్వుచు సఖీ! అమ్మవారు మనకుఁ బ్రత్యక్షమై యేమికావలయునని యడిగినప్పుడుగదా కోరికలు దెల్పుట. ఏమియు లేనిదే కోరమనియెద వేలా?

మ—సరి సరి. ఈమె ప్రభావము నీవెఱుంగవా! మహర్షులకుఁ గూడ నీమె ప్రత్యక్షముకాదు. ఆరాధించినవారి కోరికలు మాత్రము తీర్చుచుండును.

వరుణునికూఁతురు వారుణి—గంధవతీ! మన యాచార్యుండు మొదటనే యామాట జెప్పియున్నాడు. నీవు మఱచిపోయితివి.

కుబేరునికూఁతురు చంద్రకళ—సఖీ! గంధవతీ! మేము నీకంటె జిన్నవారముగదా. నీయభిలాష ముందుగాఁ దెలిపితివేని తరువాత మాకోరికలు వక్కాణింతుము.

గంధ—అవును. చంద్రకళ చెప్పినట్లు మధుమతిచేతనే మొదట నామాట పలికింపవలయును.

మధు—నాకోరికవిని యత్యాశాపరురాలని మీరు పరిహాస మాడుదురేమో మైనం జెప్పెద వినుండు.

శ్లో. మహాకులీనత్వముదారతాచ తథా మహాభాగ్యవిదగ్ధభావా

తేజస్వితా ధార్మికతోజ్వలత్వ మమీగణాజాగ్రతి నాయకస్య.

గొప్పవంశమున జనింపవలయు లోకాతీత సౌందర్యశాలి కావలయుఁ గృత్యవస్తువులయందుఁ జాతుర్య ముండవలయుఁ ధర్మైకాయత్త చిత్తుండు, సర్వసర్వంసహైశ్వర్యయుక్తుండు జగత్ప్రకాశకుఁడు నగునట్టి వాని నాకు భర్తగాఁజేయుమని నేనమ్మహారిం బ్రార్థించుచున్నానుఁ

గంధ—బాగు బాగు. ఇంకేమి? నీవు ధీరోదాత్తునే గోరితివి నేనుమాత్రము సామాన్యునిఁ గోరుదునా? నాయభిలాష వినుము.

శ్లో. కీర్తిప్రతాపసంపన్నః పుమర్థత్రయతత్పరః

ధురంధరత్వగుణవాన్ నాయకః పరికీర్తితః.

మధుమతి కోరిన గుణములుండి కీర్తిప్రతాపములచే నొప్పుచుఁ బురుషార్థములయం దిష్టము గలిగి ధురంధరుండై యొప్పువాని నాకు నాయకునిగాఁ జేయుమని యమ్మవారిం బ్రార్థించుచున్నాను.

మ—ధీరోద్ధతుం గోరితివి. నీయభిలాషమాత్రము తక్కువగా నున్నదియా? కానిమ్ము. వారుణీ! నీయభిలాషఁగూడ వివరింపుము.

వా—మీయిరువురు గోరిన పురుషునిగుణములన్నియుఁ గలిగిన ధీరలలితుం బతిగాఁజేయుమని గాయత్రీదేవిం గోరుచున్నాను.

మ—బలే బాగు. మంచికోరికకోరితివి.

శ్లో. సధీరలలితో నేతా నిశ్చింతో భోగలంపటః.

అనుటచే నతఁడు భోగలంపటుఁడై యుండుగావున వారుణి నొడిలోఁ బెట్టుకొని కూర్చుండఁగలఁడు. చంద్రకళా! నీమనోరథము గూడ

వెల్లడింపుము. ధీరశాంతునిమాత్రము గోరకేమి ?

చంద్ర—నాకు వేరొకకోరిక లేదు. నాయకలక్షణములు దెలియవు మీరు ముప్వురుగోరిన గుణములన్నియుఁ సంపూర్ణముగా నున్న పురుషుని నామనోహరుంగాఁ జేయుటకు నమ్మవారి కనేక వందనము లాచరింపుచున్నాను.

మ—అమ్మనేచెల్ల చెల్లీ! మంచి గడుసుదానవు. ధీరోదాత్త ధీరోద్ధత ధీరలలితుల మువ్వుర గుణములు నీభర్తయం దుండవలయు నేమి? సెబాసు. మాభర్తలకన్న నీభర్తయే యుత్తముఁడై యుండును. కానిండు. సంతోషమే. మఱియొక్కటి చెప్పవలసియున్నది. మన నాయకు లేలోకమువారుగ నుండవలయునో నిరూపించుకొనవలసి యున్నది. దేవతలా? మనుష్యులా? పన్నగులా?

చంద్రకళ—సరి సరి. మనము దేవతలమైయుండ మనభర్తలు మనుష్యులు పన్నగులు నెట్లగుదురు. అట్టిప్రశ్నకే యవకాశములేదే.

మధుమతి—మనుష్యుల సామర్థ్యము నీవేమి యెఱుంగుదువు? దేవతలకన్న నెక్కువ ప్రతిష్ఠగలవారు మనుష్యులలో ననేకులున్నారు. మన యూర్వశి దేవతల విడిచిపురూరవుని వరించినకథనీవెఱుంగుదువా?

చంద్ర—అట్టివా రున్నను వా రల్పాయువులుగారా సఖీ!

మధు—దేవసంపర్కము గలిగినప్పుడు వారు దీర్ఘాయువులే యగుచున్నారు.

వారుణి—అక్కా! మనుష్య లోకపోలికగా నుందురుగాని పాములకుఁ జక్కఁదన మేమియుండును ?

మధు—ఇదియా మీసందియము. ఇందులకు నేనొక చక్కని కథ జెప్పెద మీరందఱు సావకాశముగా నాకర్ణింపుఁడు. మీసందియము తీరఁగలదు అని మధుమతి చెప్పుచున్నది.

అని యెఱింగించి మణిసిద్ధుం డవ్వలికథ యవ్వలి నెలవున నిట్లు చెప్పందొడంగెను.



## 234 వ మజిలీ.

# గుణకేశినికథ.

చెలులారా! వినుండు. మాతండ్రి మహేంద్రుని సారథి మాతలి పేరు మీరు వినియుందురు. అతనికి లేక లేక చిరకాలమునకు గుణకేశిని యను కూఁతురు పుట్టినది. ఆబాలికామణిసౌందర్య మిట్టి దని వర్ణింప శేషునికైన శక్యముకాదఁట. త్రిభువనాశ్చర్యకరమగు చక్కఁదనంబుననొప్పు నకన్యకామణికి వివాహముజేయ నిశ్చయించి మాతలి భార్యతో నాలోచించి వరాన్వేషమునిమిత్తము మాతండ్రి వలన సెలవుబొంది తొలుత స్వర్గపట్టణమంతయుం దిరిగి సురగరుడోరగ సిద్ధ సాధ్య విద్యాధర గంధర్వ కిన్నర కింపురుషాది దేవతానగర విశేషములఁ బరికించి రూపయౌవనవిద్యామదగర్వితులగు వారివారి కొమరులం జూచి తనకూఁతునకుఁ దగినవారు కారని నిశ్చయించి తిరుగా నింటికివచ్చి భార్య కత్తెఱం గెఱింగించెను.

అతనిభార్య మనోహరా! మీతో మొదటనే చెప్పవలయునని తలంచితిని. చక్కఁదనముమాట యటుండనిండు. దేవజాతియందొక్క లోపమున్నది. క్రొత్తసంతతి గలుగదు. ఎప్పుడు నొక్కపోలికవారే యుందురు. నూత్నయౌవనముగల సౌందర్యవంతులు మందునకైనఁ గానరాదు. ఎప్పుడును ప్రాఁతబొందలే కావున మన గుణకేశినికి వేల్పులు పనికిరారు. భూలోకంబున కరిగి యభినవయౌవనమునం బ్రకాశించు రాజకుమారులఁ బరిశీలించి తగినవాఁడున్నఁ దీసికొనిరండని నియమించినది.

మాతలి భార్యమాట పాటించి భూలోకమంతయు మూడుసారులు తిరిగి విద్యాయౌవనబలమదగర్వితులగు క్షత్రియకుమారులం గులశీలవిద్యాతపస్సంపన్నులగు మహర్షిపుత్రుల నిశ్శేషముగాఁ బరిశీలించి తనకు మారితకుఁ దగిన లలితుఁ డెందుఁ గానక విసిగి యింటికివచ్చి భార్యకావృత్తాంత మెఱింగించెను.

ఆమె ఔరా! స్వర్గమర్త్యలోకములలో నొక్కచక్కని యువకుఁడు దొరకకపోయెనా? సీ! మృదుసత్యులకుఁ గన్యక జనించుటకంటెఁ గష్టములేదు. కన్యక పితృకులము మాతృకులము భర్తృకులము మూడుకులములకు వన్నె తేవలయును. చూచిచూచి రత్నమువంటిపిల్ల నసమానరూపుండగు వరునకిచ్చి యెట్లు పాణిగ్రహణము చేయఁగలము? మనోహరా! కష్టపడి రెండులోకములు తిరిగితిరి గదా! భోగిస్థానమైన పాతాళలోకముగూడఁ జూచి రండు. అందును దొరకనిచోఁ బిమ్మట విచారింతము గాక. అని యుపదేశించుటయు మాతలి భార్యమాట జవదాటనివాఁ డగుట నప్పుడే సుధర్మకు మ్రొక్కి ప్రదక్షిణము చేయుచు భూలోకమున కరిగెను. అందు దైవికముగా నారదమహర్షి యెక్కడికో పోవుచు నతని కెదురుపడియెను.

మాతలి—(నమస్కరించి) మునీంద్రా! నేనింద్రసారథిని, మాతలిని.

నారదుఁడు—(ఆశీర్వదించుచు) మాతలీ! నీ వీ భూతలంబునకేమిటికి వచ్చితివి? మహేంద్రుఁ డెందైనఁ బనిగలిగి పంపెనాయేమి?

మాతలి—లేదు స్వామి. స్వీయకార్యమునకే వచ్చితిని.

నారదుఁడు—మే మక్కార్యవిధానము వినవచ్చునా?

మాతలి—సరి సరి. మూడులోకములలో మీరువినని రహస్యము లున్నవియా? మీరు వినుటయే కాదు. పూనుకొని యాకార్యము నేయవలసియున్నది.

నార—ఇంతకన్న నత్యాహిత మేమియున్నది! సత్వరముగా

నెఱింగింపుము దానిం గావించి నీచే స్తోత్రముల నందెదంగాక.

మాతలి—స్వామీ! దేవతలు సంతానశూన్యులగుటనే సుఖపడుచున్నారని తలంచెదను.

నార—అట్లనుచున్నా వేమి?

మాతలి—మఱేమియుం గాదు వినుండు. మాతృసాంప్రదాయంబునంబట్టి నాకొక యాఁడుపట్టి పుట్టినది. మీ రెఱుంగుదురా?

నార—ఎఱుఁగకేమి! యామె జాతకర్మోత్సవమునాఁడు నే నందులేనా! ఆబాలికామణి సౌందర్యాతిశయము మెచ్చికొని ముద్దుపెట్టుకొని దీవించలేదా?

మాతలి—ఔను స్వామీ మఱచిపోయితిని. మీరులేనిదే దేవలోకములో నుత్సవము జరుగునా? ఆబాలిక యిప్పుడు సంప్రాప్తయౌవనయైయున్నది. వరాన్వేషణమునిమిత్తముబయలుదేరివచ్చితిని.

నార—స్వర్గలోకములోనెక్కడను దగినవరుఁడు దొరకలేదా?

మాతలి—స్వర్గమందేకాదు. మర్త్యలోకమునఁగూడ దొరకలేదు.

నార—మఱి యిందేమిటికి వచ్చితివి?

మాతలి—పాతాళలోకమొకటి చూడవలసియున్నది. అందులకై యిందువచ్చితిని. నేనెప్పుడు నాభువనము చూచియెఱుంగను. అందులకు బోవుమార్గముగూడ నాకుఁ దెలియదు. మునీంద్రా! మీరు శ్రమయని తలంపక యిప్పుడు నాతోవచ్చి యాలోక విశేషంబులు జూపింతురేనిమీకెల్లకాలము కృతజ్ఞుఁడనై యుండెదననుగ్రహింపుఁడు.

నార—మాతలీ!నన్నిందులకై యింతగా స్తుతియింపవలయునా? నేనిప్పుడు వరుణలోకమునకే యరుగుచుంటి పోవుదమురమ్ము. నీకథో భువనవిశేషములన్నియుఁ జూపుదునుగాక. అని పలికి నారదుఁడు మాతలిని వెంటబెట్టుకొని సముద్రములో మునింగి వరుణనగరమునకు దీసికొని పోయెను. వరుణదూతలు నారదునిరాక జూచి వరుణున

కడకరిగి దేవా! నారదమహాఋషి దేవసారథి మాతలియటఁ యతని వెంటబెట్టుకొని వచ్చిరి. హాజారముకడ నిలిచియున్నారు. మీకుఁ జెప్పుమన్నారని విన్నవించినంత లేచి నారదులవారి కాటంకమేలా? లోనికిఁ దీసికొనిరాలేక పోయితిరా? అని పలుకుచు ద్వారముకడ కరిగి మునిసమ్మతమగు నాతిథ్యము నారదునకును మహేంద్రసమ్మత మగు పూజ మాతలికిం గావించి తోడ్కొనిపోయి సభాభవనంబున రత్నపీఠంబులం గూర్చుండబెట్టి పెద్దగాస్తుతియించుచునాగమనకారణం బడుగుటయు నారదమహర్షి యిట్లనియె.

పాశహస్తా! ఈమాతలిని నీవుయెఱింగియేయుందువు. ఈతని కూఁతురు గుణకేశినియను కన్యకకు వరుఁడు కావలసియున్నాఁడు. స్వర్గమర్త్యలోకములందు వెదకితిమి. తగినవాఁడు గనంబడలేదు. అందు నిమిత్తముపాతాళలోకమునకుఁదీసికొనివచ్చితిని. మీలోకంబుననున్న వారి నందఱుంజూచుట కాజ్ఞయిప్పింపుమని యడిగినవరుణుఁ డిట్లనియె.

సురమునీంద్రా! నీవు త్రిలోకసంచారివి. మూఁడులోకము లలో నీవెఱుంగని ప్రదేశములు నెఱుఁగనివారును లేరుగదా. అతండు త్రిలోకాధిపతియగు నింద్రుని సచివుండు. మీయిరువురు మాకుఁ బూజనీయులు. ఇట్టి మీ కాటంకములుసెప్పువారెవ్వరు? మీయిచ్చ వచ్చినట్లు శుద్ధాంతగృహారామక్షేత్రంబుల విహరింపుఁడు. ఈమాతలి మానగర మెప్పుడును వచ్చియుండలేదు. ఈలోకవిశేషములన్నియు నతనికిం జూపుఁడు అని యుపన్యసించెను.

నారదమహర్షి మాతలిని వెంటబెట్టుకొని సర్వసమృద్ధిమంతం బగు వరుణలోకవిశేషము లన్నియుం జూపించెను. తిన్నగా వరుణుని కుమారునికడకుఁ దీసికొనిపోయి మాతలీ! యీతండు పుష్కరుం డనువాఁడు. వరుణుని పెద్దకొడుకు. రెండవమహాలక్ష్మియనం బ్రభ గాంచిన జ్యోత్స్నాకళయను సోముని పుత్రిక యితని స్వయంవర

మున వరించినది. ఏ రీతని తమ్ములు. విద్యాభ్యాసంపన్నులు చూడుము. ఈప్రదేశముల హ్రాతరాజ్యులగు రక్కసులు వసింతురు. దైత్యులు దేవతలచేఁ బరాజితులై యిందు డాగియుందురు. ఇది వారుణప్రాకము. ఇం దగ్ని సర్వదా ప్రజ్వరిల్లుచుండును. ఇది గాండీవముండుచోటు. ఇది వరుణచ్ఛత్రము. ఇందుబడిన వర్షబిందువులు చంద్రకిరణములువలె నాహ్లాదముజేయును. ఇట్టిచోద్యము లనేకములీలోకమందున్నవి. మనకుఁగల కార్యవ్యగ్రతచే నిది చూడఁదగు సమయముగాదు. వరుణపుత్రులలో నీకెవ్వరైన నచ్చిరేమో చెప్పుమని నారదమహర్షి యడిగిన మాతలి యంగీకరింపక యవ్వలిలోకములు చూతము పదుఁడు. అని యుత్తరముజెప్పెను.

అప్పుడు నారదమహర్షి యతనితోఁ గ్రిందుగా మఱికొంతదూరమేగి మాతలీ! ఇది రసాతలము సప్తమలోకము. కామధేను విందే యుదయించినది. ఇందలివిశేషము లద్భుతప్రభావయుక్తములు. పన్నగలోకమున స్వర్గలోకమున మనుష్యలోకమునగూడ నిందున్నవారి సౌఖ్యములు గలుగవని గాథగాఁ జెప్పుకొనుచుందురు. ఇందున్న సుందరకుమారుల నందఱం జూడుమని బలుకుచు నందలివింత లన్నియుం జూపించెను. మాతలి కందలి పురుషులు నచ్చలేదు. అవ్వలకుఁ బోదమని ప్రేరేపించెను. నారదుం డతని మఱికొంతదూరము దీసికొనిపోయి మాతలీ! యీనగరమును జూచితివా? దీనిపేరు భోగవతి. త్రిదివమును దేవేంద్రుఁడువలె దీనినివాసుకి పాలించుచున్నాడు. సహస్రఫణాభూషితుండగు శేషుం డిందుండియే శ్వేతభూధరమువలె మెఱయుచు భూమిని మోయుచున్నాడు. ఇందు సురస కొడుకులు నాగకుమారులు దివ్యరూపములతో నొప్పుచు మణిస్వస్తికచక్రాంకులై వేనవేలు సంచరించుచుందురు. వీరు స్వభావముచేత రౌద్రులు. ఇది నాగలోకమునకు ముఖ్యస్థానమగుట నిందు సహస్రముఖులు పం

చాశన్ముఖులు దశముఖులు పంచముఖులు త్రిముఖులు ప్రముఖులు నగు నాగకుమారు లనేకులు ప్రఖ్యాతులై యున్నారు. అని తెలియఁ జేయుచు నారదుం డాభోగవతీనగరము నడివీధిని నిలువంబడియెను.

అప్పుడందున్న పన్నగప్రముఖులెల్ల నాదరమహర్షి వచ్చెనను వార్తవిని గుంపులుగుంపులుగా వచ్చి యతనికి నమస్కరించుచుఁ బూజించి మహాత్మా! ఈదివ్యపురుషుఁ డెవ్వఁడు? ఈనడుమ మీదర్శనము మాకు లభించుటలేదు. దానంజేసి యితర లోకవిశేషము లేమియుఁ దెలియకున్నని. క్రొత్తవిశేషము లేవైనంగలిగిన వక్కాణించి మాకానందము గలుగఁజేయుఁడని ప్రార్థించిరి.

నారదుండు వారి నాశీర్వదించుచు విశేషముల కేమియున్నది సర్వలోకములవారు సుఖులైయున్నవారు. ప్రస్తుతము సంగరము లెక్కడను లేవు. గరుత్మంతునివలన మీరేబాధయుం బొందక సుఖులైయున్నారుగద. అది యట్లుండ తక్షక వాసుకి కర్కోటక కులస్థులన్యోన్యము కలహింపుచుందురు. మీలో మీకాతగవులు లేక సఖ్యముగలిగియున్నారా? అనియడిగినఁగాళీయుఁడనుఫణిపతియిట్లనియె.

మహాత్మా! మీదయవలన నిప్పుడు మేమందఱము కలిసియే యుంటిమి. మాలో మాకుఁ దగవులేమియును లేవు. గరుత్మంతుని యుపద్రవ మొకమాదిరిగాఁ దగ్గించుకొంటిమి. వినుండు. ఆపక్షిరాజు అవసరమువచ్చినప్పుడెల్ల మామీఁదఁబడి దొరికిన నాగులనెల్ల భక్షించుచు దయావిహీనుండై బంధుత్వమాలోచింపక నిత్యము మాకుఁ బ్రాణసంకటము గావింపుచుండెను. ఏదినమునవచ్చునో ఎవ్వరిని భక్షించునో తెలియదు. అతండు వచ్చినప్పుడెల్ల వేలకొలఁది నాగులఁ గాలికిఁ దగిలించుకొనిపోయి భక్షించుచుండెను. అనేకనాగకుటుంబములు పేరులేక నాశనమైపోయినవి. ఆయుపద్రవము భరింపఁజాలక మాలో మాకుఁగల తగవులు వదలుకొని మేమందరము నొకనాఁడొక

సభజేసి కర్కోటక ధృతరాష్ట్ర ప్రిభృతుల రప్పించి యిట్లంటిమి.

గరుడుఁడు శేషవాసుకిప్రముఖుల కులస్థులజోలికి బోక నిత్యము సామాన్యకుటుంబములమీఁదఁ బడి నాశనము చేయుచున్నాఁడు. మూషికాద దధిముఖ వసంతకాదినాగకుటుంబములు పేరులేక నశించినవి. పెద్దవారందరు పూనుకొనక యుపేక్షించుచున్నారు. ఇట్లు కొన్నిదినములు జరిగిన నాగకులమే నశించును. ఇందుల కేదియేని యుపాయమాలోచింపవలయునని పెద్దవారిం గోరితిమి.

అప్పుడు వాసుకి మనుముఁడు అశ్వతరుఁడు తక్షకుఁడు కర్కోటకుఁడు నలువురు నాలోచించి మాకిట్లు తెలియజేసిరి. మనతల్లి కద్రువు జేసిన దోసంబునంజేసి వినతకొడుకు మనపై యీసుబూని యిట్టి దారుణక్రియలు గావించుచున్నాఁడు. అతఁడు మిగుల బలవంతుఁడగుట విరోధించి యతని నేమియుంజేయఁజాలము. కావున నతనిం బ్రార్థించి సంఘమరణములఁ దప్పింపుమని వేడుకొందము. నెలకొకసారి మాయూరు రావలయుననియు నప్పుడు వంతులువేసికొని యొక్కనాగు నాహారముగా నర్పింతుమనియుం జెప్పుకొనుటయేకాక యట్లు వ్రాసి యిత్తము. అతం డట్లంగీకరించినచో నీయుపద్రవము కొంతవఱకు దగ్గునని యుపన్యసించి మాకుఁ దెలియఁజేసిరి. ఆనిబంధనకు నందున్న నాగకులజులెల్ల నంగీకరించి యప్పుడే సంతకములుజేసి సభాపత్రిక వ్రాసియిచ్చిరి.

ఆమఱునాఁడే గరుడుండువచ్చి యా వీటిపైఁబడి నాగకుమారుల భక్షింపఁబూని నంత శేషవాసుకి పౌత్రిలిరువురు నతని కడకుఁబోయి తమపేరులు సెప్పుకొనిరి గరుత్మంతుని కా రెండు కొలములవారియెడఁ జాల ప్రీతి గలిగియున్నది. వారింజూచి యతం డిట్టి తఱి మీ రేమిటికి వచ్చితిరని యడిగిన వా రా పత్రికంజూపుచు మా నాగకులజులెల్ల మిమ్మిట్లు ప్రార్థించుచున్నారు.

అక్కచెల్లెండ్ర బిడ్డలము. ఈమాత్ర ముపకారము చేయుము అని వేడికొనిరి. వారిమాట తీసివేయలేక యాపక్షిపతి యట్లంగీకరించి యప్పుడే మరలిపోయెను.

నాఁటినుండియు మాకు సంఘ మరణములు తప్పినవి. వైనతేయుఁడు నెలకొకసారివచ్చి మేమిచ్చినవారిలో నచ్చినవానింభక్షించి పోవుచుండును. దానంజేసి మాలో మాతగవులు గరుత్మంతుని మూలముగనే యడంగిపోయినవని యావృత్తాంతమంతయు నెఱింగించెను.

నారదుండు విని బాపురే! మీరు మంచి బుద్ధిమంతులు. అన్యోన్యమైత్రివలనఁ గలుగు సౌకర్యము లిట్టివేయని వారి నభినందించెను. అప్పుడు నాగకుమారులు ధనంజయప్రముఖులు నారదమహర్షి నగ్గింపుచు మహాత్మా! మేము మీ వీణాగానము విని చాల కాలమైనది. ఒకసారి గాయత్రీసామము బాడి మాకానందము గలుగఁ జేయుదురా? అని వేడికొనిరి. నారదమహర్షి వారి ప్రార్థనమాదరించి యానడివీధినే కూర్చుండి విపంచి మేలగించి సామగానంబు హాయిగాఁ బాడఁజొచ్చెను. నారదమహర్షి సంగీతము పాడుచున్నారని విని భోగవతీనగరంబునంగల స్త్రీబాలవృద్ధులు గుంపులు గుంపులుగా వచ్చియాలకించుచునగ్గానరసముగ్రోలి వివశులై పడగలువిప్పి యాడఁదొడంగిరి.

అట్టితఱి నారదుఁడు జనాంతికముగా మాతలితో నీనిమిత్తమే నే నీసంగీతము పాడుచుంటిని. ఫణాధరులు గానమనినఁ జెవులు కోసికొందురు. ఇప్పుడీ గ్రామంబుననున్న నాగకుమారులందఱు నిందు వచ్చియున్నారు. వీరిలో నీకూఁతునకుఁ దగినవాఁడున్నాడేమోచూచికొనుము. మనముప్రతిపన్నగుని యింటికింబోయి చూచినచోఁ బెద్ద కాలముపట్టును. పరీక్షించి చూచుకొనుమని పలుకుచు వినోదముగా బాడుచుండెను.

పన్నగు లొకచోట నిలువక పాటనాలించుచు నారదమహర్షి

చుట్టును తిరుగుచుండిరి. ఆభోగవతీ నగరంబునంగల ప్రముఖులు తక్షకుఁడు కర్కోటకుఁడు కౌరవ్యుఁడు అశ్వతరుఁడు ఆర్యకుఁడు వసంతకుఁడు దిలీపుఁడు కాళీయుఁడు శంకుఁడు ధృతరాష్ట్రుఁడు లోనగు సర్పపుంగవులెల్ల వచ్చి నారదుని గాన మాలించుచుండిరి. అట్టితరి నింద్రసారధి వారినెల్ల సాకూతముగా నాలోకింపుచుండెను.

చ. శిరమునఁజారు దివ్యమణి శేఖర మట్లు మెఱుంగు లీనఁగా
సురచిర రత్నమండన విశోభితుఁడాది వయస్కరమ్మనో
హరతనుఁ డార్యలక్షణ సమంచితుఁడై తగునాగపుత్రుఁ డొ
క్కరుఁడట నింద్ర సారధికిఁ గన్నులపండువు గాఁగనంబడెన్.

నూత్నయౌవన లావణ్య శోభా విభాసిత గాత్రుండగునట్టి నాగపుత్రుంగాంచి మాతలియుబ్బుచు గొబ్బున నారద మహర్షితో మహాత్మా! ఆ భుజంగ కుమారుండు ప్రణిధానమున ధైర్యమున రూపమున వయసున మాగుణకేశినికిం దగినవాఁడు. మీ యనుగ్రహంబున నేఁటికిజూడఁ గంటి వానిజన్మ కర్మ విశేషములెట్టివో తెలిసికొనుఁడని కోరిన విని యయ్యనిమిషముని యా బాలునిఁ దననికటంబునకు రమ్మని చీరి యిట్లనియె.

నారదుఁడు—అబ్బాయీ! నీవెవ్వనికు కుమారుండవు?

సుముఖుఁడు—(విచారముతో) నేను జికురుని కుమారుండ.

నార—నీపేరు.

సుము:—సుముఖుండందురు.

నారదుడు—నీవు ఆర్యకుని పౌత్రుఁడవుకావా?

సుము—అవును.

నారదుడు—నీ మాతా మహుఁడు వామనుఁడేనా.

సుముఖు—చిత్తము వామనుఁడే

నారదుడు—నీతండ్రియుఁ దాతయు నేమముగానున్నారా?

సుముఖు—(కన్నులనీరు గ్రమ్మ) దండ్రిలేఁడు తాతయేనన్నుఁ బోషించుచున్నాఁడు.

నారదు—అనక మేము మీయింటికివత్తుమని మీ తాతతో జెప్పెదవా?

సుము—చెప్పెదస్వామీ! తప్పకదయజేసి మమ్ముఁగృతార్థులంగావింపుఁడు అనికోరి యా బాలుండప్పుడే యింటికిఁ బోయెను.

నారద మహర్షియుఁ బాటచాలించి నాగ పతులకెల్లఁ జెప్పి యప్పుడే మాతలితోఁగూడ నార్యకు నింటికింబోయెను. ఆర్యకుఁడు మనుమని వలన నతని రాక దెలిసికొని యున్నవాఁడగుట గృహామంతయు నలంకరించి ద్వారముకడ వేచియుండి వారు చేరినతోడ నేయర్ఘ్యపాద్యము లిచ్చి స్తుతియించుచుఁ దోడ్కొనిపోయి రత్నపీఠంబులం గూర్చుండఁబెట్టి ప్రక్కలనిలఁబడి వింజామరల వీచుచుండెను.

అప్పుడు నారద మునీంద్రుండతని భయభక్తి విశ్వాసముల నభినందించుచు నార్యకా! ఈతని పేరు నీవు వినియే యుందువు. మాతలియనువాఁడు. ఇతండు మహేంద్రునకు సారధియు మిత్రుఁడు మంత్రియునై ప్రాణములలోఁ బ్రాణమై మెలంగుచుండును. ఇట్టి తేజస్వి యెందునులేడు. యుద్ధయాత్రలయందు వేయి గుఱ్ఱములచేఁ గట్టఁబడిన యింద్ర రథ మితఁడు మనసుచేతనే నడుపుచుండును. ఇతండు గుఱ్ఱములచేతఁ జయించిన శత్రువుల వృత్రారి చేతులతో జయించుచుండును స్వర్గవైభవమంతయు నీతనిదేయని చెప్పవచ్చును. ఇతనికి గుణకేశినియను కూఁతురుగలదు. ఆకన్య చక్కఁదన మిట్టిదని మేము చెప్పకయే మా ప్రయత్నమువలన మీకుఁ దెల్లముకాఁగదు. ఆకన్యకకుందగిన వరు నిమిత్త మీతండు స్వర్గమర్త్య పాతాళలోకములు దిరిగి యెందునుంగానక మీభోగవతీ నగరంబున కరుదెంచెను. ఇందులకే నేనుగూడ నిందువచ్చితిని. పూర్వపుణ్యవిశేషంబున నీ

మనుమఁ డతని మతికి ననుకూలుఁడని తోఁచెను. గుణకేశిని నీ మను మని కీయ నంగీకరించినాఁడు. అందులకు మీకు గూడ సమ్మతమేని వెంటనే శుభకార్యము జరిగించవలసియున్నది. మీ కూటస్థుఁ డైరావతుని ప్రఖ్యాతినిబట్టి తనపట్టి సుముఖుని కీయ నిశ్చయించెను. ఇందులకు నీ యభిప్రాయమేమని యడిగిన నార్యకుండు నిట్టూర్పు నిగుడించుచు నిట్లనియె.

మహాత్మా! మాతలి చరిత్రము మేమెఱుంగనిదియా! అది యట్లుండె పరిజన కథలయందును దలంప నర్హతలేని మాయింటికి దేవర మాతలిందీసికొనివచ్చి మమ్ముఁ బెద్దగా నగ్గింపుచుంటిరి. ఇంత కన్న నాకుం గావలసిన దేమియున్నది! త్రిలోకాధిపతియగు మహేంద్రుని సచివుఁడువచ్చి పిల్ల నిత్తుమన్న వలదనువారుందురా? మునీంద్రా! మాయిక్కట్టు నేమనిచెప్పుకొందును. మాకట్టిభాగ్యము పట్టుటయెట్లు? స్వామీ! మాయూరినాగులెల్ల గరుత్మంతునికి వంతులు వైచికొని యాహార మర్పించుటకు నియమము జేసియున్నారు. క్రిందటినెలలో మాకు వంతురాగా నా కుమారుని జికురుని పక్షిపతి భక్షించిపోయెను. అంతటితో విడువక తండ్రి వెనుక నేడ్చుచు నందు వచ్చియున్న యీ సుముఖునింజూచి యోర్వఁజాలక యాపతగపతి ముందరినెలలో వీని నా కాహారముగాఁ దెచ్చియుంచుఁడని పాఁవ పెద్దలకుఁ జెప్పిపోయెను. రెండు నెలలో నొక్క యింటివారి నిద్దర భక్షింపఁగూడ దదియన్యాయమని యొక్క భుజంగుఁడు చెప్పఁ డయ్యెను. సంవత్సరమునకొక యింటికి వంతు రాఁదగినది. రెండు నెలలో వరుసగా మాయింటికివంతువచ్చినది. కొడుకు పోయినందులకే దుఃఖించుచుండ మనుమఁడుగూడ నాసీడజపతికి భక్ష్యమైన నేమిచేయఁ దగినది? ఈయక్రమ మెవ్వరితోఁ జెప్పికొందును? అక్కడికిఁ పెద్ద నాగులకడకుఁబోయి మొఱపెట్టుకొంటిని. మేమేమి చేయుదుము?

గరుడుఁడు మీ మనుమనింజూచి స్వయముగా నే కోరికొనియెను. వలా దనుటకు మాకు సామర్థ్యముగలదా! ఇందు మా తప్పులేదని వారుత్త రము చెప్పిరి. తపోధనసత్తమా! మా సుముఖున కిఁకఁ బదిదినములు మాత్రమేయాయువున్నది.ఇట్టి వానికిఁమీరు పెండ్లిచేయుమని యడి గిననేనేమిసమాధానము చెప్పఁగలనని గోలు గోలున నేడువఁదొడంగెను.

సీ! సీ! శ్రీవిష్ణునికి వాహనమై కశ్యపునకుఁ గుమారుఁడై యొప్పు పక్షిపతి కించుకయు జాలిలేకపోవుట కడుంగడు శోచనీయమై యున్నదని నారదమహర్షియతనిగర్హించుచు మాతలిదిక్కు మొగంబై యుందుల కేమందువని యడిగిన నతం డిట్లనియె. స్వామీ! మీయను గ్రహముండిన గరుడుండు సుముఖు నేమిజేయఁగలఁడు? ఈసుముఖుని మన మిప్పుడు స్వర్గమునకుఁ దీసికొనిపోవుదము. మహేంద్రునితో నితనికథ జెప్పి యీముప్పు తప్పింపుమని వేడుకొందము. అతండు పేం ద్రుని ముఖముగా గరుడునకుఁ జెప్పించిన నంగీకరింపక పోవఁడు. గరుత్మంతుం డెంతబలవంతుండైనను నుపేంద్రునియాజ్ఞ నుల్లంఘింపఁ గలఁడా? ఇదియే కర్తవ్యమని నాకుఁ దోచినదని చెప్పిన నారదుండు సంతోషించి యార్యకుని కావార్త దెలియఁజేసెను.

ఆర్యకుఁడు మిగుల సంతోషించుచు మనుమని వెంటఁబెట్టికొని యాక్షణమందే వారివెంట నాకంబున కరిగెను. అని యెఱింగించి... ఇట్లు చెప్పందొడఁగెను.

---

235 వ మజిలీ.

# సుముఖుని కథ.

ఆర్యకుఁడు సుముఖుని వెంటఁబెట్టుకొని చుట్టములతోఁగూడ మాతలివెంట స్వర్గమున కరిగెనని విని భోగవతీనగరంబునంగల నాగ ప్రముఖు లొకనాఁడు సభచేసి యిట్లు సంభాషించుకొనిరి.

కాళీయుఁడు—ధనంజయా! మనము గరుత్మంతుని బ్రార్థించి యెట్లో యతనినొప్పించి యొకరీతి సంఘమరణముల దప్పించుకొంటిమి గదా. అతండు రేపు వచ్చునఁట తాను గోరిన సుముఖుందెచ్చి నడివీధి వధ్యశిలదావున నుంచుమని యిప్పుడే వార్త పంపియున్నాఁడు వింటివా?

ధనంజయుఁడు—విన్నాము. బాహాటముగాఁ జాటించినఁ దెలియకుండునాయేమి?

కాళీయుఁడు—ఆసుముఖుఁ డేడీ? నీకుఁ జుట్టముగదా! నీవు గూడ నతినితోఁ బెండ్లికి వెళ్లితివికావేమి?

ధనంజయుఁడు—నీయెత్తిపొడుపుమాటల కేమిలే. పెండ్లి కరిగెనో పేరంటమునకరిగెనో నే నెఱుంగుదునాయేమి?

సహుషుఁడు—అవును. ఇప్పుడు మనకు గట్టిచిక్కు రాఁగలదు. గరుఁడుఁడు వచ్చునప్పటికి మన మతని వధ్యశిలపైఁ దెచ్చిపెట్టనిచో మన పనిపట్టకమానఁడు.

నందకుఁడు—ఆర్యకుఁ డేమిన్యాయస్థుఁడు! మనతో నేమియు నాలోచింపక మాతలివచ్చి కూఁతునిత్తు నన్నంతనే నాగాంతకున కాహారముగా నిరూపింపఁబడిన తన మనుమని వెంటఁబెట్టికొని స్వర్గమున కెట్లుపోయెను? ఇది తప్పుపనికాదా.

శంకుఁడు—మీరిప్పుడిన్నినీతివాక్యములాడుచున్నారు. వారు నాకంబున కరుగుదురని విన్నప్పుడు వారింటికిఁజని పోవలదని యాటంకము సేయలేకపోయితిరా? ఇప్పు డేమనుకొనిన లాభమున్నది.

దిలీపుఁడు - మేము కొందర మట్టియూహ జేసితిమిగాని నారదమహామునింజూచి వెఱచితిమి. అతం డలిగిన నేరాయిగానో శపింపఁగలఁడు.

కర్కోటకుఁడు—కానిండు. గతమునకు వగచినం బ్రయోజనములేదు. నారదు మొగముజూచియే వారరుగుచుండ నెవ్వరు

నాటంకపెట్టలేకపోయిరి. ఇఁక ముందుఁ గావింప దగిన కార్యమేమి? రేపే గరుడుఁడువచ్చు దివసము. వార్తగూడ వచ్చినదిగదా స్వర్గమున కరిగిన సుముఖుని మన మిపుడు రప్పింపఁజాలము. ఉన్నవారిలో నతని కాహారమగువారెవ్వరో తెలుపవలసియున్నది.

తక్షకుఁడు—ముందరినెలలో నెవ్వారింటికి వంతున్నదో యా యింటిపురుషు నీనెలకు మార్పవలయునని నే నభిప్రాయమిచ్చుచున్నాను.

ధనంజయుఁడు—(పత్రికం జూచి) కర్కోటకు నింటికి వంతు వచ్చినది.

తక్షకుఁడు—కర్కోటకా! ముందరినెలలో మీయింటి వంతఁట, ఆవంతు రేపటికి మార్చఁబడినది. రేపటి భక్ష్యవస్తువును దెచ్చుబాధ్యత నీమీఁదం బెట్టబడినది. తెలిసినదియా?

కర్కోటకుఁడు—ఎప్పటికప్పుడు మార్చుటకు మీయిష్టమే? మావాండ్రుమాత్రము పెండ్లికిఁ బోలేదా? మా వంతు ముందరి నెలలోనన్నది. యిప్పుడు నే నెవ్వరింబంపఁజాలను.

ధనంజయుఁడు—పంపకున్న దప్పునా? పాపము సుముఖునికిది వంతు సమయముకానేకాదు. గరుత్మంతుఁడు వానింజూచి కోరికొనుటచే నట్లు వంతువేసితిమి. మొదటివంతు కర్కోటకునిదే.

కర్కో—చాలుజాలు ఆపట్టిక నీకడనున్నదని మిట్టిపడుచున్నావు. మొన్న సుముఖుని వ్రాసి యిప్పుడు నాపేరు వ్రాసిన నేనొప్పుకొందునా? ఆనింబధనము పోయినది. మఱియొకనికి వంతుమార్పుఁడు.

ధన—ఇంకొకఁడు మాత్రమొప్పుకొనునా? దీనింబుచ్చికొని నీవే మిట్టిపడుము. (అని యాపట్టిక నతనిపైఁ విసరుచున్నాఁడు.)

కర్కో—నాప్రతాప మెఱుంగుదువా? వాసుకి శేషప్రముఖులకే వెరువను. నీవా నన్ను గద్దించువాఁడవు?

తక్షకుఁడు—కర్కోటకా! తొందరపడకుము ఇట్టి నిబంధనముల మనమే యేర్పరచి మనమే దాటవచ్చునా? అందరు నిట్లే యనిన నేమిచేయఁదగినది? గరుడుం డడిగెను. కాని యార్యకునింటివంతు జరిగిపోయినది. దైవ రక్షితుండై సుముఖుండు దివికరిగెను. నీకు వంతు తప్పదు. పెద్దలందఱు నట్లు చెప్పుచున్నారు. విందువా? వినవా?

కర్కోటకుఁడు—నేనెవ్వరు చెప్పినను వినను. నాకీనెలలో వంతు లేదుగదా యని మా వాని నూరికిఁ బంపితిని. వాఁడు రేపటికి రాఁజాలఁడు. అమాట గరుత్మంతునితోనే చెప్పుకొనియెదం గాక.

ధనంజయుఁడు—కర్కోటకుఁ డిందరుచెప్పుచుండవినకపోయెంగదా. కానిండు ఇఁకమీఁదటివంతుల కెవ్వరు సమ్మతింతురో చూచెదంగాక.

తక్షకుఁడు—పోనిండు రేపతండు వచ్చుచున్నాడుగదా మన తగవులన్నియు నొక్కసారి యాపక్షిపతియే తీర్చునని భుజంగులెల్ల వాల్ల కల్లోలముగాఁ నాదివసంబెల్ల బోట్లాడుచుండిరి. అంతలో గరుత్మంతుని ఱెక్కల చప్పుడులు వినంబడినవి. పడగలు ముడిచికొని యందఱు కిక్కురుమనక నతని రాక కెదురు చూచుచుండిరి. అప్పు డప్పక్షిపతివచ్చి వధ్యశిల ప్రక్కవాలి ఱెక్కలు ముడిచికొనియెను. వధ్యశిలపై నెవ్వరింగానక కన్నుల నిప్పు లుఱుల నురగులనెల్లంగలయ నీక్షించుటయుఁ దక్షకుం డేదియో చెప్పింబోయినఁ గర్కోటకుఁ డడ్డంబై మహాత్మా రక్షింపుము. నాగులెల్లఁ గట్టుకట్టి మీతో నా మీఁద నేరములు సెప్పుట కుద్యుక్తులై యున్నారు. వీరిమాట లేమియు వినఁగూడదు. నాఁడు మీరు ముందరి నెలలో సుముఖుం భక్షింతునని చెప్పపోయితిరిగదా అని చెప్పువఱకు నిలిచి యంతలో మఱికొందఱు నాగులతని నీవలకులాగి మహాప్రభూ ఈతనిమాటలు వినరాదు. సంఘసంస్కరణ విధ్వంసకుఁడై కులస్థులతోఁ గలహించు చున్నాఁడని చెప్పు చుండ మఱికొందరువచ్చి వారిమాట విననీయక

తారేదియో చెప్పఁబూనిరి.

ఈరీతినల్లరిగా నెవ్వరి నేమాటయుం జెప్పనీయక నాగులాటంకములు సెప్పుచుండ నయ్యండజపతి హుంకారము గావించుటయు నందఱు భయపడి నిశ్శబ్దముగా నిలువంబడిరి. అప్పుడు గరుడుండు కన్నులెఱ్ఱజేయుచు నాగులు పొగరెక్కి నాచక్కనే యల్లరిసేయుచున్నారే. ఒక్కఁడే మాట్లాడవలయు, వాని వాక్యము ముగియుదనుక రెండవవాఁడు మాటాడఁగూడదు. జాగ్రత. కర్కోటకా! నీ యుపన్యాసమేమియో ముగింపుము. అనుటయు నతం డిట్లనియె.

స్వామీ! నాఁడు దేవర చికురుఁడను నాగుని భక్షింపుచు ముందరినెలలో తనకుమారుని సుముఖుఁడను వాని భక్షింతు నాఁటికి వాని వధ్యశిలపైఁ జేర్చియుంచుఁడని సెలవిచ్చియుండిరిగదా. మొన్న నాకమునుండి యింద్రసారథి మాతలియఁట తనకూఁతున కెందును భర్తదొరకలేదఁట యీగ్రామమువచ్చి వానితాత యార్యకుని నడిగి మేమందరము వీఁడాగరుత్మంతునికి భక్ష్యము కొంపోవఁగూడదని చెప్పుచుండ వినిపించుకొనక మాతలి వానిచుట్టములతోఁగూడ స్వర్గమునకుఁ దీసికొనిపోయెదనని చెప్పినంతఁ గల్పాంతజీమూతమువలె గర్జిల్లుచుఁ బక్షిపతి యక్షీణకోపంబున నిట్లనియె.

నాకాహారవస్తువని మీరందఱు చెప్పుచుండ వినిపించుకొనక మాతలి సుముఖు నల్లునిగాఁ జేసికొనుటకై నాకమునకుఁ దీసికొనిపోయెనేమి? ఇంద్రుని తేజి గుఱ్ఱములగాచెడువాని కింతపొగరేల గలుగవలయును. వాఁడు పిలిచినంతనే యార్యకుఁడు మనుమనిం దీసికొని నాకమున కరిగెనా? కానిమ్ము. నాకమన నెక్కడనున్నది? గడియలోఁబోయి పట్టకపోవుదునా? దేవేంద్రు నెదుట మాతలిచేసిన దార్ఢ్యముగ్గడించుచు నాసుముఖుని జుట్టములతోఁగూడ బక్షింపక పోయినచో నన్నుఁ బక్షిపతియని పిలువవలదు. నాగులారా! ఆర్య

కుఁడు మనుమని దీసికొనిపోవుచుండ నాటంకపెట్టవలదా? మాతలి యన నాముందర నెంతవాఁడు! మీయుపేక్షకూడ కొంతయున్నదని పలికిన విని గడగడలాడుచు తక్షకుఁ డిట్లనియె. స్వామీ! మేమా మాతలితో మీమాటలు సెప్పితిమి. కాని యతండు వినిపించుకొనఁ డయ్యెను. బలవంతమున నాపుదమన్నను మాతలిబలమెట్టిదో మాకుఁ దెలియదు. అదియునుంగాక నారదమహర్షి యతని వెంటనుండుటచే శాపమునకు వెఱచి సాహసించితిమికాము. మీరు వచ్చునప్పటికీవి షయమేకాదా తగవులాడుచుంటిమి. దేవా! దేవరవిషయమై మేమె ప్పుడును భక్తిగలిగియుందుమని నివేదించికొనియెను. గరుడుండు క్రోధవివశుండై మాతలి నన్నేమియు లెక్కసేయలేదుగా. కానిండు. ఇప్పుడే పోయి నేనాసుముఖుని పొట్టచీల్చి కండలు భక్షించెదంగాక. ఈపాటికి పెండ్లిచేసియేయుందురు. అందు నాముందర నిలుచువారె వ్వరో చూచెదంగాక పో. పొండు. నేఁటికి మీరందఱు బ్రతికిపోయితి రని పలుకుచు నయ్యండజపతి యాక్షణమ యెగసి పక్షవాతంబువృక్ష లతాగుల్మాదుల కుత్పాతంబుగతి వ్యాపింప నతివేగంబున స్వర్గలోక మున కరిగెను. అందు సుధర్మాప్రాంగణంబును గొప్పపందిరివై చిరి. ముత్యాలు తోరణముగా గుచ్చిరి. కాంచనరత్నప్రాంచితంబులగు నలంకారంబు లిన్నిగలవని వక్కాణింప శక్యముకాదు. పెండ్లిపందిరి శోభ వర్ణింపఁ బదిదినములుపట్టును. ఒకమూల నచ్చర లాడుచుండిరి. యొకమూల గంధర్వులు పాడుచుండిరి. మహేంద్రుండు మాతలినిమి త్తమై యుపేంద్రునిం దీసికొనివచ్చి వివాహవేదిక ప్రాంతమునఁ గూ ర్చుండబెట్టెను. ముప్పదిమూడుకోటులువేల్పులు నారదాదిమహర్షులు గరుడగంధర్వకిన్నర సిద్ధవిద్యాధరాది దేవతావిశేషులు పెండ్లిపందిరి నిండఁ గూర్చుండిరి. దుందుభులు మ్రోగుచుండెను. మాతలిభా ర్యతోఁగూడ బీటపైఁ గూర్చుండి బృహస్పతి పురోహితుండై

పాణిగ్రహణమంత్రములు జదువుచుండ సుముఖునకు గుణకేశినినిచ్చి కన్యాదానము గావించెను. వధూవరులు విచ్చలవిడి నతిసంతోషముతోఁ దలబ్రాలుబోసికొనుచుండిరి. అట్టిసమయంబున నొకమూల దుందుభిధ్వనులంగప్పిన గొప్పచప్పుడు లుప్పతిల్లుటయు నెల్లరు నావంకఁ జూచుచుండిరి. అంతలో ద్వారపాలురువచ్చి గరుత్మంతుఁడు వచ్చుచున్నాఁడని తెలియఁజేసిరి. అప్పుడు మహేంద్రుఁ డుపేంద్రునితో స్వామీ! గరుడుఁడు వచ్చుచున్నాడఁట సుముఖు నెట్లు కాపాడెదరో యని తెలియజేసెను. అంతలో ఱెక్కలుముడిచికొనుచు వైనతేయుం డాకళ్యాణమంటపసమీపమునకు వచ్చి వ్రాలెను. అతనిరాక జూచి సుముఖు డదరిపడి పెండ్లిపీటలమీఁదనుండి లేచి లోపలకుఁ బారిపోయెను. ఆర్యకుఁడు చుట్టములతోఁగూడ వివరము లరసి డాగికొనియెను. అప్పుడు పక్షీంద్రుం డుపేంద్రునకు నమస్కరించుచు మహేంద్రు నుద్దేశించి యిట్లనియె.

వృత్రారీ! నీసారథి మాతలి నాకెట్టి యపకారము గావించెనో చూచితివా? సర్వ భూత ప్రభువగు విధాతచే నాకుఁ బాములాహారముగాఁ జేయంబడినవి. భోగవతీపురంబున సుముఖుఁడను నాగ కుమారుని నేఁటి దిన మాహారవస్తువుగా నియమించుకొంటిని. నా నోటియన్నము పడఁగొట్టి యా పాఁపపట్టిందీసికొనివచ్చి యీ మాతలి పెండ్లికొడుకుఁగాజేసి నాఁడిది యేటి ధర్మము? నేను నియమితాహారముదప్ప మఱియొకటి భుజింపను నీకువలెనే స్వేచ్ఛావిహారములు నాకులేవు. మన యిరువురము కశ్యపుని బిడ్డలమైనను నీవు త్రిలోకాధిపతివై తివి. నే నొరులకుఁ బరిజనుఁడనై తినని నిరసింపరాదు. జమీ? నేను నీకంటె బలవంతుఁ డనగుదును. శ్రుతసేన ప్రభృతి రాక్షసుల నేను వధించినవార్త నీవెఱుంగవా? వడలుము నాకాహారవస్తువైన సుముఖునిందు రప్పింపుము భక్షించి పోయెదనని యడిగిన

మహేంద్రుండు నవ్వుచు నిట్లనియె.

వయస్యా! మనమందఱము కశ్యప సంతతిలోని వారమే యగుట నొండొరులము మైత్రిగలిగి యుండవలయు నీ మాతలి కూఁతురు మిక్కిలి చక్కనిది దాని కెక్కడ సరిపడిన వరుఁడు లభింప లేదని తిరిగి తిరిగి సుముఖునేరికొని వచ్చెను. సుముఖున కిప్పుడే పెండ్లియైనది. అట్టివానిం భక్షింప నీ కెట్లు నోరువచ్చును? మా చుట్టఱికము దలంచి వానినివిడువుము. నీకంతకన్న బలముగలుగఁ జేయు వివాహభోజనము పెట్టించెద నీభోజనము విడువుమని సానునయముగాఁ బలికినవిని రోషారుణిత నేత్రుండై పతత్రి పుంగవుం డిట్లనియె.

మహేంద్రా! వీని భక్షించి తీరెదనని నాగ సభా మధ్యంబున శపథముజేసి వచ్చితిని. ఇప్పుడు వీని నేను విడిచితినేని నాగులిఁక నామాట పాటింపరు. నీ మాట వినమి కీమాటు సైరింపుము సుముఖునిందు రప్పింపుమని పలికిన విని యనిమిషపతి పతగపతి కిట్లనియె సుపర్ణా! ఇది కేవలము నామాటయే కాదు. ఇందున్న దేవతలు మహర్షులు దిక్పతులు నీకీ మాటయే బోధించుచున్నారు. అందరిమాట యటుండనిమ్ము ఈయుపేంద్రుని యభిప్రాయముగూడ నట్లే యున్నది. అమ్మహాత్ముని యానతి దాట నీకు సామర్థ్యము గలదా యని యడిగిన నతం డిట్లనియె.

మహేంద్రా! నేనుగాక యుపేంద్రుని మోయువాఁ డెవ్వఁడు గలండు? అతనికి ధ్వజముపై నిలచి జయము గలుగఁ జేయుదును. ఇట్టి యాప్తుని నోటి యాహార మతఁడేల చెడగొట్టఁగలఁడని సాటోపముగాఁ బలికిన విని యుపేంద్రుండు మందహాసము గావించుచు గరుడున కిట్లనియె.

పక్షిపతీ! పాపము సంగరములయందు నీ కతంబున నాకు జయము గలుగుచున్నదిగా! కానిమ్ము. సంతోషమే. మహేంద్రుఁడన మూఁడు లోకముల కధికారి. అతండు సుముఖుని విషయమై

కాపాడుమని బ్రతిమాలికొనిన నిరసించితి విది బుద్ధిమంతుల తెరవే? నన్ను హేలగా మోయుచుంటినని గర్వోక్తు లాడితివేదీ. నాయెడమ చేతి యీచిటికెనవ్రేలి బరువు మోయుము. నీప్రజ్ఞ జూతునుగాక! అని పలుకుచు నావ్రేలాతని పక్షముమీఁద మెల్లనమోపెను.

అప్పుడతండు పిచ్చుకపై పెద్దపాషాణము పెట్టినట్లు క్రుంగఁబడి యీకలు రాల నోఁరుదెరచుకొని రక్తముగారుచుండ నెలుగురాక కీచు కీచుమని యఱచుచు మహాత్మా! అపరాధము జేసితి. రక్షింపుము అని తలతో సూచనగావించెను.

ఉపేంద్రుండు నవ్వుచు సుపర్ణా! యింతే నీబలము! నన్ను సకుటుంబముగా మోయువాఁడవు కాదా? ఈవ్రేలి బరువే మోయలేక పోయితివేమి? ఆ గర్వోక్తులేమైనవి? యిప్పుడైన నుపేంద్రుని మాట విందువా అని చేయెత్తి యెత్తిపోడుచుటయు గరుడుండు గరువము విడిచి చెంపలు వాయించుకొని యుపేంద్రుని కపరాధముజెప్పికొనుచు సుముఖుని విడిచి యెందేనిం బోయెను.

పిమ్మట సుముఖుండు మాతలిఁ కూఁతుం బెండ్లియాడి నందనవనంబునఁ గ్రీడాశైలంబుల మందాకినీ కాంచన సికతాతలంబుల విహరించుచుఁ బెద్దకాలము సుఖించెను. ఈకథగల పుస్తకము మాయింటనుండమిఁ జదివితిని. దీనింబట్టిచూడ నాగ కుమారులలోఁ గూడ దివ్యలోకాతీతసౌందర్యముగల వారుందురని తెలియఁబడుచుండుటలేదా. అందులకై నాగులాతుని యడిగితిని. తెలిసినదియా యని యింద్రుని కూఁతురుమధుమతి చెప్పినవిని తక్కినవారనుమోదించుచు నమ్మవారికెవ్వరుత్తములనితోచునోవారినిదయఁజేయగలదు. ఇంతియే మనము కోరవలసినదని పలికిరి.

అంతలోఁ దెల్లవారు సమయమగుటయు వారు రాఁబోవు శుక్రవారమునాఁటి కవ్వేదమాత తమకు భర్తలందెచ్చియిచ్చునను

నమ్మకముతో వారు ధరింపఁదగిన నూత్నాంబర మాల్యానులేపనాది వస్తు విశేషంబులం దెచ్చియుండిరి. కావున వానినెల్ల నాగుడిలో నొకచోటనునిచి యద్దేవికి మ్రొక్కి త్రిదివంబున కరిగిరి.

అని యెఱిఁగించి... మణిసిద్ధుం డిట్లు చెప్పందొడంగెను.

---

## 236 వ మజిలీ.

# సావిత్రికథ.

విక్రముం డావిగ్రహము పాదపీఠము చాటుననుండి యాదేవకాంతల సౌందర్యాతిశయంబు కన్నులార నాలోకించెను. ముఖమంటపపు వేదికపైఁ గూర్చుండి వారాడుకొనిన మాటలన్నియుఁ జెవులార నాకర్ణించెను. వారి హృదయాశయముల మనసార గ్రహించెను. ఆనందసాగరమున నీదుచు నత్తరుణులు దివమున కరిగిన వెనుక వారు ముఖమంటపములో దాచిన మాల్యానులేపనవస్త్రాలంకారాదులఁ బరికించి యవి చతుర్విధముగా నుండుటకు ననుమోదించుచు మనంబున నేదియో క్రొత్తసంకల్ప మావిర్భవింపఁ దటాలునఁ దదంగరాగవాసితములగు తటాకజలంబులఁ గ్రుంకులువెట్టి తదామోద మోదితనాసాపుటుండై సూర్యోదయమగుచుండ సావిత్రి నారాధించి జలంబులం గ్రోలి తృప్తుండై యాత్మగతంబున నిట్లు తలంచెను.

నాకిది స్వప్నమో భ్రాంతియో నిజమో యింకనుం దెలియకున్నది. సూర్యుండు నెండయుఁ గనంబడుచుండఁ గన్నులు తెరువబడియుండ నిద్రలేనిదే స్వప్నమెట్లువచ్చును! ఒకప్పుడు కలలోనే మెలకువవచ్చినట్లు తోచుచుండును. ఇది యట్టి యవస్థయేమో యేమైననేమి? కలలో గాయత్రిసేవ దేవకాంతదర్శనము దివ్యకుసుమవాసనాసంప్రాప్తి లోనగువిషయంబులఁ జూచుటఁ గల్యాణప్రదమేకదా.

నావలెనే మాసోదరులుగూడ నేదేని యూతబూని గట్టుచేరరాదా. ఏమో దైవసంకల్ప మెవ్వరికిం దెలియదు. నేనాసముద్రతీరమునకుం బోయి వారిజాడ నరసెదంగాక కలగాని నిజముగాని ఇప్పుడకార్య మే కర్తవ్యమని తలంచి ద్వారపాలికాముష్టిఘటితమగు చంద్రహాస మూడబెరికి చేతంబూని సముద్రముదెసకుఁ బోవుచు నాకరవాలంబునఁ గంటకలతాగుల్మాదుల ఖండించి దారిచేయుచు మధ్యాహ్నమున కా సముద్రతీరము జేరెను. అప్పుడత్తీరమునుండి యమ్మవారిగుడిదాక చక్కనిమార్గ మేర్పడినది.

అతండు సముద్రముదెస పరికించుచు సాయంకాలమువనుక నాతీరమునఁ దిరుగుచుండెను. వికలములైన యోడశకలము లక్కడక్కడ నొడ్డునఁ జేరబడియున్నవి. వానిని విమర్శించుచు నామూల నుండియామూల కూరక సంచారముచేయుచుండెను. అతనికిఁ దటాక జలంబులు గ్రోలినదిమొదలు క్షుత్పిపాసలు నశించినవి. దానంజేసి యతం డారాత్రి యాతీరమునందే వసించి తొల్లి దక్షిణాంబుధితీరంబున దర్భలపై శయనించిన శ్రీరాముండువోలె నభీష్టసిద్ధికై గాయత్రీ మహాదేవిని ధ్యానించుచుండెను.

వేకువజామున నతనికించుక నిద్రబట్టినది. అందుఁ దనసోదరులు తీరముజేరి తనతో మాట్లాడుచున్నట్లు కలవచ్చుటయు నదరిపడిలేచి నలుమూలలుచూచెను. అప్పుడరుణోదయమగుచున్నది. ఇదికలలోఁ గలకాఁబోలు. నాకట్టి భాగ్యముపట్టునాయని తలపోసి యట్టెలేచి యేమియుం దోచక సముద్రపుగట్టునే యుత్తరముగా నడువఁజొచ్చెను. అది పాటుసమయమగుట సముద్రముకొంత లోపలకుఁ బోయినది. అందందుఁ జిక్కియున్న జల జంతువు లతనిరాకజూచి తటాలున బొరియలలోఁ దూరుచుండెను. ముత్తెపుచిప్పలు నత్తగుల్లలు వరాటికలు పోగులుగానుండి యతని పాదములకు గ్రుచ్చికొనుచుండెను.

వానిలక్ష్యముసేయక తనలక్ష్యమునందే దృష్టినుంచి కొంత దూరమేగునప్పటికి సూర్యోదయమైనది. ఆవెలుగులోనతండు తన దృష్టుల సముద్ర తీరము వెంబడి కొంతదూరము వ్యాపింపఁజేసెను. నూఱు గజముల దూరములోఁ బెద్ద దారువేదియో యొడ్డునఁజేరి యున్నట్లు కనంబడినది. అతం డుబ్బుచుఁ గనుఱెప్పపాటులో నా దారువుచేరువకుఁ బోగలిగెను.

చంద్రోదయ చంద్రాస్తమయసమయములయందు సముద్రము పొంగి తరువాత తీసిపోవుచుండుఁగదా. నాఁటిరేయి పోటున కా దారువు గట్టెక్కి పాటుతోఁబోవక యందాగియున్నది. దానిం బరిశీలించిచూడ సముద్రపుటోడ తెరచాపకొయ్యవలె దోచినది. గోడ నంటిన బల్లులవలె మువ్వురుపురుషు లందు బోర్లగిలఁబడి యంటిపండుకొనియున్నారు.

వారిం గురుతుపట్టి యతండు గుండె ఝల్లుమన హా! సోదరులారా! యని యఱచుచుఁ బ్రతివచనంబు గానక వారు మృతిబొందిరని నిశ్చయించుకొని నేలఁ గూలఁబడి పెద్దయెలుంగున నేడువందొడంగెను. అంతలో నతండయ్యో! నాకిదేటిశోకము. ఆహారము గుడవనిచోఁ బదిదినములవఱకుఁ బ్రాణములు బొందని విడిచిపోవవనివైద్యులుచెప్పుదురు. మేము సముద్రములోఁబడి మూఁడుదివసములైనది ఇతరోపద్రవము లేనిచో వీరికి మేనిలో బ్రాణములుండవచ్చును పొరబడి యూఁడుదానివలె నేడుచుచుంటినేమి? అని తలంచి యప్పుడ వారి యొద్దకుఁబోయి యొడలు ముట్టికొని యూపిరియుండుట గ్రహించి వడివడి యొకచలమద్రవ్వి యందలి నీటిచే వారిదేహములుప్పుకస వోవఁ గడిగి మోములపై నీళ్లుజల్లి జిడ్డువోవ దుడిచితుడిచి యన్నా! విజయా! తమ్ముఁడా!అనిపిలుచుచుండ వారికించుక యూపిరియాడుచున్నట్లు పొడకట్టినది. అప్పుడతండొక పర్ణపుటంబున నీరువట్టి వారి నోళ్ల

తెరఁవుడని పలుకుచు గొంచమునీరు ద్రావించెను. ఇంచుక తెలివి గలిగినది. కన్నులెత్తిచూచిరి అప్పుడు వారి నాదారువునుండి లేవదీసి మెల్లగా నాదారువునకు జేరఁబడి కూర్చుండబెట్టి యాప్రాంతమునకుఁ బరుగెత్తికొనిపోయి వెలగపండ్లు గోసికొనివచ్చి వానిగుంజు మెల్లగా నోటికందిచ్చి తినిపించెను.

ఆరస మొకింత నోంటబట్టినతోడనే వారు లెస్సగాఁ జూచుచు నొండొరులఁ బరికించుకొనివిక్రమునితో నెలుగురాక మఱికొన్ని వెలగపండ్లు తినిపించుమని సంజ్ఞచేసిరి. అతండు కడుపునిండ వెలగ పండ్లదెచ్చి తినిపించెను. దప్పిదీర నీరుద్రావించెను. అన్నాతురులకు రుచియుఁ బక్వము గావలయునా? యెట్లో కడుపునిండించుటయే పని.

విక్రముఁడు తనయుపవస్త్రముమార్చి వారి పుట్టంబులు విప్పించి యుదికి యార్వవైచి కట్టించి సోదరులారా! మీకుదగిన పానీయము దీసికొనివచ్చెద. దానిం గ్రోలితిరేనితృప్తిపాసలుండవు. నాలుగుగడియలలో వచ్చెద నిందుఁ బండుకొనియుండుడని పలికి యప్పుడే యమ్మవారియాలయముకడకువచ్చి గర్భాలయములోనున్న అభిషేకఘటంబు గైకొని యమ్మవారికి మ్రొక్కుచు దానినిండనీరు వట్టి యావరణలోనున్న నారంగఫలములఁ గొన్నిగోసికొని యతివేగ ముగా వారికడకుఁ బోయెను.

అప్పటికి వారికిఁ గొంచెము బలముకలిగి యొండొరులఁ బల కరించుకొనుచున్నారు. విక్రముఁడు నారంగఫలముల రసముపిండి వారిచే గ్రోలింపఁ జేసెను. తటాకతోయము ద్రాగించెను. అమృత పానముజేసినట్లు వారికి శరీరములో మిక్కిలిబలము గలిగినది.

విజయుఁడు విక్రమునితోఁ దమ్ముఁడా! నీవెక్కిన యోడమునుఁ గలేదాయేమి? నిన్నుఁజూడ సముద్రములోఁబడనట్లు కనంబడుచుం టివి. మేమెట్లు గట్టుచేరితిమో తెలియదు. మనప్రయత్న మంతయు

జలధిపాలైపోయినదిగదా! నేనాయోడ గుభాలున చప్పుడై మునిఁగినతోడనే సముద్రములోఁ బడిపోయితిని. చేతికేమియు నాధారముఁ దొరకలేదు. పెద్దతడ వీదితిని. ఆయాసము గలిగినది ఇఁక మునిఁగిపోవుదునని తలంచుచు దేహముపై నిరాశజేసికొని పరమేశ్వరిని ధ్యానించితిని. ఇంకను జీఁకటిగానేయున్నది. నాప్రక్కనే యొక్క పెద్దదారువు కొట్టికొనివచ్చుచున్నది. అది నాచేతికి దొరికినది. అది చిన్నదోనెవలెనే గుండ్రనై యున్నది. దానిపై నెక్కితిని మనుఁగలేదు. తమ్ములిద్దరు దానిమీఁద నున్నారని నాకుఁ దెలియదు. దానినంటి విడువకయుంటిని. రెండుదివసములు చెరుపుమఱుపులతోనుంటిని. తరువాత స్మృతిదప్పినది. ఇక్కడికెట్లువచ్చి గట్టెక్కితినో తెలియదని విజయుఁడు తనకథ నెఱింగించెను.

తక్కిన యిరువురుగూడ నట్లేకొంతసేపు సముద్రములో మునిఁగి యాకొయ్య యాధారముఁదొరకగా నెక్కితిమని చెప్పిరి. ఆతెరచాపకొయ్య మిక్కిలిపొడవుగాను లావుగానుండుటచే నొండొరులున్నవార్త తెలియకయే కొట్టికొనివచ్చిరి. ఆస్తంభమే వారికిదైవమై తీరమును జేర్చినది. వారునలువు రారాత్రి యిష్టాలాపములాడుకొనుచు నాతీరమునందే శయనించిరి. మఱునాఁడుదయమున లేచిన పిమ్మట విజయుఁడు విక్రమా! ఇప్పుడు మన మేమిచేయదగినది? ఇది యేదీవియో తెలియదు. ఇందు మనుష్యసంచారము లేకపోవుట వింతగానేయున్నది. ఇది వరుణద్వీపమైనచో జనులుండకపోవుదురా? శ్రీధరుఁడుజెప్పినమాట వినక మనమిట్లు బయలుదేరుట చాల తప్పు. మనతోవచ్చిన యోడలన్నియు మునిఁగిపోయినవి. శ్రీముఖునకు మనవార్త దెలియదు. క్రోధనుని జయించుమాట దేవుఁడెఱుఁగు. మనమీ సముద్రముదాటి యింటికిఁబోవుటెట్లని యడిగిన నతం డిట్లనియె.

అన్నా! మీరు పిఱికితనము వహింపవలదు. సముద్ర మధ్యం

బునంబడిన మనలను గట్టుజేర్చిన భగవంతుని సంకల్పమెట్లో యట్లు జరగక మానదు. ఇందు మీా కొకవిశేషము జూపెదరందు మీారు పడిన యిడుములు మఱచిపోవుదురని పలుకుచుఁ దా నా గట్టెక్కినది మొదలు నాఁటి తుదివఱకు జరిగిన చర్య యంతయుం దెలుపుచు నాదారిని వారినమ్మవారి కోవెల ప్రాంతమునకు దీసికొని పోయెను.

కాంచనసముద్దీప్తంబులగు నా యాలయ ప్రాకార గోపుర మంటపాదులంజూచి యాశ్చర్యమందుచు నిట్టిదివ్యక్షేత్రంబున్నదని యెఱింగిన జనులు రాకుందురా! ఇది దేవతాభూమి మన పూర్వ పుణ్యవిశేషంబున దీనింజేరితిమని సంతసించుచు నందలి విశేషం బులంజూపింపుమని విక్రమునింగోరికొనుటయు నతండు సోదరులఁ దటా కమునకుఁ దీసికొని పోయెను. వారు తత్తోయ పరిమళ విశేషమున కుబ్బి గంతులువైచుచు విక్రమా! నిన్న మాకుఁదెచ్చిన నీరీ కోనేటి లోనిదే కాఁబోలు. ఈ రహస్య క్షేత్రమును నీ వెట్లు పొడగంటివో వింతగానున్నది. అనుటయు నతండు ఇది నాప్రజ్ఞగాదు. భగవంతుఁడే దీనింజూపించె వేగమిందు గ్రుంకులు వెట్టుఁడు దేవీదర్శనము గావింత మని తొందర పెట్టెను.

పిమ్మట వారందఱు నందు తీర్థములాడియాడి వార్చి యొట్టకే గట్టెక్కి తడిపుట్టంబులం బిండికొనుచు నా యాలయముచుట్టు ప్రద క్షిణములుజేసి తలుపులు తెరచికొని లోపలకుఁ బోయిరి. విక్రముఁడు సోదరులకు గాయత్రీ మహాదేవింజూపుచు నీ యంబ యెవ్వరోఁ యెఱింగితిరా? వేదములఁ గన్నతల్లి గాయత్రి మనపాలింటి కిప్పుడు కల్పవల్లియైనది. ఈమె కృపచేతనే మన మిందుఁజేరితిమి. ఇమ్మహా పరదేవత నారాధింపుఁడని పలుకుచు సోదరులతోఁగూడ నానం దఁబరవశుండై గాయత్రిదేవినిఁ షోడశోపచారములచేఁ బూజించి పెద్దగా నగ్గించెను.

అమృతపానము జేసినట్లుగా వారికిఁగూడ క్షుత్పిపాసలునశించి నవి. పిమ్మట నతండందొకచో గూర్చుండబెట్టి సోదరులకు దేవకాంతా గమన వృత్తాంతము జెప్పుచు వారందుంచిన వస్త్రమాల్యానులేప నాదులఁ జూపించెను. వాటిని వా రక్కజముతో విలోకింపుచుండ విక్రముండు తమ్ములారా! వీని మనము ధరింతము దేవకాంతలు రేపు శుక్రవారము రాఁగలరు అప్పటి మన యదృష్ట మెట్లుండునో యట్లు జరగును. అని యుపదేశించుటయు వారేకవస్త్రులై యున్న వారగుట సంతోషముతో నా కనకాంబరములుదాల్చి మణిహారకట కాంగుళీయాదికముల నలంకరించుకొని మందారదామంబు లురమున వైచుకొని దివ్యరూపములతోఁ బ్రకాశించుచుండిరి.

ఆరాజకుమారులు నలువురు నత్యంత భయభక్తి విశ్వాసము లతో నియమితచిత్తులై మూఁడు దివసములా కోవెల ముఖ మంట పమున గూర్చుండి గాయత్రి మంత్రోపాసన గావించిరి.

శుక్రవారమునాఁడు సూర్యోదయమైనది మొదలు రాజకుమా రుల చిత్తములు సంభ్రమాభివ్యక్తములై యెప్పుడు ప్రొద్దుగ్రుంకు నెప్పుడు దేవకాంతలం జూతుమని యుబ్బూట లూగుచుండెను. వారికి నాఁ డెంతసేపటికిఁ బ్రొద్దు గ్రుంకునట్లులేదు. సంతతము నాకసము వంకేచూచుచుందురు. ఎట్టకే సూర్యాస్తమయమైనది. తారకాభర్త నక్షత్రముల నడుమ పూగుత్తియవలెవారి కాహ్లాదము గలుగఁజేసెను.

అప్పుడు వారు తటాకంబున మునుంగులాడి తమమేనులు దివ్య గంధమాల్యానులేపనాదుల నమరఁజేసి నూత్నాంబర భూషా విశే షంబుల నలంకరించుకొని తదాగమన మభిలషించుచుండిరి.

దేవకాంతలును వల్లభ సమాగమాభిలాషం జేసినాఁడు వింతగా గైసేసికొని పెందలకడ బయలుదేరి మాటలాడికొనుచు నా యాలయ ప్రావరణములోఁ దిగిరి.

రాజకుమారులను వారిసమ్మర్దము వినఁబడగనే గుడిలోఁ బ్రవేశించి యమ్మవారివెనుక దాగియుండిరి.

అనిమిషకాంతలు వాడుక ప్రకారము జలకమాడి ప్రదక్షిణ పూర్వకముగా గుడిముఖ మంటపములోని కరుదెంచి యందుఁ వారుంచిన వస్త్రాలంకారాదులం గానక యమ్మవారప్పుడే తమభర్తలకుఁ దాల్ప నిచ్చినదని నిశ్చయించి గుడిలోఁ బ్రవేశించి సముచిత స్తవంబుల నమ్మహాదేవిం గీర్తింపుచు సపర్యానంతరమున ముఖమంటపములోఁ గూర్చుండి యిట్లు సంభాషించుకొనిరి.

గంధవతి—మధుమతీ! యిద్దేవి మన మిందుఁ బోవునప్పటికే భర్తలందెచ్చి యుంచునని చెప్పితివి కావా? ఏరీ?

మధుమతి—ఓహో? నీకు భర్తంజూడ జాల తొందరగా నున్నది గదా? మన మంచిన వస్తువు లిందు లేకుండుటచే నవి యామె సంగ్రహించినదని యొప్పుకొనియెదవా?

గంధవతి—ఆమెయే తీసినదనుమాటయేల? మఱియెవ్వరైన వచ్చి తీయఁగూడదా.

మధు—మనముగాక యిచ్చటి కిదివఱ కెవ్వరైన వచ్చియుండిరా? రెండు గడియలు తాళుము. నీకంతయుం దెలియఁగలదు. నీవల్లభున కే రంగు పుట్టంబులుంచితివి?

గంధవతి—ఇంద్రనీల చ్ఛాయాపుటంబులు. నీవో?

మధు—నాకుఁదెలుపేయిష్టము తెల్ల చీనాంబరములుంచితిని.

గంధవతి—వారుణియో

వారుణి—నాకెఱుపు నేనట్టివేయుంచితిని

గంధవతి—చంద్రకళకేవర్ణ మిష్టము?

చంద్రకళ—ఆకుపచ్చనిరంగునాకుఁజాలప్రీతినేనావుట్టంబులుంచితిని.

అని వారు మాట్లాడుకొనుచు నమ్మవారు తమకు భర్తలం

దప్పక తీసికొని వచ్చునను నమ్మకముతోఁ జేతఁ బుష్పదామంబులం ధరించి వారిరాక జూచుచుండిరి. ఇదియే సమయమని రాజకుమారులు నలువురు గుడిలోనుండియొకరి వెనుకనొకరు మెల్లగానీవలకువచ్చిముఖ మండపములోనొకదెస శ్రేణిగా నిలువబడి యమ్మవారికినమస్కరించిరి.

అప్పుడు దేవకాంతలు వారింజూచి మోహావివశలై యొక్కింత సేపు సిగ్గుపెంపునఁ దెంపుసేయక క్రేగంటిచూపుల వారింజూచి చూచి లజ్జ దిగ ద్రోసి సాహసముతో మేను గఱు పార

క॥ నీవే నా ప్రాణేశుఁడ,వీవే నాదైవమనుచు నెదసత్యముగా
భావించి చరించితి నీ, దేవి కృపావశత నను మతింపు మహాత్మా!

అని దేవకాంతలు వారువారు గట్టిన పుట్టంబులు గురుతుపట్టి మనోహరుగా నేఁగొని మెడలోఁ బుష్పదామంబులు నైచుటయు వారును సంతోషావేశముతో

కం॥ ఇది నాసతి యిది నాసతి
యిది నాసతియనుచు వెస గ్రహించిరి వార
మ్మదవతుల కరతలంబులఁ
దుది మదనుఁడె సత్పురోహితుండై కూర్పన్॥

అట్లు రాజకుమారగృహీత పాణులై యప్పల్లవ పాణులు లజ్జావనత వదనలై వారచూపుల నా భూపాల పుత్రుల సౌందర్యాతిశయంబు బాపోవక చూచుచుండ నత్తదను రూపక్రియాకరణ నిరతచిత్తులై యమ్మవారి కెదురుగా నిలువంబడి

క॥ నినుఁగొనియాడ వశంబే
జననీ గాయత్రి! మాకుసమధిక కరుణా
ఖనివై దయజేసితి మో
హనరూపులఁ బతుల గుణసమన్విత మతులన్॥

అక్కాంతల ప్రార్థనా వాక్యంబుల విని రాజపుత్రులు వారికిఁ దమయెడఁ గలుగు గౌరవప్రతిపత్తులం దెలిసికొని సంతసించుచు గాంతలారా! మీరెవ్వరు? ఈ యేకాంత ప్రదేశమున కెట్టువచ్చితిరి? మమ్ము వరించిన మీ కులశీలనామంబులఁ దెలిసికొనుట మాకావశ్యకమైన పనికాదే యని యడిగిన మధుమతియిట్లనియె.

ఆర్యులారా! నేనింద్రుని కూఁతురను ప్రభావతియను నచ్చరయందు జనించితి నిది యముని పుత్రిక యది వరుణునిపట్టి యిది కుబేరనందని. మా నలువుర తల్లులు నచ్చరలగుట మేము జనించినది మొదలొక్కచోటనే పెరిగితిమి. ఆహార నిద్రా విహారాదుల నొక్క గడియయైన విడిచియుండఁజాలము మేముక్రమంబునఁ బెరిగి యౌవనవతులమై యతిగుణాన్వితులగు పతులంబడయఁదగు వ్రతముపదేశింపుమని యొకనాడు బృహస్పతికడకరిగి యడిగితిమి. ఆసురగురుండించుక యాలోచించి భూలోకమున శక్తిద్వీపమున గాయత్రీమహాదేవి క్షేత్రమున్నది. ప్రతిశుక్రవారము రాత్రియందుఁబోయి జాగరముండి యాదేవి నారాధించుచుండ నాలుసంవత్సరములకు వ్రతము బూర్తియగు. చిట్టచివరశుక్రవారమునాఁడు మీ కామిత మా దేవత యీడేర్చునని యుపదేశించెను.

మేమాగురువచనంబు గురువచనంబుగాఁదలంచి తదుపదేశప్రకారము వరుస దప్పకుండ నాలువత్సరములనుండి యీదేవి నారాధింపుచుంటిమి. నేఁటికి మావ్రతము పూర్తియైనది. అమ్మవారు మిమ్ముఁ బతులగా దయచేసినది. మేము కృతకృత్యులమైతిమి. ఇఁక మేము మీయిష్టమువచ్చినట్లు మెలంగువారము. మీరు మాతో యథేష్టసుఖంబులనుభవింపవచ్చును. మీయిచ్చవచ్చినచోటునకు మేమువచ్చెదము. మీవృత్తాంతముకూడ నెఱింగించి మాకు శ్రోత్రానందము గావింపుఁడని వేడుకొనిన విక్రముండిట్లనియె.

సాధ్వులారా! మాకథ చాలపెద్దది. ముందు వివరింతుముగాక యీమహాదేవికృపవలననే మేమిందు వచ్చుటకుఁ గారణమైనది.మన కుసంఘటన మీామెయేచేసినదని తత్సమయోచితములైన మాటలచేత నతండు వారికి సమ్మోదము గలుగఁ జేసెను.

అని యెఱింగించుటయు ముసిముసినగవులు నవ్వుచు గోపా లుండు స్వామీా! యిందు గాయత్రీమహాదేవి మాహాత్మ్యమేఁటియు నాకుదెలియఁబడలేదు. మాయూరిగుడిలోనున్న యమ్మవారువలె గాయత్రియు నాగుడిలోనుండుటయేకాని వారి కేమిసహాయముజేసి నదియో చెప్పుడు. అమ్మవారి మహిమవలనఁ దమకాపతులు లభించి రని దేవకాంతలును గట్టెక్కితిమని రాజపుత్రులును సంతోషించు చున్నారు. నిజమరయ నందులకు నిందులకుఁగూడ నీమె యేమియుఁ గారణముకాలేదు. కాకతాళీయముగా రాజపుత్రులందుజేఁరి వారి మాటలు వినుటచేఁ గపటంబున నట్టి వేషంబులు వైచి వారిని మోసముజేసిరి కాదా! అని యడిగిన నవ్వుచు నయ్యవా రిట్లనియె.

ఓరీ! గాయత్రీమహాదేవిం దూఱితివికావున లెంపలువాయిం చుకో. అమ్మహాదేవికరుణావిశేషంబునం గాక యట్టిసంఘటన మెట్ల గును? ఆమె భక్తులకుఁ బ్రత్యక్షముగాదు కామ్యములు తీర్చునని నీ కిదివఱకే చెప్పియుంటిని. అద్దేవి దయచేఁ గాక సముద్రమధ్యంబునం బడినవారు దరిజేరఁగలరా? ఆసేనలలో నొక్కరైనబ్రతికిరా?గాయ త్రీదా నేమియు నెఱుఁగనట్లేయుండి సేవించిన వారికార్యంబులఁ దీర్చునని దేవీమహాత్మ్యము పెద్దగా వివరించి శిష్యునకు సంతోషము గలుగఁజేయుచు నవ్వలికథ పైమజిలీయం దిట్లు... చెప్పుచుండెను.



237 వ మజిలీ.

# క్రోధనునికథ.

గాయత్రీదేవి యాలయముగల దీవికి శక్తిద్వీపమని పేరు. ఆదీవి నాలుగుమూలల నాలుగు శక్తి దేవళములు గలిగియున్నవి. నడుమ గాయత్రీయాలయ మొప్పుచున్నది. ఆదీవికడుచిన్నది. వరుణ ద్వీప మునకు దక్షిణ సముద్రమునంటియున్నది. ఆద్వీపము చేరిన వారిని మహాశక్తులు మ్రింగివేయునని వాడుక యుండుటచే మనుష్యులెవ్వరు నాద్వీపమునకు నోడలఁ జేర్పరు. సముద్రములోఁ బోవునప్పుడుకూడ నాదీవికిఁ జేరకుండ దూరమునుండి నడిపించుచుందురు.

దానంజేసి యాదీవి మిగుల రహస్యస్థలమై యొప్పుచున్నది. తాళధ్వజుని పుత్రులు నలువురు దేవకాంతలతో నాలుగుదెసల నతి విచిత్రపరిచారముల నతిమనోహర కేళీవిలాసముల నపూర్వకామక్రీడా వినోదముల నిదిరాత్రి యిది పగలను వివక్షలేక నెలదినము లొక గడియగా వెళ్ళించిరి.

ఒకనాఁడు విక్రముఁడు మధుమతితో, ప్రేయసీ! మాచరిత్ర మంతయు నీకెఱింగించితిమిగదా! మాపూర్వపుణ్యవిశేషంబున మా యన్నలవలె దేవకాంతల మిమ్ము భార్యలుగ బడసితిమి. మీ కేళీవి లాసముల జొక్కి వచ్చినపని మఱచితితిమి. వరుణావతీ పురాధీశ్వరుఁడు క్రోధనుం జయించినఁగాని యింటికిఁ బోవరాదు. అట్లు పోయితిమేని యుమాపురంబుననున్న రాజకుమారులు మమ్మ్ముఁ బరిహాసింపక మా నరు. మేము శపథములుసేసి వచ్చితిమి. శత్రునగరముచుట్టును యం త్రము లమరించియుంచిరఁట. సముద్రములో నాగనులుతగిలియే కాదా మా యోడలు శకలములైనవి. మెట్టదారిని గూడ నావీటు చేరుట కష్ట మఁట. ఆకాశగమనంబున నప్పురము జేరవలసియున్నది. వానికి

గూడ విమానము లున్నవని వినియున్నారము. ఉండుగాక. ఇందులకై మీరొక సహాయము చేయవలసియున్నది. దేవలోకమునుండి యొక విమానము సంగ్రహించి తీసికొనిరావలయును. అప్పని మీకుసాధ్యమే? యని యడిగిన మధుమతి యిట్లనియె.

మనోహరా! స్వర్గమునందలి విమానశాలలో వేనవేలు విమానము లొప్పుచుండును. ఆకాశగమనము సహజమైనది. కావున మాకు విమానములతోఁబనిలేదు. దేవలోకములో భార్యాభర్తల మిధునమునకు గాని విమానమీయరు. విమానశాలాధికారి సెలవు లేనిదే విమానము సంగ్రహించుట కష్టమే. మావివాహవృత్తాంతములు పెద్దలతోఁ జెప్పుదుమా మానుదుమా యని మేమింకను నాలోచించుచుంటిమి. మనుష్యభర్తృత్వమునకు వారు శంకింతురేమో యని యనుమానముగా నున్నది. కానిండు. ఈసంఘటనము గాయత్రీకర్తృకమగుటచే మమ్ము మావారు నిందింపఁగూడదు. ఎట్లైనను మీకువిమానమొకటితీసికొనియియ్యగలము.మమ్మనుపుఁడనికోరినది.

అరాత్రి నలువురు నొకచోటఁజేరినతరువాత విక్రముఁడు సోదరులతోఁదనయుద్యమ మెఱింగించివిమానము దెచ్చుటకై భార్యల నాకమున కనుపుటకు యోచించి వారింగూడ నంగీకరింపఁ జేసెను.

దేవకన్యలు నలువురు భర్తల యనుజ్ఞ బుచ్చుకొని నాఁటి వేకువజామున స్వర్గంబున కరిగిరి. ఆకాంతలరాక నిరీక్షించుచు రాజపుత్రులు గాయత్రీదేవి యాలయంబున వసించి క్రోధముని జయించు నుపాయ మాలోచించుచుండిరి. దేవకాంతలు వత్తుమన్న గడువునకు రాకపోవుటచే వారికిఁ బెద్దవిచారము గలిగినది. అప్పుడు విక్రముఁ డయ్యో!నేను చాల తెలివితక్కువపని చేసితిని. మనుష్యభర్తృత్వమునకు వేల్పులు గర్హింతురని మధుమతి చెప్పిన మాటలోఁ గొంత సత్యమున్నది. ఈవార్తవిని వీరిని మందలించి

యిందు రాకుండ నాటంకపరచిరేమో? లేకున్న వారిందు రాకుండ గ డియనిలుతురా? లబ్ధనాశనమననిట్టిదే యని పరితపింప విజయుఁడిట్లనియె.

విక్రమా! దేవకాంతల ప్రేమ యవ్యాజమైనది. వాండ్రఁ గట్టిపెట్టినను నెట్లో తప్పించుకొని వత్తురుగాని యందు నిలువరు. వారు రాకపోయినచో మనయాయువు లీదీవియందు ముగియవలసి నవే యని పలికెను. చిత్రభానుండు నలుండుగూడ నట్లే యనువదిం చిరి. మఱి రెండుదినములు గడిచినను వారిజాడ గనంబడలేదు. మిక్కిలి పరితపించుచు వారు సముద్రతీరంబునకుంబోయి యందుఁ గూర్చుండి వారురారని నిశ్చయించి తత్క్రీడా వినోదముల నొండొరులకుం జెప్పికొని పరితపించుచు నాశదీరక యాకాశమునందే సర్వదా దృష్టులు వ్యాపింపఁజేయుచుండిరి. వారిజాడ గనంబడలేదు.

వెండియు దేవీభవనంబున కరుదెంచి ముఖమంటపములో సాష్టాంగముగాఁ బండుకొని యమ్మహాదేవిని ధ్యానించుచు,

గీ॥ ఉదధి జలమధ్యమున మున్గుచున్న మమ్ముఁ
దెచ్చి యమరాంగనల గూర్చితివిగదమ్మ
బేలతనమున మేమాండ్రఁ గోలుపోతి
మంబ! యెటుచేర్తొ కృప మా కుటుంబినులను

అని ప్రార్థించుచు నారాకుమారు లారాత్రియెల్ల జాగరము జేసి దేవి నారాధించుచుండిరి. తెల్లవారుసమయమున నంతరిక్షమున గంటలచప్పుడు వినఁబడినంత వారత్యంత సంతోషముతో బయటకు వచ్చి తలలెత్తిచూచిరి. అప్పుడు కనకమణిరుచిరప్రభాపటలంబు క్రిందికి వచ్చుచున్నట్లు కనంబడుటయు నది విమానమని వారు దెలిసి కొని చప్పటులు గొట్టుచు నాట్యముసేయఁ దొడంగిరి.

అంతలో నావిమానమువచ్చి దేవీముఖమంటప ప్రాంగణమున వ్రాలినది. అందుండి మెఱపుతీగవలె మెఱయుచు నానలువురు తరు

ణులు దిగివచ్చి వియోగచింతాసాగరమగ్నులై తమరాక కెదురు చూచుచున్న భర్తలం గౌఁగిలించుకొని యానందాశ్రువులచే వారి శిరంబులం దడిపిరి. అప్పుడు విక్రముఁడు మధుమతిని గ్రుచ్చియెత్తుచు మత్తకాశినీ! మీరు మమ్ము మాయజేసి పోయితిరని తలంచితిమి. అబ్బా! యిట్టి వియోగశోకము శత్రులోకమునకైన రావలదని కోరుచున్నాను. అని తాము వారిగుఱించి పడిన పరితాపమంతయుం జెప్పి వారింగూడ దుఃఖవివశులం గావించి మీరేమిటి కనుకొన్న గడువునకు వచ్చితిరికారు? మిమ్మక్కడ నెవ్వరైన నాటంకముసేసిరా? మీవృత్తాంతము సవిస్తరముగాఁ జెప్పుఁడని యడిగిన విని మధుమతి భర్తకు నమస్కరించి యిట్లనియె.

మనోహరా! మీరిక్కడ వియోగదుఃఖ మనుభవించుచుందురని మే మెఱుంగుదుము. అయినను రాశక్యమైనదికాదు. వినుండు. మేము మీసెలవుపొంది తిన్నగా స్వర్గమున కరిగితిమి. మేము నలువురము నందనవనములోఁ దూరుపుదెసనున్న పారిజాతతరుషండము నడుమ నొప్పు వసంతమను పేరుగల సౌధంబున వసింతుము. కావున ముందుగా మామేడకే పోయితిమి.

అందు మాపరిచారికలు మమ్ముజూచి అయ్యో! మీరు భూలోకమున కరిగి యింతయాలస్యముగా వచ్చితిరేల? ఎప్పుడైన నిన్నినాళ్ళు జాగుచేసితిరా? మాసము దాటిపోయినది. మిమ్ము భూలోకములో నెవ్వరైన నిర్బంధించినారేమో యని మొన్ననే మహేంద్రుని కడ కరిగి చెప్పితిని. మీరు ప్రతిశుక్రవారము భూలోకమున కరుగుచుండుట ఆయన యెఱుగరఁట. కన్నులెఱ్ఱజేసి మాసెలవు లేనిదే వాండ్రు భూలోకమున కేల పోవలయు? నిలువుం డిప్పుడే తగినవారిం బంచి రప్పింతునని చెప్పుచుండ బృహస్పతిగా రరుదెంచిరి. వారెద్దియో రాజకార్యముల మాటలాడుకొనుచు మామాట మఱచిపోయిరి.

పెద్దతడవు మేము సుధర్మా సభాబాహ్యప్రదేశమున నివసించితిమి. తిరుగా మాకింద్ర దర్శనమైనదికాదు. ఇంటికి వచ్చితిమి. తరువాత నీమాట జెప్పుటకై పదిసారులు పోయితిమి వారి దర్శనమైనదికాదు. మీకొఱకె యెదురు చూచుచుంటిమని చెప్పిరి.

ఆమాటలు వినినంత మాగుండెలు ఝల్లుమన్నవి. అయ్యయ్యో! మీరేల తొందరపడి యింద్రునికెఱింగించితిరి. మా కం దమ్మవారు ప్రత్యక్షమై కామ్యములు దీర్చినది దానంజేసి యాలస్యమైనది. మహేంద్రుఁడు మేము భూలోకమునకరుగుటయె తప్పనియె నేమి? బృహస్పతిగారి యనుమతి వడసియే పోవుచుంటిమి. అయ్యో! మనుష్య భర్తృత్వము నిందింతురుకాఁబోలు! ఏమిచేయుదము! విమానమెట్లు సంగ్రహింతుము? వారితో నీమాట చెప్పుదుమా మానుదుమా? చెప్పినఁ దప్పుపట్టి పోనీయరేమో? చెప్పకున్న నందు పోవుటయెట్లు? అని మేము డోలాయిత హృదయులమై యేమిచేయుటకుఁదోచక తొట్రుపడుచుండ నింతలో నింద్రుని పరిచారకుఁ డొకఁడక్కడికివచ్చి మాపరిచారికలం జీరి మహేంద్రుని సెలవైనది. తక్షణమురండు. అని పలికిన విని మేము ఓహో ఈపిలుపు మానిమిత్తమేనై యుండవచ్చును. ఏమిచెప్పుకొందుము అని యాలోచించి వారి కిట్లంటిమి.

వారివార్తయేమైనదని మహేంద్రుండు మిమ్మడిగిన వా రప్పుడే వచ్చిరి. కావునఁ దిరుగా మీకడకు రాలేదని చెప్పుడు పైమాట జూచుకొందమని యుపదేశించి పంపిరి. వారుదూతలవెంట మహేంద్రుని కడకరిగి నమస్కరించుటయు నతండు మీరు కన్యకా చతుష్టయము పరిచారికలు కారా? తిరుగా వారిమాట జ్ఞాపకముచేసితిరి కారేమి! వారింటికి వచ్చిరా లేదా? అనియడిగిన వారిం ద్రుడు స్వామీ! వారామట నాఁడే యింటికివచ్చిరి. అమ్మవారు ప్రత్యక్షమై వరము

లిచ్చినదఁట అందులకై యాలస్యమైనదని చెప్పిరి. అని యెఱింగించిన నింద్రుండు;

ఓహో! గాయత్రిదేవియే వారికిఁ బ్రత్యక్షమైనదియా ఎట్టి వరము లిచ్చినది? అనుటయు నావరము వివరము మాకుఁ దెలియదని వాండ్రు చెప్పిరి. వెంటనే మమ్ముఁ దీసికొని రమ్మని యాజ్ఞాపించుటయు దూతలు వచ్చి మమ్ముఁ దోడ్కొని పోయిరి.

ఇంద్రుఁడు—(మా నమస్కారములందుకొని) చంద్రకళా! ప్రతి శుక్రవారము గాయత్రిదేవి నారాధించుటకు భూలోకమున కరుగుచుంటిరఁట ఏమిటికి?

చంద్రికళ—(సిగ్గభినయించుచు) బృహస్పతిగారు మమ్మట్లు పోయి సేవించమన్నారు.

ఇంద్రుఁడు—ఎందులకై సేవించమన్నారు?

చంద్రి—ఏమియు మాటాడినదికాదు

ఇంద్రుఁడు—వారుణీ! నీవు చెప్పుము

వారుణి—మీకు మంచి యల్లుఁడు వచ్చుటకు

ఇంద్రుఁడు—గాయత్రీదేవి ప్రత్యక్షమైనదియా? వరము లిచ్చినదా?

వారుణి—ఆ ప్రత్యక్షమై వరములిచ్చినది.

ఇంద్రుఁడు—ప్రత్యక్ష మైనదా? తిన్నఁగాఁ జెప్పుము

వారుణి—తిన్నగానే చెప్పితిని.

ఇంద్రుఁడు—ఎట్టి వరము లిచ్చినది?

వారుణి—మేము కోరిన వరము లిచ్చినది.

ఇంద్రుఁడు—మీరు భర్తలంగోరి సేవించితిరి గదా భర్తల నిచ్చినదియా?

వారుణి—ఇచ్చినది స్వామీ యసత్యమాడుదుమా?

ఇంద్రుఁడు—వా రెవ్వరు?

వారుణి—భూలోకచక్రవర్తి కుమారులు.

ఇం—(కన్నులెఱ్ఱ జేయుచు) ఏమీ! మహామునులకుఁ బ్రత్యక్షముగాని గాయిత్రీదేవి మీకుఁ బ్రత్యక్షమైనదియా? భర్తల నిచ్చినదియా? ఎవ్వరో యువకులు మాయజేసి యట్లు చెప్పియుందురు. మీరు స్వతంత్రించి భూలోకమున కరుగుటతప్పు. మీనిమిత్తమై భర్తల మాటాడుచుంటిమి. మాసెలవులేనిదే యిల్లు కదలితిరేని మిమ్ము దండింపఁజేసెదఁ జూడి! పో పొండు అని యదలించుటయు మాగుండెలలో తాయిపడినది. తెల తెలబోవుచు నేమాటయుఁ బలుకనేరక చూచుచుంటిమి.

అప్పుడు మాపుణ్యవశంబున దైవికముగా బృహస్పతి గారచ్చటికివచ్చిరి. ఆయనం గూర్చుండఁ బెట్టి మాతండ్రి గురూత్తమా! వీరి చరిత్రము వింటిరా? వీరికి గాయత్రీదేవి ప్రత్యక్షమైనదఁట మంచి భర్తలం దెచ్చియిచ్చినదఁట. ఆవ్రతము వీరికి మీరే యుపదేశించితిరఁట కాదా? అని యడిగిన నగ్గురుండు ఔను భూలోకములో శక్తిద్వీపమున నున్న గాయత్రీదేవిని నాలువత్సరము లారాధించినవారికి నద్దేవి కామితము దీర్చును. ఇది సత్యమైనమాటయే యని చెప్పిన నింద్రుఁడు నవ్వుచు ననేక సహస్ర సంవత్సరములు దలక్రిందుగాఁ దపం బొనర్చిన మహర్షులకుఁ బ్రత్యక్షముకాని గాయత్రీదేవి గొన్ని శుక్రవారములు సేవించినంతఁ బ్రత్యక్షమై కామితములం దీర్చునా. ఈ మాట విశ్వాసపాత్రముగాలేదని చెప్పుటయు గ్రీష్పతియిట్లనియె?

మహేంద్రా! అట్లనరాదు గాయత్రి ప్రత్యక్షముగాఁ గనంబడదు కాని కామితములఁ దీర్పకమానదు. బాలికలారా! మీరు నాఁడు నన్నడిగితిరిగదా? ఆయమ్మవారి నారాధించితిరా? ఏమిజరిగినదని యడిగి మేము యథార్థమంతయు జెప్పితిమి. మా మాటలు

విని గ్రీష్మతి నేనన్నమాట యసత్యమంటివి. ఈ వాల్గింటుల మాట వింటివా? వారు వీరుకోరిన గుణములుగలవారై యుండకపోరు. వీరిభర్తలు గాయత్రీ ప్రసాద సంప్రాప్తులేయని యింద్రునికడ యుక్తి యుక్తముగా నుపన్యసించెను.

అప్పటికి దేవేంద్రునిబుద్ధి కొంతమారినది స్వామీ! మే మీ కన్యకలకుఁ బెండ్లిజేయవలయునని తలంచు చుంటిమి. ఏమందురు? అని యడిగిన సరిసరి. అట్లుచేసిన వేదజననికిఁగోపమూరా! దాఆమెచేఁ గూర్పఁబడినభర్తలేయుత్తములని చెప్పిమాకుసంతోషముగలుగజేసెను.

అప్పుడు మాతండ్రి నన్ను దాపునకుఁజీరి మధుమతీ! మీకు గాయత్రీమహాదేవి యనుకూలవాల్లభ్యంబు గలుగఁజేసినదియా! మీ కిష్టముగానున్నదిగద. అని యడిగిన నేను తత్సమయోచితములైన మాటలు జెప్పి యతని మెచ్చజేసితిని. తరువాత మీవిజయవార్తలం దెలుపుచు మాకు వారితో భూలోకములో విహరించుటకు విమాన మిప్పించుమని కోరితిని. అతం డంగీకరించి యప్పుడే విమానశాలాధి కారిపేర జీటివ్రాసి యిచ్చెను.

మేమాయింద్రునిచే ననిపించుకొని యప్పుడే విమానశాలకుం బోయి యాయధికారికి చీటిఁజూపి మాయిచ్చవచ్చిన విమానమేరికొని పరిజనులకుమాత్రము జెప్పి యిందువచ్చితిమి. యిందులకై యాలస్య మైనది. గాయత్రీమహాదేవి యనుగ్రహంబున మాతండ్రిగూడ నను మతించెను. మనమీ విమానమెక్కి మూడులోకములు సంచారము సేయవచ్చును. అని యావృత్తాంతమంతయు నెఱింగించినది.

ఆవార్త విని విక్రముఁడు సంతసించుచు గాయత్రీదేవి ప్రభావ మెట్టిదో తెలిసికొంటిరా యని సోదరుల కెఱింగించి సోదరులతోఁ దరుణులతో నమ్మహాదేవికి మ్రొక్కి యప్పుడే యావిమానమెక్కి మధుమతి కిట్లనియె.

ప్రేయసీ! ఈవిమానము కామగమనమునముకలదిగదా! దీనినిప్పుడు వరుణావతీనగరమునకుఁ బోవునట్లు స్మరింపవలయును. రాత్రివేళ మమ్మందు దింపి మీరు స్వర్గమునకుఁ బొండు మేము స్మరించి నప్పుడు తిరుగా రండు. మీయందు మాకు నమ్మకము గలిగినది. మే మాక్రోధనుని జయించినపిమ్మట మనమందరము గలిసి విమాన మెక్కి మానగరమున కరుగుదముగాక. అని యుపదేశించిన వినిమధు మతి యంగీకరించి వారు కోరినరీతిగాఁ దెల్లవారుసమయమునకు నా విమానము వరుణావతీనగరము జేరునట్లుజేసి యావీటి నడివీధి వారిం దింపి విమానముతో స్వర్గమునకుఁ బోయెను.

క్రోధనుఁడు భూపతులనిన నిరసించును. యతులనిన నతిభక్తితోఁ బూజించును. ఆవార్త వారదివఱకే వినియున్నవారగుట నప్పుడే యతివేషములువైచికొని సూర్యోదయముకాఁగా నేవరమెక్కుడనున్న దని యడిగి తెలిసికొని సన్న్యాసులువసించు శంకరమఠమున కరిగిరి.

మఠాధిపతులు వారిరాకజూచి యెదురువచ్చి సగౌరవముగాఁ దోడ్కొనిపోయి తగిననెలవునఁ బ్రవేశపెట్టి మ్రొక్కుచు నిట్లనిరి.- మహాత్ములారా! మీరెందుండివచ్చితిరి. ఇందెన్నాళ్లుందురు? మీ రేయేదేశములు తిరిగితిరి? మీవృత్తాంత మొకింత యెఱింగించితిరేని వ్రాసికొని మారాజునకుఁ దెలియఁజేయవలసియున్నది. మీ రెంత కాల మిందుండినను నభ్యంతరములేదు. మీకుఁ గావలసిన పదార్థ ముల నర్పింపుచుందుము. ఇది మారాజశాసనము అని యడిగిన విని విక్రముఁడు ఇంచుక నవ్వుచు నిట్లనియె.

మీయధిపతి యతిప్రియుండనియు విద్యాబలసంపన్నుండనియు విని చూడవచ్చితిమి. ఇందలివారలకు యతిధర్మములేమియుం దెలి యవనుకొందుము. మాకాహారముతోఁ బనిలేదు. నారాయణస్మర ణము, అద్వైతచింతనము తప్ప నితరవిషయములుమా చెవికెక్కవు.

యతుల కొకచోఁగాపురము, ఒకనామము గలిగియుండునా? అన్నిదేశములు తిరుగుచుండుటయే యతిధర్మము. అన్నినామములు మాకే వర్తించును. సర్వంఖల్విదం బ్రహ్మ అను శ్రుతివాక్యము వినియుండ లేదా. బ్రహ్మవ్యతిరిక్తపదార్థ మొక్కటియును లేదు. మేమే బ్రహ్మలము. అంతయు బ్రహ్మమయంబు. మేము భిక్షాటనముజేసి భుజింతుము. మీరేమియు మాకీయనవసరములేదు. కావలసిన మేమే మీకీయఁగలము. అని పలికిన విని వారు వారి నిస్పృహత్వమునకు వెరగందుచు వారు మహానుభావులని తలంచి మఱేమియుఁ బ్రశ్నములు వేయక భయభక్తివిశ్వాసములతో వారి వెనువెంటఁ దిరుగఁజొచ్చిరి.

వారు ప్రొద్దుటలేచి స్నానముజేసి కాషాయాంబరములు ధరించి తత్వములు పాడుచు భిక్షాటనముసేయువారుం బోలె వీధులం దిరుగుచు యంత్రవిశేషంబులం బరికింపుచుండిరి. గుప్పెడు బియ్యము తప్ప వారేమియుం బుచ్చికొనరు వారి కిష్టమైనవారియింటకడనేకాని నిలువరు. ఇట్టి మహాత్ముల నిదివఱకుఁ జూచియుండలేదని పౌరులు జెప్పుకొనుచు వారి వెనువెంటఁ దిరుగుచుందురు.

ఆనగరమంతయు యంత్రములతో నొప్పుచున్నది. ఒకవీధికిఁ బదియంత్రములున్నవి. మఱత్రిప్పినంత తలుపులు పడిపోవును. అప్పుడా వీధినుండి యవ్వలకుఁ బోవశక్యముగాదు. శత్రువులు గ్రామసీమకైనఁ జేరజాలరు. చేరినను వీధులం బ్రవేశింపవశముకాదు. ప్రవేశించినను దలుపులుపడినంత నానడుమంబడి మడియవలసినదే. కోటకనేక దుర్గములున్నవి. ఎట్టి బలవంతులైనను నాయంత్రంబులఁ దప్పించుకొని యాకోటలోఁ జేరఁజాలరు.

రాజకుమారులు నలువురు నిత్యము వీధులఁదిరుగుచుఁ బదిదినములలో నావీటి రహస్యములన్నియుం దెలిసికొనిరి. ఆనగరము విశ్వకర్మనిర్మితమేమోయని భ్రాంతిపడఁజొచ్చిరి. వారు వీధుల నడుమన

పుడు బాలురకు ఫలములు పంచదారయు నిచ్చుచు వారిచే నారాయణస్మరణ జేయించుచుందురు. దానంజేసి వారివెంటఁ బాలకులు గుంపులుగా మూఁగి ఫలములందికొనుచుఁ బోవుచుందురు.

పదిదినములలో వారిప్రఖ్యాతి నగరమంతయు వ్యాపించినది. వారు వీధింబోవుచుండ నెదురుపడినపౌరులు సాష్టాంగనమస్కారములు జేయుచుఁ గొంతదూరము వారితో నడిచి వెనుకకుఁ బోవుచుందురు. కొందఱు భిక్షావందనములకు రమ్మని కోరుచుందురు. సంతతిలేని స్త్రీలు రాత్రుల మఠమునకుఁబోయి యతిభక్తితోఁ బాలు ఫలములు నర్పించుచుఁ దమకుఁ బుత్రులుగలుగువిధానము బోధింపుఁడని వేడుకొనిన నేదియో చెప్పి వారిని సంతోషపఱచి పంపుచుందురు. "ఎవ రేమియిచ్చినను బుచ్చుకొనరు. ఫలములందికొని యప్పుడే పంచిపెట్టుదురు." అనియూరంతయు వాడుక వ్యాపించుటచే వారి సుగుణములు మఱియుం బెద్దగా నెన్నుచుండిరి.

వారికీర్తిక్రమంబున మఠంబువదలి,వీధులునిండి, గోడలుదూకి, మేడలెక్కి, సందులదూఱి, దుర్గముల నతిక్రమించి, శుద్ధాంతములఁ బ్రవేశించి, కోటదాటి, రాజుగారిచెవిం జేరినది. క్రోధనుఁడు సన్న్యాసులప్రఖ్యాతి విని యక్కజమందుచు మఠాధిపతుల రప్పించుకొని యిట్లనియె.

మనగ్రామము మహానుభావులైన సన్న్యాసులు నలువురువచ్చి మఠములో నివసించియుండిరఁట. వారెట్టివారు? ఎందుండి వచ్చిరి? వారి ప్రవర్తనము లెట్టివి? తెలుపుడని యడిగిన మఠాధిపతు లిట్లనిరి.

మహారాజా! మనమఠమున కిదివఱ కనేకసన్న్యాసులు యతీశ్వరులు వచ్చియుండిరికాని యిట్టి నిస్పృహుల నిట్టి విరక్తుల నెన్నఁడును జూచి యెఱుంగము. సమలోష్టకాంచనులన వీరికే చెల్లును. ఫలము కాయ యెవ్వరైన నిచ్చిన నందుకొని యందే పంచిపెట్టుదురు. మఱి

యొక్కవిశేషము వినుండు. వారెప్పుడును భోజనముజేసినజాడయుఁ గనంబడదు. మర్యాదకై యెవ్వరైన భిక్షావందనమునకుఁ బిలిచినచోఁ బోయి పాలుమాత్రము పుచ్చుకొందురు. అని వారిగుఱించి యారాజపురుషులు బెద్దగా నగ్గించుటయు రాజు వారిం జూడవలయుననియు భిక్షావందనము జేయవలయుననియు నభిలాషజనించుటయుఁ దన యుద్యమ మాపురుషుల కెఱింగించెను.

వారు ఓహో! యింతకన్నఁ బుణ్యకార్య మున్నదా! అవశ్యము దేవర, వారిం బూజింపవలసినదియే. మీసద్గుణములు మావలన విని వారు మిగులసంతోషించిరి. కోటలోని విశేషములు జూడవలయునని యొకప్పుడు మాతోఁ జెప్పిరి. ఇఁక నెన్నిరోదినము లీయూర నుండునట్లు లేదు. కావున రేపే వారికి భిక్షావందనము చెప్పుడని ప్రోత్సాహపరచిరి.

సరే. రేపుప్రొద్దుననే నామఠమునకువచ్చి వారికి భిక్షావందనము చెప్పెదను. మఱియెక్కడికైనఁ బోయెదరేమో వారితోఁ జెప్పియుంచుఁడని పలికి వారిం బంపివైచి తా నంతఃపురకాంతలకెల్ల నాకృత్యము దెలియఁజేసెను. రాజపత్ని నంతసించుచు నేను వారికి స్వయముగా వంటజేసి యర్పింతుఁ బెందలకడ దీసికొనిరండని భర్తను బ్రోత్సాహపరచినది.

అమఱునాఁ డుదయముకాకమున్న క్రోధనుఁడు స్నానముజేసి పట్టుపుట్టంబులం దాల్చి సముచితపరివారముతోఁ గాలినడకనే యామఠంబునకుం బోయి యాబాలసన్న్యాసులంగాంచి తత్తేజోవిశేషంబున కచ్చెరువందుచు వారికి సాష్టాంగనమస్కారము గావించి మహాత్ములారా! మీచరిత్రము నాలుగు దివసముల క్రితమే నాచెవింబడినది. ఈనడుమ ద్వీపాంతరమందున్న ద్వారవతీనగరమునుండి మాయింటికిఁ గొందఱు బంధువులు వచ్చియున్నారు. వారితో ముచ్చ

టింపుచుఁ దిరుగుటఁజేసి మీదర్శనముజేయ నవకాశము జిక్కినదికాదు. వారీనాఁడు సముద్రవిహారమునకై యరిగియున్నారు. దానం జేసి తీరికయైనది. మీవంటి మహాత్ముల పాదధూళి సోకిన మావంటి పామరుల గృహములు పవిత్రము లగుచుండును. నేఁడు మీరు మాయింటికి బిక్షావందనమునకు దయచేయవలయు. ఇదిగో భద్రగజము. తీసికొని వచ్చితిమి. దీని నధిష్ఠింపుఁడు. అనిప్రార్థించిన విని యకపటయతులిట్లనిరి.

మహారాజా! నీదానశూరత్వము ద్వీపాంతరముల విని నిన్నుఁ జూచుటకే యీయూరు జేరితిమి. నీసౌశీల్యము విననదానికన్న నెక్కువగానున్నది. మేము సన్యాసులము. భోగములతోఁ బనిలేదు. వాహనము లెక్కము. మార్గంబెఱింగిన పరిజను నొక్కరుని మాత్రమిందుంచుము. పాదచారులమై మీయింటికి వత్తుము. నీవింటికిం జనుము. మాకేదేని కోరికయున్న నక్కడఁ గోరికొందుమని పలికిన విని యాజనపతి సంతసించుచు వారిని వీడ్కొని యింటికిం బోయి యతులు భుజింపఁదగిన పదార్థములు దెప్పించి రుచియుక్తముగా వండుమని భార్యకుఁ దెలియజేసి వారియాగమన మభిలషించుచుండెను.

అంతలో నాకపటయతులు లోపల జెట్టిపుట్టంబులంగట్టి పైనఁ గాషాయాంబరము లవకుంఠనముగా వైచికొని యాయుధంబులు వస్త్రచ్ఛన్నంబులు గావించి తూర్యనాదములు నింగిముట్ట రాజభటుల వెంటనూరేగుచు నడుమ నడుమఁ గనంబడు యంత్రవిశేషంబులం జూచి భటులవలనఁ దద్విధానంబులం దెలిసికొనుచుఁ బౌరులుమూగి వెంటనడువ బ్రాహ్మణులు స్వస్తిమంత్రంబులం జదువ మెల్లన మహావైభవముతో సింహద్వారము కడ కరిగిరి.

క్రోధనుం డర్ఘ్యపాద్యాదులంగొని ద్వారముకడ కెదురువచ్చి సత్కరించి యత్యంతభక్తితో శుద్ధాంతమునకుఁ దీసికొని పోయి

పాదంబులం గడిగి శిరంబునఁ జల్లుకొనుచు భార్యపైఁజల్లి పైడిపీటలపై గూర్చుండఁబెట్టి యర్చించుచు భిక్షుకు సంకల్పించినంత వారు,

చ॥ సముచితరీతి మేమిటకు సంగరభిక్షనుగోరి వచ్చినా
రము వినుతింప నీదగుపరాక్రమమెల్లడ మాకు నీ పదా
ర్థములు రుచింప వాజి భుజదర్పములేర్పడ నేఁడు ద్వంద్వయు
ద్ధము దయసేయుమయ్య ప్రమదంబు వహింతుముదాననెంతయున్

చ. సమధికయంత్రశక్తి నృపజాలములన్ ధరఁ గెల్చితంచు గ
ర్వముపడఁబోకుమీ యదిపరాక్రమహీనుల మాగర్ మాత్మ వి
క్రమ మెఱిగింతువేని రణకౌశలమేర్పడరమ్ము సాంపరా
యము బొనరింతమందుఁ దెలియుంబడుగా మనశౌర్యసంపదల్.

నరేంద్రా! మేము నలువురమని శంకింపవలదు. మాలో నొక్కనితోఁబోరి గెలుపుగొందువేని నిన్ను మంచి బంటుగా గీర్తింతుము. కత్తులా గదలా శరములా పిడికిళ్ళానీవు వేనితోఁ బోరంగలవో చెప్పుము మేము వానిం గైకొందుములెమ్ము. నీయంత్రబలమును మాతంత్రబలముమ్రింగివేసినదని పలుకుచు శాటీపటావకుంఠనముదీసి పారవైచి వీరవేషములతో నెదుర నిలువంబడియున్న యారాజకుమారుల నలువురంజూచి మందహాసము గావించుచు,

మ. జననాథాగ్రణి వారిఁబల్కె బళిరా! సన్యాసులై మీరు వం
చన విచ్చేసితిరిప్పురంబునకు మీశౌర్యంబు ధైర్యంబు దీ
నసె తెల్లంబగుచుండె సంగరములోన న్వీరవీక్షింపఁగాఁ
బనిలేదైనను మీప్రతాపవచన ప్రౌఢత్వమున్మెచ్చితిన్.

ఉ. ఎవ్వరుబాబు మీరు? కులమెయ్యది? కాపురమెందు పౌరుషమున్
జివ్వకుఁ జీరుచుంటిరి విచిత్రమె యిందలి నాచరిత్రమీ
కెవ్వరు సెప్పలేదుకొ గ్రహింపకవచ్చితిరద్దిరయ్య! మీ
క్రొవ్వడిగింతు నిల్వుఁడొకకొంచవుకాలము సంగరంబులో.

ఉ. సంగర భిక్షబెట్టుమని సాహసమొప్ప వచించినారలు
ప్పొంగితి నొక్కరొక్కరుగఁ బోరొనరింపఁగనేల నందఱేకమై
నం గుతుకంబె నా కమరనాథ సుతుండొకఁడేకదా బలా
త్రింగురునాథులం గెలిచి త్రిప్పఁడెగోవుల మీరెఱుంగరే.

అని పలికిన విని యారాజనందనులు మందహాసశోభిత వదనారవిందులై

క. ఓనృప! తాళధ్వజనృపు
సూనుల మేమిప్పురంబు జొచ్చితి మురు వి
ద్యా నిపుణతతో శత్రు
స్థాన రహస్యములఁ దెలియఁదగు ఛద్మమునన్.

యంత్రబలగుప్తుండవగు నిన్నుఁ దంత్రబల ప్రౌఢిమం బట్టికొనుట తప్పుగాదు. లే లెమ్ము. ఆయుధంబులం ధరింపుము. నీధార్మిక బుద్ధికి మెచ్చుకొంటి. అన్నంబిడఁబూనిన నీపైఁ గత్తిగట్టితి మిదిక్షత్రియధర్మంబగుట దూష్యంబుగాదు. జితోస్మి యనుము. విడుతుమని పలికిన విని క్రోధనుం డిట్లనియె.

ఓ హో హో! మీబాహుబలం బెట్టిదైనను వచనప్రౌఢిమ మెచ్చఁదగియున్నది. వాచాలురగుదురు. దొంగలవలె నింటిలో దూఱి బీరము లాడెదరా? కానిండు. మిమ్ముఁ బరిభవించి మీవాక్యములకు సమాధానము చెప్పెదంగాక. అని పలుకుచు నసిగదాముసలాది సాధనంబుల నక్కడికిఁ దెప్పించుకొని వారిపై దుముకుటయు నతనితో విక్రముం డొక్కఁడే కలియఁబడెను. తక్కినవారు వారి యుద్ధనైపుణ్యము బరికించుచు దూరమున నిలువఁబడిరి.

అంతకుమున్న యంతఃపురకాంత లందఱు నయ్యతిపతులఁ బర్చించుటకై స్నానముజేసి పీతాంబరంబులం దాల్చి పుష్పంబులు చేతఁబూని ప్రాంతములం బొంచి పొంచి చూచుచుండిరి. రాజపత్నియతిభక్తితో వంటజేసి వడ్డింపఁ నిరీక్షించుచున్నది. అట్టిసమయంబున

నీపోరు సంప్రాప్తించుటయు నామె అయ్యో! నాభర్త యొక్కరుండు శతృవులు నలువురు. నలువురుతో నొక్కఁ డెట్లు పోరఁగలఁడు? అక్కటా! మాచుట్టము లీదివసమే సముద్రవిహారమున కరిగిరికదా. వారికి వార్త బంపిన లెస్సగానుండునే. శత్రువులు బలవంతులు గాకున్న నింతవ్యూహము పన్ని శుద్ధాంతము సేరుదురా! అయ్యో! మాయంత్రబల మిప్పుడేమి పనికివచ్చును? అంతఃపురముననే చిచ్చు పుట్టినది. ఔరా! శుద్ధాంతము సంగరరంగమైన నేమిచేయుదుము? అని పరితపించుచుఁ బెరటిదారిని మంత్రులకు సామంతులకు దండ నాథాది వీరయోధుల కవ్వార్త దెలియపఱచినది.

మట్టమధ్యాహ్నమైనది. అర్చన సమయమని సింహద్వారము కడ మంగళనాదములు వెలయించుచుండిరి. ఆయుద్ధప్రవృత్తి యెవ్వ రికిఁ దెలియదయ్యెను. మంత్రు లావార్తవిని యాశ్చర్యపడుచుఁ గొందర వీరయోధులఁ బ్రోగుజేసికొని యత్యంత వేగముగా గోట లోఁ బ్రవేశించిరి కాని, విజయాది రాజకుమారులు ముష్వురు నా యుధంబులంబూని సముద్రంబును జెల్లెలికట్టవలె నాదిట్టల లోపల నడుగు పెట్టనీయక దూరముగాఁ బాఱదోలిరి.

అంతఃపురస్త్రీలు వెరపుతోఁదలుపులు మూసికొని గవాక్ష ములు తెరచికొని వారి యుద్ధవిశేషములు చూచుచుండిరి. అందుఁ జారుమతి యను చిన్నది సంగరరహస్యము లెఱింగిన వీరపత్నియగుట దుర్యోధన భీములవలెఁ బోరుచున్న యాయిద్దర యుద్ధనైపుణ్యము పరికించుచుఁ గ్రోధనుని యేటులు దప్పిపోవుచుండుటయు విక్రముని యేటులు బీరుపోవక ప్రతివీరునకుఁ దగులుచుండుటయుఁ గనిపెట్టినది

అప్పు డప్పుడఁతి భయపడుచు రాజపత్నితో నమ్మా! నీభర్త క్రోధనుం డనూన పరాక్రమశాలియని గరువపడు చుంటివికాని గదాయుద్ధములోఁ బ్రతివీరునికిఁ జాలకున్నాఁడు. ఇంక రెండు గడియ

లలో నితండు పడిపోవును. రిపుఘాతంబులు రెండు తగిలినవి. వాని కితని తాడనంబొకటియుఁ దగులలేదు. గద త్రిప్పుటలో వానికిగల నైపుణ్య మీయనకు లేదు. తల్లీ! వేగము వారికి వర్తమాన ము పంపుము. ఆవీరులువచ్చిన వీరితోఁబోరాడగలరు. లేకున్న గడి యలో నితండు పడిపోవఁ గలడని పలికిన రాజపత్ని యిట్లనియె.

అమ్మా! మీతండ్రిగారి పరాక్రమ మేతన్మాత్రముకాదు. ఈలాటి బలాఢ్యుల నిదివఱ కెందరను పీచమడంచి రనుకొంటివి! అయినను వారి కీవార్త దెలియఁజేయుమని యిదివఱకే వార్తనంపితి నని యుత్తర మిచ్చినది.

అట్లు క్రోధనుండు విక్రమునితోఁ బెద్దతడవు గదాయుద్ధము జేసి క్రమంబున బలంబు క్షీణం బగుచుండ నతని యేటులు గాచి కొన లేక తప్పుదెబ్బలు కొట్టుచు శత్రు గదాప్రహారములు మర్మ సంధుల వేధింప విహ్వలుండై యొక్కింత పెడకుఁ దప్పుకొని,

క. ఏయకు మేయకు మాగు గ
దాయుద్ధమునందు నీవు తద్దయుఁ బ్రజ్ఞా
గేయుఁడవైతివి మెచ్చితి
నాయాసముదీర నిలువుమా క్షణ మనఘా!

అని పలికిన విని నవ్వుచు విక్రముండు ఏయుటమాని రాజా! ఆయాసము తీర్చికొని రమ్ము. తొందరలేదు. పాపము! నాచేఁ జాల దెబ్బలు తినియుంటివిగదా!

క. భూధవ మాయాయోధన
సాధన మింతియయ నీప్రసంగమువిని బల్
యోధుఁడ వనుకొంటిని మేల్
బోధపడె నీ్నదుశౌర్యమును ధైర్యంబుల్.

క్రోధనా! ఆయాసము దీరినదియా? నీకు గదాయుద్ధము

సం దంతగా నైపుణ్యమున్నట్లు తోఁచదు. పోనీ, ముష్టి యుద్ధము చేయుదమా? లేక శరశరాసనంబులం బూని ద్వంద్వయుద్ధము చేయుదమా? నీ కేది ప్రియమో చెప్పుము. అన్నిటియందు నిట్టిప్రజ్ఞయే కలిగియున్నచో దొలంగిపొమ్ము. జితోస్మియని నాకాలిక్రింద దూఱిపొమ్ము. అని పలుకుచుండ విని యతండు దోస్సారము శ్లాఘించి నను రోషావేశంబున లేనిబలము దెచ్చుకొని యొక్కపెట్ట విక్రముని మీఁది కుఱికి ముష్టియుద్ధంబునకుఁ దొడంగెను. అప్పుడు వారిద్దరు పెద్దతడవు బాహాబాహి ముష్టాముష్టి కచాకచిం బెనంగుచుఁ జూపఱకు వెఱపుఁ గలుగజేసిరి.

విక్రముం డట్లొక్కింతసేపు విలాసముగాఁ నతనితోఁ బోరి బెండువడియున్న యతని నట్టె యెత్తి నేలం బడద్రొబ్బి బెబ్బులి మేకపిల్లనుం బోలె నవలీలం బొదివి పట్టుకొని యిట్టటు కదలనీయక మోకాళ్ల నొక్కిపట్టుటయు నామహారాజు,

క. చచ్చితిఁ జచ్చితి నయయో
నొచ్చెనొడల్ నిలువ లేననూనవ్యథకున్
మెచ్చితి నీబలమున కిదె
యిచ్చెదఁ బ్రతికల విడువుమిఁక నన్ననఘా!

అని గిలగిలం గొట్టుకొనుచుఁ బలికిన విని యాయుద్ధముజూచుచున్న రాజపత్ని యడలుచు నందువచ్చి మహాత్ములారా! మీరు దేవసములు లోకైకవీరులు. కానిచో ననేకయంత్ర దుర్గరక్షితంబగు నీనగరంబు జేరఁగలరా! హఠాత్తుగా భోజనమునకుఁ బిలిచిన నరపతి పయింబడి భోజనశాలయే రణభూమిగాఁజేసి పరాభవించుట వీరధర్మముగాదు. మీకడ నేను రణధర్మములు సెప్పుదాననా? ఎట్లైననేమి? మీరు నానాథుని జయించితిరి. పతిబిక్షపెట్టి వీనిని రక్షింపుఁడని వేడుకొనినది.

విక్రముండు నవ్వుచు అమ్మా! మేము నీపతి నక్రమముగా జయించితిమని పలుకవలదు.

కొంత గడువిత్తుము. నేనలం గూర్చుకొని మీకడనున్న మహా వీరులనెల్ల నాయత్తపరచికొని యుద్ధము సేయుమనుము. అందుం గూడ గెలిచినప్పుడే మాకు నీపతిచే జయపత్రిక లిప్పింపుము. అంత దనుక మేమిందొకచోట వసించియుందు మని పలుకుచు విక్రముండు క్రోధనుని విడిచి లేచెను. అప్పుడతండు లజ్జావనతముఖుండై లోపలికిం బోయెను. అప్పుడా రాజపుత్రులు ద్వారముననిలిచియున్న మంత్రిసామంత ప్రముఖ యోధులనెల్ల లోపలికిబొమ్మని యాజ్ఞయిచ్చి సాధ్వీ! మే మామఠమునకుం బోవుచుంటిమి జయపత్రికయో రణపత్రికయో మూడుదినములలో మాకుం బంపవలయును. నింతియగడువు. మేము బోవుచున్నారమని పలికి వారు మఠంబునకుం బోయిరి.

అని యెఱింగించి మణిసిద్ధుండు...ఇట్లు చెప్పం దొడంగెను.

238వ మజిలీ

అయ్యో భూలోకమునంగల చక్రవర్తులందఱు నాపేరువినినగ డగడలాడుచుందురు. నాపాలిటికీవీరులెక్కడనుండివచ్చిరో! ఇప్పుడు నేను వీరికి జయపత్రికలిచ్చినచో నలువురలోం దలయెత్తి తిరుగుటయెట్లు? ప్రేయసీ! ఇట్టిపరాభవము నే బుట్టినతరువాత బొందియుండలేదు. మనయింటికివచ్చిన చుట్టములలో క్రైకవీరులనిచారుమతి చెప్పినదిగదా! వారీ రాత్రి నింటికిం రాగలరు వారింటనుండు నప్పుడైన వీరిని బిఱు కుం బిలిచితినికానే యారా! ఆకపటాత్ములు యతులవలె నెంతప్ర చారము చేసిరి! ఇంతయేల జయపత్రికలిచ్చిపంపుమందునా. తిరుగాయు ద్ధమునకురమ్మని సన్నాహము చేయుమందువా? ఇప్పుడు కర్తవ్య మేమని యడిగిన భార్య యిట్లనియె.

నాథా! మీరు వారితోం బోరంజాలరు వారు సామాన్యులు

గారు ఈరాత్రి మనచుట్టములనడిగి పిమ్మట వారికి వార్తబంపవచ్చు నింతలోఁతొందరయేమివచ్చినది? చారుమతీ! నీవిందులకేమందువు నీవు తెలివిగలదానవు. మొదటనే మనక్రోధనుఁ డోడిపోవునని చెప్పితివి. అనియడిగినఁ జారుమతి యిట్లనియె అమ్మా! నాపతియు సోదరులు నుత్తర దిక్కంతయు జయించినమహావీరులు వారువీరిం గెలువఁ జాలుదురు. వారువచ్చినతరువాత నాలోచించి రేవుశత్రువులకువార్తలంపుటయే యుచితమని పలికినది.

రాజు. ఆదినమెల్ల మంత్రులతో నాలోచించుచుండెను. విక్రముని బలముదలచి వెంటనే జయపత్రికలిచ్చి యంపుటయే శ్రేయమని పలుకుచుండెను. ఇంతలో సాయంకాలమైనది సముద్ర విహారమునకై యరిగిన వారిచుట్టములింటికివచ్చి యంతకపూర్వమే యావార్తవినియున్న వారగుటఁ గ్రోధను నూరార్చుచు నిట్లనిరి.

మామా! మామాసామర్థ్యములు నీవెఱిగిన నింతచింతింపవు నిన్నవమానము గావించిన యావీరుల గడియలోఁ బలాయితులంగావింపనిచో మాప్రజ్ఞనిందింపుము. పాపము నీకిట్టి యవమతి గలుగు యోగముండఁబట్టియే మేము లేనితఱివారినింటికి రప్పించుకొంటివి. కానిమ్ము గతమునకు వగవంబనిలేదు. రణభేరి మ్రోగింపించుము మాప్రతాపము చారుమతి చెప్పలేదా? నీవుమాకుఁజుట్టమువై యొరులచేఁగొట్టఁబడిన నూరకుందుమా? ఈయవమానము మాదికాదా. ఇప్పుడెవారి కందు వచ్చుచున్నామని వార్తనంపుము. అనితొందరపెట్టుటయుఁ గ్రోధనుండిట్లనియె.

వీరులారా! మీసామర్థ్యమట్టిదే కావచ్చును. ప్రతివీరుల బలముకూడఁ గొంతదెలిసికొన వలసియున్నది. నేనిట్లెనాకెవ్వరు సాటిలేరని గర్వపడువాఁడను. పోరసినఁ బందువుగాదలంచువాఁడ నిప్పుడా మాట జెప్పిన నెడద దడబడుచున్నది. నిదానింపుఁడు. ఆవీరులు సా

మాన్యులుకారు. వానిప్రహారములు నామర్మముల వీడఁజేసినవి. ఇప్పుడు జయపత్రిక లిచ్చిన బోవుదురు.

క్రమ్మఱఁ బోరంజేరి మీరుగూడ నందోడితిరేని నారాజ్యమే కైకొందురేమో? యని పలికినవారు మీసములు దువ్వుచు నిట్లనిరి.

మహారాజా! మాప్రతాప ప్రభావమెఱుంగకిట్లు పిఱికితనంబు వహించుచున్నావు. నిన్నిందుఁ గూర్చుండఁబెట్టి జయము గొందుము చూడుము మీసేనలతో యోధులతో మాకేమియుఁ బని లేదు. మాగుఱ్ఱములఁ దెప్పింపుము. రేపు సూర్యోదయ సమయమే యుద్ధసమయమని వారికి వార్తనంపుము పరితపింపకుమని యుదుటు గరువుచుం బలికిన నతండట్టకే యంగీకరించి యట్టివార్త మతంబు నకుఁ దెలియజేసెను.

మఱునాఁడు సూర్యోదయముకాక మున్న యావీరులేవురు గుఱ్ఱములెక్కి వీరవేషములతో రణభేరి మ్రోగ నామతంబున కరిగిరి. క్రోధనుండింటికడనుండి చారుమతితో పట్టీ! వీరిసాహసములు వింతగా నున్నవి. వీరెవ్వని కుమారులు? ఎట్టి బలవంతులు? అని యడిగిన నాయువతి యిట్లనియె.

బాబా! వీరు తాళధ్వజుఁడను మహారాజు కుమారులు ఉత్తరదిగ్విజయము జేయ బయలుదేరి యెల్లభూపతులను జయించి కప్పములు గొన్న మహాశూరులు నన్నెత్తికొని పోయిన మధుండను దానవుని బరిమార్చిన యోధులు వీరే! ఇట్టియసహాయ శూరు లెందును లేరనిచెప్పిన విని యతండు. ఏమీ వీరు తాళధ్వజుని కుమారులా! నాశత్రువు గూడ దాళధ్వజుని కుమారులమని చెప్పిన జ్ఞాపక మున్నది. వీరును వారు నన్నదమ్ములు గారు గద. అని యడిగిన నవ్వోలఁది తెల తెల పోవుచు గావచ్చును. తాళధ్వజుని కుమారులు ఇరువదిమంది పెద్దవారేవురు పూర్వదిక్కు జయించుకొని వచ్చిరఁట.

వీరు సులోచనుని తరువాతి వారేమో? కానిచో నితరుల కింత పరాక్రమముండుట యరుదే. వీరు మీతోఁ దాళధ్వజుని కుమారులమని చెప్పిన మాట బాగుగా జ్ఞాపకమున్నదియా. అట్లైన మనము ధన్యులమే. అందలి నిజానిజములు దెలిసికొనుటకై తగిన వారి ననుపుడని యుపాయము చెప్పినది.

ఆనృపతి తగుపరిజను నొకనిం బిలిచి సంగరంబెట్లు వర్తించు చున్నదో తెలిసికొనిరమ్మని యనిపెను. వాఁడతి రయంబునంబోయి యక్కడి విశేషంబు లన్నియుఁ జూచివచ్చి యిట్లు చెప్పెను.

దేవా! మనవీరులు వాలువములెక్కి యక్కడ కరుగునప్పటికి బ్రతివీరులును ఘోరనాయత్తపడి యుండిరి. మనవారి గుఱ్ఱముల ముఖ పట్టణముమీఁదనున్న చిహ్నముల విలోకించుచు వారిలో వారేదియో నిరూపణపూర్వకముగా మాటాడికొని యాయుధములవిడచి మోడ్చు చేతులతో మనవారి గుఱ్ఱముల దాపునకు వచ్చి నమస్కరించిరి.

మనవీరులు వారింజూచి యోహహో! ఇదియేమి చోద్యము. మన తమ్ములిందు వచ్చియున్నారే! అని గుభాలున గుఱ్ఱములు డిగ్గ నఱికి వారిం గౌఁగిలించుకొని విజయా! విక్రమా! అని పేరులు పెట్టి పల్కరించుచుండ వారును నానందబాష్పములు గ్రమ్మ గ్రమ్మఱ నాలింగన సుఖం బిచ్చిరి. కంఠంబులు డగ్గుతికపడ నొక్కింత తడ వేమియు మాటాడలేక వారూరక చూచుచుండి రందు విక్రముం డను ప్రతివీరుం డిట్లనియె.

అన్నలారా! మీ రుత్తరదిశ కరిగితిరిగదా! యిక్కడి కెట్లు వచ్చితిరి? ఈరాజు మీకుఁ జుట్ట మెట్లయ్యెను? తొలుత గుఱ్ఱములఁ జూచి గురుతుపట్టితిమి. లేకున్నఁ బ్రమాదమే జరగును. జూఁడీ. ఆహా! నేడెంత సుదినము. అయత్నోపలబ్ధముగా మనము గలిసికొంటి మని సంతోషాతిశయముతోఁ బలికిన విని మనవీరులును

మురియుచు వారిచేతులు పట్టుకొని పోయి యామరంబు వేదికపైఁ గూర్చుండి ముచ్చటలాడుకొనుచు నొండొరుల చరిత్ర మొండొరులకుఁ దెలియఁ జేసికొనిరి.

పౌరులు విశేషముగా మూగికొనియుండుటచే నాకు వారి దాపునకుఁబోవ వీలుపడినదికాదు వారాడికొనిన మాటలన్నియు వినఁబడలేదు వినఁబడినవానిం జెప్పెద నాలింపుడు మేము ద్వారవతీనగరంబున నాలుగుదివసంబులుండి శ్రీకృష్ణునిభజించి యింటికింబోవలయునని ప్రయత్నింపుచుండ జారుమతి తండ్రి యవంతీశ్వరుఁడు తోడల్లుఁడగు క్రోధనునింజూడ నోడలమీఁదుగా నీయూరుచేరుటకై ద్వారవతి యరుదెంచి మూఁడుదివసంబులావీటిలో నివసించెను తనకూఁతురు చారుమతి నప్పుడు రాక్షసుండెత్తికొనిపోయెననియేకాని తరువాత జరిగిన వార్తలేమియు నెఱుంగఁడు.

మేమెవ్వరమో మహావీరులము దేశములు పెక్కుజయించితిమనివిని యారాజు దైవికముగా మర్యాదకై మమ్ముఁ జూడవచ్చి మాకువార్తనంపెను. మేమతనిరాక కనుమోదించుచు శిబిరద్వారము దనుక నెదురుపోయి సగౌరవముగాఁ దీసికొనివచ్చి యుచితాసనాసీనుం గావించి స్వాగతపూర్వకముగా గుశలప్రశ్నము జేసితిమి. అతండు తనవృత్తాంతము మాకిట్లుచెప్పెను.

రాజపుత్రులారా! నాయదృష్ట మేమనిచెప్పికొందు. లేకలేక నాకుఁ జారుమతియను నాఁడుపిల్లకలిగినది. దానికిఁదగినవరుఁదీసికొని రాలేక స్వయంవరముచాటింపించితిని అందుఁ గల్యాణమంటపమున కరుగుచున్న నాపట్టి నాకసమునంబోవురక్కసుడొక్కఁడట్టెవచ్చియెత్తికొనిపోయెను. ఎంతయోదూరము వెదకించితిని. ఆకన్యజాడ యేమియుఁ దెలియలేదు. నాఁటిసుత నేఁటిదనుక నాభార్య నిద్రాహారములులేక బిడ్డకై పరితపించుచున్నది. వగపునిరర్థకంబనియెఱిఁగియున్నను మోహా

పాశబద్ధులమగుట లోకమును జింతాపరంపరలు తాకఁకమానవు. వరు ణావతీనగరంబునఁ గ్రోధనుండనుమహారాజు నాభార్యకు అక్కమగఁడు అతనిభార్య చెల్లెలి పరిదేవనమువిని మమ్మక్కడికిఁ దీసికొనిరమ్మని నమ్మకమగు భృత్యులనంపినది వారివెంట మేమందుబోవుచున్నాము ఈక్షేత్రం బతిపవిత్రమైనదగుట మూఁడునాళ్ళు వసించితిమి. రేపు ఓడలెక్కి పోవుదుము మీరు లోకైకవీరులని చెప్పగావిని చూడవచ్చితి నని యారాజు తనకథయంతయుఁ జెప్పెను. ఆకథవిని మేమొకరిమొక రము చూచుకొనఁదొడఁగితిమి. అప్పుడు హరివర్మలేచి యోహో హో! అవంతీశ్వరుఁడవా నీవు! దైవసంఘటన మతివిచిత్రమైనది గదా. మీకూఁతురు చారుమతి కుశలినియైయున్నది. మీకిందుఁ జూపింతు నాకేమి పారితోషిక మిత్తురని యడిగిన నమ్మహారాజ ట్లనియె.

మహాభాగ! నీవనినమాట సత్యమగుంగాక. అట్లైన నారాజ్యమే నీకుఁ బారితోషికముగానిత్తు. ఏదీ? ఎందున్నదియో చెప్పుఁడు చెప్పుఁడు అనియూరకయున్నత్తునిచందమున నడుగుచుండ మనహరివర్మమామా! నేను నీయల్లుఁడ చారుమతి నన్ను వరించినది. అని తమకథసంక్షేప ముగాఁజెప్ప విని యమ్మహీపతిబొందిన యానందమిట్టిదని చెప్పుటకు మాతరముకాదు.

హరివర్మంగాఁగలించుకొని యేదీనానందనియేదీ చూపుదువా? అని యడిగిననతఁడు నాతోరమ్ము చూపింతునని పలుకుచు నొకపట కుటీరమునకుఁ దీసికొనిపోయి చారుమతింజేరి నీతలిదండ్రులు వచ్చి యున్నారనిచెప్పెను. అప్పుడప్పడఁతి ముప్పిరిగొను వేడుకతో వారిం గాంచినది పుత్రికఁజూచి వారుమాటాడలేక హా తల్లీ! నీవు బ్రతికి వచ్చితివా! అనిపలుకుచుశోకగద్గదకంఠులై యక్కునంజేర్చి పెద్దతడవు గారవించిరి.

నాదారిని గన్యాకుబ్జమునకు రమ్మని వార్తననిపి శుభముహూర్తంబున హరివర్మాదులు దలంచినంతనే దేవకన్యలతోఁగూడ సన్నిహితమగు రత్నవిమానముపై వారెల్ల భార్యలతో నెక్కి మహావైభవముతో గగనమార్గంబునఁ బుష్పకారూఢుం డగు శ్రీరాముఁడువోలె జనుచుఁ దొలుతనుమాపురంబున కరిగిరి.

అందొకచో విమానమునిలిపి హరివర్మయల్లన శ్రీధరుని కోటలోనికిం జనియెను. అతండు శ్రీముఖుని తమ్ముండని యెఱింగిన వారెల్ల వడివడి బరుగిడికొనిపోయి యావార్త శ్రీధరుని కెఱింగించిరి. శ్రీధరుం డతని కెదురువచ్చి ప్రీతిచే నాలింగనము జేసికొని రాజపుత్రా! మీతమ్ములేరి? అందరు సుఖముగా వచ్చితిరా? అని యడిగిన నతండు మీ యనుగ్రహమున సేమముగా నే వచ్చితిమి. మాయన్న శ్రీముఖుఁ డిందుఁ గుశలియై యున్నవాఁడా యని యడిగిన నా రాజిట్లనియె.

రాజపుత్రా! నినొ్నకమాట నడిగెదఁ జెప్పుము. మీరుసముద్రములో నరుగుచుండ నోడలన్నియుఁ గనులకుఁ దగిలి వికలములై మునిగినవనియు, మీరందుఁబడి మృతినొందితిరనియు మాకువార్తలు వచ్చినవి. మీరెట్లు బ్రతికి వచ్చితిరో తెలుపుమని యడిగిన నతండు సంక్షేపముగా దమకథ నెఱింగించి యతని కానందము గలుగఁ జేసెను.

రాజు విస్మయపడి అయ్యో! పాపము! మీయన్న మీ మరణవార్త విని మిక్కిలి దుఃఖించుచు అక్కటా! క్రోధనుని యంత్రబలసామర్థ్యము వినియుం దమ్ములబంచి బలవంతమున జంపికొంటి. నావంటి దుర్మార్గుం డెవ్వఁడైనఁ గలఁడా? అయ్యో! నేనత్తవారింట విందులు గుడుచుచుఁ దమ్ములతోఁ బోలేక నిలిచితినే. నేనొక్కరుండ నింటి కెట్లు పోవుదును? తమ్ములేరని యడిగిన మాతల్లి కేమి

చెప్పుదును? అనియూరక యున్మత్తునివలెం బలుకుచు నాఁడుదాని వలె గుండెలు బాదుకొనుచు వచింపఁదొడంగెను. మేమెంత జెప్పి నను వినిపించుకొనడయ్యె. కొన్నిదినములు సముద్రముమీఁద బయన ముజేసి మీజాడలు దెలిసికొని మీరు మృతినొందినట్లే ధ్రువపడి నంత నింతంతనరాని వంతతోవచ్చి యెవ్వరుజెప్పినను వినక నింటికిఁ బయన మగుటయు నేనతని భార్యగూడ వెంట నంపితిని. వారి మీ యింటం బ్రవేశపెట్టి మాపరిజనులు తిరుగావచ్చిరని యావృత్తాంత మంతయు నెఱింగించెను.

ఆవార్తవిని విక్రముఁడు శోకవిహ్వలుఁడై మామా! మాసోద రుని పరిదేవనము వినిన నాగుండె పగిలిపోవుచున్నది. ఇంటికిఁ బోయి యీమవార్త మాతల్లి కెఱింగించిన నామెయెంతచింతించుచున్నదో! వేగబోయి వారియార్తి యుడిగించి ప్రహర్షము గూర్చవలయు సెల విండు పోయివత్తుమని పలుకుచు నటఁగదలి క్రమ్మఱ విమానమెక్కి యక్కడి కథ లందున్నవారి కెఱింగించుచు నర్ధదివసములోఁ గన్యా కుబ్జమునకు విమానముఁ బోఁజేసెను. అప్పు డందు శుద్ధాంతమున సౌభాగ్యసుందరి బిడ్డలు చుట్టునుం గూర్చుండి యూరడింపుచుండ,

ఉ. హా! సుకుమారులార! సుగుణైక నిధానములార! శత్రు సం
త్రాసకరప్రతాప బలదర్పితులార! కుమారులార! మీ
హాసవిలాసభాసుర ముఖాంబుజము ల్గన నాకు నింక న
య్యో! సమకూరదా సుతవియోగభవార్తి భరింపనెట్లకో.

క. ఇదె వత్తురో యదెవత్తురో
కద యని యెదురెదురుఁజూచి కాలముగడపఁగ
దుద కిట్లు పిడుగుపడిన
ట్లు దరఁగఁ జెడువార్త వినంగనయ్యెం గట్టా!

క. మీయన్నలగతి మీరును
శ్రీయుతులై వచ్చి నేను ప్రియమంద నతుల్
సేయుదురని యెడదం దల
పోయుదు నెల్లపుడు రిత్తవోయె మదాశల్.

గీ. ఏల పోయితిరయ్య మీరెటకుఁగి యెటిగి
క్రోధనుని యంత్రశక్తి రాకొమరులార!
అంబుధి నిమగ్నమూర్తులైనప్పు డెంత
యార్తిజెందితిరో బిడ్డలార మీరు.

అక్కటా! పెక్కండ్రు బిడ్డలు పుట్టుటయు రట్టునకే కారణమైనది. రెక్కలువచ్చిన పక్షులవలె బిడ్డలు చెప్పియుఁ జెప్పకయు నలుమూలలకుం బోయిరి. తూర్పుదెస కరిగిన వారు మాత్రము కష్టములు దాటి గట్టెక్కి వచ్చిరి. యుత్తరముదెస కరిగిన వారి సౌకర్యవార్త దెలియుచున్నది కాని యింకను నింటికి రాలేదు. వారిట్లు సముద్రముపాలైరి. కడపటివా రేవురు దండ్రియాజ్ఞ బూనకయే దక్షిణముదిక్కున కరిగిరఁట. ఎవ్వరికై వగతును ఏమిసేయఁగలను? ఆసముద్రము లోనైనదే కాఁబోలు. శ్రీముఖా! నన్నక్కడికిఁ దీసికొనిపోవుదువా? సముద్రములో మునింగి నాబిడ్డలం జూచెదగాక, అనియూరక వారలం దలంచి సౌభాగ్యసుందరి దుఃఖించుచున్నది. అట్టి సమయంబున విమాన మామేడమీఁదికి దింపి విక్రమాదులు దిగివచ్చి,

గీ॥ జలధిఁబడియు దైవసంకల్పమునఁజేసి
బ్రతికినార మొక్కభంగి మేము
చూడు వీరె నీదు సుతు లుత్తరాశకుఁ
జేనినవారు వారి సతులు వారు.

వీరు మాభార్యలు దేవకన్యలు. వీడు విద్యాసాగరుని కొమారుఁడు. నీమనుమని జూచికొనుమని పలుకుచు వారినెల్ల దెల్లముగా

నెఱింగించి తమ వృత్తాంతము వ్రాసగుఱిచ్చిన జ్ఞ్లిఱింగించి సౌభాగ్య సుందరిని సంతోషపారావారవీచికల నుయ్యెలలూగించిరి.

క॥ కొడుకుల నక్కునఁజేర్చుచు
గడువడిఁ గోదండ్రిఁ దిగిచి కనఁగొనుచు నొడల్
బుడుకుచు నామె కొమారుల
నడిగినమాటలనె మఱియు నడుగుచు వేడ్కన్.

సౌభాగ్యసుందరి దివ్యరూపసంపన్నులగు కోదండ్రిను గొడుకులను దనకడనే యుంచికొని వారివారి చరిత్రములం బలుమారు వినుచు గడమకొడుకులు గూడ నింటికి వచ్చినచో నిఁక నాకేవిచారము నుండదని పలుకుచు సంతోషముతోఁ గాలముగడుపుచుండెను.

అని యెఱింగించి మణిసిద్ధుండు...ఇట్లు చెప్పఁ దొడంగెను.



239 వ మజిలీ.

దక్షిణదిగ్విజయము

## పుష్పకేతుని కథ.



పుష్పకేతుఁడు మయూరధ్వజుఁడు చిత్రభానుఁడు సౌమ్యుఁడు పింగళుఁడు వీరేవురు దక్షిణదిగ్విజయము సేయఁదలంచి తండ్రియను మతిబొందకయే రహస్యముగాఁబయలుదేరి యాంధ్రకర్ణాటకేరళాది దేశవిశేషములఁ జూచుచుఁ గాంచీపురాదిదివ్యక్షేత్రంబుల సేవింపుచు ద్రవిడదేశంబు జొరపడి యందలివింతలనరసి పాడ్యదేశంబు మీఁదుగా స్త్రీరాజ్యంబుజేరి తద్రాజధానియగు పుష్పపురంబు ప్రవేశించిరి.

ఆనగరము పదియామడ వెడల్పును పదాఱామడ పొడవును గలిగియున్నది. విశాలములైన వీథులచే సౌధములచే నొప్పుచున్నది.

ఒక్కొక్కవీధి యొక్కొకపేట పెద్దపట్టణముతోఁ బోల్చవచ్చును. ఆస్త్రీరాజ్యములో మూఁడువంతులు నగరమే వ్యాపించియున్నది. రత్నమకుటయను వనితారత్న మప్పీఁడు పాలించుచున్నది.

రాజపుత్రు లేవురు నప్పురంబున నొకభవనంబద్దెకు దీసికొని యందువసించిరి. పెద్దవాఁడు తమ్ములారా! ఇన్నగర మాఁడుదిపాలించుచున్నదఁట. ఆమెతో మనముపోరు సేయఁగూడదుగదా! ఇందుఁగొలఁది దినములుండి యిందలివిశేషములు సూచియవ్వలికిఁబోవుదుముగాక. ఇంతపట్టణ మిదివఱకు మనము చూచియుండలేదు. ఇందుఁ బెక్కులు విచిత్రములుండకపోవు. మనముతలయొక వీధికిం బోయి చూచివచ్చుచుందముగాక. మనమదుల కచ్చెరువుగలిగించు విశేషములేమైనగలిగినచోఁ బరీక్షింపవలసినదియే. అని యుపదేశించిన వారనుమతించిరి వారునిత్యము పెందలకడ భోజనముచేసి చక్కగా నలంకరించుకొని శృంగార శేఖరులవలె నొప్పుచు బయలుదేరి తలయొకవీధికిఁబోయి యందలివిశేషంబులుచూచి రాత్రికింటికివచ్చి యవ్వింతలొండొరులకుం జెప్పుకొనుచుందురు. ఈరీతి మూఁడుదివసములు జరిగినవి నాలుగవనాఁడు పుష్పకేతుఁడు మాత్ర మింటికివచ్చెను. తక్కినవా రెవరును రాలేదు. చీఁకటిపడినది పుష్పకేతుఁడు పరితపించుచుఁ దమ్ములజాడఁ జూచుచుఁ బెద్దదవుపీధిలోనే కూరుచుండెను. ఒక్కఁడును రాలేదు.

అప్పుడతండాలోచించుచు నిన్నరాత్రి పింగళుఁడు మాటలధోరణిలో నీపీట వేశవాటిక చాలపెద్దదనియు నందలిబోటులుమంచినీటుకత్తెలనియుఁ జెప్పియున్నాఁడు నేఁడక్కడికిఁబోయియుందురా? అయ్యో! అందు బోవలదని చెప్పవలసినది. ఆవెలయాండ్రు వీరినేమి మోసము జేసిరో? మాకిది క్రొత్తదేశము కానిమ్ము. ఆమహావీరులవార లేమిజేయగలరు? వలపుగలుగఁజేసి చిక్కపట్టినంబట్టుదురుగాక రేపుపోయి పరిశీలించెదనని తలఁచుచు నారాత్రియెల్ల నిద్రబోవడయ్యెను.

మఱునాఁడు పెందలకడ భుజించి రూపంబు దిద్దికొని చేఁత బెత్తంబుబూని విలాసముగా నడచుచు దెలిసికొని వేగముగా నడుచుచు జాముప్రొద్దువేళకు వేశ్యాంగణముజేరెను. అందు

క॥ ఒకచోట మృదంగధ్వని
యొకచో వీణానినాద మొకచోఁ దార్య
త్రికరవము వేణుగానం
బొకచోఁదగవిని యతండహోయని పొగడెన్.

పుష్పకేతుఁడందలి సంగీతనాదములు చెవులపండువు గావింపుచుండఁ గొండకదూరముపోయి యొక్కచో సమున్నతవేదికాభిరామంబై విచిత్రకుడ్యదీప్తంబై యభ్రంలిహాగ్రంబై బహుళతానముల్లిఖితసింహద్వారకవాటంబై యొప్పు నొకసౌధరాజంబు రాజభవనమేమో యని యతనికి భ్రాంతిగలుగఁజేసినది. వేశవాటికలోఁ బ్రాసాదము లుండునా! అనితలంచుచు సమీపమునకుఁబోయి యీమేడయెవ్వరిదని యడిగెను.

అందుఁగాపున్నవారామాటవినిఅయ్యా! ఆగోడకుఁవ్రేలఁగట్టిన పట్టంబుజదివికొనుడు. అంతయు మీకుఁ దెలియగలదని యుత్తరము జెప్పిరి. అతండు సంతసించుచు నటఁగెక్కి యందలిపట్టంబు జదువ నిట్లున్నది.

## మహారాజరత్నముకథ.

ఇందు మహారాజగత్నమను వేశ్యారత్నము గాపురముసేయు చున్నది. ఆయద్దములోఁగట్టఁబడిన రూపమాయువతి ప్రతిబింబము ఈత్రిభువనైకసుందరికిఁ జతుష్షష్టికళలయందుఁ బాండిత్యము గలిగి యున్నది. ఈమెతుచ్ఛవిటతండముల షండములఁగాఁజూచుచుండును. ప్రచండ విద్యామదగర్వితుని వరింపఁగలదు. పండితంమన్యులఁ బరిచా

రకులగాఁ జేసికొనును. మఱియు నామె విద్యావిషయకములగు కొన్ని ప్రశ్నములనడిగి వానికిందగిన సమాధాన మిచ్చిన వానిఁ బ్రాణేశుఁగా జేసికొనఁగలదు. లేకున్న నామెతోటలోఁ బనిజేయవలసియున్నది యిందులకంగీకరించినవాఁడు ఒడంబడిక వ్రాసియిచ్చి లోపలకు రావలయును.

అనియున్న పట్టము జదివికొని యారాజపుత్రుఁడు రెండుగడియలసేపాలోచించి ద్వారపాలునింజూచి యోయీ నిన్న నెవ్వరైన నీమెయిచ్చినపశ్నముల కుత్తరమిత్తుమని లోపలకుఁబోయిరా! అని యడిగినవాఁడు ఒకచిన్నవాఁడు మీవలెనేయున్నాఁడు నిన్న వచ్చి యామెయిచ్చిన ప్రశ్నములన నెంతత్రుటిలోనుత్తరమిత్తునని చెప్పి లోపలికిఁబోయి తిరుగారాలేదు. తోటలోనికదేదారినిబోయెను. మొక్కలుత్రవ్వుచున్నాడని యాకథ యెఱింగించి యతండు వ్రాసియిచ్చిన పత్రికం జూపించెను.

ఔరా! ఈరాగ విద్యలలో నెంతప్రౌఢ! మాతమ్ముని బింగళునే జయించినదియా! ఇదిమాకన్న నెక్కువజదివినది కాఁబోలు! ఏవిద్యలో నడుగునో విమర్శించిపోవలయును.

ఆహా! సకలకలానిపుణుండగు పింగళు నోడించిన యీవారాంగన పాండిత్యము కొనియాడఁదగియున్నది. కానిమ్ము. ఇప్పుడు దీని నెట్లో జయించి తమ్ముని విడిపించుకొనిరావలయుంగదా. దీని విద్యావిశేషము లెట్టివో పింగళు నేవిద్యలో బరాజితుంజేసినదియో తెలిసికొనుట ఆవశ్యకమైనపని. దీనిగుట్టెవ్వరివలనం దెలిసికొందునని యాలోచించుచు నెదురింటి యరుఁగుపైఁ గూర్చుండెను.

అంతలో నొకగుఱ్ఱముబండి వచ్చి యచ్చిగురుబోడి వాకిట నిలిచినది. అతం డాబండివానిని జీరి యోరీ! దీని నెవ్వరినిమిత్తము దీసికొనివచ్చితివి? రాజరత్న మెంద్దైన విహరింపనరుగునా? అని యడి

గిన వాఁడు ఆమెకాదుసామి. ఆమె పనికత్తెనిమిత్తము దెచ్చితిని. ఇం టికిం బోగలదని చెప్పుచుండగనే లోపలనుండి యొకపరిచారిక వచ్చి యాబండిలోఁ గూర్చుండెను. బండి నడుచుటకుఁ బ్రారంభించినతో డనే రాజపుత్రుఁడు వెనుకం గూర్చుండెను.

ఆశకటము గడియలో దానియింటికిం బోయి నిలిచినది. రాజ పుత్రుఁడు దానికన్నముందు బండిదిగి ద్వారముకడ నిలిచి యది దిగి నతోడనే రత్నకేసరీ! నీనిమిత్తమిందు వేచియుంటి. వచ్చితివా అని యడిగిన నప్పడతి తెల్లబోయి చూచుచు నతని యాకారగౌరవము నుంబట్టి యుత్తముఁడని తలంచి నమస్కరించుచు లోపలకు దయచే యుఁడనిసవినయముగాఁ బలికి తీసుకొనిపోయి యొకపీఠంబునఁ గూ ర్చుండఁబెట్టి యిట్లనియె.

అనఘా! మీరెవ్వరో గురుతు తెలియకున్నది. నన్నెఱింగినట్లు పల్కరించితిరి. ఇది గరువమని తలంపవలదు. నాకొఱకు వేచియుం డుటకు నావలనం గాదగినపని యేదియో సెలవీయుఁడని యడిగిన మందహాసముజేయుచు నాసుందరుం డిట్లనియె.

రత్నకేసరీ! నావృత్తాంతము చాలగలదు. నన్ను నీవెఱుఁగ కున్నను నిన్ను నేనెఱుంగుదును. నీసుగుణములు విని నిన్నుఁ జూడ వచ్చితిని. నీవలనఁ గాఁదగినకార్య మొకటికలదు అందులకు గాను కగా నీకీరవ్వయుంగరమిచ్చుచున్నవాఁడఁ గైకొనుమని పలుకుచుఁ గాంతులీనుచున్న యంగుళీయక మొకటి దీసి దానిచేతిలోఁ బెట్టెను.

మిక్కిలివెలగల యానగం జూచి యామగువ వెఱఁగువడుచు ఆర్యా! మీకార్యమేదియో యెఱిఁగింపుఁడు. ఓపుదేని గావించి పిమ్మట మీవలన నీకానుక నందుదాన. పనికత్తెనగు నన్నింతపెద్ద జేసి యగ్గింపుచుండ సిగ్గగుచున్నది. సామీ! అని యాయుంగర మీ యఁబోయిన వారించుచు నతండు వలదు. నీకడనే యుంచుము నాకా

ర్యము నీకుఁ జేయశక్యము కాకపోవదు. వినుమని యిట్లనియె.

పుష్పకేతుఁడు—రత్నకేసరీ! నీకెక్కడపని?

రత్నకేసరి—మహారాజరత్నమను వేశ్యకడ

పుష్ప—నీవక్కడ నేమిచేయుచుందువు?

రత్న—సఖురాలువోలె గౌరవములైనపనులుచేయుచుందును.

పుష్ప—నీ వేమి చదువుకొంటివి?

రత్న—సామాన్యమైన చదువే.

పుష్ప—రాజరత్నమో?

రత్న—అబ్బో! అది గొప్ప విద్వాంసురాలు. ఆమెకు రాని చదువులేదు.

పుష్ప—అది విద్వాంసులతో వాదించి యోడించునఁట యే విద్యలలోనో యెఱుంగుదువా?

రత్న—అది నాకుఁ దెలియదుసామి.

పుష్ప—ఓడిపోయినవారి నేమిచేయును?

రత్న—తోటలోఁ బనిచేయించునుసామి. నిన్ననే యొకఁడు పాపము చక్కనివాఁడు మీావలెనున్నాఁడు. వాని నోడించి తోటలోని కనిపినది.

పుష్ప—వానితో నెట్లు వాదించినదో చెప్పఁగలవా?

రత్న—ఆసాంకేతకములు మాకేమియుఁ దెలియవు. ఏదియో సాంకేతికమువ్రాసి యంపుచుండును. తగుసమాధానము రానిచో లాగివేయును. నిన్ననే యాసంవాదమంతయును జరిపితిని.

పుష్ప—ఆ జరిపిన యుత్తరప్రత్యుత్తర పత్రికలు నీయొద్ద నున్నవియా?

రత్న—ఆ. వానిం దీసికొనిరాఁగలను. కట్టకట్టి మంచముపందిరిమీాఁదఁ నేనే పెట్టితిని.

పుష్ప—అదియే నీవలన నాకు గావసినపని. వానిం దెచ్చి, చూపఁగలవా?

రత్న—రేపు సాయంకాల మీపాటివేళకు రండు. ఆకట్ట తెచ్చి మీకిచ్చివేసెదను. యిదియేనా మీపని.

పుష్ప—అవును. నేను బోయివత్తు. మఱతువుసుమీ.

అని చెప్పి యతండు బసలోనికిం బోయి మఱునా డావేళకే దానియింటికిఁ బోయెను. రత్నకేసరి యాకట్ట యతని ముందరం బెట్టినది. ద్రవ్యంబునకు సాధ్యము కానివా రుండరుగదా.

పుష్పకేతుండు ప్రశ్నోత్తరములతో నొప్పుచున్న యా పత్రికలన్నియుం జదివి యందలి రహస్యములు కొన్ని తెలిసికొని దాని కిట్లనియె. రత్నకేసరీ! మొదట నీవు పల్లవాంకురము తరువాత మాలతి పిమ్మట జాతమంజరి. తరువాత గోళ్లునాటించిన మెట్టగుడ్డచుట్టిన మైనము ముద్ర పిమ్మట నల్లగుడ్డచుట్టిన తామలపాకులు నతని యొద్దకుఁ దీసికొనిపోయి యిచ్చితివి జ్ఞాపకమున్నదా? అని యడిగిన నది ఔను. ఇచ్చితిని. వాని కతండు తగుసమాధానము చెప్పలేక పోయెనఁట. అతండును సామాన్యుఁడు కాడు. నీవోడితివని చెప్పినప్పు డెదరించి బెదరించి కత్తితీసి నరికెదనని పలికెను. పిమ్మట నాపాన్నికొమ్మ ఏదో పుస్తకము జూచి కొన్ని శ్లోకములు వ్రాసియిచ్చినది. వానిం జదివికొని మఱుమాట పలుకక తోటలోనికిఁ బోయెననిఁ చెప్పినది.

అవును రాజరత్నము తానడిగిన ప్రశ్నమును శాస్త్రసమ్మతములే యని దృష్టాంతము చూపినది.

శ్లో. నారీసం కేతకం వక్ష్యే వక్రీభాషాంగముద్రియోః।
పోటలీవస్త్రపుష్పాణాం తాంబూలస్యాప్యనుక్రమాత్.

అను శ్లోకముమాత్రము జదివి రత్నకేసరీ! నీదయవలనఁ

గొంత సదుపాయము గలిగినది. నేను గూడ మీరాజరత్నముతో గొంత ముచ్చటించెద నని పలికిన నక్కలికి సామీ! నేను మీకీపత్రి కలిచ్చితినని చెప్పఁగూడదు చుఁడీ యని కోరినది. అతం డనుమతించి బస కరిగెను.

రాత్రియెల్ల నావిషయమై ధ్యానించుచు మేము కామశాస్త్రము లన్నియు జదివితిమి. బౌద్ధయతికృతమగు నాగరసర్వస్వ మను గ్రంథములో నీనారీసాంకేతికములు వ్రాయఁబడి యున్న వికాఁబోలు. ఆగ్రంథము మేము చదువలేదు. దానంజేసి పింగళుండా ప్రశ్నముల కుత్తరము జెప్పలేకపోయెను. ఆపుస్తకమీ నగరంబున నుండకమానదు. దానిం జదివి యందలి రహస్యముల గ్రహించెదంగాక. దీని నోడించుట యెంతపని. అని యాలోచించి మఱునాఁ డావీటనున్న పుస్తకాలయముల గుఱించి వితర్కించి తెలిసికొని యొక పుస్తకభాండాగారమున కరిగి యందుగల పుస్తకముల పట్టికం జదివి యతిప్రయత్నముతో వెదకి నాగరసర్వస్వమును దీసి దాని నామూలాగ్రముగ మూఁడుసారులు చదివెను. అందు,

శ్లో॥ యదపిన సులభేహ సామ్యగాక్షీ
నకల కళాకలనాసు పండితయా
కథమపి యది సంగమ స్తయాస్యాత్
వ్రజతి తదాహి పరాభవం వరాకః
అవిదిత యువతీకృతైక సాంకే
తక ఇతి రత్నకుమారకోయథైవ.

సకలకళాపాండిత్యముగల కలకంఠితోఁ గలసికొనుటయే దుర్ఘటము. దైవవశంబున నట్టి యంగనతో సంగమము గలిగినప్పుడు యువతీకృతసాంకేతములు దెలియనివాఁ డైనచోఁ రత్నకుమారుఁడు

వలెనే పరాభవము నొందఁగలఁడు అని వ్రాయఁబడియున్నది. ఇట్లు వ్రాసినవాఁడు,

శ్లో॥ కేచిద్భాష్యాంతరకృతతయా కామశాస్త్రప్రబంధా
దుర్విజ్ఞేయా గురుతరతయా కేచిదల్పార్థకాశ్చ
తత్పద్మశ్రీవిరచితమిదం సర్వసారం సుభోధం
శాస్త్రం శీఘ్రంశృణుత సుధియోభీష్ట ధర్మార్థకామాః.

పద్మశ్రీ యను బౌద్ధసన్యాసి రచించుటచే నిందలి విషయంబు లశాస్త్రీయములని చెప్పుటకు వలనుకాదు. అందులకే మాతమ్ముఁడు అంకీకరించి బద్ధుండయ్యెను.

నాకిప్పుడీ గ్రంథవిషయంబు లన్నియు క్షుణ్ణముగా నున్నవి. రాజరత్నమును దృటిలో జయింపఁగలనని యాలోచించుచు నాయాఘట్టమునందలి శ్లోకములు వ్రాసికొని వల్లించుచు నింటికిఁబోయి మఱునాఁడు సాయంకాలమున శృంగారవేషముతోఁ రాజరత్నము నింటికిఁ బోయెను.

అఱుగెక్కి యెవ్వరి నడుగక యే ప్రకటన పట్టములోనున్న ప్రకార మందలి గంటమ్రోగించెను. అంతలో లోపలనుండి యొక పురుషుఁ డీవలకువచ్చి మీరెవ్వరు? గంటమ్రోగించితిరేల? రాజరత్నముతోఁ బ్రసంగింతురా? అని యడిగిన నతం డౌను. అందులకే వచ్చితినని చెప్పెను. ప్రకటన పట్టము చదివికొంటివా? అందుల నిబంధన కొప్పుకొంటివా? ఒడంబడినచో నీకాగితముపై వ్రాఁలుచేయుమని చెప్పెను. అంగీకరించితినని యాతండు వ్రాలుచేసెను.

ఆపురుషుఁ డాయొడంబడిక పత్రిక లోపలికిఁ దీసికొనిపోయిన యరగడియలో నిరువురు పరిచారికలు లోపలినుండి వచ్చి యొకతె కాళ్ళుగడిగినది. ఒకతె నివాళి యిచ్చినది. సవినయముగా నతనిం దీసికొనిపోయి విచిత్రాలంకార భూయిష్టంబగు నొక గదిలోఁ దల్పంబున

గూర్చుండఁబెట్టిరి. ఆభవనాలంకారములం దిలకించి యారాజపుత్రుఁడది స్వర్గమేమో యని భ్రాంతిపడఁజొచ్చెను. అందు నానావిధ ఫలములు పుష్పములు దళములు జిగుళ్ళు మొదలగు వింతవస్తువులు పేరులువ్రాసి యద్దపు మందసములలో నునుపఁబడి యున్నవి. పెక్కేల? అది యొక చిత్రశాలవలె నొప్పుచున్నది.

అతం డా శయ్యదిగి యొకపీఠముపైఁ గూరుచుండి యది యెట్టి ప్రశ్నములిచ్చునో యనియాలోచించుచుండెను. అంతలో వాడుక ప్రకారము పరిచారికచే బంగారు తళియలోఁ బల్లవాంకురము లునిచి యతనియొద్ద కనిపినది. దానింజూచి యతండు నవ్వుకొనుచు.

శ్లో॥ కులప్రశ్నాంకురః స్మృతః॥ నీకుల మేమని యడుగుట కిది యంకురము పంపినదని గ్రహించి యాపళ్లెరములోనే, శ్లో॥ పనసః క్షత్రియేస్మృతః॥ అని చెప్పఁబడినది కావున నందు రంగులతో నమరించియుంచిన పనసఫలం బొండుదీసి యాపళ్లెములోఁ బెట్టి పంపెను. తరువాత నానాతి విదియచంద్రుని గాకితముమీఁదవ్రాసియంపుటయు శ్లో॥ రాజపుత్రే ద్వితీయేందుః॥ అనియుండుటంజేసి నీవురాజపుత్రుఁడవా? అని యడిగినట్లు తెలిసికొని, శ్లో॥ ఘనచ్ఛాయస్తు భూపతిః॥ నేను కేవలము రాజపుత్రుఁడనే కాను భూపతినని తెలియఁజేయుచు మేఘమురంగు వ్రాసియంపెను.

తరువాత నానెలఁత పోట లీప్రశ్న యడిగినది;—

శ్లో॥ సిక్థేన నిర్మితా ముద్రా పంచాంగుళి నఖాంకితా
వేష్టనం రక్తసూత్రేణ పోటలీ పరికీర్తితా॥

"మైనము ముద్దగాఁజేసిదానిపై నైదుగోళ్లు నాటించి యెఱ్ఱదారము చుట్టి యంపినది. దానికే పోటలియని పేరు

శ్లో॥ మదనానంగతః సిక్థః సంరాగోరక్తవేష్టనం
పంచబాణక్షతత్వేన పంచాంగుళినఖక్షతం॥

ఎఱ్ఱదారములు చుట్టుటచే నీయం దనురాగము కలదనియు నింతకుముందు మన్మథవ్యాపారము లేదనియు నైదుగోళ్లు గ్రుచ్చుటచేమన్మథుని పంచబాణముల బాధ యెక్కువగా నున్నదనియు నభిప్రాయమని గ్రహించి యతండు,

శ్లో॥ స్మరేణోద్భిన్న దేహత్వే సచ్ఛిద్రం వస్త్ర ముత్తమం

అని యుండుటచే నది పంపిన మైనము ముద్రకు చిల్లులుపొడిచిన మంచిగుడ్డ గట్టి యంపెను. అనగా నాదేహము మన్మథుని చేఁజిల్లులు చేయబడినది. అని తెలుపు సూచన తెలియఁజేసెను. పిమ్మట నాకొమ్మ తాంబూల ప్రశ్నలు వైచినది.

శ్లో॥ తాంబూల విటకాః పంచకీర్తితా నరపుంగవైః
కౌశలాంకుశ కందర్ప పర్యంక చతురశ్రకాః

కౌశలము శలాకసూత్రరహిత మైనది. అంకుశము, అంకుశాకారము, కందర్పము, త్రికోణాకారము గలది. మధ్యబాణాకారముగనుండును. పర్యంకము పర్యంకాకారముగలది. చతురశ్రము-నాలుగు కోణములుగలది. అని యైదువిధములతో నొప్పుచున్నది. అందు బర్యంకమను విటకము పళ్లెమున నిడి పంపినది.

శ్లో॥ పర్యంకస్సంగమాశయా,- అని యుండుట గ్రహించి రాజపుత్రుండు, శ్లో. బాహ్యేచందన పంకాక్త మత్యర్థ మనురాగతః-అని యాతాంబూల వికటముపై మంచిగంధము నంటించి యనిపెను. నాకు నీయందుఁ జాల యనురాగము కలిగియున్నదని సూచించెను.

ఈరీతి తానుపంపిన నారీ సంకేతనము లన్నియు నతండు గ్రహించి తగినట్లు ప్రత్యుత్తర మిచ్చినంత నకాంతారత్నము సంతోషించుచు నెడమచేతి మధ్యాంగుళి నడిమిరేఖ నాఁడు తిరుగారావలయునని వ్రాసియంపినది. అది చదివికొని యతండు,

శ్లో. శుక్లేవామకరోజ్ఞేయః అసితో దక్షిణఃకరః
కనిష్టమూలమారభ్య రేఖాః పంచదశస్మృతాః.
అంగుష్టస్యోర్ధ్వరేఖాంతాః స్మృతాః ప్రతిపదాదిషు.

ఎడమచేయి శుక్లపక్షమనియుఁ గుడిచేయి కృష్ణపక్షమనియు జిటికెనవ్రేలి మొదటిరేఖ మొదలుబొటనవ్రేలి తుదిలేఖవరకు బదియేను రేఖలు పదియేను తిధులుగాఁ దెలిసికొనవలయునని సాంకేతికము. ఎడమచేయి అనగా శుక్లపక్షము. మధ్యాంగుళి నడిమిరేఖ యనసష్టమి. శుద్ధాష్టమినాడు రాత్రి తిరుగా రమ్మని సూచనయని గ్రహించి యతం డట్టే యాలోచించి నేనంతకాలంబుదనుక నిలువను. అనామిక నడిమి రేఖకే (పంచమినాటికి) రాఁగలను. అని ప్రత్యుత్తరమిచ్చెను?

ఆవేశ్య మిగుల సంతసించుచు నతండు తన ప్రశ్నములకు సమాధాన మిచ్చిన ట్లొప్పుకొని నాఁడు వచ్చుట కంగీకరించి యంపినది.

పుష్పకేతుం డింటికిఁబోయి యావారాంగననోడించినందులకు సంతసించుచు సౌమ్యుని పిడిపించి పిమ్మటఁ దక్కిన తమ్ముల జాడఁ దెలిసికొనియెదనని నిశ్చయించి మూడుదినము లెట్లో గడిపి పంచమినాఁడు సాయంకాలమునకు మహారాజరత్నము నింటికడకుబోయెను.

అంతకుముందే యిందుముఖు లిరువు రతనినిమిత్తమందు వేచి యుండిరి. అతని జూచినతోడనే రండు రండని పలుకుచు నొకతె పాదములు కడిగి తడియొత్తినది. ఒకతె నివాళి యిచ్చినది. ఇరువురు నతని సగౌరవముగా లోపలకుఁ దీసికొనిపోయి వెనుకటి గదిమీఁదుగ ననేక కక్ష్యాంతరములు దాటించి యొక రాజసౌధములోనికిం దీసికొనిపోయి రత్నపీఠంబునం గూర్చుండఁ బెట్టిరి. ఆగది యలంకారము జూచి యతం డిది వేశ్యాసదనము కాదు. రాజభవనమువలె నున్నది.

ఆమేడ వీధిగోడకు వ్రేలంగట్టిన చిత్రఫలకము మహారాజరత్నముదని వ్రాయఁబడి యున్నది. ఇందు మఱియొక రమణీమణి చిత్రఫలకము గనంబడుచున్నది. ఈచిన్నది మఱియొకతె కాఁబోలు. దీనికిఁ గిరీటములు కేయూరములుగూడఁ గలిగియున్నవి. ప్రభుచిహ్నముల వేశ్య యెట్లు దాల్చెడిని? ఏమో. దేశాచారభేదము లెవ్వఁ డెఱుంగును? అని యాలోచించుచున్న సమయంబున,

క. కుందనపుబొమ్మయనఁ మెఱు
పుందీగె యనంగఁ గాంతిపుంజికయనఁ బొ
ల్పొందు నొక సుందరీమణి
యందుల కరుదెంచెఁ బరిజనావృతయగుచున్.

కిరీట కేయూర కరవాలాదిప్రభుచిహ్నాలంకారముల దాల్చియున్న యాయన్నుమిన్నం జూచి యతం డౌరా! ఈనారీరత్నము మున్ను నే చిత్రఫలకంబునఁ గన్నదికాదు. ఇది వేరొకతె. ఆమహారాజరత్న మెందున్నది? దీనిరాకకు గతంబేమి? నాచే జయింపఁబడిన చేడియయెవ్వతె? దాని మొగమే చూచియుండలేదేయని యాలోచించుచుండనయ్యండజగమన మెల్లన నతనినికటమున కరిగి పదంబులకు నమస్కరించుచు,

క. ఫలియించె నిప్పటికి నా
యలఘుపురాకృతఫలం బహో సకలకళా
లలితు నినుఁ బతిగఁ బడసితి
నిల ననుఁబోలిన వధూటి యెటలే దరయన్.

రాజ—ఓహో! నీవేశ్యాలాపములు నాకడ నుపచరింపవు. నీవు ఏకపరిగ్రహవా? అనేకపరిగ్రహవా? అపగ్రహవా?

రత్నమకుట—రాజపుత్రా! నేను వేశ్యను గాము. ఈదేశము పాలించు నధికారిణిని. నాపేరు రత్నమకుట యండ్రు.

రాజు—బలే. బాగు. ఇందు దేశమేలు రాజస్త్రీలుగూడ వేశ్యావృత్తి వహింతురని మాకుఁ దెలిసినదికాదు. మంచి యాచారమే.

రత్న—రాజనందనా ! నావృత్తాంతమంతయును విని పిమ్మట నాక్షేపింపుము.

రాజు—నీవృత్తాంతము వినక తెలిసికొనక యింతదూర మెట్లు వచ్చితిని ? గోటకుఁగట్టిన పట్టము నీవృత్తాంతమంతయుఁ జెప్పుచుండ లేదా? ఏదో మారుమూలగ్రంథములోనున్న నారీసాంకేతికశ్లోకములు నాలుగు వల్లించి కట్టుకథలవంటిప్రశ్నము లడిగి వానిం జెప్పలేకున్న సకలకళాపారంగతుల నిర్వక్రపరాక్రమవంతులఁ గూలివాండ్రగాఁ జేసి కొందువా? నీవ్రాఁతలకుం గట్టుబడియింతదనుక నుపేక్షించితిమి. నిరుపమవిద్యాబలశాలియగు మాతమ్ముని మొన్న బరిచరుంగాఁ జేసికొంటి వతం డెట్టివాఁడో యెఱుంగుదువా? న్యాయంబునకుఁ గట్టుపడి యెంగాని యువ్వోత్తుగా నీరాజ్యము నిన్నుఁగూడ మట్టుమాపకపోవునా? ఈదేశమును బాలించు నీవే యిట్టికపటకృత్యములు సేయుచుండ నిందుఁ గాదనువా రెవ్వరు? రాజస్త్రీవై వేశ్యనని చెప్పుకొంటివేల? ఇది యెట్టిగౌరవమని యత్యంతకోపముతోఁ బలుకుటయు నక్కుటిలాలక యతని యలుకకు వెఱచుచు నడుగులంబడి యిట్లనియె.

మహాత్మా! నావృత్తాంతమంతయు విని తప్పున్న గోపింపుఁడు. ఇది స్త్రీరాజ్యము. నేనీరాజ్యమునకు వచ్చి సంవత్సరము దాటినది. మాదేశాచారములు కడు విపరీతములు. ఇందు విద్యాధికులగు పురుషులు చాల తక్కువగానున్నారు. నేనుత్తముఁడగు పతిం బడయఁ గోరి యొక బౌద్ధసిద్ధు నాశ్రయించితిని. ఆబౌద్ధసన్యాసి నాభక్తికి మెచ్చి నాకీశ్లోకములుగల ప్రశ్నోత్తరములు వ్రాసియిచ్చి వీని కీరీతిఁ బ్రత్యుత్తరమిచ్చిన వానిం బెండ్లియాడుము. అని చెప్పి పోయెను.

అందులకై యిట్టిపత్రము బూనికొంటిని. మహారాజరత్నము నాకు స్నేహితురాలు. మంచియందకత్తెయ. విద్వాంసురాలు. నాపేరున నిట్టిప్రశ్నములిచ్చుట కిష్టపడక దాని పేరునం బ్రకటించితిని. వేశ్యల గేహములకు పురుషశ్రేష్ఠులు వచ్చుచుందురని యట్లు నియమించితిని ఆమేడ నిజముగా దానిదే. అదియు సామాన్యుల నొల్లక కన్యక గానే యున్నది. మొన్న మీతమ్ముని వరించి మెడలో బూవుదండ వైచి తనమేడకుఁ దీసికొనిపోయినది. ఆయనతో మీవృత్తాంత మింకను జెప్పలేదు. మఱియు నాప్రశ్నముల కుత్తరమీయలేనివారిం బరిచరులఁగాఁ జేసికొననేల యందురేమో వినుండు. మొదటగొన్ని దినము లట్లే ప్రకటించితిని. విద్యావిహీనులుగూడ నిత్యము నాప్రశ్నముల కుత్తరమిత్తుమని లోపలిగృహవిశేషములు చూడ ననేకులు వచ్చుచుండిరి. దానంజేసి విసిగి యిట్టినియమము గావించితిని కాని లోకుల వంచించుటకు గాదు. మాతప్పులన్నియు మన్నించి యీరాజ్యముతోఁగూడ నన్ను బరిగ్రహించి స్త్రీరాజ్యమన్మథసామ్రాజ్యములకుఁ బట్టభద్రులు కండు. నేను మీచే వాదంబున గెలువబడితిని గదా? అని ప్రార్థించిన నతండించుక యాలోచించి యిట్లనియె.

దేవీ! నాచే నోడింపఁబడినది మహారాజరత్నముకాదా నీవెట్లగుదువు? అనుటయు నాచతుర మీరు విద్వాంసులు. ఆపేరు మాయిద్దరియందు వర్తించుచున్నది. నేను మహారాజరత్నము ననుకొనదగనా? కావున మీచే నోడిపోయినదానను నేనేకాని యదికాదని యుత్తరము చెప్పినది.

ఓహో! మహారాజులలో రత్నమువంటిదానవని నీవు శబ్దార్థమును దిరపచుచుంటివా. ఈమాటు మెచ్చుకొంటి. సరిపోయినది. కానిమ్ము. సిరిరా మోకాలొడ్డువాఁ డుండునా? నీవు రాజ్ఞివని గరువమునొందక నాయిచ్చవడువున మెలంగెదనంటివేని నిన్నుఁ బరిగ్ర

హింతు. లేకున్న నొడంబడనని పలికిన విని యక్కలికి నవ్వుచు నెం తైనను మగవారు మీదువారు. వారిమాటయే పైగానుండును. అం దుల కాటంకమేమి? మీయిష్టమువచ్చినట్లు శిక్షించుకొనుఁడని యప్పుడే యతనిమెడలో ముక్తాదామము వైచినది. అతండు మఱి యొకదామం బాపడఁతిమెడలో వైచెను. అదియే వారికి వివాహము. వేశ్యారత్నముతోఁగూడఁ బింగళు నక్కడకుఁ దీసికొనిరమ్మనివారొక విచిత్రభవనాంతరమున కరిగిరి.

శ్లో. విలసదమలదీపె పుష్పదామావకీర్ణె
ప్రసృతసురభిధూపెధామ్ని కామీ సువేషః
సహసహచరవర్గై ర్వామపార్శ్వేని వేశ్య
స్త్రియముపహితవేషాం భావయేన్నర్మగోష్ఠీం.

శ్లో. కలాకలాపైశ్చయుతం సమస్తైః
గుణైరసంకేతవిదం హికాంతం
పరిమ్లాన నిర్మాల్యమివోత్సృజంతి
గుణాధికానాగరికాస్తరుణ్యః

శ్లో. తతోన్యచింతాంపరిహృత్యకామీ
యతేత సాంకేతిక శాస్త్రకేషు
సతాంహి సమ్మానసహస్రభాజాం
యూనాం వధూధిక్కృతి రేవ మృత్యుః

సకలకలాపాండిత్యము గలిగియున్నను నారీసాంకేతిక మెఱుంగని పురుషుని గుణాధికలగు నాగరికస్త్రీలు వాడిన నిర్మాల్యమాలికలవోలె గౌరవింపక విడిచివేయుదురు. కావున నితరచింతవిడిచి పురుషుఁడు నారీసాంకేతికవిధానము దెలిసికొనవలయును. అనేక సన్మానములు బొందుచున్నను యౌవనవంతులకు స్త్రీధిక్కారముకన్న నవమానము వేరొకటిలేదుగదా.

అని యెఱింగించునంతఁ గాలాతీతమైనది. అవ్వలికథ తదనంత రావసథంబున నిట్లు చెప్పఁదొడంగెను.

240 వ మజిలీ.

# మణిమంతునికథ.

స్త్రీరాజ్యపాలనావిశేషము లెట్లుండునో రత్నమకుట యెట్లు తీరుపులు చెప్పునో వినవలయునని యభిలాషగలిగి యొకనాఁడు పుష్ప కేతుఁడు భార్యతోఁ గూడ సభాస్థానమున కరిగి రత్నమకుటసింహాస నమునకుఁ బ్రక్కగా వేరొకపీఠంబునఁ గూర్చుండి యామెచేయు ప్రశ్నప్రకారము లరయుచుండెను. తనభర్త ప్రక్కనుండుటచే వాడుక ప్రకారముగాక స్వరవైక్లబ్యముతో మంత్రిదిక్కు మొగంబై యామె నేఁడు విచారింపవలసిన యభియోగము లేమిగలవని యడిగినది.

మంత్రి లేచి రాజ్ఞీ! నేఁడు ముఖ్యముగా హత్యాపరాధపరి శోధకములు రెండువిమర్శింపవలసియున్నవి. ఒకదానిలో వాది ప్రతి వాదు లిరువురు వచ్చియున్నారు. ఒకదానిలో వాదిమాత్రమే వచ్చి యున్నాఁడు అని పలుకుచు నాకాగితములుకట్ట నామెచేతికిచ్చెను. రత్నమకుట చేయి వణక నందుకొని వానిభర్త కిచ్చుచు మీయెదుట మేము విమర్శింపలేము. మీరే విచారించి తీరుపుచెప్పఁడని పలికినది

అతండు నవ్వుచు మీపాలనావిధానము జూడవలయుననితలం చ నీభారము నామీఁదనే పెట్టితివా? కానిమ్ము మీయమాత్యుఁడు హత్యలనుచున్నాఁడు. అవి యెట్టివో తెలిసికొనియెదంగాక యని పలు కుచు నాపత్రికలం జదివికొని శిరఃకంపముతో ముందు మణిమంతుఁడు రత్నపాదుఁడునను వర్తకులఁ బిలువుఁడని భటుల కాజ్ఞాపించెను.

వాండ్రు పిలువఁగా నావర్తకులిరువురు వచ్చి యెదుర నిలువం

బడి నమస్కరించిరి. వారిరువురపేరులు తెలిసికొని

పుష్పకేతుఁడు—మణిమంతా! నీదీయూరేనా?

మణి—చిత్తముమహాప్రభూ మాతాత తండ్రులనాఁటినుండి యు నూ దీనగరమే కాపురము.

పుష్ప—నీవు కోటీశ్వరుఁడవఁట నిజమేనా?

మణి—ప్రభువువారికిఁ బదికోట్లమీఁదఁ బన్నుగట్టుచున్నాను మహాప్రభో!

పుష్ప—ఈరత్నపాదు నెఱుగుదువా?

మణి—ఎఱుఁగుదును మహాప్రభో. యెఱుఁగుదును.

రత్నపాదుఁడు—ఎఱుఁగబట్టియే నాకొంప నిట్లు ముంచినాఁడు—

మంత్రి—ఉస్స నీవు నడుమ మాటాడరాదు.

పుష్ప—గొప్ప స్థితిగల వర్తకుని కుమారునకుఁ బిల్లనిత్తునని యొప్పుకొని వారు తరలివచ్చులోపల నీకూఁతును మఱియొకని కిచ్చి వివాహము చేయుటయేకాక నీయల్లునిచే వారి బలగమునంతయుఁ జావమోదించితివఁట. కొందరు చచ్చిరఁట. కొందఱు కాలుసేతులు విరిగి బాధపడుచున్నారఁట. నిజమేనా? ఈదేశమునం దిట్టి యాచారము లున్నవియా యేమి? హత్యలనిన సామాన్యదోషము లనుకొంటివా?

మణి—మహాప్రభూ! మాకథ యంతయు మీరు సాంతముగా వినినగాని నిజము బయలు పడదు. చెప్పుటకు సెలవైనచోఁ దెలిపెద.

పుష్ప—ఊఁ. చెప్పుమనియేకదా నేనడుగుచుంటిని?

మణిమంతుఁడు చేతులు జోడించి మహారాజా! నేనుమిక్కిలి భాగ్యవంతుఁడ నయ్యు సంతానము బొడమక కొంతకాలము పరితపిం

చితిని. చివరకుఁ గన్యకాపరమేశ్వరీ కృపావిశేషమున నొక్కయాఁడు పిల్ల కలిగినది. దానినేపుత్రుఁగా భావించి యపురూపపు గారాముతోఁ బెనుచుచుంటిమి. జాతకర్మకు నేబదివేలు వ్యయపెట్టితిని. నూఱ్వురఁ బాలదాదులను రెండువందలమంది యాడించు పిల్లదాదులను నూఱ్వుర రక్షకుల నియమించి పెంచుచుంటిమి. డోలికోత్సవము, అన్నప్రాశనోత్సవము, దంతాగమనోత్సవము, విద్యాభ్యాసోత్సవము, ఒకటననేల ఏదియో పేరుపెట్టి దినమున కొక యుత్సవము చేయుచుండెడివారము.

ఈచిన్నకార్యములకే యీవర్తకుఁ డింత వ్యయపెట్టుచున్నాఁడు. కూఁతురి పెండ్లి కెంత వ్యయము చేయునో యని యనుకొనుచుఁ గొందరు నన్నామాట యడిగిరి. అప్పటి యుత్సవము మీరే చూతురుగాక. ఇదివఱకు భూమండలములో నిట్టియుత్సవ మెక్కడను జరుగలేదని జనులు స్తోత్రములు చేయునట్లు కావింతునని చెప్పుచుందును.

పిల్ల కైదేండ్లు దాటినది మొదలు పెండ్లి ప్రయత్నము చేయుఁడని నాభార్య నన్ను నిర్బంధించుచుండెను. మఱిరెండు సంవత్సరములు నేను మనసులో నాలోచించుచు, బిమ్మట దేశములవెంబడిఁద్రిప్ప మొదలిడితిని. నాలుగేండ్లు దేశములు త్రిప్పుటతోడనే గతించినది. మాకు సరిపడిన సంబంధ మెక్కడను దొరకలేదు. ఒక్కమాట చెప్ప మఱచితిని మావైశ్యులలోఁ గన్యకాపరమేశ్వరీ శాపంబునఁ జక్కని కన్యకలుండరు. నాముద్దులపట్టి నాయమ్మవారు ప్రసాదించినది కాబట్టి బహుసౌందర్యశాలినియై యొప్పుచున్నది. దాని కూర్మిళయని పేరు పెట్టితిని. దానిచక్కఁదనమునకు సరిపడినవరుఁ డెందును దొరకలేదని పరితపించుచు శుకద్వీపమున నీరత్నపాదుని కుమారుఁడున్నాఁడని విని నలువురుబ్రాహ్మణుల ననిపితిని. వారు వీని స్థితిగతులు వరుని విద్యాశీలములు విమర్శించివచ్చి యన్నిటికిని నీకుఁదగిన సంబంధమని చెప్పిరి.

అదిమొదలు నేను నాపరిజనులు వీరింటిచుట్టు నాలుమాస ములు దిరిగితిమి. మాకు రాకపోకలకుఁ బదివేలు వ్యయమైనది. ఎట్ట కేల కీమహానుభావుఁ డనుమతించెను. అతడు కోరినంతసొమ్మిత్తు నన్నప్పు డనుమతి కాకయేమి? దేశదేశములనుండి సిద్ధాంతుల రప్పించి యాలుమాసములు వ్యవధియుండఁగా సుముహూర్తము నిశ్చయించితి అట్టిముహూర్తము మఱియొకటి లేదని యేకగ్రీవముగా సిద్ధాంతులం దరు నొప్పుకొనిరి. ఆపైన మూఢమి వచ్చునఁట. అటుపైని నధిక మాసమట. ఆపైన క్షయవత్సరమట. ఆసుమూర్తము దాటినచో మూడేండ్లవఱకు మఱియొకసుముహూర్తము లేదని సిద్ధాంతులు చెప్పి యున్నారు. అదే స్థిరపరచి పనులు ప్రారంభించితిమి. మహారాజా! నూఱ్వురుచిత్రకారు లాలుమాసములు కేవలము పందిళ్లపని చేసిరి. నవరత్నములు నద్దినట్లుగా బందిళ్లపైఁ జిత్రించిరి. వివాహమంటపము మీఁది పందిరికి నిరువదివేలు వ్యయమైనవి. ఆపందిళ్ల వైభ వము చూచితీరవలయును. ఇప్పటికి నట్లేయుండును కాని యీమహాను భావుఁడు దుడ్డుకఱ్ఱలవాండ్రతో వచ్చి యాపందిళ్లన్నియుఁ బాడు చేయించెను. పేరుపొందిన నూఱుభోగముమేళముల నూఱ్వుర వైణి కుల నూఱ్వుర గాయకుల నాటకుల భాగవతులఁ బెక్కండ్ర నెక్కడ నేవిద్యలోఁ బేరుపొందినవిద్వాంసుఁ డున్నాడని వినిన నక్కడనుంచి యట్టివాని నాపెండ్లికిఁ దగినవెలయిచ్చి రప్పించితిని. ఆపెండ్లిదినము లలో మాయిల్లు మహేంద్రవైభవముతో నొప్పుచుండునవి. సుము హూర్తమునకు మూడుదినములకు ముందరనే వారందఱువచ్చి చేరిరి. నెలదినములు వ్యవధియుండఁగనే బంధువులువచ్చి చేరిరి. అప్పుడే యుత్సవములు ప్రారంభించిరి. సుముహూర్తము సమీపించినకొలఁది మాకు సంతోషావేశ మెక్కువయగుచుండెను. సుముహూర్తము

నాఁటి యుదయమునకు మాగృహములన్నియు బంధుజనముతో నిండి పోయినవి.

పదివేలమందిజనులు నివసించుటకుఁ దగినట్లు పెండ్లివారికి విడిది నేరుపరచితిని. దారిలో స్నానకక్రతము జేసికొని సుముహూర్తమునాఁటి యుదయముననే వత్తుమని యాతఁడు మాకు జాబువ్రాసెం గావున వారికొఱకు నిరీక్షించుచుంటిమి సూర్యోదయమైనది. యెంతయో వైభవముతోఁ బెండ్లివారి కెదురేఁగవలయునని యందర నాయత్త పరచియుంచితిని. వీరిజాడ యేమియుఁ గనంబడలేదు. జాముప్రొద్దెక్కినది. రెండుజాములైనది. రాలేదు. గుఱ్ఱములెక్కించి రౌతులఁ బరుగెత్తించితిని. పెద్దదూరము పోయి వచ్చి యెవ్వరు గనంబడలేదని చెప్పిరి. ముహూర్తము రాత్రిగదా దారిలో భోజనముచేసి లగ్నము వేళకు వత్తురని తలంచి మాసన్నాహములో మేముంటిమి.

అంతలో సూర్యుఁ డస్తమించెను. అప్పటికిని రాలేదు. పందిళ్లన్నియుఁ బ్రేక్షకులతో నిండిపోయెను. వింతవింతలుగా దీపమాలికలు వెలిగింపఁబడినవి. పెక్కుచోట్ల వారాంగనలు నృత్యములు సేయుచుండిరి. వైణికులు పాడుచుండిరిఁ నాటకు లాడుచుండిరి. హాస్యములు చెప్పుచుండిరి భూమండలములోఁ దూర్యనాదము లెన్నిభేదములు గలిగియున్నవో వానినన్నియుం దెప్పించితిని కావున నానినదములన్నియు శ్రోత్రపర్వముగా మ్రోగుచుండెను. దిగ్దంతులవంటి చతుశ్శాస్త్రపండితులు కవీశ్వరులు సిద్ధాంతులు నవధానులు వేనవేలు బ్రాహ్మణులు నానాదేశములనుండి వచ్చి వివాహమంటప మలంకరించి శాస్త్రవాదములు చేయుచుండిరి. పెండ్లికొడుకుజాడమాత్రము లేదు.

అప్పుడు నేను మిక్కిలి పరితపించుచు నేమియుందోచక వారు వచ్చుదారిలోఁ బోయి నిలువంబడితిని. పురోహితుఁడు వచ్చి మణిమంతా! ఇఁక రెండుగడియలలోఁ బీటలపైఁ గూర్చుండవలసియున్నది.

ఇప్పటికిఁ బెండ్లివారే రాలేదే? ఏమిచేయుదము? అని యడిగిన నే నేమియు సమాధానముచెప్పక యూరక యాదెస జూచుచుంటిని.

ఇంతలో నిరువురు గుఱ్ఱపురౌతులు వడిగా వచ్చుచు నొకచో గుఱ్ఱములనాపి పెండ్లివారిల్లెక్కడనని యడుగుచున్న మాటలు వినంబడినవి. ఇటురండు. ఇటురండు. అని వారిని కేకలువేయించితిని. వారు నేనున్నకడకు వచ్చి యాతఁడే కన్యాదాతయని యెవ్వరో చెప్పఁగా గుఱ్ఱములు దిగి వాండ్రు నాకు నమస్కరించిరి.

అప్పుడు నేను కోపముతో నోహో! మీయజమానుఁ డెంత మోసకాఁడు! సుముహూర్తమున కొకదివస మెడముండగా రమ్మని చెప్పితినే. ఇప్పటికి రాలేదు ఏమి చేయవలయును? ఎంత దూరములో నున్నారు అని యడిగిన వాండ్రు మోమున విన్నఁదనము దోపనేదియో యుత్తరము తత్తరముతో నాకిచ్చిరి. దాని విప్పి చదువ నిట్లున్నది.

రత్నపాదుఁడు నియమితదివసమునాఁడే పదివేలజనముతో నిల్లు బయలుదేరి యోడలెక్కి సముద్రము దాటుచుండ గాలితోపున నొక లోకకొండకుఁ దగిలికొని వికలములై సముద్రములో మునిఁగినట్లు మాకు వార్తలు వచ్చినవి. వారిరక్షణకొఱకు కొన్ని యోడల మేమందుఁ బంపితిమి. వారిక్షేమసమాచారము మాకిప్పటి కేమియుం దెలియలేదు. కావున వారివృత్తాంతము తెలియువఱకు ప్రస్తుత మీసుముహూర్త మాపవలెనని కోరుచున్నాము. మేము రత్నపాదున కత్యంతబంధువులమగుట మీరు దొట్రుపడుచుందురని యీవార్త మీకుఁ దెలియఁజేసితిమి.

ఆపత్రికం జదివితిని. నా నాడులన్నియుం గుంకినవి. నేలం జదికిలఁబడితిని. అప్పుడు నా చిత్త మెట్లుండునో విచారింపుఁడు. అర నిమిషము నాకు మేను దెలిసినదికాదు. ఏమిచేయుటకుం దోచక

నేలం బండుకొంటిని. అంతలో నాకు భగవంతుఁడొకయూహ తోపించెను. గడియ యాలోచించి యది మంచిదని నిశ్చయించు కొని యట్లె లేచితిని. అప్పుడే యావార్త నలుమూలలు వ్యాపించు టచే దూర్యారవములు ప్రయోగించుట మానివేసిరి. నేను వాని నాప వలదని తెలియఁజేసి యాయుత్సవములోఁ బెండ్లిపందిరిలోనున్న ప్రేక్షకులనెల్ల నుపలక్షించుచు నాలుగుతేప లిటునటు తిరిగితిని.

నాపుణ్యవశంబున నొకచోట మేజువాణిఁజూచుచున్న యొక చిన్నవాఁడు నాకుఁ గన్నులపండువు గావించెను. విశాలములగు నేత్ర ములు చంద్రబింబమువంటి మొగము. ఆజానుబాహువులు. పెద్ద యురముగలిగి తేజస్స్ఫూర్తితో నొప్పు నాపురుషుని చేయిపట్టుకొని రమ్మని చీరుచు అబ్బాయీ! నీ వేకులమువాఁడవని యడిగితిని. అతఁడు ద్విజకులుండనని యుత్తరముచెప్పెను. ఇఁక మతేమియు నడు గక సంతోషముతో నతని లోపలికిఁ దీసికొనిపోయి నీకు నాకూఁతు నిచ్చి వివాహముగావించెద నంగీకరింతువేయని యడిగితిని. అతఁడు చిఱునగవుతో నంగీకరింప కేమి? అని యుత్తరమిచ్చెను.

అప్పుడు నేను వీఁడే నాయల్లుఁడని యందరకుఁ దెలుపుచు దీసి కొనిపోయి నాభార్య కత్తెరంగెఱిఁగించితిని. తద్రూపాతిశయమునకు మెచ్చుకొనుచు నాభార్య నే నీమాట మొదటనే చెప్పితిని. ఎక్కడో సముద్రమధ్యములోనున్న దీవిలోఁ గాపురముసేయు కోటీశ్వరుని కుమారుఁడఁట ఎన్నఁడు చూడని సంబంధము తెచ్చిపెట్టితిరి. దైవ ము మనకిప్పు డనుకూలుఁడే! మొదటనే యోడ మునిఁగినది. పెండ్లి చేసిన తరువాత మునిఁగిన నేమిజేయుదుము! తప్పక వీనికే పెండ్లి చేయుమని బోధించినది. బంధువులందరు సమ్మతించిరి. బ్రాహ్మణు లుత్తమలక్షణుఁడని మెచ్చుకొనిరి. ప్రేక్షకు లుత్సాహపడిరి.

పురోహితుఁడు తొందరపెట్టగాఁ బుణ్యస్త్రీ లప్పుడే వాని

మంగళస్నానములు చేయించి పట్టుపుట్టంబులు గట్టనిచ్చి మాల్యాను లేపనాద్యలంకారములచేఁ గైసేసి వివాహవేదికపైఁ గూర్చుండబెట్టిరి. మహావైభవముతో నే ననుకొన్నమహూర్తమునకే నాకూఁతు నాపిల్ల వానికిచ్చి కన్యాదానమహోత్సవము జరిగించితిని. వధూవరు లొండొరులం జూచికొని యానందించుచు మనంబునంగల ముచ్చ టలు వెలిబుచ్చుచు విచ్చలవిడి తలఁబ్రాలు పోసికొనిరి.

పెక్కుల నూరేగింపులతో భోగముమేళములతో గానసభ లతోఁ గర్ణరసాయనంబులగు తూర్యనాదములతోఁ బెండ్లి యైదుదిన ములు నట మహోత్సవముతో వెళ్ళించితిమి. దీక్షావసానదివసం బున వధూవరులం గలిపి సంవర్తనమహోత్సవము గావించితిమి. మహా రాజా! నేనాయైదుదివసములలో బ్రాహ్మణులకుఁ బీదలకు నితరు లకు బంధువులకు జేసిన దానములు చెప్పుకొనరాదుగాని రెండులక్షల కన్న నెక్కువయైనట్లు లెక్కలవలనఁ దెలియఁబడినది.

అట్లుండ నేడవనాఁడు సాయంకాలమున కీరత్నపాదుఁడు బది వేల పౌజులతోఁ బెక్కండ్రుబంధువులతో వచ్చి మావీధి బాహ్యో ద్యానవనంబున విడిసినట్లు నాకు వర్తమానమువచ్చినది. నేనావార్త విని గుండె ఝల్లుమన నోహో! సముద్రంబున మునింగివా రెట్లు వచ్చిరి? వచ్చిరిపో నేనిప్పుడేమిజేయుదును? పెండ్లి యైనదని తిరుగా వర్తమానము బంపుదునా? అట్లుకాదు ఇంటికివచ్చినవాని గౌరవిం చుట న్యాయము. అని తలంచి తగినపరివారమును వెంటఁబెట్టికొని యీరత్నపాదుఁడు విడిసినచోటికిం బోయి పల్కరించితిని.

అంతకుమున్నె నాకూఁతునకువివాహమైనదని వినియున్నకతం బున నితండు నన్నుఁజూచి మండిపడుచు నోరీ తులువా! నీవుసంపన్న గృహస్థుండవని దూరమైనను నీసంబంధ మంగీకరించితిని. ఎక్కుడు విభవముతోఁ దరలివచ్చుచుంటి. దైవవశంబున సముద్రమధ్యంబున

మాయోడలు కొండకుఁదగిలి చిల్లులుపడినవి. లోపలికి నీరు చొరబడుచుండ నందలిసామగ్రి కొంత జలధిలోఁబడవేసి యెట్లో రంధ్రములు గప్పించి నీరు తోడించి యతిప్రయత్నమున నాలుగుదివసములకుఁ బ్రాణములతో నీవలగట్టునం బడితిమి. అందున్న మాబంధువులు మమ్ము బెద్దగా నాదరించి మావార్త మీకుఁ దెలియఁజేసినట్లుగాఁ జెప్పిరి. ఆమాటపైఁ బెండ్లియాపి మాకొఱకు వేచియుందురని యింతదూరము వచ్చితిమి. మాచావుబ్రదుకులు తెలిసికొనకుండ నీకూఁతు మఱియొకనికిచ్చి పెండ్లిచేయుట నీకు నీతియా? మఱినాలుగు దివసములైనఁ బరీక్షింపఁగూడదా. మేము మీయింటికివచ్చుచుఁజిక్కుపడియుంటిమని వినియు విచారింపక వివాహమహోత్సవము జరిపించితివే! నీవెట్టికృతఘ్నుఁడవు.నీవు మానవజన్మమెత్తలేదా? నీకంటెఁ బశువైన మేలే. ఛీ ఛీ నీమొగము చూడఁగూడదు అని నోటికివచ్చినట్లు ప్రేలుచుండ నే నిట్లంటి.

రత్నపాదా! తొందరపడకుము. నీవు పడరానియాపద పడియుంటివి కావున నీకినుకకుఁ బ్రత్యుత్తరమీయక సైరించితిని. ఈవల యిబ్బందులుగూడఁ బరికించిన నింతగాఁ దూలనాడవు. మీకొతులు చెప్పిన మాటలవలన మీరు బ్రతికివత్తురను నాస లేకపోయినది. మఱియొకసుముహూర్తము మూఁడేండ్లవఱకు లేదని దైవజ్ఞులు సెప్పుచున్నారు. వచ్చినబంధువులు నిలువరు. చేసిన సామగ్రి చెడిపోవును. దైవఘటనము లేదని తలంచి వీథింబోయెడివారి కిచ్చితిమి. నీతో సంబంధము కలియనందులకు మాకుఁ జాలవిచారముగానున్నది. దైవము ప్రతికూలుఁడైన మనమేమిచేయగలము? మీరిచ్చటికి వచ్చినందులకైన వ్యయమంతయు నిచ్చుకొందును. అలుగకుమని బ్రతిమాలినకొలఁది వీని కలుక పెఱుగుచుండెను.

మాధవు లిట్లే తప్పులుసేసి దైవముమీఁదఁ బెట్టుచుందురు.-

పుట్టుముహూర్తము లేకున్నను బెట్టుముహూర్త ముండదా? బ్రాహ్మ ణులకుడబ్బిచ్చినఁ గావలసినన్ని ముహూర్తము లున్నవని చెప్పుదురు. కానిమ్ము. సామగ్రి చెడునని కాదా పెండ్లిచేసితివి. నీసామాగ్రి నీక్రొత్తయల్లుని చుట్టాలతోఁగూడ మట్టుమాపెద నాసామర్థ్యము చూడుము మాకిది చాల లజ్జాకరముగానున్నది. ఇంత ధనముండియు నీచే నవమానింపఁబడితిని. నాకైసవ్యయ మిచ్చుకొందువా! ఇందులకుఁదగిన ప్రాయశ్చిత్తము నీకుఁ జేయనిచో నాకసి తీరదు. నీమర్యాదలుమాకవసరములేదు. పోపొమ్ము. నీయిల్లు కాచికొనుము. నీభాగ్యమంతయుఁ గొల్లగొట్టి మాయింటికిఁ బట్టించుకొనిపోవనిచో నన్నీ పేరఁబిలువవలదు. ఎవ్వరడ్డమువత్తురో చూతముగా. అని మీసములు దువ్వుటయు నేనేమాటయుం బలుకక గిరాలున మరలి యింటికివచ్చి భార్యతో నిట్లంటి.

మన కిప్పుడు గ్రహచారము చాలనట్లున్నది. శుభముచేసికొనినవెంటనే కలహామువచ్చినది. రత్నపాదున కిప్పుడు మనపైఁజాల కోపమువచ్చినది. మనయిల్లంతయుం గొల్లగొట్టి పట్టించుకొనిపోవునఁట. నాలుగువేలమందివీరులు నాఱువేలు నితరులును బదివేలఫౌజుతో వచ్చియున్నాఁడు. వాని నడ్డపెట్టువారెవ్వరు? నేనీవార్త మనరాజ్ఞికిం దెలియఁజేసి సహాయమిమ్మని కోరికొనివచ్చెద నంతదనుక నింటికడ భద్రముగా నుండుఁడు. వెలగల రత్నపునరకులన్నియు దాచివేయుఁడు. అని దైన్యముతోఁ బలుకుచున్నసమయంబున నామాట విని బంధువులందఱు గగ్గోలుపడఁజొచ్చిరి.

అంతలోమాయల్లుఁడావార్తవిని మాకడకువచ్చి మీరేమిటికిట్లు చింతించుచున్నారని యడిగెను. మేమతనికి రత్నపాదుని యెత్తికోలంతయుం దెలిపితిమి. అతండు నవ్వుచు నోహో! యిది స్త్రీరాజ్యమా! బలముగలవాఁడే యధికుఁడు కాఁబోలు కాకున్న ద్వీపాం

తరమునుండివచ్చిన కోమటిశెట్టి పొరుగూరిలో నిట్లు బీరములుగొట్టు నా. కానిందు మీరు వెరవఁబనిలేదు. రాజ్ఞినొద్దకు బోయి చెప్పు కొననవసరము లేదు. అతనికడ నాలుగువేల వీరులున్నారా.

ఉ. నాలుగువేలుగాదు భువనంబులు మూడునుగూడి వచ్చినన్
లీల జయించువాఁడను చెలింపక సంగరసీమ నిల్చి మ
త్కాలకరాళహేతితత ఖడ్గనిశాతవిఘాతపాతన
జ్వాలల పాలుగాఁగ రిపుజాలముల న్మడియింతుఁ జూడుఁడీ.

మామా! మీరందఱు జింతమాని సుఖంబుండుఁడు. రత్నపా దుని భటుల మన పందిరిలోనికి రాకుండ నేను గాపాడెద నని పలికిన నందరము విస్మయము జెందితిమి.

మఱునాఁడు సూర్యోదయము కాకమున్న రత్నపాదునిబలము దుడ్డుకఱ్ఱలుబూని వచ్చుచున్నట్లు వార్తలు వచ్చినవి. అప్పుడు మా యల్లుఁడు చేతఁ గరవాలంబు మెఱయ రయస్తుతంబగు నొక హయ మెక్కి ప్రచండ హేతిభీకరుం డగు చిత్రభానుండో యన నొప్పుచు మాయింటి మొగసాలం గాచికొని యుండెను.

క. మణిమంతుని పని తీరఁగ
నణువైన న్మిగులకుండ నతిశయసంప
న్మణి కనక వస్తువాహన
గణముల వెసఁ గొల్లకొట్టి కైకొందుమిఁకన్.

అని కేకలు వేయుచు దండములు ద్రిప్పుచు మూకమూకలు గా మాయింటికడకు వచ్చుచుఁ బెండ్లి పందిళ్ళన్నియుఁ బాడుపడెనుగా దండములతోఁ బాదుచుండిరి. అప్పుడు మాయల్లుఁడు వాండ్రయల్లరి దిలకించి తనగుఱ్ఱమును మడమలతోఁ గొట్టినంత నది రివ్వున నెగసి శత్రువీరుల కడ కొక్కయడుగులోఁ బోయినది. అతండు గుఱ్ఱపుడెక్క లచే వారిం ద్రొక్కించియుఁ గరవాలంబున నేసియుఁ ద్రోసియుఁ గ్రుచ్చి

యుఁ బొడిచియు మొత్తియని యఱచుచు నాతురతం బాఱుచుండ వెన్నంటి లేళ్ళగమిం దఱుము బెబ్బులియుం బోలె పఱచుచు నాభీల కరవాల ప్రహారముల నాబలమునెల్ల గడియలోఁ బీనుఁగు పెంటలు గావించెను. మహారాజా! మీకడ నసత్యమాడనేల? చేతులు తెగి యఱచువారును పాదంబుల నరకఁబడి యేడ్చువారును ఖండితంబులగు శిరంబులతోఁ బాఱువారునై యతని జనులు పరితపింప నాప్రదేశము జూడ భయంకరముగాఁ దోచినది. హతశేషులుగోడగోడల సందుసందుల డాగికొని ప్రాణములు దక్కించుకొనిరి. అతని పరాక్రమముజూడరుద్రు డోయని మాకే భయమైనది. దేవా! ఇదియే జరిగిన కథ. ఇందు మాతప్పేమి యున్నదియో దేవర విచారింపవలయును. మాయల్లుఁ డడ్డపడనిచో నీతఁడు మాయిల్లు కొల్లగొట్టువాఁడే. అప్పుడు మే మే మగుదుము అని యావృత్తాంత మంతయు మణిమంతుఁ డెఱిఁగించుటయు విని పుష్పకేతుఁ డవ్వీరుని శౌర్యమునకు విస్మయము జెందుచు రత్నపాదునితో నిట్లనియె.

సెట్టీ! నీవియ్యంకుఁడు సెప్పిన కథయంతయు వింటివా? ఇం దేమైన నసత్యముండిన నడుగుము. విమర్శించెదనని పలికిన నతండు ఇం దేమియు నసత్యము లేదు. చెప్పినదంతయు సత్యమే. నిరాయుధు లైన మాభటులం బీనుఁగు పెంటలు గావించెనని యతం డొప్పుకొనుచు నప్పని తప్పుగాదని పలుకునేమి? అంతకన్న నపరాధ మేమి యున్నది? మేముబలవంతమున నతని యింటిపైఁబడి కొల్లగొట్ట దలంచిన దేవరకుఁ జెప్పికొనవలయుంగాని యల్లునిచే హత్యలుగావింపవచ్చునా? ఇంతకన్న నపరాథ మేమున్నది? అని పలికిన విని పుష్పకేతుఁడు నవ్వుచు నిట్లనియె.

సెట్టీ! నీకీమాత్రము బుద్ధియుండిన నీము ప్పేరాకుండెడిదిక దా. ఆతగవు మాయొద్దఁ బెట్టకబలము గలదుగదా యని వాని యింటిమీఁద

బడి కొల్లగొట్టింపఁజూతువా? వాని యల్లుఁడు లేకున్న వానిపని యేమగును? ఇది స్త్రీరాజ్యము గావున మీయాటలు సాగుచున్నవి. నీకు మంచి ప్రాయశ్చిత్తమైనది. సంతసించితినని రత్నపాదుని నిందించుచు నీతప్పంతయు రత్నమకుటది. నగరములో నేమి యల్లరి జరుగుచున్నదియో తెలిసికొనవలదా? యని రత్నమకుట నాక్షేపించుచు రత్నపాదా! నీవు మొదట మణిమంతు నిల్లు గొల్లగొట్ట బలములఁ బంపుట నీదియే తప్పుగాఁ గనంబడుచున్నది. ఇందుల కేమందువని యడిగిన నతం డిట్లనియె.

దేవా! నేను అవమానజనితమగు కోపము పట్టఁజాలక యూరక యట్లు చేయుదునని బెదరించితిని కాని మఱియొకటి కాదు. అంత మాత్రమునకే యట్టిహత్యలు గావింపవలయునా? అయ్యపరాధ పరిశోధనము గావింపరా? అని యడిగిన పుష్పకేతుఁ డిట్లనియె. సెట్టీ! నీ వూరక వియ్యంకుని బెదరించుటకై పదివేల జనముతో నతనియింటిమీఁదఁ బడితివా? ఆపెండ్లి పందిళ్ళన్నియు భగ్నముచేయించితివదియుఁ బరిహాసమే కాఁబోలు? కానిమ్ము. మణిమంతుఁడా! నీయల్లునికిఁగూడ నాజ్ఞాపత్రిక పంపితిమిగదా. అతం డేమిటికి రాలేదు. బలవంతుఁడనని గరువము కాఁబోలు. అతనివలనఁ గొంతసాక్ష్యము దీసికొనవలసి యున్నది. నీవుపోయి యిప్పుడే వెంటఁబెట్టుకొని రమ్ము. పొమ్మని పలికి యతండు వచ్చుదనుక నవ్వల నుండుమని రత్నపాదునితోఁ జెప్పి రెండవ యభియోగంబున వాదియగు వ్యాఘ్రముఖ యన్నగారిం బిలిపించి నీవేమి చెప్పెదవు? ప్రతివాది యేమిటికి రాలేదు? అని యడిగిన వాఁడిట్లనియె.

దేవా! వ్యాఘ్రముఖియను వారకాంత నాయక్కకులవృత్తిచేఁ జాల ధన మార్జించినది. మొన్ననొక విటుఁ డెవ్వఁడోవచ్చి దాని తూఁతుఁ గుందమాలను వశముజేసికొని వ్యాఘ్రముఖిని బలవంతము

గా జంపి నూతిలో బారవేసెను. అడ్డమువచ్చిన మఱికొందఱ దాదు లంగూడ నాక్రోశింపుచుండ నానూతిలోనే పడవేసెను. మామేన కోడలు కుందమాల వానికిc జడిసియో వరించియో యాహత్య యెవ్వరికిం దెలియఁజేయక యాశవములఁజాటుగాc దహింపజేసి వానింబట్టుకొని కులుకుచున్నది. తల్లిచావున కించుకయు విచారములేదు. స్త్రీల చరిత్రలు దేవర యెఱుంగునివికావు. ఆవిటుఁడు సంతతము దానితోc గలసిమెలసి వర్తించుచున్నాడు. వాఁడు చాల పొగరుఁబోతు. నేను మాయక్కచావునకు దుఃఖించుచుc గుందమాలతో నీహత్యాప్రకారము చదురునc జెప్పికొనుమని యెంతబోధించినను వినక చచ్చిన తల్లి తిరుగారాదు. ఈవిటుఁడు మంచివాఁడు వీని జంపించిన లాభమేమని యుపేక్ష జేసినది. దానంజేసి నేనే యీయభియోగము దెచ్చితిని. ప్రతివాది మీయాజ్ఞాపత్రిక జూచియుc బుచ్చికొనియుc దిరస్కారముతో నిందురాలేదు. దేవర వాని రప్పించి యీయభియోగమువిచారింపుఁడని కోరికొనుచున్నాను.

అని యెఱింగించిన వానిమాటలు విని పుష్పకేతుఁడు మంత్రింజూచి యిక్కడిప్రజలు మీయాజ్ఞల మన్నింపరు కాఁబోలు. ప్రతివాది రాకున్న నెట్లు విచారింతుము. తగిన భటులంబంపి వానింబట్టి తెప్పింపుమని యాజ్ఞాపించుటయు నతండప్పుడే యతనిం దీసికొనిరాc బదుగుర రాజభటులం బంపించెను.

ఈలోపల మణిమంతుc డరుదెంచి మహారాజా! నాయల్లుఁడు చాల యలసియున్నాఁడు. రాలేనని తమతో మనవిచేయుమన్నాఁడని యేదియో చెప్పఁబోయిన నలుగుచు డౌను. నేనప్పుడే యనుకొన్నాను. ఇది స్త్రీరాజ్యమనుకొనుచున్నాఁడు కాఁబోలు పురుషరాజ్యమని చెప్పుము. గడియలో రాకున్న వానిం గట్టి తెప్పింతు. క్రమ్మఱఁబోయి చెప్పుమని యతనివెనుక నొక రాజభటునిగూడ నంపించెను. వారిరు

ఘురు వోయివచ్చిరి. మణిమంతుఁడు:— మహారాజా పిల్లవాండ్రమాట లు మీరు పాటింపఁగూడదు. రేపు బతిమాలి తీసికొనివచ్చెద. నేఁటి కూరకుండుఁడని ప్రార్థించెను. నాయాజ్ఞనిని యతం డేమనియెనో చెప్పు మని భటునడిగిన వాఁడిట్లనియె.

దేవా! మేముపోయి దేవరసందేశ మెఱిఁగించితిమి. నే నప రాధివలె నరపతికడకు వచ్చువాఁడను గాను. అతనియాజ్ఞ మన్నింప నాకవసరములేదు. నాబలము దెలిసికొన నభిలాషగలదేని కయ్యమున కాయత్తపడియున్నవాఁడ. పొండు పొండు. నన్ను రప్పించుటకువాని కేమిసామర్థ్యమున్నదని యతఁడు నిర్లక్ష్యముగా నుత్తరముచెప్పెను. దేవా! వాఁడు మీయానతి తృణముకన్నఁ దేలికగాఁ జూచెను. పావ మీవర్తకుఁడు రమ్మని బతిమాలికొనిననువినిపించుకొనలేదని భటుం డెఱింగించిన విని పుష్పకేతుఁడు ధూమకేతుండువలె మండుచు నిట్లనియె.

ఓహో! ఇందలిప్రజలకు నాసామర్థ్యము దెలియలేదు. ఇం కను నాఁడుదియే పాలించుచున్నదని తలంచుచున్నవారు కాఁబోలు. మణిమంతా! నీవింటికిం బోయి నీయల్లునితో నిప్పటిరాజు రత్నపా దుఁడు కాడని చెప్పుము. మేకలవంటి యతనిమూకల నేమో చేసితి నని గరువముఁజెందియున్నవాఁడు కాఁబోలు కాచికొనుమని చెప్పుము వాని పరాక్రమముఁజూడ నాకును వేడుకగానేయున్నది. రేఁపు ప్రాతః కాలమే బద్ధసమయమని తెలియఁజేయుము పొమ్ము. అని వానినంపి పీఠమునుండి లేవఁబోవుసమయమున వ్యాఘ్రముఖు తమ్ముని వెంట నరి గిన భటు లరుదెంచి యిట్లనిరి.

దేవా! మేమా హంతకునికడ కరిగి దేవరయాజ్ఞ యెఱింగించిన నవ్వుచు నతఁ డిట్లాక్షేపించెను.

క. మీరా జాఁడుదియని విని
నారముగద పురుషుఁడయ్యెనా యిపు డక్కా-ర
తారత్నం బట్లైనం
బోరం గనుఁగొందు వాని భుజబలమిఁహిహీ.

అని పలుకుటయు మేమదలించి వానిం బట్టికొనఁ బ్రయత్నిం చితిమి. స్వామీ! వాఁడు మాకు లొంగువాఁడుకాఁడు. చేతనున్న బెత్తముతోనే మమ్ముఁ గాందిశీకులఁ గావించెను. ఆదెబ్బలఁ దిని పారిపోయివచ్చితిమని యెఱిఁగించినఁ బక్కున నవ్వుచు నౌరా! ఈ రాజ్యంబున మంచివీరులున్నారుగద. రాజునానతి నొక్కరుఁడు లెక్క సేయఁడు. ఆఁడురాజ్య మాఁడురాజ్యముగానే యున్నదని రత్నమకుట నాక్షేపించుచు వారిరువురబలము రేపు గనుంగొనియెదఁగాక. తెల్ల వారకమున్న పదుగురసాదుల నిందుండునట్లు నియమింపుము. నాని మిత్త ముత్తమాశ్వ మొకదాని నాయత్తపరచి యుంచుమని మంత్రికి నియమించి పుష్పకేతుఁడు భార్యతోఁగూడ నతఃపురమున కరిగెను.

అని యెఱింగించునప్పటికి వేళ యతిక్రమించినది. పైకథ యవ్వలిమజిలీయం దిట్లు చెప్పందొడంగెను.

## 241 వ మజిలీ.

మణిమతుఁ డల్లునితో నగరిలోజరిగిన కథయంతయుం జెప్పి గడ్డముపట్టికొని బాబూ! నామాట వినుము. బలవద్విరోధమువలదు. రాజు చాలమంచివాఁడు. రత్నపాదునిమాటలు విని యతని నాక్షే పించుచు నీపక్షమే వాదించెను. నీవు తనకడకు వచ్చితివికావను కోప ముతప్ప మఱేమియునులేదు. ఒకసారి పోవుదమురమ్మని బతిమాలిన నవ్వుచు నతండు మామా! నాసామర్థ్యము నీవెఱుంగక వగచుచు న్నావు. అతండు నన్నేమియుఁ జేయఁజాలఁడు. నాకంటె బలవంతు లగు నాసోదరులు నలువు రీయూరనున్నారు. అంతయవసరమువచ్చి

హచో వారిం గలసికొని తోడుచేసికొనియెద. నీవు విచారింపకుమని పలుకుచు నతండు వత్తునన్నవేళకు గుఱ్ఱమెక్కి యావీథిం దిరుగుచుండెను.

మయూరధ్వజుం డెందుండియో యాదారి నరుదెంచుచు గుఱ్ఱముపైనున్న చిత్రభానుని గుఱుతుపట్టి అన్నా! నీవిందున్నావేమి? ఈగుఱ్ఱమెక్కడిది? బసలోని కరిగితివా? సోదరులం గలసికొనుచుంటివా అని యడిగిన విని యబ్బురపాటుతోఁ దమ్ముఁడు మయూరధ్వజుఁడా? బాగుబాగు. తలంచినంతనే కనంబడితివే. నే నొక్కగొడవలోఁ బడిపోయితిని. మన మీపట్టణప్రభువు ఆఁడుదియని యుపేక్షచేసితిమి. మగవాఁడఁట. నాకిప్పు డతనితో విరోధమువచ్చినది. నన్నుఁ బట్టికొనుటకు వచ్చుచున్నాఁడు. వాని ప్రాణమునకు మనమిద్దరము చాలమా? తక్కినసోదరులఁ బిలువనేల. ఆగుఱ్ఱమెక్కి నిలఁబడుమని పలికిన సంతసించుచు మయూరధ్వజుఁడు వేఱొక తురగమెక్కి కత్తిచేతంబూని యిటునటు స్వారిచేయుచుండెను.

అంతలో భేరీధ్వానము దంధణ యంచు మ్రోఁగుచుండెను. పుష్పకేతుఁడు తమ్ముఁడు పింగళునితోఁగూడఁ దురగారూఢుండై వీరయోధులు పెక్కండ్రు యోధనసాధనంబులఁ బూని చుట్టునుఁ బరివేష్టించి రాఁ దురగఖురపుటీపాటితంబగు భూరజం బాకసంబుగప్పి చీఁకటి గలుగఁజేయఁ బటురయంబున మణిమంతుని గృహంబు నికటంబున కరిగెను.

మయూరధ్వజుండు చిత్రభానుండునువారిరాకఁ దెలిసికొని తమ ఘోటకముల విచిత్రగతుల నడిపించుచు వారి కభిముఖముగా నిలువంబడి చూచుచుండిరి. అప్పుడు పింగళుం డన్నల గుఱుతుపట్టి యోహో! ఆవీరులు మనసోదరులు. చిత్రభానుండును, మయూరధ్వజుండును, అన్నా! చూడుమనిపలికిన నతం డౌను వారలే. తెలిసినది.

మణిమంతుని యల్లుఁడు మనవాఁడేకాఁబోలు. కానిచో నితరున కాబింక మెట్లువచ్చెడిని. నేఁడు మంచిసుదినమే యని సంతసించుచు దమవాజువముల వారిచేరువకుఁ బోనిచ్చిరి. వారు వీరిం గుఱుతుపట్ట లేకపోయిరి. ఎఱింగియే పింగళుఁడు—

క. నిలు నిలుఁ డేయకుఁ డేయకు
డలఘువ్రతులార యుష్మదభిదానములం
దెలుపుఁడు పదఁపడి మనమన
బలములు దెలియంగవచ్చు భండనవేళన్.

అని యడిగిన విని చిత్రభానుండు

గీ. పుడమిఁ దాళధ్వజనృపాల పుత్రకులము
శూరమణి పుష్పకేతుని సోదరులము
క్షత్రియాన్వయభవుల మాక్రాంతసంగ
రోత్సవప్రీతులము విజయోత్సుకులము.

అని చెప్పినంత వారిరువురు గుభాలున గుఱ్ఱముల డిగ్గనుఱికి తమ్ములారా! రండు రండు మేము మీసోదరులము. తెలియక యొం డొరులము కలహింపదొరకొంటిమని పలుకుచుండఁగనే వారును వారు వముల దిగి వారిం గౌఁగిలించుకొనిరి. అప్పుడు పింగళుఁడు వారితో దైవసంకల్పము కడువిచిత్రమైనది. పదిదినములలో నెన్నిమార్పులు కలిగినవి! పెద్దన్న యీవీటికి రాజయ్యెను. చిత్రభానుఁడు కోటీశ్వ రుని పట్టెం జేపట్టెను. మయూరధ్వజుఁ డేమిచేసెనో తెలిసికొనవలసి యున్నది. సౌమ్యుఁడు ఇంటికడ మనజాడ నరయుచు నుండెనేమో? మనమీనగరము చేరినవేళ మంచిదే యని సంభాషించుకొనుచున్న సమయంబున సౌమ్యుండు గుఱ్ఱమెక్కి కొందఱుయోధులం దఱుముకొని యచ్చటికి వచ్చెను.

వానింజూచి అదిగో మనసౌమ్యుఁడని పింగళుఁడు కేక పెట్టెను. ఆకేకవినిసౌమ్యుఁడు వారి నికటమున కరుదెంచి యోహో! మాసోదరులందఱు నిచ్చటనే యున్నారే నా రాక శుభోదర్కమైనదే యని పలుకుచుండఁ బుష్పకేతుఁడు సౌమ్యా! నీవీగుఱ్ఱపురౌతులఁ దఱుముకొని వచ్చితివేల? వాండ్రు నిన్నేమిగావించిరి? అని యడిగిన నతం డిట్లనియె.

అన్నా! మన మిన్నగరాధిపతి నాఁడుది యనుకొనలేదా మగవాఁడఁట. నే నేదియో యపరాధముచేసితినని నన్నుఁ గట్టి తీసికొనిరమ్మని యీయోధుల నంపెను. అందులకై వారిం దఱిమితినని చెప్పగా నవ్వుచుఁ బింగళునితో నేననినట్లయ్యెనది చూచితివా కానిచో నొరులకు రాజుపైఁ దిరగఁబడుసామర్థ్యముండునా? సౌమ్యా! నేనే నీకావార్త నంపితిని. నేనే యీనగరమునకు రాజైతిని. అంతయుఁ నానకజెప్పెదంగాక యిప్పుడు కోటలోనికిఁ బోవుదము రండు అని పలుకుచు మణిమంతుని రప్పించి వర్తకుఁడా! నీయదృష్టము మంచిది. యదృచ్ఛగా నీబిడ్డకుఁ జక్రవర్తి కొడుకు మగఁడయ్యెను నీయల్లుఁడు మాతమ్ముఁడే యని యాకథయంతయుం జెప్పి వారి నందఱ వెంటఁబెట్టికొని దివాణములోనికిం బోయెను.

పుష్పకేతుం డంతఃపురమున నొకసభ జేసి తనభార్య రత్నమకుటను రప్పించి తమ్ములంజూపుచు జరగిన వృత్తాంతమంతయు నెఱింగించెను. లోకాతీతప్రతాపసంధుతులగు మీకుఁగాక యొరుల కిట్టిపౌరుషము గలిగియుండునా అని పరిహాసమాడినది. తరువాత నొండొరుల చరిత్రము లిట్లు చెప్పుకొనిరి.

## కుందమాలకథ.

అందు సౌమ్యుఁ డిట్లనియె. సోదరులారా! నాఁడు నేనును బింగళుండును నీవీఁటివేశవాటికంగల విశేషములఁ దెలిసికొనఁదలంచి

కొంతదూరము కలిసిపోయితిమి. ఒకవీథిలో నే నతనివిడిచి పైకిఁ బోయితిని. ఒకచోట నడివీథిలోఁ గూర్చుండి కొందఱు గోవాళ్ళు విలాసముగా మాట్లాడికొనుచుండ నందొకచోఁ గూర్చుండి యాల కించితిని.

ఒకఁడు—కుందమాలతల్లి వ్యాఘ్రముఖిమాట యముండు మఱచిపోయెనేమో ఎంత కాలమునకు దానికిఁ జావురాదేమి?

మఱియొకఁడు—కుందమాల యౌవనము లావణ్యము సౌంద ర్యము త్రిభువనాభిరామంబై యొప్పుచున్నది. అయిననేమి నీవనిన ట్లుమాతృపిశాచావేష్టితయగుట నది యెవ్వరికి నుపయోగపడకున్నది.

ఇంకొకఁడు—వ్యాఘ్రిముఖి కుందమాలకుఁ గన్యాత్వహాని కాకుండ విటుల వంచించుచు ధనమార్జించుచున్నదఁట యెట్లు?

ఒకఁడు—ఆరహస్యమే యెవ్వరికిం దెలియదు. దానిలోపలికిఁ బోయినవాఁడు తిరుగావచ్చి యిట్లైనదని చెప్పినవాఁ డొక్కరుఁడును గనంబడలేదు. నే ననేకదినములనుండి చూచుచున్నాను.

మఱియొకఁడు—గ్రామస్థుల నెవ్వరిని గదిలోనికి రానీయదఁట వింటిరా? పొరుగూరివాండ్రుగాని దానికపటములోఁ జిక్కికొనరు.

ఒకఁడు—ఎట్లైననేమికుందమాలచక్కఁదనము చూచితీఱవల యు. మొన్న గరుడోత్సవములోఁజూచితిని. అబ్బా! దానియందము, బింకము, పొంకము, సౌరు, టక్కు మన నగరములోనున్న వారకాం తల కెవ్వరికిని లేదు.

మఱియొకఁడు—అది మనఁబోఁటులకు లభ్యముకాదు. అంద రానిపండ్ల కాశపడనేల? నాతోరండు మఱియొకవింతఁ జూపెదనని చెప్పగా వానివెంట నందఱు లేచి యెందేనింబోయిరి.

నేను వారి సంభాషణములన్నియు వింటిని. కుందమాల మిగు లఁ జక్కనిదని తోఁచి దానిం జూడవలయునని యభిలాషగలిగిన ది.

దానిమేడ యాప్రాంతమందే యుండుటచేఁ దెలిసికొని పోయి యా యింటి వీధియరగుపైఁ గూర్చుంటిని. అంతలో సాయంకాలమైనది. వాడుకపరికారము దాదియొకతె తలుపులు తెరచికొనివచ్చి దీపము వెలిగించి నన్నుఁజూచి అయ్యా! తమరెవ్వరు? ఏమిటికై యిందుఁ గూరుచుంటిరని యడిగినది.

కుందమాలవాడుక విని యాచేడియం జూడవచ్చితిని. మాది విదేశము నాయాశయ మా కుశేశయవదన కెఱింగింతువేయని కోరితిని. అది నామాటలువిని కన్నులు చిట్లించుచుఁ గుందమాలకుఁ గాదు. ఆమెతల్లికిం జెప్పి తీసికొనిపోయెద నిందు నిలుండని పలికి యాదాది లోపలికిఁ బోయి గడియలోవచ్చి ముచ్చటమాటలాడుచు నన్నా సదనాంతరమునకుఁ దీసికొనిపోయి యొకపీఠంబునంగూర్చుండఁ బెట్టినది. నేనందలి వింతలు చూచుచుండ నింతలోఁ గుందమాల తల్లి వ్యాఘ్రముఖి వచ్చి నాకు నమస్కరించుచు,

వ్యాఘ్రముఖి—ఓహో! మీరు మహారాజుబిడ్డలువలె నుంటిరి. మేమెంతధన్యులము. మాకుందమాల నోము లిప్పటికి ఫలించినవి. మీనివాసదేశ మేదియో చెప్పెదరా?

నేను—అబ్బో! మాది చాలదూరదేశము. నేనొక రాజకుమారుఁడనే.

వ్యా—ఆమాట మీరుచెప్పకయే మీమొగమే చెప్పుచున్నది. సామాన్యుల కీసౌందర్యాతిశయముండునా. బాబూ మీపేరేమి?

నేను—సౌమ్యుఁడందురు.

వ్యా—ఇఁక నేమి! మీసౌశీల్యము నామమే చెప్పుచున్నది.

నేను—ఏదీ. మీకుందమాల యిటురమ్మను. మిక్కిలి చక్కనిదని వింటిని?

వ్యా—అలంకరించుకొని రాఁగలదు. ఇదిగో దాని చిత్రఫల

కము. బాబూ! నేననవలసినమాట కాదుకాని మాకుందమాలను బోలిన మెలనాగ యీభూమండలమందే కాదు స్వర్గమందుఁగూడ లేదని చెప్పఁగలను.

నేను—అట్లైన నేను ధన్యుఁడనే కదా.

వ్యా—చక్రవర్తులు వచ్చి యూళ్లిత్తుమనియు దేశములిత్తుమనియుఁ గన్నెఱికము సేయుటకుఁ గోరిరి. నేనును నాకూఁతురుగూడ నంగీకరించితిమికాము. తగినవాఁడు దొరకవలయు నభిలాష తీరవలయు. ఊళ్ళును దేశములు నేమిచేసికొనఁగలము.

నేను—నీవుమంచిగట్టిదానవఁట. నీమాట వీథిలోఁజెప్పికొనిరి.

వ్యా—ఇప్పటివాండ్రకు మాపాటి సామర్థ్యములేదు. ఇంతకు దాని కళ్లముందర దాటవలయుఁ గదా.

నేను—నే దాటించెద వెరవకుము. ప్రొద్దుపోయినది. కుందమాలను రప్పింపుము.

వ్యా—అమ్మాయికిఁ గల నగలన్నియు రత్నములు చెక్కినవియే. యలంకరించుకొని యిప్పుడే రాఁగలదు. అంత దనుక మీరాహంసతూలికాతల్పంబునఁ బండుకొనియుండుఁడు. నేను బోయి వేగ నని పెదనని చెప్పి యది యవ్వలకుఁ బోయినది. అప్పుడు నేను మెల్లగ లేచి యామంచము దాపునకుఁ బోయి సంశయముతో

"శ్లో॥ శయనేహస్త తాడనం" యందుకొనునప్పుడు చేతితో శయ్యంగొట్టి దులిపి పిమ్మట శయనింపవలయునని చిన్నప్పుడు చదివికొన్నమాట జ్ఞప్తికివచ్చుటచేఁ గుడిచేతితో నట్లు కొట్టితిని. అది యమరించిన యంత్రము గడియసడలి తటాలున నాశయ్య యగాధముగానున్న నూఁతిలోఁ బడినది.

నేనాయుపద్రవముఁ జూచి ఔరా! యీరండ యెంతమోసము చేయుచున్నది? ఈకపట మెవ్వరును దెలిసికొనలేకపోయిరే. ఎంత

మంది నిట్లు చంపినదో. దీనిమేను తునుకలుగాఁగోసి పారవేసినను దోసములేదు. అని యాలోచించుచు దాని తరువాయి చర్యలు పరీక్షించు తలంపుతో నం దొక తలుపుమూల డాగి చూచుచుంటిని. పఱుపు జారిపడుటకు గురుతుగానుంచిన గంటచప్పుడు విని దాదియు నదియు నచ్చటికివచ్చి శయ్యజారుట తెలిసికొని యిట్లు సంభాషించిరి.

వ్యాఘ్రి—ఒసేవు! అబ్బాయిగారి పని అయినది. నూఁతిలోఁ బోయి శయినించినారు. అమ్మాయి పీనిమాటలు విన్నదా? లేదా?

దాది—అమ్మాయిగారు మీరాయనతో మాట్లాడుచుండగాఁ వచ్చి చూచిపోయినది. వాని సౌందర్యము చూచి వలచినది. తన కతనినే పెండ్లిచేయుమని మీతోఁ జెప్పుమన్నది. ఇంతలో మీరీపని కావించితిరి.

వ్యాఘ్రి—రండవు నీవు వానియందము దానికడఁ బొగడితివి కాఁబోలు లేకున్న నది యేమిటికి వచ్చి చూచును?

దాది—అవును. ఆమాట వాస్తవమే. మీకుఁ జెప్పలేము గాని ఆయన మంచి చక్కనివాఁడు. అట్టి యందగాని నింతకు ముందు నేను జూచియుండలేదు. మనకుందమాలకుం గూర్పవలసినది.

వ్యాఘ్రి—ఓసి రండా! మంచియాలోచనయే చెప్పుచున్నావు. అమ్మాయిగారు అప్పుడే మగనిఁ బెట్టుకొని కులుకవలయునని చూచుచున్నది కాఁబోలు. ఇంకను బదారేండ్లు నిండలేదు. అప్పుడే విటులు నలుగురు త్రొక్కి విడిచినచో దమ్మిడీ చేయదు. ఆకుట్లబొంత నెవ్వఁడు వలచును? ఈబెట్టుమీఁదనే విత్తము సంపాదింపవలయును. దాని లావణ్యము తెలిసియేకదా గొప్పగొప్ప విటులు వచ్చుచున్నారు.

దాది—అమ్మా! ఎల్లకాలము సంపాదనయే? ఉన్న సొమ్ము చాలదా. పెక్కేల. మీరు చేయుచున్న ద్రోహకృత్యము లమ్మాయిగారి కిష్టములేదు. మీతో బలుమాఱు చెప్పుమన్నది.

షాసల్లాపములఁ జొక్కి తిగిరి బసలోనికిం బోలేక పోయితినని సౌమ్యుఁడు తనకథ నెఱింగించెను.

అని చెప్పువఱకు వేళయతిక్రమించినది. మణిసిద్ధుం డవ్వలి కథ పై మజిలీయందిట్లు చెప్ప మొదలుపెట్టెను.

242వ మజిలీ.

## మయూరధ్వజునికథ.

పిమ్మట మయూరధ్వజుండు తనకథ నిట్లు చెప్పఁదొడంగెను. సోదరులారా! మిమ్ము నేవిడిచి దక్షిణవీథింబడి పెద్దదూరము పోయితిని. ఆనగరము తుది చూచితీరవలయునని నాకు బుద్ధిపుట్టి వేగముగా నడువఁదొడంగితిని. ఎంతసేపు నడిచినను దుది కనంబడదు. ఇంక చాలదూరమున్నట్లు చెప్పిరి. అంతలో సాయంకాలమైనది. దీపము లెల్లెడల వెలిగించిరి. అప్పుడు నాకొకవీథి కన్నులపండువు గావించినది. నేనా వీథిని గొంతదూరము పోయితిని. ఒకవీథి యరగుపైఁ గూరుచుండి కొందఱు కథలుచెప్పుకొనుచుండిరి. నేనుగూడ నందొకచోఁ గూర్చుండి యాకథల వాలించితిని. కథకుఁ డిట్లు చెప్పదొడంగెను.

## గోపాలుని కథ.

ఉజ్జయినీపురంబున మహాసేనుఁడను రాజు రాజ్యము సేయుచుండెను. అతనికిఁ బదాఱువేల భార్యలు గలిగియున్నను సంతానాభివృద్ధి లేకపోయినది. ఎప్పటికో గోపాలకుఁడు, పాలకుఁడు అను పేరులుగల యిరువురు పుత్రులుదయించిరి. అతనిమంత్రి భరతరోహకుఁడనువాఁడు. నీతిశాస్త్రపారంగతుఁడు. అయ్యమాత్యునికిఁగూడ రోహంతకుఁడు, సురోహకుఁడు, అను పుత్రులిద్దఱు పెద్దకాలమునకు

జనియించిరి. వారిరువురు రాజపుత్రులకు సమానప్రాయులగుట నలువురం గలిపి విద్యాభ్యాసము జేయించుచుండిరి.

కొలదికాలములో నలువురు సమస్తవిద్యలం జదివి మహాపండితులని ప్రఖ్యాతి వడసిరి. కొంతకాలమునకు మహాసేనుఁడు లోకాంతరగతుం డగుటయు మంత్రు లతని పెద్దకుమారుఁడు గోపాలునికిం బట్టము గట్టిరి. అతని తమ్ముఁడు పాలకుఁడు యువరాజయ్యెను. మంత్రిపుత్రు లిరువురు మంత్రులై సమస్తకార్యములు న్యాయముగా జరుపుచు రాజ్యతంత్రము లనుకూలముగా నెఱవేర్చుచుండిరి.

ఒకనాఁడు గోపాలుండు విజయదశమి పండుగకు పట్టపేనుఁగనెక్కి తూర్యఘోషములు భూనభోంతరాళములు నిండ మహావైభవముతో నూరేగుచుండెను. అప్పుడు పౌరులు మేడలెక్కియు గోడలెక్కియు నాయుత్సవమును రాజును జూడఁ దొడంగిరి. ఒకానొకబ్రాహ్మణ వీథిం బోవుచుండ నొక బ్రాహ్మణ కన్యక మదురుగోడయెక్కి రాజపుత్రుం జూచుచుండ నతని యేనుఁగ తొండముతో నాకన్యకం బట్టుకొనఁబోయిన నాయబల యడలుచు నేలంబడినది. అప్పుడు గోపాలుఁడు వెఱచుచు మదకరి నాపి యాపిల్లను మెల్లగా లేవదీయించి అయ్యో! పాపము! నీకు దెబ్బ తగిలినదికాఁబోలు. ఉపచారములు సేయింతు నూరడిల్లుమని పలికిన నాకలికి యతనిం జరచురం జూచుచు రాజపుత్రా! నీవు చంపఁదగని తండ్రినే చంపించి రాజ్యంబు గొంటివి. వేదాధ్యయనసంపన్నులగు బ్రాహ్మణులం జంపువానికి మృగములం జంపుట లక్ష్యమా? నీయేనుఁగు నన్నిట్లు బాధించుటలో నాశ్చర్యము లేదని యాక్షేపించుచు నాకన్యక లోపలికిం బోయినది.

చండాలుండైన విన నసహ్యించుకొనఁదగిన యాకన్యకా వాక్యములువిని రాజపుత్రుఁడు చిన్నవోయి అయ్యో! నన్నీచిన్నది యిట్లు నిందించినదేమి? నేను మాతండ్రి నెట్లుచంపితిని? లోకాపవాద మూరక

రానేరము. అని చింతించుచు నుత్సాహముడిగి యా యూరేగింపు మానిపించి యింటికిఁబోయి లోకాపవాదమునకు వెఱచుచు నాఁటి రాత్రి నల్లని కంబళి గప్పుకొని ఖడ్గముచేతఁబూని ప్రచ్ఛన్నముగా గ్రామసంచారము గావించెను. అందొక పాడుదేవాలయమున నభిసారికతోఁ గాముకుఁడు మాట్లాడుచున్న మాట లిట్లు వినంబడినవి.

కాము—ఓసీ! నీనిమిత్తమై యెంతసేపటినుండి వేచియుంటిని. నీమాటలు నమ్మి వృథాశ్రమపడితిని. వీలులేదని మొదటనే చెప్పితి వేని రాకపోవుదునే?

అభి—మనోహరా! నేనందులకే వెఱచుచుంటి. పాపము. నీవు ముందుగవచ్చి కూర్చింటివా? కాల మెట్లుజరిపితివో!

కాము—పాప మనుచుంటివా? చాలు చాలు. నిజముగా నాపై నీకుఁబ్రీతియున్నదని ముందుగవచ్చి కూర్చుంటి. నీవు రాకున్న నేమియుందోచక యాకసమును పిడికిటిచేఁబొడిచితిని. యూకవలిచితిని. అబ్బా! అప్పటి దుఃఖ మేమిచెప్పుదును? పిట్టలేచినను నాకు గదలిన నీవే వచ్చుచుంటి వనుకొంటిని. నీవు వట్టిదొంగవని యిప్పటికిఁ దెలిసికొంటిని. చాలు నీస్నేహము చాలు.

అభి—అయ్యయ్యో! నీవట్లనిన నాగుండె పగిలిపోవుచున్నది. నా చిక్కులు వినిన నీవిట్లనక పోవుదువుగదా.

కాము—ఆచిక్కులెట్టివి? నీవు మహాపతివ్రతవలె యింటిలో వటియించితివి కాఁబోలు.

అభి—కాదు మనోహరా! నామాట వినుము. నాకుఁ బిల్లవాఁ డున్నాఁడనుమాట యెఱుంగుదువా? వానిని నిద్రపుచ్చవలయు నా? నాభర్తకుఁ బెందలకడ నిద్రపట్టదు. ఏమిచేయుదును? ఆయాటంకములుండఁ బెందలకడ యెట్లురాఁగలనో చెప్పుము?

కాము—అవును. నీమగఁడును గుమారుడును నాకన్న నిష్టులై

యుండ నేనిం దధముఁడనై వట్టికుంకవలె నీకొఱకు వేచియుంటి. నాదే తప్పు.

అభి—అట్లనరాదు. భర్తలయందు ప్రీతిలేకయే విటులతో స్త్రీలు రమింతురు. భర్తలమూలమునఁ గులటలకునాటంకములు గలుగుచుండును. ఈగలేని తేనెవలె నిర్భయముగా విటులతో స్త్రీలకుఁ గలిసికొనుభాగ్యము పట్టుట కష్టము. నేనేమి చేయుదును?

కాము—నీయభిప్రాయ మేమియో నాకుఁదెలియలేదు.

అభి—నాకు భర్తయుఁ బిల్లవాఁడును నీక్రీడ కాటంకము గలుగఁజేయుచున్నారు. నీవు సంశయింపక వారిద్దరిం గడతేర్చితివేని హాయిగా మనము సుఖింపవచ్చును.

కాము—చాలుఁజాలు. ఇదియా నీవు చెప్పిన యుపాయము అది మహాపాతకముకాదా? నేనొల్లను.

అభి—నీవుపాపమునకు వెఱచి యట్టిపని చేయవేని నేను నాయిష్టము వచ్చిన ట్లనుభవించుటకు వీలుండదు.

కాము—ఆపాపకృత్యము నాకంగీకారముకాదు.

అభి—చాలుచాలు. దుర్వారరాగాంధులకుఁ జేయరాని పను లుండవు. బ్రహ్మయంతటివాడు కూఁతుతోఁ గలిసికొనియె. దీనింబట్టి చూడ నీకు నాయందు గాఢానురాగము లేనట్లు తోచుచున్నది.

కాము—అనురాగము కలిగియున్నదని ఘోరకృత్యము లెట్లు చేయుదును?

అభి—అయ్యనురాగమేచేయించును.సుఖార్థుఁడవైతివేనితప్పక నప్పని సేయుము. మన రాజపుత్రుఁడు సుఖార్థియైకాదే తండ్రినిం జంపించెను. ఆవార్త నీవు వినలేదా? మహారాజులే ఘోరహత్యలు గావించుచుండ సామాన్యుండవు నీవిట్లు సంశయింతువేమిటికి? రేపు సాయంకాలము మాయింటికి రమ్ము. వారు నిద్రింపుచుండఁ గత్తిచే

సలుకుము. తరువాతి బొంకులు నేను బొంకఁగలను. అనిపలుకుచు నాకులట విటునితోఁ గలిసికొనినది.

ఆమాటలన్నియుఁ బ్రచ్ఛన్నముగానుండిగోపాలుఁడాకర్ణించెను. అయ్యో! కాముకురాలుగూడ నన్నాక్షేపించినది. నే నేకర్మము నెఱుంగను. లోకాపవాద మిట్లు వ్యాపించుటకుఁ గారణమేమియో యని యాలోచించుచు సతం డటకదలి మరియొక వీధికింబోయియొక గృహముకడఁ బొంచి యాలించెను.

ఒక బ్రాహ్మణుఁడు భార్యతో నోసీ! పిల్లవాఁడు లేచి యేడ్చు చున్నాఁడు. లేచి పాలిమ్ము నిద్ర యేమిటికిఁ బోయెదవని లేపిన నా యిల్లాలు కోపముతోఁ బిల్లవానిం గొట్టుచు పితృఘాతకుఁడా! ఏల యేడ్చెదవు? నే నీకుఁ బాలీయఁజాలను. నిద్రవచ్చుచున్నది. పండు కొనుమని మందలించినది. ఆమాటలు విని యా బ్రాహ్మణుండు మూర్ఖురాలా! పిల్లవానిని బితృఘాతకుఁడా! యని పిలిచెద వేమిటికి? వాఁ డింకను బాలు వదలలేదు. పితృఘాతకుఁ డెట్టులయ్యెను. ఈలాటి తుచ్ఛపు పలుకలు నీనోటనుండి రావచ్చునా? అని యడిగిన నామె లేచి మీకు దెలియలేదా? కొడుకు లెప్పుడు పెద్దవారైనతోడనే తండ్రిచావును కోరుచుందురు. మన గోపాలుఁ డేమిచేసెనో చూచి తిరా? ఆత్మసుఖమునకై తండ్రిఁజంపించి యారాజ్యము తానేలుచుం డెను. వీఁడుమాత్ర మెదిగిన తరువాఁత మనల నెక్కువ నిర్వాహక ముచేయునా? అని యుత్తరము చెప్పినది.

ఆమాట లాగోపాలుని చెవింబడినవి. అయ్యయ్యో! ఎక్కడికిఁ బోయినను నాకీమాటలే వినంబడుచున్నవి. నాతండ్రిని నేనెట్లు చంపి తినో యెఱుంగను. గ్రామమంతయు నాయపయశము వ్యాపించినది. అని దుఃఖించుచు మఱియొకవీధికిఁ బోయి యాలింప నొకచోఁ దండ్రి యుఁ గొడుకును గ్రుద్దులాడుచుఁ గొడుకు తండ్రితో నీవు బ్రతికి

యుండ నీయాస్తి నాకీయవు. ధనహీనుండనై నేనెన్నినాళ్లు కష్టముల పాలగుచుందును? మనరాజు గోపాలుండు బలవంతమున దండిఁ జంపించి రాజ్యము గైకొన్నట్లు నిన్నుఁ జంపి నీధనము లాగికొందును చూడుమని యదలించెను.

ఆమాటలాలించి యాగోపాలుండు దుఃఖముతో నింటికిఁబోయి యారాత్రి నిద్రఁబోక యెట్టకే తెల్లవార్చి మంత్రికుమారులిద్దర రప్పించి రాత్రిజరిగిన చర్యలన్నియు నెఱింగించి యిట్టి యపఖ్యాతి నాకెట్లువచ్చినదని యడిగిన వారిట్లనిరి.

నీతండ్రి వార్ధక్యంబున జనకంటకములైన పనులనేకములుగావించెను. వినుము. ఒకనాఁడు క్షౌరము చేయించుకొనుచుండ మంగలవాఁడు తెల్లవెండ్రుకల లాగుచుఁ బ్రమాదవశంబున నల్లవెంద్రుకయొకటి తీసెనఁట. దానం గోపించి వానిం జంపించెను.

మఱియు వంటబ్రాహ్మణుఁ డొకప్పుడు కూర వండి వడ్డించగా దాని నములునప్పుడు చిన్నరాయి తగిలి పన్నూడినదఁట. దానంజేసి వానిని వెంటనే పరిమార్పించెను.

మఱియొకప్పుడు బ్రాహ్మణులు ద్రవ్యార్థులై వచ్చి యాశీర్వదింప నారొదవలనఁ దలనొప్పివచ్చినదని వారినందఱం బట్టించి బందీగృహంబునఁ బెట్టించెను. పార్శ్వంబున నిలిచి వింజామర గట్టిగావీచినదని చామరగ్రాహిణిం గొట్టించెను. వందిమాగధులు వేకువజామున నిద్రాభంగము గావించిరని కొరడాలచే బాదించెను. ఈలాటి ఘోరకృత్యము లనేకములు గావింపుచుండ వారించియు నప్పనులు మాన్పింపంజాలక దుఃఖించుచు నావిచారముతోఁ బెద్దమంత్రి కాలధర్మము నొందెను.

తరువాత మేము మంత్రిపదవి నధిష్టించితిమి. రాజుచేయు పనులవలనఁ బ్రజల కీర్ష జనించినది. అతని మరణము కోరుచుండిరి.

అప్పుడు మేమాలోచించి మీతండ్రిని బలవంతమున గట్టించి బంది గృహంబునం బడనేసితిమి. దైవికముగా నతండాచెరసాలలో మృతుండయ్యెను. దానంజేసి మీకీకాలీనము సంప్రాప్తించినది. ఇందులకు మేమే కారకులమని చేసినపనియంతయుం జెప్పిరి.

ఆవార్తవిని రాజపుత్రుం డదోముఖుండై క్షణకాల మూరకొని చేతులచే నేలంగొట్టుచుం గన్నుల నీరుగార నాకాశమువంకం జూచుచు నిట్లనియె.

మీరు శుక్రబృహస్పతులతో సమానులగుదురు. మీరు నాహితముగోరి మంచికార్యమే చేసితిరి. కాని యిట్టిపనులు శంకాశూన్యబుద్ధులగు సత్వవంతుల క్రమముగాని దృష్టాదృష్టభయగ్రస్తచేతస్కులగు మావంటివారికిం జెల్లనేరదు. నేనీభూమిని బాలింప సమర్థుడంగాను. నేనీ యపఖ్యాతి భరింజాల. మాతమ్ముని రాజుగాంజేసి మీరీరాజ్యము పాలించుండు. నేను తపోవనంబున కరిగెదనని పలికిన విని వారు సిగ్గుపడుచుం దలవాల్చుకొని యేమియుం బ్రత్యుత్తరము చెప్పలేకపోయిరి.

ఈసంవాదమంతయు రాత్రిజరిగినది. అంతలోం గోళ్ళు కూసినవి. అప్పుడు వందిమాగధులు జయము మహారాజా జయము. దిగంతవ్యాప్తయశఃసముదయా జయము. సకలభూపకిరీటమణినీరాజితచరణా జయము. అని స్తుతియింపుచుండ సిగ్గుతోం జెవులు మూసికొని చాలు చాలు నాకీర్తి దిగంతముల వ్యాపించినది. వందిమాగధులనూరకొనుమని చెప్పుమని ప్రతిహారిచే వార్తనంపెను.

అయ్యో! చిరకాలము జీవించెడు తండ్రిని నావలె నెవ్వండు చంపించును. నేను మహాపాపాత్ముండ నాకీపాప మెట్లుబోవును? అని దుఃఖించుచు నప్పుడే జటావల్కలముల ధరించి తపోవనంబునకుం బోవుట కుద్యోగించి సభామంటపమునకుం బాలకుని రప్పింపుడని

యాజ్ఞాపించి తానాస్థానమునకుఁ బోయెను. ఆవార్తవిని బ్రాహ్మణు లనేకులు వచ్చి రాజ్యము నీవే పాలింపవలయు ధర్మాత్ముండవని యెంతయో బోధించిరి కాని యతని తలకెక్కినదికాదు. తమ్ముఁడు సభకువచ్చి కృత్రిమబుద్ధితోఁ దనకు రాజ్యమక్కరలేదని కొంతసేపు ప్రతికూలముసెప్పెను కాని బలవంతమునఁ గోపాలుండు తమ్మునికి రాజ్యమిచ్చుచుఁ దనకుమారుని వాని కప్పగించి మంత్రులకుఁజెప్పి విరక్తుండై తపోవనంబున కరిగెను.

పాలకుండు ప్రజాపాలకుండై రాజ్యంబుసేయుచుండ నతనికొక దుస్స్వప్నము వచ్చినది. మంత్రులతో నాకల తెఱఁగెఱింగింప వారిట్లనిరి.

పూర్వము మీతండ్రి కిట్లె దుస్స్వప్నము వచ్చినంత బ్రాహ్మణుల కెఱింగింపగా వారు హోమములు సేయింపుఁడని చెప్పిరఁట. దానఁ గోపించి వారిఁ బట్టికొని కొట్టించెను. వారుచెప్పిన మితికే కోటమీఁద పిడుగుపడి కోట నాశనమైనది. కావున బ్రాహ్మణులచే జపములుచేయించవలెను. లేక కొన్నిదినములు దేశాంతర మరుగవల యును. సింహాసనముమీఁద మృగముచెక్కించి పాలింపవలయునని యుపాయము చెప్పిరి.

అట్లు వారు మాట్లాడికొనుచుండఁగా నన్నకుమారుఁడు నర వాహనదత్తుఁడనువాఁడు బంతియాడుచుండ నాబంతి దొర్లి సింహాస నముదరికి వచ్చినది. దానిఁ దెచ్చుకొనుటకై యాబాలుం డట కరి గెను. వాని యాకారగౌరవము జూచి సంతసించుచుఁ బాలకుండు వానికి రాజ్యమిచ్చి తాను తపోవనంబునకుఁ బోయెను.

తరువాత నరవాహదత్తుఁడు భూపాలుండై ప్రజలం బాలించు చుండెను. ఒకనాఁడతనికడ కొకయోఁదుది వికృతాంగి చూడ నస హ్యము జనించినది రత్నములవంటిబిడ్డలఁ నాల్గురవెంటబెట్టుకొని వచ్చిఆశీర్వదించినది. ఆవికృతాంగిం జూచి యారాజకు మారుఁడుఅప

హ్యించుకొనుచుఁ గుమారులఁ జూచి యాశ్చర్యమందుచు నీవెవ్వ తెవు? ఈకుమారులెవ్వరు. నీవృత్తాంతము జెప్పుమని యడిగిన నావి కృతాంగి యిట్లనియె.

ఈబిడ్డలు నేను గన్నవారే. నాపతి దేశాంతరమరిగిరని చెప్పిన వింతపడుచు నతఁడౌరా నీకుఁ బతియున్నవాఁడా నిన్నెట్లు పెండ్లి యాడెను. ఇది వింతగానున్నది నీకథ చెప్పుమని యడిగిన నామె యిట్ల నియె. అయ్యా వినుండు.

## పింగళికకథ.

అవంతిదేశములోఁ గపిస్థలమను నగ్రహారముగలదు. అందు సోమదత్తుడను బ్రాహ్మణుఁడు వేదవేదాంగపారంగతుఁడు కాపురము సేయుచుండెను. అతనికి వేనవేలు శిష్యులుగలరు. ఆవిప్రునిభార్య యరుంధతికన్నను మిన్నయని చెప్పనొప్పు. అపుత్రుకుఁడగు నాపాఱు నకుఁ గొంతకాలము గతించినంత నుత్కలవలె నొకకూఁతురు పుట్టి నది. స్త్రీలక్షణవేత్తలు దానింజూచి దీనికిఁ బతియు బుత్రులుండరు; దేశాటనముచేయునని యెఱింగించిరి. ఆబాలిక ధూమకేతువువలె వా రింట నెదుగుచుండెను. అన్నియు దుర్గుణములే. సుగుణమొక్కటియు నులేదు. ఆచారహీనురాలై మాలపల్లెలోనికిఁగూడఁ బోయి వచ్చు చుండును. దాని యాకారము గుణములు జూచి యెవ్వరు బెండ్లి యాడలేదు. ఆచింత సోమదత్తుని స్వాంతమున మిక్కిలి వేధించు చుండెను. కనంబడిన పిల్లలను జావఁగొట్టుచుండును. పెద్దలపై రాళ్లు విసరుచుండును.

ఒకనాఁడొక వటుఁడు వీధింబడి పోవుచుండఁ బెద్దరాయి తీసి కొని వానిం గొట్టినది. మొగము గంటుపడి బొటబొట రక్తముగారు చుండఁ సోమదత్తునొద్దకుఁబోయి యావ్రణము చూపి నీకూఁతు రిట్లు కొట్టినదని రాయిఁ జూపెను. అప్పుడాసోమదత్తుఁడు మిక్కిలి కోపిం

చుచుఁ శిష్యులఁ గొండఱఁజూచి దాని మహారణ్యమున విడిచిరమ్మని యాజ్ఞాపించుటయు వారట్లు కావించిరి.

ఆచిన్నది చావవలయునని తలఁచి యాయరణ్యములోఁ బడి పోవుచుండ నొకచో నొకవిష్ణ్వాలయము తటాకము గనంబడినవి. అందు స్నానముచేసి దేవునిబూజించి చచ్చినచో వైకుంఠము రాఁగలదు; లేకున్న నరకమునకుఁబోవుదునని తలంచి స్నానముజేసి యందలి పూవులచే నాదేవు నర్చించినది. నాఁడేకాక నిత్యము నెలదినములట్లు పద్మములచే నాదేవు నర్చించుచు ధ్యానించుచుండ భక్తవత్సలుండగు నాదేవుం డొకనాఁడు స్వప్నములోఁ గనంబడి పుత్రీ! నీకిష్టమైనవరము గోరికొనుమని యడిగిన నాపడఁతి మరణము దయచేయుమని కోరినది. స్వామి నవ్వుచు నీవు పతిపుత్రధనాదులఁ గోరక యాత్మహత్య గోరితి వేల? అది సమంజసముగాదు. ఆలోచించి కోరుమని పలికిన నామె స్వామీ! నేను పూర్వజన్మమునఁ బుణ్యమేమియుఁ జేసియుండలేదు. పతిపుత్రధనాదులు నాకెట్లు లభ్యమగుదురు? ఇట్టికురూపినిఁ బెండ్లి యాడువాఁడెవ్వఁడు? ఇతరసుఖములతో నాకుఁ బనలేదు. మరణమే శ్రేయము. దయచేయుమని కోరిన శ్రీవిష్ణుఁ డిట్లనియె.

పుత్రీ! నీవన్నమాట వాస్తవమే. కాని జన్మాంతరమున దండ్రి గారియింటఁ గుంచెడుధాన్య మొకబ్రాహ్మణునికి దానమిచ్చితివి. ఆబ్రాహ్మణుఁ డిప్పుడు బ్రాహ్మణునింటఁ బుట్టి నాలుగువేదములు చదివినాఁడు చతుర్వేదియని బిరుదము వడసెను. ఆబ్రాహ్మణుఁడే నీకు భర్త కాఁగలఁడు. అతనికొక్కనికిమాత్రము నీవు మిక్కిలిచక్కని దానవుగాఁ గనంబడుదువు. నీవతనిఁ బెండ్లియాడుము చక్కనిసంతానము గలుగఁగలదు. నీవాభర్తతో యవాథకమువలన నీవు క్రీతుఁడ వైతివని యెన్నఁడు చెప్పఁగూడదు. చెప్పితివేని ముప్పురాఁగలదు. మఱియు నీవొకప్పుడు జన్మాంతరమున నువ్వులు దినుచుండఁగా వ్రేళ్ల

సందునుండి యెనిమిదిగింజలు జారి యగ్నియందుఁ బడినవి. దానంజేసి నీకెనమండ్రుపుత్రులు పుట్టుదురు. మరణము మానుమని చెప్పి స్వామి యంతర్హితుఁడగుటయు సంతసించుచు నావిప్రకన్య తటాకములో స్నానముజేసి స్వామి నర్చించుచుండ నింతలో నామెతండ్రి శిష్యులతోఁగూడ వెదకికొనుచు నాస్థలమున కరుదెంచెను.

చెట్టుచెట్టుసందు వెదకి యొకచో నాకన్నెంగని కన్నీరుగార్చుచు బలవంతమున నింటికిఁ దీసికొనిపోయి కాపాడుచుండెను. ఒకనాఁడా చతుర్వేది శిష్యులతోఁగూడ సోమదత్తుని యింటికివచ్చి తండ్రిచేఁ బూజింపఁబడి కన్నెంజూచి యాశ్చర్యమందుచు నీదివ్యాంగన యెవ్వతె? దేవలోకము విడిచి భూలోకమున కెట్లువచ్చినది? అని యడుగ నాపాఱుఁడు వానిమాటలు పరిహాసజల్పితములనుకొంచి హీనస్వరముతో నిది నాకూఁతురు. దీని కింకను బెండ్లిచేయలేదని చెప్పెను.

దీని నాకిచ్చి వివాహము గావింపుము బెండ్లియాడెదనని యడిగిన సంతసించుచు నాసోమదత్తుఁ డప్పుడే వాని కాచిన్నదానినిచ్చి పెండ్లి కావించెను. ఆమెయుం దతఁడత్యంతానురాగంబున మెలంగుచు నామె చెప్పినట్లు వినుచు నామెయిష్టానువచ్చినట్లు కాపురముసేయుచుండెను. ఆపింగళికనే నేను. నాకతనివలన నెనమండ్రుకుమారులుదయించిరి. వీరే వారు. శ్రీహరికృపచేఁ గలిగినారని యెఱింగించి మఱియు నిట్లనియె.

అట్లు కొంకతకాలమరుగ నొకనాఁడు నాభర్త నన్నుఁజూచి చండీ! నాకుఁ గాళ్ళు నొప్పిపెట్టుచున్నవి. పిసికెదవా? అని యడిగెను. ఎప్పుడు నన్నట్లడుగలేదు. నే నిట్లంటి. నీవు నాకేమైన నిచ్చి నన్నుఁ గొంటివాయేమి? ఊరక నీకుఁ బాదసంవాహన మేమిటికిఁగావింపవలయును? అని యుత్తరమిచ్చుటయు నామగఁడు నీవుమాత్రము నన్నుఁ గొంటివా యేమి! సంతతము నీకుపచారములు సేయుచుండ

లేదా అని చెప్పిన నేను పూర్వకర్మప్రారబ్ధమున శ్రీహరిచెప్పినమాట మఱచి తటాలున నవ్వుచు. నిన్ను అధికపరిమితయవలిచ్చికొంటిని. అని పలికితిని.

అంతలో నాతఁడు నాయాకార మెగడిగా జూచి ఛీ ఛీ నీవెవ్వతెవు? పింగళిక యేమైనది? నీ వెక్కడినుండివచ్చితివి? పో పొమ్ము నాయెదుర నిలువవలదు. నిన్నుజూడ వాంతి వచ్చుచున్నది. అని యసహ్యించుకొని నాఅధికథాన్య మేమనియడిగిన యదార్థమంతయుం జెప్పితిని. నాకథ విని నామగఁడు నన్నుజూడ నేవగించుకొని యందు నిలువక యెోదో లేచిపోయెను. తండ్రి స్వర్గస్థుఁడయ్యెను. పతిపితృవిహీననై యీపిల్లల వెంటఁబెట్టుకొని తిరుగుచుంటిని. నాపూర్వకర్మమిట్లున్నదని తనకథయంతయుఁ బింగళిక యెఱింగించినది.

నరవాహనదత్తుఁ డాకథవిని యక్కజమందుచు నామెను బిడ్డలను బోషించుటకుఁ దగినయుపాధు లిప్పించి యంపించెను. అని యం తదనుక నాకథజెప్పి యక్కథకుండు అబ్బా! యిప్పుడు ప్రొద్దుపోయినది. తరువాతికథ చాలయున్నది. చెప్పఁజాలను. అని పలుకుచు నందుండి లేచిపోయెను.

# జగన్మోహినికథ.

నేనాకథ విని స్త్రీల సాహసచర్యల కాశ్చర్యమందుచు గోపాలుని పితృభక్తికి సంతసించుచుఁ జిత్రసేనుని మూర్ఖత గ్రహించుచు నటఁ గదలి మిక్కిలి పెద్దగానున్న యావీధింబడి మఱికొంతదూరము పోయితిని. అందొక్కచో భూమిలోఁ గార్చిచ్చు రవులుకొని ప్రజ్వాలజ్వాలాభీషణంబై మహారణ్యంబును దహించునట్టిచప్పుడు గొప్పగా వినంబడఁజొచ్చినది. ఆధ్వని విని నేనది యేమియోయని విమర్శింపుచుంటి నింతలో నావీధిగృహములందున్నవారెల్ల హల్లకల్లోలముగా

రొదజేయుచు అన్నా! తమ్ముడా! అమ్మా! తండ్రీ! బాబూ! అమ్మా యీ! పట్టీ! రండు రండు వేగరండు అని హాహాకారరవంబులతో నొండొరులం జీరికొనుచు గాలుచున్న యిండ్లనుండివలెనే యీవలకు వచ్చి వీధింబడి యెక్కడికో పారిపోవుచుండిరి. అమ్మా! యని యేడ్చుచు వెనుకవచ్చు పిల్లలనైనఁ జూడకఁ నాథా, నిలు, నిలుమని పిలుచు భార్యనైనం బరిశీలింపక పట్టీ! మమ్ముఁ దీసికొని పోవా? అని కేకలుపెట్టు తలిదండ్రులవంకం జూడక యాడు వాండ్రు మగవాండ్రొండొరులఁ బల్కరించుకొనక శక్తికొలఁది పరుగిడుచున్న యాపౌరులంజూచి నేనందలి కారణంబు దెలియక అయ్యా! ఇప్పుడువచ్చిన యుపద్రవమేమి? అందఱు నిట్లు పారిపోవుచున్నా రెక్కడికి? చెప్పుఁడని యడిగిన నెవ్వరు నుత్తరము చెప్పినవారు లేరు.

నేనుగూడ వారితోఁ బోవుచుఁ గనంబడినవారినెల్ల గారణం బడుగుచుండ నొక్కఁడయ్యా! నీవు గ్రొత్తవాఁడవు కాఁబోలు. భూమి పగులుచున్నది. ఇందు నిలువరాదు అని మాత్రము చెప్పి పరుగెత్తికొని పోవుచుండెను.

అతని మాట నాకేమియుఁ దెలిసినదికాదు. భూమి యెక్కడ పగిలినది? పగిలిననేమి? యని ప్రవాహమువలెఁ బోవుచున్న పౌరుల నడుగుచు నేనొకచో నిలువంబడితిని. నిలిచితివేల పదము. భూమి యెక్కడనో పగులును. ధ్వని వినంబడుచున్నది. అవ్వలివీధికినిబోయినఁ బ్రమాదము దప్పునని యొకఁడు చెప్పి యవ్వలఁబోయెను.

ఆయుపద్రవ మేమియో నాకుం దెలియక యందే నిలువం బడి యాప్రజలం జూచుచుంటిని. అప్పుడొక మేడలోనుండి యొక మెఱుఁగుంబోడి తలిదండ్రులతో నీవలకు వచ్చి తలిదండ్రులవెంటఁ బరుగెత్తుకొనిపోవుచుఁ గాలికి ఱాయితగిలి నేలంబడి మూర్ఛిల్లినది. ఆపాటుజూచి నేను తటాలున దాపునకుఁ బోయి ముట్టుకొనుటకుఁ

సంశయించుచు నుపచారములు సేయుచుంటిని. అంతలో నామె తలితండ్రులు పుత్రికం గానక వెనుకకు వచ్చి యందుపడియున్న యా సుకుమారగాత్రిం గాంచి అయ్యో! నిన్నా రక్కసుండు మ్రింగఁగలఁడు. పడియుంటివేమని యేడ్చుచు నడిగిరి.

అప్పుడు నేను వారి నూరడించుచు రాక్షసుఁ డెవ్వఁడు? ఎక్కడనున్నాఁడు? మీరందఱు నిట్లు పరుగెత్తుకొని పోవుచున్నారు. ఎక్కడికని యడిగిన వా రిట్లనిరి. అయ్యా! నీవెవ్వఁడవో క్రొత్త వాఁడవు. రాఁబోవు ననర్థము తెలిసికొనక యిందు నిలువఁబడి నాబిడ్డ కుపచారము సేయుచుంటివి కాని ఇఁక పదినిమిషము లుం డుంటిమేని యారాక్షసుఁడు వచ్చి మనల భక్షింపఁ గలఁడు. అప్పుడే భూమి పగిలినది. పొగ పైకి వచ్చుచున్నది. మే మీబిడ్డను విడిచి పోఁజాలము. మేమెట్లైన శమనలోకాతిథులము కావలసివారమే పడుచువాఁడవు. నీవిందు నిలువఁబడితివేల? కాలికొలఁది పరుగెత్తి కొని యవ్వలివీథికిఁ బొమ్మని యుపాయము జెప్పిరి.

నే నారక్కసుని వృత్తాంతమంతయు వివరముగాఁ జెప్పుమని యడిగితిని. చావునకుఁ దెగించి పుత్రికను విడువలేక యందు నిలువం బడి యున్నవారగుట వారు నాతో నార్యా! యీనగరములో నేఁ డాది కొకసారి యిట్లే చప్పుడై భూమి పగిలి యొకచో వివరమేర్ప డును. ఆవివరమునుండి భయంకరాకారముగల రక్కసుఁ డొక్కఁడు బైటకు వచ్చి యావీథినున్న మనుష్యుల నెల్ల నాబాలవృద్ధముగా భక్షించి పోవును. ఆవీథి సర్వశూన్యమై యరణ్యప్రాయ మగును. నాలుగేండ్లనుండి యిట్లు వచ్చుచున్నాఁడు. ఈవీట నాలుగు వీథులు పాడై పోయినవి. ఈసంవత్సర మీవీథికివచ్చుచున్నాఁడు. ముందుగా గొప్పచప్పుడు వినంబడును. తరువాత భూమిపగిలి వివరమేర్పడును. దానినుండి పొగవచ్చును. ఆవెంటనే రాక్షసుండు వచ్చి కనంబడిన

మనుష్యులను దోమలవలె నోటిలోవైచికొని నములును. పొగవచ్చు చున్నది. వాఁడు వచ్చువేళ యైనది. మేము మువ్వురము చచ్చిన వారమే యగుదుము. నీవుగూడ మాతో నిలిచితివేల? అవ్వలఁ బారి పొమ్మని పలికిన విని నేను నవ్వుచు నిదియా కారణము? చాలు జాలు. ఈయూర వానిం బరిభవించు శూరుం డొక్కరుండును లేడా? మీరు వెఱవకుఁడు. మీప్రాణముల నేను గాపాడెద నిలువుఁడని పలుకుచు నాచిన్నదానిని సందిటఁ బట్టి భుజముపై నెక్కించుకొని వారిం గూడ రమ్మని యొక్క యరగుపై బండుకొనఁ బెట్టితిని.

అంతలో నాకాంతకు మెలకువ వచ్చినది. తలిదండ్రులామె పైఁబడు దుఃఖించుచుండిరి. అయ్యో! నాకతంబున మీరిందేల నిలు వంబడితిరి? పారిపోవలేక పోయితిరా? నేనెట్లనను జచ్చినదాననే. మీరున్న వంశము నిలుచునుగదా? అని కన్నీరు గార్చుచు గూఁతు రేడ్చినది. అమ్మా! నిన్ను వరప్రసాదమునఁ జిరకాలమునకుఁ గం టిమి. నీకుఁ బెండ్లిచేయవలయునని యెంతయో వేడుకతోఁ దలంచు కొనుచుంటిమి. నీవలనఁ గుల ముద్ధరించుకొనఁ దలంచితిమి. ఇట్టి నీవే మిత్తిపాఁలంబడుచుండ మేము బ్రతికి యేమిచేయుదుము. ఈపా డురక్కసుఁ డీయేడు మన వీధికే రావలయునా?

మనకర్మ మిట్లున్నది. మన యైశ్వర్యమంతయు నేలపాలైనది. మనమేకాక పాప మీ పుణ్యాత్ముఁ డెవ్వఁడో నీ కుపచారములు సేయుచు మనతోపాటు చావఁ దెగించియున్నాఁడు. అని పలుకుచు నుండఁగనే యావీధిం బోవువారు భూతిభీషణముగా నార్చుచు నార క్కసుం డెదురుపడినంతనే వెనుకకు మరలి మఱియొక దెసకుఁ బాఱి పోవఁ దొడఁగిరి.

ఆరక్కసుని యార్పులు విని నేను నడుము బిగించి చేతం గర వాలంబుబూని నడివీధిలో నిలువంబడితిని నాసాహసముజూచి యాకు

టుంబమువారు బాబూ! వాఁడు సామన్యుఁడు కాడు. మనుష్యులు వాని నెదిరింపఁజాలరు. ఏచాటుననో దాగికొందము రమ్మా. అని చీరుచుండ నవ్వుచు మీారు నిర్భయముగా నాయరుగుపయిం గూరుచుండుడు. గడియలో నాయసురుని మడియజేసెదనని పలుకుచుండఁ బ్రచండదోర్దండంబుల సాచి పారిపోవు మనుష్యులం బట్టికొని పొట్టలంద్రొక్కి విరిచి దంష్ట్రాకరాళంబగు నోటం బడవైచుచు నారాత్రించరుండు మేమున్న తావున కరుదెంచెను.

వానింజూచి యరుగుమీాఁద నున్నవారు అమ్మయ్యో! చచ్చితిమి. చచ్చితిమి. వాఁడిందే వచ్చియున్నాఁడని పెద్ద యెలుంగున నేడువందొడంగిరి. వాఁడు ఎదురునున్న నన్నుఁజూడక యేడుచుచున్నయాకుటుంబము మీాఁదికిఁబోవ నుంకించుటయు నే నవ్వు డడ్డంబై మండలాగ్రంబు గిరగిర ద్రిప్పుచు క్రూరాత్మా! నేనిందుండ వారిపయిం బడెదవేల? రమ్మా. రమ్మా. ఇదియే మదీయ కృపాణహారము కాచికొనుము. నీయాయువు మూడియే యిందువచ్చితివని పలికినంత గుహాసదృశంబగు వదనంబు దెరచికొని యగ్నిజ్వాలవలె నాలుక వ్రేలాడుచుండ నారక్కసుం డుక్కుమీార నాపై లంఘించెను.

అప్పటి నాసాహసము తలంచికొనిన నాకే యాశ్చర్యము గలిగించినది. అట్టిబలము నాకెట్లు వచ్చినదో తెలియదు. వాఁడు నన్నుఁజేతులతో బట్టుకొనబోవునంతలో మండలాగ్రంబెత్తి ప్రచండవేగంబున వేసితిని. ఆవ్రేటుతో వాని నాలుక సగమును కరతలంబులుం దెగి నేలంబడినవి.

అప్పుడు వాఁడు వెల్లువగ రక్తముగారుచుండ వికృతస్వరంబున నార్చుచు మొండిచేతులతో నేదియుఁ బట్టికొనంజాలక గింజుకొనుచు జిందులుద్రొక్క నొక్కవ్రేటున వాటముగా వాని రెండుపాదంబులుం దెగనతికితిని. వాఁడు కొండవలె నేలంగూలి భీషణఘోషముతో

దొర్లుచుండ దండకుఁబోయి రెండుచేతుల మండలాగ్రం బెత్తి గొడ్డలి చేతంబోలె నాభీలగతి వాని కంఠంబు ఖండించి మొండెమును గావించితిని.

ఆదంపతులును బుత్రికయు నాపోరాటము వానిపాటుంజూచి యాశ్చర్య సంతోషములతో నాకడకువచ్చి పాదంబులంబడి మహాత్మా నీవు దేవుఁడవు కాని మనుష్యుండవుకావు. సామాన్యమానవుం డింత చులకనగా నీదానవుం బరిమార్పఁగలడా? నీకతంబున మేము మువ్వు రము బ్రతికితిమి. నీవడ్డుపడకున్న నీపాటికి జము వీటికిం జేరవలసిన వారమే. మేమేకాదు. ఈనగరవాసులకెల్ల మహోపకార మొన రించినవాడ వైతివి. ప్రతిసంవత్సరము వీఁడేవీధికో వచ్చి యందలి ప్రజలం జంపి శూన్యము చేయుచుండువాఁడు. బకుని జంపి యేకచ క్రపురవాసులం గాపాడిన భీమునివలె నీవీ పట్టణ ప్రజల రక్షించితివి ఈనగర మాఁడుది పాలించుచున్నది. ఇందులకుఁ బ్రతీకార మామె యేమియు నాలోచింపలేకపోయినది. అని వారు నన్ను బొగడు చుండఁగనే యందు మిగిలినయున్న వారెల్ల నావార్త విని మూఁగికొని పూవులచే నన్నుఁ బూజింపఁ దొడంగిరి.

ఆయజమానుని పేరు ధనకోటియఁట. పదికోట్ల దీనారముల కధికారియఁట. అతని కూఁతురు పేరు జగన్మోహిని. పేరునకు మిం చిన సౌందర్యము కలిగియున్నది. అట్టి భాగ్యవంతుఁ డెక్కడనున్న వస్తువు లక్కడ విడిచి ప్రాణములు దక్కించుకొనుటకై భార్యాపుత్రి కలతో నిల్లువెడలి పోవుచుండ నొక్క పరిజనుండైన వెంటరాడయ్యె. ప్రాణములకన్న దీపైనవస్తువు లేదుగదా. ధనకోటి తనవృత్తాంతము నాకెఱింగించి నన్ను సగౌరవముగాఁ దనయింటికి రమ్మని ప్రార్థించి తీసికొనిపోయెను.

మాయల్లుం డారక్కసుం బరిమార్చెను. పౌరులు నిర్భయముగా

వచ్చి గృహములలోఁ బ్రవేశింపుండని ధనకోటి యావీధిని జాటింపఁ జేసెను. ఆరక్కసుండు గావించిన హత్యలును పౌరులకుఁ గలిగిన యపాయములు నెఱింగించుచు నన్ను స్తుతియించుచు నారాత్రి శేషంబు వెళ్ళించిరి. ఆమఱునాఁడు పౌరులెల్ల నాబాలవృద్ధముగా దేవునిఁజూడ వచ్చినట్లు పహారములతో వచ్చి చూచి నన్నర్చించి పోవుచుండిరి. ఆమోహిని నన్నుఁ బతిగాఁ బడయఁగోరి తన యభిలాష తలిదండ్రులకెఱింగించినది.

ధనకోటి నన్నుం బ్రార్థించి మఱునాఁడే తనకూఁతు నాకిచ్చి మహావైభవముతోఁ వివాహము గావించెను. మాసోదరులీ యూరనున్నారు. వారిని రప్పింపవలయునని చెప్పుటకు నాకు బుద్ధిపుట్టినది కాదు. ఆవీధివారెల్ల నాపెండ్లికి బంధువులవలె వచ్చి పరిజనులవలె నుపచారములు సేసి బట్టులవలెఁ బొగడుచు దేవునివలెఁ బూజించిరి.

ఆమహోత్సవములతో నెనిమిదిదినములు గడియవలె వెళ్లించితిని. ఈనగరి యవ్వలివీధిలో నెవ్వరో పెండ్లివారు పోట్లాడుచున్నారని వింతగాఁ జెప్పికొనఁగా నలువురతో నేనా వీధికి బోయితిని. అందు మన సోదరుఁడు గుఱ్ఱముపై నిలువంబడి మీతోఁ గయ్యము సేయఁ గాలుఁద్రువ్వుచుండెను. అతండు నన్ను గురుతుపట్టి తనతోఁ గలుపుకొనియెను. తరువాతి కథ మీ కెఱింగినదియే. ఇదియే నా వృత్తాంతమని యెఱింగించిన విని పుష్పకేతుఁ డిట్లనియె.

ఔరా! మనచరిత్రములు విచిత్రములుగా నున్నవి. ఒక నగరంబున వసించియుఁ దలయొక దేశమున నున్నట్లు వ్యవహరించితిమి. అవ్వలివీధి నెవ్వఁడో యొక వీరుండు రక్కసుం బరిమార్చెనని చెప్పికొనగా వింటి. నీవని తెలిసికొనలేక పోయితిని. ఈపట్టణము చాల పెద్దదగుట నెన్ని విశేషములైనం గలిగియున్నది. భూమండలమున నింత పెద్ద పట్టణము జూచియుండలేదు. స్త్రీరాజ్యభాగమంతయు

నగరముగానే యున్నదఁట. దీని వర్ణింపఁ బెద్దకాలము పట్టును. ఏవీధి కావీధియే యొక పట్టణమని చెప్పవచ్చును.

దైవకృపచే మన మేగురము మంచిభార్యలం బడసితిమి. అమిత ధనము సంపాదించితిమి. మఱియు నీస్త్రీరాజ్యము మన యధీనమైనది. మన మిప్పుడు భార్యల వెంటఁబెట్టుకొని యన్నలవలె నింటికిఁబోయి తలిదండ్రులకు సోదరులకు ప్రజలకు నానందము గలిగింతము. మన దక్షిణదిగ్యానము గూడ గొంత సఫలమైనదని చెప్పుకొనవచ్చును. మనదేశమునకుం బోవుదమా? అని చెప్పిన నామాట కందఱు సమ్మతించిరి. తమతమ భార్యలకు వారివారి యాప్తులకు నావార్తఁ దెలియఁజేసి శుభముహూర్తంబునఁ బయనంబై యారాజ్యంబు మంత్రులు పాలించునట్లు నియమించి చతురంగబలములు గొలువఁ గతిపయప్రయాణంబులం గన్యాకుబ్జనగరంబు ప్రవేశించి తలిదండ్రులకు సోదరులకుఁ దమ వృత్తాంతమంతయు నెఱింగించి సంతోషసాగరంబున మునుంగఁ జేసిరి.

అని యెఱింగించి... మణిసిద్ధుం డిట్లనియె.

---

## 243 వ మజిలీ.

### మునుల తారతమ్యము.

గీ. తన కుటుంబంబు తామరతంపరగను
నల్లుకొన వేనవేలకు నధికమగుచు
తనదు నామము సార్థకత్వము వహింప
నలరె సౌభాగ్యసుందరి యధికమహిమ.

ఇరువదిమంది కుమారులును దిగ్విజయంబుజేసి లోకాతీతసౌందర్యంబునఁ బ్రకాశించు నించుబోడ్లం బెండ్లియాడి యింటికివచ్చిన తరువాతఁ గొడుకులును గోడండ్రును మనుమలు మునిమనుమలులోన

గు తనకుటుంబమును జూచికొని సౌభాగ్యసుందరి తన్నుఁబోలు భాగ్యశాలిని యెందునులేదని గర్వపడఁ జొచ్చినది. లెక్కింప నామె సంతతి వేలకు మించియున్నది.

ఆకుటుంబాభివృద్ధి ఆవైభవముం జూడ నింద్రభోగముగూడ హీనముగాఁ దోపకమానదు. ఆమె సంతతము మనుమలతో నాడుకొనుచుండును. మున్మనుమల ముద్దాడుచుండును. కోడండ్రతో ముచ్చటించుచుండును. గృహకృత్యములయందు లోపము రాకుండఁ బరిచారికాసహస్రముల నియమించి సమకూర్పించును. అట్టిమర్యాద యట్టి నైపుణ్యము యట్టి గౌరవప్రతిపత్తి యేమత్తకాశినికిని గలుగ లేదని విఖ్యాతి పొందినది.

ఆమె కోడండ్రు యిరువదిమందియు భువనైకసుందరులు. సకలకళాభిరాములు. సర్వజనస్తవనీయ చరిత్రులునై తరుచువిద్యాగోష్ఠి చేయుచుందురు. వారిలో వారి కొకప్పుడు మహాఋషుల తారతమ్యము గుఱించి సంవాదము గలిగినది. అందు

ఇందుమతికూఁతురు, మధుమతి—మహర్షులందరు లోకాతీత ప్రభావముగలవారే, కానివారిలో లోపాముద్రా మనోహరుండగస్త్యమహర్షి సర్వాధికుండని నాయభిప్రాయము. వినుండు,

సీ. జనియించె నేమునీశ్వరసార్వభౌముండు
ప్రభమీర మహితకుంభంబునందు
నిల్వలవాతాపు లేమహామహు కుక్షిఁ
జేరి త్రేఁపినయంతఁ జీర్ణమైరి
మునులచేఁ బల్లకీ మోయించి నహుషుఁ డె
వ్వని హుంకృతిని బదభ్రష్టుఁడయ్యె
గ్రహతారకాదుల గతుల కడ్డముగ నే
గిన వింధ్యనగ మేని ఘనతనడఁగె

గీ. వనధి నాపోశనముగ నెవ్వాఁడు గ్రోలె
సతత మేముని దక్షిణాశను వసించు
నయ్యగస్త్యుండు సర్వసంయములయందు
నగ్రగణ్యుం డటంచు నాయభిమతంబు.

వారుణి—అక్కా! ఆమాట కాదనువా రెవ్వరు?

గంధ:— ఆహా! ఆమహానుభావుండు గావించిన పనులు దేవతలకు గూడఁ శక్యమైనవియా? అతని సర్వాధికుం డనుటకు సందియమేలా?

చంద్ర—మధుమతీ! అగస్త్యమహర్షి యెట్టిపనులనైనఁ జేయనీ యహంకారసక్తుడగుట సర్వాధికుండనుటకు నేనొల్ల.

క. పుత్రులు త్రిమూర్తులును క
శతృం బనసూయ శాంతలలితాత్మండా
యత్రిమహామునికన్నఁ బ
వితృండగు తపసిగలఁడె వెదకిన నెందున్.

రత్నావతి—మహాపతివ్రతా శిరోమణియగు ననసూయా మహాదేవికిఁ బ్రాణవల్లభుండైన యత్రిమహర్షియే యుత్తముండని నాకును దోచుచున్నది.

ప్రభావతి—నా యభిప్రాయము నట్టిదే.

ప్రమద్వర—అక్కలారా! వీరిద్దరికన్నను బ్రహ్మమానసపుత్రుండగు మరీచికుమారుండు కశ్యపుని నుత్తముండని చెప్పినఁ దప్పు పట్టెదరా? వినుండు

గీ. అదితియందున వేల్పులను దితియందు
దానవులనెల్లఁ గనిన ప్రధానమూర్తి
వనజభవు పట్టిపట్టి వామనుని తండ్రి
కశ్యపునికన్న కధికుఁ డొక్కరుఁడు గలఁడె.

చారుమతి—కశ్యపుండే పరమోత్తముఁడని నే నభిప్రాయ మిచ్చుచున్నాను.

ప్రఫుల్ల—ఆమాటయే నేనును బలుకుచున్నాను.

కాళింది—అక్కా! నీవు మఱచిపోయితివిగదా? వినుము.

క. గోదావరి తనపేరిట
మేదిని వెలయించినట్టి మేటి యాహా
ల్యా దయితుఁడు గౌతమముని
వేదండుం డధికుఁ డనుచు వివరింపఁదగున్.

రుక్మవతి—అక్కలారా! నాకుఁ దోచినమాట నేనునుం జెప్పెద నాకర్ణింపుఁడు.

గీ. వసుధరాజర్షి యయ్యు దుర్వారభూరి
వర తపఃప్రథితప్రభావప్రభూతి
సృష్టికిని వేరుసృష్టి జేసిన ఘనుండు
కౌశికునిబోలు తపసి యొక్కరుఁడు గలఁడే.

మహారాజరత్నము—అక్కా! రుక్మవతీ! ఇందఱు మహర్షులుండ నీమది కా పరమక్రోధనుండు మెప్పువచ్చెనా? అక్కటా! నిత్యసత్యవ్రతుఁడైన యాహరిశ్చంద్ర మహారాజు నతండు పెట్టిన చిక్కులు తలంచిన నెంత కఠినాత్మునికైనఁ గన్నీరు రాకమానదు గదా! నిజముగా విమర్శించినచోఁ

చ. వనజభవప్రసూతి రవివంశభవక్షితిపాల దేశికుం
డనుపమ కీర్తివాసిత దిగంతుఁడు శాంతుఁ డరుంధతీ మనో
వనజ దివాకరుం డురుతపఃపరితోషిత సర్వదేవతా
ప్రణుతుఁడు జ్ఞానమూర్తి మునివర్యుఁ డనంగ వసిష్ఠుఁడేకదా.

ఇమ్మహాత్ముని తపఃప్రభావముజూచి యోర్వలేకయే కాదా విశ్వామిత్రుఁడు మహర్షియగుట.

రుక్మవతి— హరిశ్చంద్రునకు విశ్వామిత్రునివలనఁ గలిగిన కష్టములనే యగ్గడించితివి కాని సుఖముమాట చెప్పవేమి? అమ్మహారాజును మహేంద్రుని యర్ధసింహాసన మెక్కింపలేదా ? అదియునుంగాక హరిశ్చంద్రుండు పుత్రార్థియై వరుణు నారాధించి తనకుఁ బొడమిన కొడుకును పశువుగా వేల్తునని యొప్పుకొని కలిగిన పిమ్మట వరుణుం డరుదెంచి కొడుకును బశువుగా జేయుమనిన గడువులేర్పరచి త్రిప్పుచుండఁ గుమారుం డవ్విధం బెఱింగి పారిపోవుటయు దానం గోపించి వరుణుండు హరిశ్చంద్రుని జలోదర పీడితుండవు గమ్మని శపించెను. తచ్ఛాపదోషంబునఁ బరితపించుచు హరిశ్చంద్రుఁడు అజీగర్తి యను బ్రాహ్మణుని మధ్యమకుమారుని శునశ్శేపుఁ డనువాని వారుణ యజ్ఞపశువుగాఁ జేయఁబూనినంత నాశునశ్శేపుండు విశ్వామిత్రుని శరణుజొచ్చెను. పరమదయాసంపన్నుండగు నామహర్షి శునశ్శేపుని కాపాడి హరిశ్చంద్రునియెడ వరుణుండు ప్రసన్నుం డగునట్లు చేసెను. హరిశ్చంద్రుని తండ్రి త్రిశంకు నిమిత్తమే కాదా క్రొత్త స్వర్గము నిర్మించెను. ఇన్ని విశేషము లే ముని యందున్నవి?

మహారాజరత్నము— ఓహోహో ! ఇదెక్కడి కల్పన ? హరిశ్చంద్రుండు శునశ్శేపుని వరుణ పశువుగాఁ జేయుట యెప్పుడును వినలేదే. నీవు పొరపాటు పడుచున్నావు. హరిశ్చంద్రుని యజ్ఞమందు గాదు. అంబరీషుని యజ్ఞమందు. బాగుగా జ్ఞాపకము జేసికొనుము.

రుక్మవతి—నేనెఱింగియే చెప్పితిని. ఇందబద్ధములేదు.

మహా—నీవు రామాయణము చదువలేదా యేమి ?

రుక్మ—నీవు దేవీభాగవతము చదివిన నిట్లనవు.

మహా—రామాయణము కన్న దేవీభాగవతము ప్రమాణగ్రంథమా ?

రుక్మ—అది ప్రమాణగ్రంథము కాదని నీవెట్లు చెప్పగలవు?

రత్నమకుట—నిలుఁడు నిలుఁడు. ప్రస్తుతాంశము మఱచి మఱి యొక గొడవలోఁ బడితిరేల? మనము మహర్షిశ్రేష్ఠు డెవ్వఁడని కదా తగవులాడుచుంటిమి. ఆవిషయమే ముచ్చటింపుఁడు.

గంధ—అక్కలారా! మీరందఱు తలయొకనిం బేర్కొను చుంటిరి. సర్వముని సార్వభౌముండైన నారద మహర్షిమాట యెవ్వఱికును జ్ఞాపకము వచ్చినదికాదేమి?

సీ. పుట్టుకతోడనే పొడమె నేతపసికి
జ్ఞానవైరాగ్యవిశ్వాసబుద్ధి
భరియించె నెవ్వాఁడు పరమేష్ఠిశాపంబు
గామినీవైముఖ్య కలన నెసఁగి
బ్రహ్మాత్మజన్మతాపసు లెందరున్న నె
వ్వఁడు దేవమునియంచు వాసిగాంచె
మూఁడులోకమ్ములు క్రీడాలయములుగా
జరియించు నేమౌనిచక్రవర్తి

గీ. యక్షగంధర్వసిద్ధవిద్యాధరాది
ఖేచరులు భూచరులు శర్వరీచరులును
స్త్రీలుపురుషులు సమత నర్చింతు రెవని
నట్టి నారదమునియే సర్వాధికుండు.

చంద్ర—అవును ఆమహాత్ముని మించిన విరక్తుం డెవ్వఁడు కలండు?

క. జేరగునది యెఱిఁగిచేయును
పరిమిత్రులు శత్రులఖిలసముఁ డామునికిన్.
హరిభక్తాగ్రేసరుఁ డ
ప్పరమ తపోధనునిఁ బోలు పరముఁడు గలఁడే.

మధుమతి—చంద్రకళ మంచిమాట చెప్పినది మనలో మనకీ తగవేల. మన మన యభిప్రాయములు మన యత్తగారి కెఱింగింతము. అమ్మహాసాధ్వి యెట్లుచెప్పిన నది సిద్ధాంతము. ఈమాట కందరు నంగీకరింతురా? అని యడిగిన నేకగ్రీవముగా నొప్పుకొనిరి. అప్పుడే యాకాంత లందఱు సౌభాగ్యసుందరికడ కఱిగి తమ తమ వాద ప్రకార మంతయు నెఱింగించిరి. సౌభాగ్యసుందరియు నారదనామ స్మరణంబున నేదియో మఱచిపోయి జ్ఞాపకమురాక యాలోచించు చున్నట్లు తలంచుచుఁ గొంత సేపటికి వారికిట్లనియె.

యువతులారా! మహర్షుల తారతమ్యము తెలియక యుం డ్రాదిబృందారకులే తొట్రుపడుచుందురు. మనమెట్లు గ్రహింపఁగల ము? ఒక్కొక్కమహర్షియం దొక్కొక్క శక్తి లోకాతీతమైనది యొప్పుచుండును. ఏముని కాముని యే యధికుండని చెప్పవలయును. మూర్తిత్రయ తారతమ్యంబు నిరూపింప నెట్లు శక్యముకాదో యిది యు నట్టిదే. ఇప్పటికి మీరందరు గెలిచితిరి. అందరు నోడితిరి. సంత సింపుఁడని చెప్పిన విని యిందుప్రని కూఁతురు మధుమతి యిట్లనియె.

అత్తా! నీయభిప్రాయము నే దెలిసికొంటి. మాలో నొకరి వాదము గెలిపించినఁ దక్కినవారు చిన్నవోవుదురని యట్లుపలికితిరి. మీఁకు గోడండ్ర యందరియందు సమానప్రేమయున్నది. మొన్నమే మిట్లే పతివ్రతలలో నుత్తమురా లెవ్వతెయని వాదమాడితిమి. అన్ని విధముల మీరే యుత్తములని యేకగ్రీవముగా నంగీకరించితిమి. మీ యెదుట మిమ్ము స్తోత్రము చేయఁగూడదు కాని ప్రశంస వచ్చినది కావునఁ జెప్పుచుంటి. మీరు కోడండ్ర నందఱను సమముగా జూచు చు సమప్రేమతో నాదరించుచుందురు. మాపూర్వపుణ్యవిశేషంబున మీయట్టి యత్తగారు లభించినదని స్తోత్రములు జేయఁగా సౌభాగ్య సుందరి యిట్లనియె.

మధుమతీ! నాకోడండ్రియొక్క సౌజన్యమే నా కీమంచికిఁ గారణమగుచున్నది. మీలోమీరు తగవులాడక నక్కచెల్లెండ్రవలె మెలంగుచుండ నేనెంతయు మురియుచుందును. నీవు మూఁడులోకము లకు నధికారియగు మహేంద్రుని పుత్రికవు. నాకూడిగము సేయు చుండ నాభాగ్య మనన్య సామాన్యమని యొప్పుకొనకతప్పదు. నేను మీయందరి ముందర వెళ్ళినచో ధన్యురాలనగుదును. కాలమెట్టివారి కిని సమముగా నడువదు. ముందరి క్షణమున మనమెట్లుందుమో తెలియదు. ఇప్పటికి మంచిగానే వెళ్ళినది. అని పలుకుచుండఁగనే తాళధ్వజనృపాలుం డయ్యంతఃపురమునకుఁ దొందరగా నరుదెంచెను.

అమ్మహారాజుం జూచి కోడండ్రందఱు సిగ్గున దిగ్గున గదుల లోనికింబోయిరి. అసమయమున వచ్చిన భర్తరాకకు శంకించుకొనుచు సౌభాగ్యసుందరి తదాగమన కారణంబడిగిన నాయొడయుం డిట్లనియె.

ప్రాణేశ్వరీ! యిప్పుడు మనకుఁ జెడుకాలము వచ్చినట్లు తోచు చున్నది. బునబిడ్డలు నాలుగుదిక్కులు జయించివచ్చిరని సంతసించి తిమి. మనకు భూమియందుఁగల రాజులందఱు విరోధులైరి. అది య ట్లుండె. మన వీరవర్మ పాతాళలోకమునకుఁబోయి యందుఁగల రాక్ష సుల సంహారించి యాలోకము వశము జేసికొనియెంగదా. వజ్రకంఠుని పినతండ్రి పాతాళకేతుఁ డనువాఁడు దేవతలకుఁగూడ నజేయుఁడట. వాఁడు అయ్యతలమునందు రక్కసులకుఁ గలిగిన యపజయము విని రౌద్రావేశముతోఁ గొందఱరక్కసుల వెంటఁబెట్టుకొని యాయతలం బున కరుదెంచి యందున్న మన దూతలనెల్లం బరిమార్చి బిలద్వార మునఁ జిత్రకూటనగరమునకు వచ్చి యందు గాపున్న మనమూఁకల నెల్లఁ జీకాకుపఱచి మ్రింగుచున్నాఁడఁట. వాఁడు కుంభకర్ణునంత యున్నవాఁడఁట. వాని యాకారము చూచినంతనే మనుష్యుల ప్రాణములు పోవునఁట. అందున్న వాఱువపుతౌతు ఒకఁ డెట్లో వాని

బారి బడకుండఁ దప్పించుకొని వచ్చి యిప్పుడే యీవార్త చెప్పినా డని యెఱింగించిన జడియుచు నప్పడఁతి యిట్లనియె.

ప్రాణేశ్వరా! బిడ్డలందఱు నింటియొద్ద నున్నారా? ఈవార్త విన్నారా? విని యేమనిరి? అని యడిగిన నతండు విన్నారు. ఈలాటి నిశాటుల నెందరినో బరిమార్చితిమని బీరములు పల్కుచున్నారు. వాఁడిందు వచ్చుచున్నాఁడని తరువాతి వార్తవినికవచాదిసాధనముల ధరించి యుద్ధసన్నద్ధులగుచున్నారని పలుకుచుండగనే యక్కుమార శేఖరు లిరువదిమందియు వీరవేషములతో నచ్చటి కరుదెంచి తల్లికి నమస్కరించిరి.

ఆమె వారి నందరం దీవించుచు బిడ్డలారా! ఆరాక్షసుఁ డెక్కడనో యుండఁగనే యోధవేషము దాల్చితిరేల? మన గ్రామమునకు వత్తురని నిశ్చయించితిరా? అనియడిగిన వారు తల్లీ! వాఁడు కామరూపుఁడు ఎగురఁగలడు. మన నగరమునకు గోశదూరములో నున్నట్లు తెలిసినది. సేనల నంపితిమి. గుఱ్ఱము లెక్కి మేము వోవు దుము. వీఁడన నెంత? వీని తాతలవంటి రక్కసుల పీచమడంచితిమి. నీవు జింతింపకుము. విజయమగునట్లు మా కాశీర్వదింపుము. నీ కోడండ్రు జడియుచుందురు. అదటుడిపి యుదుటు గరపుచుండు మని పలికినవిని యాయిల్లా లిట్లనియె.

బిడ్డలారా! నామది నేదియో యదటు గలుగుచున్నది. మీ రిప్పుడు యుద్ధమునకు బోవలదు. శత్రువుల బలాబలంబులు విచా రింపఁవలయుంగాదే యనుటయు నవ్వుచు వీరవర్మ తమ్ములారా! అమ్మ మన పరాక్రమ మెఱుంగదు. వగచుచున్నది. నేనొక్కరుం డపోయి వాని యుక్కడంచి వచ్చెద. మీ రిందుండుండని పలికిన నామె సరిసరి. నీవొక్కరుఁడవు పోవరాదు. తమ్ములతోఁ బొమ్ము. జాగరూకులై పోరొనరింపుఁడని పలుకుచు నెట్టకేలకు వారి నంపినది.

పిమ్మట భార్యలకు జెప్పి వారిచే ననిపించుకొని యారాజకుమారు లందఱు తురగారూఢులై యారాక్షస వీరుల కెదురుగా బోయిరి. అప్పుడు,

క. కాలము మేలై యొప్పఁగ
వాలికపులి మేకయగుచు వశమగు మఱి య
క్కాలము చెడ మేకయె శా
ర్దూలంబై మీఁదఁబడి నిరోధించుగదా.

గీ. లీలరాక్షసులతో మావటీలతోడ
గుఱ్ఱముల నేనుఁగుల మ్రింగికొనుచు నసుర
తరిమి సేనల గబళింపఁ దాళలేక
పఱచె వెన్నిచ్చి సేన దిగ్భాగములకు.

అట్లా దానవవీరుండు రౌద్రాకారంబున సేనలం దరుముకొని వచ్చుచుండుటఁజూచి రాజకుమారు లందఱు నొక్కపెట్టున గుఱ్ఱముల వానిపైకిఁదోలి శూలంబులం బొడిచియు వాలమ్ముల నేసియు గుతారింబుల నరికియు నసుల విసరియు గదలమోదియు నిర్వక్రపరాక్రమంబున వానిం జుట్టుకొనుటయు వాఁడు కోపావేశంబున వామనమూర్తియుంబోలె నాభీలముగాఁ మేను బెంచి,

క. అరచేతఁ జఱచికొందఱ
గురుగతిఁ బిడికిళ్ళఁబొడిచి కొందఱఁ గాలన్
జరచర ద్రొక్కుచుఁ గొందఱ
నరనిమిషములోన వారినందఱఁ జంపెన్.

అట్లయ్యసుర గడియలో రాసుతులనెల్ల గతాసులం గావించి రాక్షసవీరులతోఁగూడ నిరాటంకముగ నానగరాంతరము ప్రవేశించి పేర్చిన కార్చిచ్చువోలె నలుమూలలు నాక్రమించి ప్రజాక్షయము గావింపఁదొడంగె. మఱియు,

సీ. పారిపోయెడువారిఁబట్టి పొట్టలుచీల్చి
రక్తంబు గ్రోలు ఘోరముగ నొకఁడు
ఇండ్లలోదూఱి పూఁబోండ్ల దాసీదాస
జనము లెంపలుకొట్టి చంపునొకఁడు
శిశువుల నురమునఁ జేర్చి మూలలడాగి
కొనువారి యీడ్చి చేదునుమునొకఁడు
వెఱచి వేయుఱుకు బాలుర నెత్తిచఱచి మొ
ఱ్ఱోయనం జకాఁడు నొక్కరుండు
గీ. డొక్కలూడగ వృద్ధుల ద్రొక్కునొకఁడు
నల్లులనుబోలె శిశువుల నలుపు నొకఁడు
పసులఁ బులిపోలె గొంతుకల్ పిసుగునొకఁడు
ఊరిపైఁబడి రక్కసు లుక్కుమీఱ.

పాతాళకేతుఁడు రాక్షసబలములతోఁగూడ నావీటి పయిం బడి మారిమెసంగినట్లు కనబడిన జంతువు పశుపక్షిమృగాదుల మనుష్యుల స్త్రీల వృద్ధుల బాలుర శిశువులఁబట్టికొని మొఱ్ఱోయని యఱవ మ్రింగుచుఁ జఱుముచు బ్రాముచుఁ బొడుచుచు ఆఁడుచుఁ ద్రొక్కుచుఁ బ్రజాక్షయము గావింపుచు నమ్మా! తండ్రీ! పుత్రా! మామా! అని యాక్రోశించుచు గుంపులుగాఁ బారిపోవు జనంబులఁ దరిమి పట్టుకొని పోగులుగా సంహరించుచుఁ బ్రళయకాలంబోయని యెల్లరు తలంప రెండుయామయములలో నానగరమంతయు మునుము వెట్టి శూన్యముగావించెను.

ఆరక్కసుఁడుక్కుమిగిలి పోరనరిగిన రాజుకుటుంబమునంతయు సమస్త సేనలతోఁగూడ నాశనముచేయుటయే కాక పట్టణమునందలి పశుపక్షి మృగాదుల మనుష్యుల నాబాలవృద్ధముగా భక్షించుచు వచ్చుచున్నాడను వార్త విని సౌభాగ్యసుందరి హాహాకారరవము

గావింపుచు దారుణశోకావేశంబున మేను దెలియంగక నేలంబడి మూర్ఛిల్లినది.

ఆ యుపద్రవవార్త కోటలోనున్నవారందఱకు దెలిసినది. అంతఃపుర స్త్రీలందఱు మహాదుఃఖావేశంబుతో బ్రాణబంధువుల మరణములకు దుఃఖించుచుం గటారులం బొడుచుకొనువారును దాదులచేం బొడిపించుకొనువారును నూంతులం దూకువారును అగ్నిలోంబడువారు మెడ కురిబోసికొనువారునై రెండు గడియలలో రాజస్త్రీలందఱు దేహత్యాగము గావించుకొనిరి. వారి పాటుజూచి దాసదాసీజనంబులు బలవంతముగనే హత్యలు గావించుకొనిరి. అంతలో నారక్కసుండు కోటలోం బ్రవేశించి మిగిలిన శిశు బాలవృద్ధులం గ్రుద్దుడై నెత్తిపై గ్రుద్దుచుం బెద్దనిద్దుర నొందంజేసెను.

మఱియు రక్కసులెల్ల నాకోట గొల్లకొట్టి పాతాళలోకము నుండి రాజకుమారులు తెచ్చిన రత్నములు, మండనములు, బంగారము నంతయు నెత్తికొని యాకోట పాడుపడదుచేసి తిరుగాం బాతాళలోకమున కరిగిరి.

అని యెఱింగించునంతం బ్రయాణసమయ మగుటయు నయ్యతిపతి యవ్వలికథ పై మజిలీయం దిట్లు జెప్పందొడంగె.

---

244 వ మజిలీ.

## నారదుని స్వస్వరూపప్రాప్తి.



క. పెద్దతడ వొడలు తెలియక
ముద్దియపడి కొంతవడికి మోహంబుడుగన్
దద్దయు విలపించెను బలు
సుద్దులం బుత్రుల దలంచి శోకము హెచ్చన్.

సౌభాగ్యసుందరి కొంతసేపటికి మేను దెలిసి యట్టె లేచి నలు దెసలం బరికింపుచు దాపున నెవ్వరింగానక కొంతపరిక్రమించి శవా క్రాంతములై యున్న ప్రాంగణ భూముల జూచి గతాసులైన కోడండ్ర మనుమలం బౌత్రికల దాసదాసీ జనంబులం జూచిచూచి గుండెలు బాదుకొనుచుఁ బెద్ద యెలుంగున నాక్రోశింపుచు నావాకళులన్నియు దిరిగి తిరిగి యొక్కొక్క కోడలింజూచి తచ్చర్యల స్మరించుకొనుచు దుఃఖింప నోదార్చుటకు నొక్కరైనను మిగులలైరిగదా! అప్పుడామె చిత్తవృత్తి యెట్లుండునో చెప్ప నెవ్వరితరము?

తన పతికూడ సహితునిచే మృతినొందింపఁబడెనని నిశ్చయించి యాసాధ్వీమణి శోకావేశమునఁ గర్తవ్యమెఱుఁగక యున్మత్తవోలె నాకోటలో నొక్కరితయుఁ దిరుగ జొచ్చినది. అంతలో నొక మూల నుండి తాళధ్వజుండు రక్కల దాడికోడి పారిపోయి వారూరువిడిచి చనిన తరువాత మఱల రణావని కరుదెంచి యందుఁ జచ్చిపడియున్న కొడుకుల మనుమల శవములపైఁబడి యేడ్చి యేడ్చి కోటలోనివా రెట్లుండిరో యవి తెలిసికొనుటకై యాప్రాంతమున కరుదెంచుటయు సౌభాగ్యసుందరి భర్తం గాంచి యతనిపయింబడి గోలు గోలున నేడ్చుచుఁ బ్రాణేశ్వరా! నాపుత్రులేరీ? ఒంటిగా వచ్చితి రేల? పిల్ల వాండ్ర యుద్ధభూమిలో విడిచివత్తురా? మీకక్కటికములేదా! అని పిచ్చిదానివలె నడుగుటయు నతం డామెనూఱడించుచు గౌగలించుకొని.

క. ఎక్కడి పుత్రికులయహో
ఎక్కడి పౌత్రికులు మానినీ! దుర్మతియా
రక్కసుఁడు మడియ జేసెను
నొక్కకొడుకునైన మిగులకుండఁగ నకటా!

మ. ప్రమదా! యేమని చెప్పువాఁడ మన మాపద్వార్ధిలో మున్గినా
రము దిక్కెవ్వరులేరు కాచుటకు రారమ్మందు నీపుత్రదే

హాము లెట్లున్నవో చూతుగాక కని దేహత్యాగముం జేసి స్వ
ర్గమునం దాప్తులఁగూడికొందము విచారం బేల నింకియెడన్.

అని పలుకుచు భార్య చేయిపట్టికొని తాళధ్వజుండు యుద్ధభూమికిఁ దీసికొనిపోయెను. సౌభాగ్యసుందరి యందు నరకఁబడిన కాళ్లతోఁ దెగిన చేతులతో మొండితల మొండి కళేబరముల గల పుత్రపౌత్రాదుల గాత్రములఁగాకగృధ్రములు పొడిచి పీకుచుండఁ జూచి గుండెలు బాదుకొనుచుఁ భర్తతోఁగూడ నాశవములమీఁదఁబడి,

సీ. అయ్యయ్యో శ్రీముఖుండా వీఁడు కటకటా
కమలాంచితాస్య తేజము నశించె
సౌమ్యుఁడా వీఁడయో చారుగాత్రమువాసె
గుందమాలాభి యుక్తుండుగామి
చిత్రభానుఁడె వీఁడు శివశివా గాత్రముల్
కడముట్టె వారుణీకలనబాసి
పుష్పకేతుఁడె వీఁడు పోల్పంగ విగత ర
త్నమకుటుండగుట ఖేదముఘటించె

గీ. ఖండితావయవములగు మొండెములఁ గ
నంగ గుండెలుపగిలెఁ బుత్రాంగకముల
గాక గృధ్రములీడ్వంగఁ గనియు నిట్లు
బ్రతికియుంటిని నావంటి పడఁతి గలదె.

అయ్యయ్యో? నాకుమారులు హంసతూలికా తల్పంబులఁ బండికొనియు నొచ్చియునని పలుకుచుందు రట్టి ముద్దుకట్టల యవయవము లిట్లు ఖండితంబులై జంబుకంబులు దినుచుండఁ జూచియు మేనం బ్రాణంబులు దాల్చియుంటి నావంటి మొండికత్తె యెందైనగలదా! ఛీ! నేనొక ప్రేమగలదాననే. ఔరా! ఎంతలోఁ గాలము మారిపోయినది. నేఁటి యుదయకాలముననే కాదా కోడండ్ర తగవులు

దీర్చుచు నావంటి భాగ్యశాలిని యొదును లేదని గరువపడితిని. హాహా! నిన్న నీపాటివేళ నాముద్దు కొమరులతో మాట్లాడుచు వారివారి భార్యల సౌందర్యంబునం గల తారతమ్యముల నిరూపించు చుంటి. ఛీ! ఛీ! నావంటి దౌర్భాగ్యురా లెందునులేదు. నాభర్త చెప్పినట్లు మృతినొంది సుతులతో ముచ్చటించెదనని పెద్దయెలుఁగున రోదనముజేయుచుఁ బౌత్రుల శవంబుల వెదగివెదకి గురుతుపట్టి తచ్ఛవంబులమీఁదఁబడి నాపోవుచు బెద్దతడ వాయుద్ధభూమి యున్మత్తవలె దల విరియఁబోసికొని తిరుగుచుండె. అప్పుడు,

క. వీపునఁ గృష్ణాజినము జ
టాపటలము శిరమునందొడల భూతియు ను
ద్దీపింపఁ బొఱుఁడొక్కరుఁ
డాపడఁతి సమీపమునకు నరుదెంచి తగన్.

వృద్ధబ్రాహ్మణుడు—అమ్మా! నీవెవ్వతెవు? ఇట్లు దుఃఖించుచుంటి వెవ్వరి నిమిత్తము?

సౌభాగ్యసుందరి—(నమస్కరించి) మహాత్మా! నాదౌర్భాగ్య మేమి చెప్పుదును? ఏను తాళధ్వజనృపాలునిం బెండ్లియాడితిని. లోకైకవీరు లిరువదిమంది కుమారు లుదయించిరి. నాలుగుదిక్కులు జయించి త్రిభువనైకసుందరులం బెండ్లియాడి పెక్కండ్రఁబుత్రులం గనిరి. మావంశము యాదవవంశమువలె వృద్ధినొందినది. ఈదినమున శత్రువులచే నాకుటుంబ మంతయు నాశనమైనది. నేనును నాభర్త మాత్రము మిగిలితిమి. తండ్రీ! అని దుఃఖించినది.

వృద్ధ—అమ్మా! నిన్నొక్కమాట నడిగెదఁ జెప్పుము. నీవా రాజుం బెండ్లియాడి యెంతకాలమైనది?

సౌభా—ఎనుబది సంవత్సరములైనది. ఆహా! నేననుభవించిన సౌఖ్యము ఇంద్రాణియైన ననుభవింపఁలేదు. తండ్రీ! ఆవైభ

వమంతయు గడియలో స్వప్నప్రాయమైనది. అని పెద్ద యెలుంగున రోదనము గావించినది.

వృద్ధ—కోమలీ! నీవు శోకముడిగి నామాటవింటివేని జెప్పెద. లేకున్న నాదారింబోయెద. నామాటలకు సమాధానము జెప్పుము.

సౌభా—చిత్తము. మహాత్మా. చిత్తము.

వృద్ధ—నీవారాజుం బెండ్లియాడకపూర్వ మీసంతతియంతయునున్నదియా?

సౌభా—ఎవ్వరులేరు స్వామి! పెండ్లియాడిన తరువాతనే యీకుటుంబమువృద్ధియైనది. గడియలో నాశనమయినది. అని శోకించినది.

వృద్ధ—మొదటలేదు నడుమవచ్చినది. చివరపోయినది. ఇందులకు వగచెద వేమిటికి? సంసారము మోహజనకము క్షణభంగురమని తెలియదా? వీరికి నీవేమగుదువు? వీరు నీకేమగుదురు? ఎట్టి సంబంధము? గర్భవాస సంబంధము. వారికి నీవంటి తల్లులెందరైరో! నీవిదివఱ కెందరకుఁ దల్లివైతివో! అందఱికొఱకు నిట్లుదుఃఖించుచుందువా? ఈచక్ర మిట్లు తుది మొదలులేక గడియారమువలెఁ దిరుగుచునే యుండును. నీవు పుత్రోదయము సుఖమని మురిసితివి. ఆమురిపెమే యీ వెఱపునకుఁ గారణమైనది. అదియే లేనిచో నిదియును లేకపోయెడిదే సంసారమాయామార్గ మిట్టిదని తెలిసికొనుము. ఏడవకుము. లెమ్ము. లోకమంతయు నస్థిరమని యెఱింగిన శోకముందునా? ఇంతయేల? నీమాట చెప్పుము. ముందరిక్షణమున నీవెట్లుందువో తెలియునా? సంసార ప్రవాహంబునఁ బుద్బుదములవలె గొట్టికొనిపోవుచు దేహులు మోహావేశచిత్తులై దుఃఖసముద్రంబునం బడిపోవుదురుగదా! కావున విలపించిన ప్రయోజనములేదు. లెమ్ము. అదియ పుణ్యసరోవరము. అందు స్నానమాచరించిన మనోమలంబు

వాయఁగలదు. స్నానమాచరింపుము. అని యుపదేశించుటయు నా యోషామణి కించుక విరక్తిగలిగినది. సంసారము స్వప్నప్రాయము. ఎండమావుల నీరు గోరిలదలంచినట్లిందు సుఖపడఁదలంచుట భ్రాంతియేయని తలంచుచు నాచంచలాక్షి అట్టిలేచి యాపాటుని వెంట నల్లంత దవ్వులోనున్న తటాకమున కరిగినది. భర్త యించుక యెడముగ నుండగనే మనములోదుఃఖించుచు నాజలాకరము లోనికిఁ దిగి దలవిప్పికొని మూడు మునుఁగులును మునింగి లేచినంత,

క. తీరమునఁ జూచె గరుడుని
చేరువఁ గూర్చున్నవిష్ణుఁ జెంతను తన వీ
ణారత్నము నజినంబును
దారుకమండులువు విస్మితస్వాంతుండై.

పిమ్మటఁ దనయాకారము జూచుకొని యెప్పటి నారదవేషము ప్రత్యక్ష్యంబగుటయు మోహావివశుండై తన కుపదేశించిన బ్రాహ్మణునంచుఁ గానక క్రమ్మఱ దరిదెసకు జూపుల వ్యాపింపఁజేసి యందున్న శ్రీహరిని, దనవీణా కమండలువులగాంచి కన్నులనూసికొని సౌభాగ్యసుందరీ వృత్తాంతమంతయుఁ దలంచుచు నేది నిజమో యేది యసత్యమో తెలిసికొనఁజాలక తొట్రువడుచున్న సమయంబునఁ బుండరీకాక్షుఁడు మందహాసము గావించుచు,

ఉ. స్నానము సేత కింత యట జాగొనరించితివేల? నీ యను
ష్ఠానము దీర్చుకొంటె మునిచంద్రమ! రమ్మిట వేగ మేనునున్
స్నానముజేసి వచ్చెద వెసంజనగాఁ దగు నూరిలోనికిం
భానునిబింబ మవ్వడె నభంబు నగంబెగఁబ్రాకెఁ జూడుమా.

అని పిలుచుటయు నతం డాహా! ఇదియేమి మోహము? తాళధ్వజునితో నేనఁబదియేండ్లు కాపురముజేసి యిరువదిమంది బిడ్డలం గనిన దంతయు వట్టిదే. ఇది స్వప్నము కాఁబోలు. నేను

నారదుఁడనా? సౌభాగ్యసుందరినా? సరి సరి. గర్భధారణ ప్రసవ వేదనము మొదలగు చర్యలన్నియుం గన్నులకుఁ గట్టినట్లుండ నిది వట్టిది యెట్లగును? అయ్యో! నేను నారదుండగానా! స్నానము చేయుమని నన్ను విష్ణుండు ప్రేరేప నిందు మ్రుంకలేదా! ఇంతలో నింతకాలమైనట్లున్నదే! ఇంద్రజాల మేమో? ఏమియుఁ దెలియకున్నది గదా! నే నిప్పుడు నిద్రలో నుంటినేమో! ఇంతయు నచ్యుతున కెఱింగించి నిజము దెలిసికొనియెదం గాక! అని యాలోచించుచు మెల్లగా గట్టెక్కి విష్ణునికడ కరుగుచుండెను.

అంతలో నా తాళధ్వజనృపాలుం డాతటాకము దాపున కరుదెంచి పెద్ద యెలుంగున సౌభాగ్యసుందరీ! సౌభాగ్యసుందరీ! యని పిలుచుచుఁ బ్రతివచనంబు బడయక గుండెలు బాదికొనుచు,

అయ్యో! అయ్యో! నాప్రాణనాయకి యీకొలనిలోఁ దిగి మునింగి పోయినది. జలజంతువులు మ్రింగినవి కాఁబోలు. అక్కటా! నేనిఁక నెట్లు బ్రదుకువాఁడ. హా! పరమేశ్వరా! అని పలుకుచు మూర్ఛవడి కొంతవడికి లేచి నలుదిక్కులు సూచుచు నింకెక్కడి సౌభాగ్యసుందరి! నీటిపాలైనది. అని గోలుగోలున నేడువఁ దొడంగెను. మఱియు,

సీ. సౌభాగ్యసుందరీ! నాభాగ్యదేవతా!
సతి! నన్ను విడిచిపోయితివె నీవు
వదలెనే నేఁటితో ముదిత! నీతోపొందు
నాకు దిక్కెవ్వరున్నార లింక
కలికి నీప్రథమసంగమము నాఁటివినోద
ములఁ దలంచిన గుండె కలకఁ జెందె
స్త్రీరత్నమనుచు వర్ణింపఁగాఁదగు నిన్నె
తప్పులెన్నద నరుంధతికినైన

గీ. సాధ్వి నీయట్టిసతి యెన్ని జన్మములకు
నైన దొరకునె తలక్రిందుగాను నిలిచి
తపముజేసినగాని నీ! తలఁచిచూడ
వట్టి నిర్భాగ్యుఁడనై తిఁ జివరకు నేను.

అని యమ్మహారాజు సౌభాగ్యసుందరి తనకడకు వచ్చినది మొదలు నాఁటి తుదివఱకు జరిపిన చర్యలన్నియు నుగ్గడించి దుఃఖించుచు నా సరోవరములోఁదిగి వెదకుచుండ నాలించి నారదుండు అచ్చర్యలెల్లఁదాను గావించినవిగా నెఱింగియు నేమియుందోచక యూరక చూచుచుండె నప్పుడు శ్రీవిష్ణుండా భూపాలుఁ దాపునకు రమ్మని చీరి సమీపించినంత,

నీ వెవ్వఁడవు? ఎవ్వరి కొఱ కిట్లు విలపించుచుంటివి? ఆతటాకములో వెదకుచుంటి వేమి పోయినది? అని యడిగిన నాభూనేత తన కథయంతయుం జెప్పి నాకళ్యాణరాశి నాసౌభాగ్యసుందరి నాజీవితేశ్వరి, యీతటాకములో మునిఁగి తిరుగా లేచినదికాదు. జలజంతువు లేవియో మ్రింగినవి. ఆయెమ్ములకున్నవందు వెదకుచుంటి తండ్రీ! మీకుఁ జాలపుణ్యముఁ రాఁగలదు. అందులకు సహాయము జేయుదురే. అని వేడికొనిన నవ్వుచు ముకుందుం డిట్లనియె.

నీటిలో మునింగినవా రింతసేపు జీవింతురా? నీభార్య మకరగ్రస్తయై పరలోకమునకరిగినది. ఎంత విలపించినను నీకాంత రానేరదు. వగపు నిరర్థకము. మూఢుండవై యేల విలపించెదవు? ఇంటికింబొమ్మని పలికిన విని తాళధ్వజుం డిట్లనియె.

అయ్యయ్యో! నాభార్య లోకము వరిపాటిబోటికాదు. తండ్రీ! ఆసుగుణములు, ఆప్రేమ, ఆయనురాగము ఇట్టిదని చెప్పఁజాలను. కుటుంబమంతయు నశించినను నాయిల్లాలు బ్రతికియున్న నేనిట్లు విల

పింతువా? ఇంటికిఁబోయి యేమిచేయుదును? ఇల్లు సర్వశూన్యమై యున్నది. నేనుగూడ నాతటాకములోఁబడి ప్రాణములవదలెద. నాకు వేరొకగతిలేదని దుఃఖింపఁదొడంగిన వారించుచు నిందిరాభర్త రాజా! నీవు శాస్త్రములేమియుఁ జదువలేదా? పురాణములు విన లేదా? పెద్దల సహవాసమేమియుఁ జేయలేదా? నీవు పట్టి మూఢుఁ డవువలె దోచుచుంటివి. వినుము ప్రవాహరూపమైన సంసారమున భార్యా పుత్రాదులు నావయెక్కుటకుజేరిన పాంథులవలెఁ జేరికొని యెవ్వరిదారిని వారు పోవుచుందురు. వెనుకటి జన్మమున నామె యెవ్వతె? నీవెవ్వఁడవు? ఇప్పుడు కలిసి కొన్నిదినములు గాపురము సేసిరి. ఆమెదారి నామె పోయినది. నడుమవచ్చినది నడుమపోయినది. మొదటినుండియు నీకడనున్నదా! చేరకపూర్వ మామెయందు నీకీ మోహమున్నదియా! ఆమెరాక నీకు సుఖముగలిగించినది. పోక దుఃఖమైనది. దుఃఖాంతములు సుఖములని యెఱుఁగవా. జ్ఞానము దెచ్చికొని మోహమును నాశనముజేయుము. తపోవనంబునకుంబోయి యోగముపట్టి ముక్తుండవుకమ్ము. కానిచో మఱియొకయువతిం బెండ్లి యాడుము. వేయిసంవత్సరములు విలపించినను నీకాసుందరి గనం బడదు. పొమ్మని పలికిన విని యారాజు శ్రీహరికి నమస్కరించుచు నిట్లనియె.

అయ్యా! మీరెవ్వరో మహానుభావులగుదురు. మీమాటలచే నాశోకము కొంత తఱిగినది. కాని స్వామీ! నా సౌభాగ్యసుందరి నెట్లు మఱవఁగలవాఁడను? ఆనరోక్తులు, ఆప్రియభాషణములు ఆక్రీడలు తలంచికొనిన నామనసు దుఃఖసముద్రములో మునిఁగిపోవు చున్నది. అబ్బా! దురంతశోకానలంబున నామేను భగ్గున మండిపోవు చున్నది. ఎట్లు తాళుదును సామీ! అని పరితపింప నాక్షేపించుచుఁ బుండరీకాక్షుం డిట్లనియె.

నీ మూర్ఖుఁడా! నాచెప్పిన నీతియంతయు వఱదపాలుగావించి తివే. మోహమన నిదియేకాదా? ఇంత తెలిసికొనఁజాలకుంటివేమిః ఇది యొక యింద్రజాలమని గ్రహింపుము. ఎండమావులలో నీరు గ్రోలఁగలవా? నీవిట్లెన్నికల్పములు దుఃఖించినను నీభార్య కనంబడదు. విరక్తుండవై యింటికిఁ బొమ్మని యుపదేశించిన విని తాళధ్వజుం డేమాటయుం బలుకనేరక లోలోపల దుఃఖించుచుఁ దటాకములో స్నానముజేసి యింటికిం బోయెను.

అని యెఱింగించి—పై మజిలీయం దిట్లు చెప్పఁదొడంగె.

## 245 వ మజిలీ.

క. నారదుఁ డామాటలఁ జెవు
లారఁగ విని నృపతిఁ గన్నులారఁగని యప
స్మారుని గతిఁ దనమదిలో
నూరక తలపోసిపోసి యూహగలంగన్.

గీ. నవ్వు, విలపించు, వగచిడెందమున దాను
మున్ను జేసిన చేష్టలనన్ని దలఁచి
స్వప్నమో! భ్రాంతియో! యింద్రజాలమో! య
టంచుఁ దర్కించు నాకస మట్టెచూచి.

అతని చిత్తవికారంబరసి సరసిజాక్షుండు నవ్వుచు నారదా! నీవున్మత్తుండువోలె నీలోనీవే మాటలాడికొనుచుంటివేమి? జలంబుల మునింగి వింతలేమైన గంటివా? అని యడిగిన గ్రహించి నారదుండు ఓహోహో ఇదియా తాతా! తెలిసికొంటి నీవుపన్నిన యింద్ర జాలమా! నీచేతవంచింపఁబడితి. మాయాబలము జూపితివి. ఔరా! ఎన్నివిచిత్రములు గావించితివి? లెస్స. లెస్స. నేనాఁడుదాననై గావించిన చర్యలన్నియుఁ గన్నులకుఁ గట్టినట్లున్నవి గదా! అయ్యో!

తలంచికొనిన సిగ్గగుచున్నది. స్వామీ! నిజముగాఁ దాళధ్వజుఁ డున్నాఁడా? అతఁడు నావంటివాఁడేనా? అతండు నన్నుగురించి యుగ్గడించిన చర్యలన్నియు నేను గావించినవియే. అవి యన్నియు నిప్పుడు జ్ఞాపకమున్నవిగదా! నేను నారీదేహసంస్థుఁడనైనప్పుడు నారదదేహవృత్తాంతమేమియు జ్ఞాపకము లేదేమి? మనస్సు, బుద్ధి, చిత్తము, లింగదేహము, అదియే కదా. ఈమోహమేమిటికిఁ గలుగవలయును? అని యడిగిన శ్రీవిష్ణుఁ డిట్లనియె.

నారదా! తాళధ్వజుండు నావంటివాడేనా యని యడిగితివి. నీవంటివాఁడు కాక యతండు నిత్యుఁ డాయేమి? ప్రపంచకమంతయు మాయాబలంబున నున్నట్లు కనంబడుచున్నది. అంతయు మిథ్యకాదా? సర్వజంతువుల దేహములయందు దశాభేదములంబట్టి మాయావిలాసములు వ్యాపించియుండును. జాగ్రత్స్వప్న సుషుప్తులని యవస్థలు మూడుగలవు నాలుగవది దేహాంతరప్రాప్తి. స్వప్నవృత్తాంతములు మేలుకొనినతోడనే యన్నియుఁ బొడకట్టును. కలలోనున్నప్పుడు బాహ్యప్రచారము లేమైనం దెలియబడుచున్నవియా? నిద్రచేఁ జిత్తము జలింపఁగా స్వప్నములు వచ్చుచుండును. క్రూరజంతువులు తన్ను దఱుముకొనిరా స్థూలేంద్రియములు లేకపోవుటచేఁ బారిపోవ సమర్థుఁడుకాఁడు. ఎన్నఁడో చచ్చిన పితామహుఁడు తనయింటికివచ్చి భుజించినట్లు కనంబడును! లేచినతోడనే యదియంతయు నసత్యముగాఁదోచును. అతఁడు వచ్చుటసత్యమా? అసత్యమా? కన్నులార జూడఁబడినట్లు మాట్లాడినట్లు తెలియబడుచుండును గదా. అదియే మాయాబలము. అప్పుడు నీవు నారదుండవని తెలిసికొనలేకపోయితివి. ఇప్పు డాకథలన్నియుఁ దెలియబడుచున్నవి. మాయావిలాసములు స్వప్న భ్రమలవంటివని యెఱుంగుము.

మఱియు నేను శంకరుండు బ్రహ్మయుఁగూడ మాయాబల

విశేషములఁ దెలిసికొనఁజాలము. ఇతరులమాట జెప్పనేల? గుణత్రయముచే స్థావరజంగమాత్మకమగు జగంబు జనించినది. గుణములేక సంసారము గలుగదు. గుణములేనివాని నేనిదివఱకుఁ జూచియుండలేదు. వినలేదు. నేను జితమాయుండనని పలికితి వందులకై నీకీ మాయాబలము జూపితిని. తెలిసినదియా? అని యడిగిన నారదుండు సిగ్గుపడుచు హరికి నమస్కరించి యతని వీడ్కొని తిన్నగా బ్రహ్మలోకమున కరిగి తండ్రికి నమస్కరించె.

క. మునిఁగనుఁగొని చతురాననుఁ
డనురాగముతోడ నిట్టులను నీమోహముం
గనఁ జిన్నవోయియున్నది
తనయా! యెఱిఁగింపు సువిదితనయా! యనినన్.

నారదుండు తండ్రీ! నామోహమునకంతయు నీవే కారకుండవు. నాయవమానమేమని చెప్పుకొందును? పుట్టినతోడనే జ్ఞానమార్గ ముపదేశింపుమని కోరికొనినఁ గోపించి గంధర్వజన్మ మెత్తించి పెద్ద కాలము ఏబదుగుర భార్యలతో గార్హస్థ్యధర్మముల ననుభవింపఁజేసితివి. తరువాత దాసీపుత్రుం జేసితివి. అంతటితో విడువక సృంజయుని పుత్రికతోఁ గూర్చితివి. పిమ్మట నేను హరిభక్తుండనని పేరు పెట్టుకొని వైకుంఠమున కేగఁగా నన్ను విటాధమునిఁగా దలంచి కమల జాటునకుఁబోయినది. అందులకు నగుచు శ్రీవిష్ణునితోఁ జెప్పఁగా నతండు పామరునకుఁబోలెనది మాయాబలము. పతివ్రత పరపురుషులకడ నిలువరాదని ధర్మములు బోధించెను. నీ పెద్దబిడ్డలు సనకసనందనాదులరిగిన లక్ష్మీదేవి చాటునకుం బోఁగలదా! విష్ణుడట్లు జెప్పగలఁడా? నాకర్మము. నన్నధమాధమునిఁగాఁ దలంచి యాఁడుదానింజేసి యనేక నీచకృత్యములు చేసినట్లు పన్ని నాకుఁ దగనియవమానము గావించెను.

నేను మునులలోఁ గడుహీనుండనైతిని. పామరుండనైతి గా నిమ్ము. నాకిదియొక ప్రారబ్ధకర్మ మగుంగాక. ఇటుపైన నాప్రజ్ఞ జూతురుగాక. నేను జితమాయుండనై త్రిమూర్తులనుగూడ మాయా బద్ధులం గావింపఁజాలకపోయినచో నన్నీ పేరఁ బిలువకుఁడు. ఇందు లకు నీవు నాకొక యుపకారము గావింపవలయును. దక్షుండు నన్నొ కచో నిలువకుండునట్లు శపించియున్నాఁడు. అకార్యంబు తపంబునకు విఘ్నప్రదంబు కావున నేను తపంబుగావించునంతకాలము నన్నా శాపదోష మంటకుండ వరంబిమ్ము. ఇదియే పదివేలనికోరిన బ్రహ్మ సంతసించుచుఁ బుత్రు నాలింగనంబు జేసికొని యిట్లనియె.

పుత్రా! నిన్ను సంసారిగాఁజేయు తలంపుతో మొదటినుం డియు నీతపంబున కంతరాయము గల్పించితి. నీవు రెంటికిం జెడిన వాఁడవైతివి. కానిమ్ము. నీయభీష్టము వడువునఁ దపంబు గావించి సర్వోత్కృష్టుఁడవు కమ్ము. నిన్ను దక్షశాపంబంటకుండ వరంబిచ్చితిఁ బొమ్ము. తపంబు సర్వకార్యసాధనమని యనుజ్ఞయిచ్చుటయు సంత సించుచు నారదుఁడు తండ్రియాజ్ఞ గొని ధరిత్రిసతిపవిత్రమైన బదరి కారణ్యమునకరిగి యందు నియమితచిత్తుండై,

చ. తరణికరప్రహేతిపరితప్త నిదాఘమునందుఁ బావకాం
తరమున నభ్రఘోషభయదంబుల వార్షికరాత్రులందు బీ
తర బయలన్ హిమంబుగురియన్ వడకించెడు శీతకాలమం
దరుదుగఁ గంఠదఘ్న జలమందు వసించి మునీంద్రుఁ డుద్ధతిన్.

నిరాహారుండై దక్షిణపాదాంగుష్ఠంబుననిల్చి యచలంబు వోలెఁ గదలక యనేక సహస్రదివ్యవర్షంబు లత్యుగ్రతపంబు గావిం చుటయుఁ దన్మూర్ధాంతరంబునుండి వెల్వడిన జ్వాలనంబు ప్రజ్వలజ్జ్వాలా భీలంబై ప్రళయానలంబు పగిది జగంబులఁ బీడింపఁ దొడంగినది. మఱియు,

చ. జలనిధులేడునుంగలఁగె సప్తకులాచలముల్ జలించె ది
క్కులఁ బొగ(గ్రమ్మె వే తిరిగెఁ గుమ్మరిసారెగతిం ధరిత్రి వ్యా
కులపడె నెల్లదేవమునికోటు లిదేమి? యయో? యకాలపుం
బ్రళయమటంచు నారద తపః ప్రభవానల దహ్యమానులై.

అయ్యకాండ ప్రళయంబునకు వగచి హాహాకార రవంబులు సేయుచు ముప్పదిమూడుకోట్ల వేల్పులు దిక్పతులు సేవింప నింద్రుఁడు పరమేష్ఠికడ కరిగి యయ్యుపద్రవ ప్రకారం బెఱింగించుటయు నా సృష్టికర్త వారినెల్ల వెంటఁబెట్టికొని నారదునొద్దకుంబోయి వత్సా! నారద! నీతపంబు లోకంబులం బీడింపుచున్నది. నీయభీష్టంబు దెలిపి వరంబులంది తపం బుపసంహరింపుమని పలికిన నతనిమాట వినిపించు కొనక యథాప్రకారంబు తపంబు గావింపుచుండెను.

అప్పుడు బ్రహ్మ యాదేవసమాజముతోఁగూడ శంకరు నొద్ద కుంబోయి నారద తపఃప్రవృత్తిం దెలుపుటయు నమ్మహాత్ముండు వారెల్ల దనవెంటరా నత్తపోధన సత్తముని సవిధంబున కరిగి బోధింపుచు నిట్లనియె.

క. యతివర యేమిటికి ట్లు
(గతపంబొనరింపుచుంటిఁ గడువడి లోక
త్రితయముచలింప నీకా
మితమదియేమియొ వచింపుమీ యిత్తుననన్.

మహేశ్వరున కేమియుఁ బ్రత్యుత్తర మీయక నారదమహర్షి తపంబు విరమింపఁడయ్యె నప్పుడయ్యుమాపతి యెల్లవేల్పులతోఁగూడ వైకుంఠంబున కరిగి రమాధవున కయ్యుదంత మెఱింగించె నప్పుడా శ్రీమన్నారాయణుండు లక్ష్మీసహితుండై బ్రహ్మరుద్రాదులతో నారద మహర్షి యొద్దకుబోయి తచ్ఛిరంబునఁ దనకరంబిడి,

శా. వత్సా! నారద! లెమ్ము నీవిటుల దుర్వారజ్వాలద్వహ్ని భూ
భృత్సాదృశ్యముగాఁ దపంబునలుపన్ భీతిల్లె లోకంబు లా
పత్సమ్మగ్నములై వచింపుము భవద్వాంఛా విశేషంబుల
త్యుత్సాహంబున నీయవచ్చితిమి దివ్యుల్ గొల్వ మేమీయెడన్.
గీ. ఇతఁడు మాతండ్రి బ్రహ్మ గిరీశుఁ డీత
డితఁడు సురపతి వీ రెదిక్పతులు వీరు
వాగ్రమాపార్వతులు వింధ్యవాసినియును
వరములీయంగ నీకిందు వచ్చినారు.

ఏను వాసుదేవుండఁ దపంబు చాలించి నీకోరికల దెలుపు మని పలికిన విని నారదుండు కన్నులందెరచి యెదుర సర్వలోకాధిపతులఁ ద్రిమూర్తుల సకలదేవతాసమూహములఁ గనుంగొని మేనంబులక లుద్భవిల్ల వారికెల్ల నమస్కారములు గావించుచు నారాయణు నుద్దేశించి యిట్లనియె.

మహాత్మా! నాయభీష్టంబుదీర్ప నిప్పటికి దయవచ్చినదియా? నాకడకు నీభార్య లక్ష్మింగూడ దీసికొనివచ్చితి విది వింతగానున్నది. నేనా మహాదేవి దర్శనముసేయ సర్హుండనైతిగా. నన్ను నాఁడు నీవాఁడుదానిం జేసి యనేక మాయావిలాసంబులం జూపితివి. జ్ఞాపకమున్నదియా. అయ్యవమానంబు బాధింప నీ ఘోరతపంబు గావించితిని. నాకేకోరికయునులేదు. మాయను జయించుటయే నాయుద్దేశము. నన్ను జితమాయుండనని మీరెల్ల నొప్పుకొందురేని యీతపంబు చాలింతు లేకున్న నింకను ఘోరముగాఁ గావింతు నిదియే మదీప్సిత మని పలికిన విని సంతసించుచు నారాయణుం డిట్లనియె.

మునీంద్రా! నీవిప్పుడు జితమాయుండ వైతివనుట కేమియు సందియములేదు. మాయాస్వరూపిణియగు మూలప్రకృతి యాదిశక్తి యీదేవచ్చి నీకడనిలిచి నీకు వశవర్తినినైతినని సూచించుచున్నది.

పుటంబిడిన బంగారమువలె నీవీతపఃకరణంబునఁ బరిశుద్ధుండవైతివి. నీగుణములన్నియు నశించినవి. త్రిమూర్తులకుఁగూడ గుణములున్నవి. నాఁటి యవస్థననుసరించి నిన్నట్లనవలసివచ్చినది. ఇప్పుడు నీవు సర్వ సముఁడవైతివి. త్రిమూర్తుల పత్నులేకాక యింద్రాణి ప్రభృతి దేవ కాంతలు నీకడ సిగ్గుపడరు. ఎవ్వరి యంతఃపురమునకరిగినను నీకాటం కము లేదు. వారివారి నెలవులతోఁబని లేదు. నిష్కాముఁడవగు నిన్నుఁ జూచిన నెవ్వరికిని సందియము గలుగదు. సర్వమహర్షులందే కాక మద్భక్తులలో నీవే యగ్రగణ్యుఁడవైతివి. ఎల్లలోకముల స్వేచ్ఛా విహారములు సేయుచుందువుగాక. సమస్తపురాణములు నీముఖంబున వెలువడఁగలవు. తత్వజ్ఞుండవను నీకే చెల్లును. నీవెఱింగిన తత్వరహస్య ములు దేవతలుగూడ దెలిసికొనఁజాలరు. నీయన్నలు సనకసనంద నాదులకన్న నీకే యెక్కువ ఖ్యాతిరాఁగలదు. అని యెన్నియో వరములిచ్చి విష్ణుండు నారదమహర్షిని సంతోషపఱచె.

పిమ్మట బ్రహ్మయు శంకరుండుగూడ నతనికి సర్వాధికుఁడగు నట్లు మఱికొన్నివరము లిచ్చిరి. అట్లు సమస్తదేవతాసమూహముచే సర్వమునిసార్వభౌముండని కీర్తింపఁబడి నారదుండు వారికెల్ల వంద నంబులొనరించి శ్రీహరిం బెద్దగా స్తుతియించెను.

బ్రహ్మాదిదేవత లమ్మహర్షిని దీవించి తమతమ నెలవులకుఁ బోయిరి.

అని యెఱింగించి—మఱియు నిట్లనియె.

---

## 246 వ మజిలీ.

# శుక నారద సంవాదము.

—∘—(౦)—∘—

ఒకనాఁడు నారదమహర్షి యదృచ్ఛగా స్వాధ్యాయనిరతుం డగు శుకమహర్షియొద్ద కరుగుటయు నమ్మునివరుం డతని నర్ఘ్య పాద్యాదివిధులనర్చించి సుఖోపవిష్టుండైన పిమ్మట నేదియోయడుగఁ దలంచి యతని మొగముపైఁ జూట్కులు నెరయఁజేయుటయు నారదుం డతని యాశయము గ్రహించి యిట్లనియె. ధర్మజ్ఞా! నావలన శ్రేయస్కరమగు ధర్మ మేదియేని వినఁదలతువేని యడుగుము. నాయెఱింగి నంత వినుపింతు ననవుఁడు శుకమహర్షి మహాత్మా! ఈలోకమందు హితమైన దేదిగలదో యది నాకెఱింగింపుమని యడిగిన నారదుం డిట్లనియె.

వత్సా! పూర్వకాలంబునఁ దత్త్వాభిలాషులగు ఋషులకు సనత్కుమారుఁ డెఱింగించిన విషయంబులు గొన్నిగలవు. అవి ముముక్షుజన శ్రోత్రానందంబులై యుండు. వాని నెఱింగించెద నవహితుండవై యాలింపుము. విద్యాసమంబగు చక్షువు సత్యసమంబగు తపంబు, రాగసమంబగు దుఃఖంబు, త్యాగసమంబగు సుఖంబు లేదని పెద్దలు సెప్పుదురు. పాపకర్మలయందు నివృత్తి, పుణ్యకర్మలయందుఁ బ్రవృత్తియుఁ గలిగియుండుట శ్రేయము. సుఖలేశ శూన్యమగు మానుషజన్మమెత్తుట కెవ్వఁ డుత్సహించునో వాఁడే మోహమును బొందువాఁడు. దుఃఖము సంయోగమువలన వచ్చును. సక్తునియొక్క బుద్ధి మోహజాలమును బెంపుజేయును. మోహయుక్తుఁ డిహపరముల యందు దుఃఖమునుబొందును.

శ్రేయస్కాముఁడగు వాఁడు సర్వోపాయములచేతను గామ క్రోధముల నణఁచు ప్రయత్నము చేయుచుండవలయును. మఱియుఁ గ్రోధమువలనఁ దపస్సు, మత్సరమువలన సంపద, మానావమాన

ములవలన విద్యను, ప్రమాదమువలనఁ దన్నును రక్షించుకొనుచుండ వలయును. ఏభూతమునకు ఘాతుకత్వము దలంపకపోవుటయే యుత్తమధర్మము. అంతకన్న క్షమ యుత్తమమైనది. అంతకన్న నాత్మజ్ఞానము శ్రేష్ఠము. దానికంటె సత్య మెక్కుడిది. దానికంటె సర్వభూతహితముగాఁ బలుకుట మంచిది. భూతహితము గోరుటయె సత్యమని నామతము.

సర్వారంభముల విడిచినవాఁడును, ఆశాశూన్యుఁడును, బరిగ్రహరహితుండును, ఉత్తముఁడని చెప్పుదురు. ఎవనిచేత సర్వము విడువఁబడినదియో వాఁడే విద్వాంసు డనఁబడును. ఎవ్వఁడు నిర్వికారుఁడై యింద్రియముల వశముజేసికొని యింద్రియార్థములతోఁగూడ నీయక చరించునో యతం డుత్తముఁడందురు. భూతములదెస జూడకపోవుట, నంటకపోవుట, మాటాడకపోవుట, పరమశ్రేయము. సర్వభూతములయందు మైత్రిగలిగివర్తింపుము. శరీరియెవ్వరితోడను వైరము చేయఁగూడదు. జితేంద్రియుండగు నాత్మవేత్తకు దరిద్రమే సంతోషము పరిగ్రహమును విడిచి జితేంద్రియుఁడవగుము. తాతా! శోకశూన్యమగు స్థానము నాశ్రయింపుము. ఇహపరములయందు భయరహితుఁడ వగుదువు. నీకుసంగమునం దిష్టమున్నచోఁ దపోనిత్యుఁడు దాంతుఁడు నగు వానితో సహవాసముచేయుము. గుణసంగులతో నెన్నఁడును బరిచయము చేసికొనకుము. ఏకచర్యారతుఁడవు కమ్ము.

సుఖదుఃఖములకు నారామములగుభూతములయందు నొక్కండే క్రీడించును. అట్టివాఁడు జ్ఞానతృప్తుఁ డనంబడును. జ్ఞానతృప్తుఁ డెన్నఁడును దుఃఖింపఁడు. కేవల సుఖములచే దేవత్వమును బొందుచున్నాఁడు. మిశ్రమ సుఖములచే మనుష్యుఁ డగుచున్నాఁడు. అశుభములచే నధోగతిఁ బొందుచున్నాఁడు. మనుష్యజన్మమునందు జరామృత్యుదుఃఖములచే సర్వదా తొట్రుపడుచు నీసంసారమున మునిఁగి

యున్నాఁడు. అది గ్రహింపనేరక ఆసంసారమున నహితము హితము గాను, హితము నహితముగాను వాఁడబడును. అనిత్యము నిత్యమనియు, నరర్థ మర్థమనియుఁ దలంపఁబడును.

తనయందుఁ బుట్టఁబడిన పలువిధములగు తంతువులచేఁ దన్నే చుట్టుకొను పట్టుపురుగువలె సంసారంబునఁ దనదోషములచేతనేచుట్టుకొనఁబడి బాధలం జెందుచుండును. చివరకుఁ బట్టుపురుగు తంతువేష్టితమై మృతినొందు. అట్లె పుత్రదార కుటుంబములయందు సక్తులై బురదలోఁ జిక్కుకొనిన యడవి యేనుఁగులవలె జంతువులు దుఃఖించుచున్నారు.

మహాజాలములచే లాగబడి మెరకజేరిన మత్స్యములవలె స్నేహజాలసమాకృష్టులగుచు జను లెట్లు దుఃఖించుచున్నారోచూడుము. తనదేహమె యధ్రువంబగుచుండ బంధుమిత్రాదులు ధ్రువులాయేమి? సర్వమును విడిచి యెప్పుడో వెళ్ళఁదలఁచినవాఁడవే కదా! ఇట్టి యనర్థకార్యమం దేమిటికి సక్తుండవయ్యెదవు? విశ్రాంతిశూన్యమై యాలంబరహితమై పాథేయముదొరకనిదై జీకటిచే నగమ్యమైయొప్పు మార్గంబునంబడి మరణానంతరమున నీవొక్కరుఁడ వెట్లుపోగలవు? మృత్యుముఖంబునంబడి బయలుదేరి వెళ్ళునప్పుడు నీవెంట నీభార్యాపుత్రాదులలో నొక్కరుఁడు రాడని యెఱుంగుదువా? నీవుజేసిన సుకృత దుష్కృతములే నీవెంటవచ్చును. నిన్ను రక్షించినను భక్షించినను సుకృత దుష్కృతములే! నీకెవ్వరును లేరు. నీవెవ్వనివాఁడవునుకావు.

విద్యయు, గర్వము, జ్ఞానము, శౌచము, అర్థార్థమై యనుసరించును. వానిచే సిద్ధార్థుఁడు విడువఁబడుచున్నాడు.

నీకు గ్రామంబుననుండు తలంపు గలుగుట నది నీకు బంధన పుత్రాదునుమీా. ఉత్తముఁడు దానింద్రెంపిపోవుచున్నాఁడు. పాపులు దానిం ద్రెంపలేక కట్టుపడియుందురు.

ధర్మాధర్మముల విడువుము. సత్యాసత్యములవదలుము. వాని వదలినపిమ్మట నీవు దేనిచేత విడువఁబడుచున్నావో దానిఁగూడ వదలి వేయుము. సంకల్పశూన్యుఁడవై ధర్మంబునకు అలిప్సచే నధర్మమును విడువుము. మంచిబుద్ధిచే సత్యాసృతముల విడువుము. పరమ నిశ్చయమువలన బుద్ధిని విడువుము. మఱియు నెముకలచేఁ గట్టఁబడినది, స్నాయువుతోఁ గూడికొన్నది, మాంసశోణితములచేఁ బూయఁబడినది, చర్మముచే గప్పఁబడినది, మూత్రపురీషములచ్చేఁ బూరింపఁబడినది, జరారోగములచే బీడింపఁబడునది యనిత్యమైనది యిట్టి భూతావాసమును శరీరమును నమ్మియుండకుమీ.

పుత్రా! ఈకనంబడుచున్న పంచభూతాత్మకమగు జగంబంతయు మహాత్తని చెప్పఁబడుచున్నది. ధర్మాధర్మములను, సుఖదుఃఖములను, జీవితమరణములను, ఎవ్వఁడుఁ దెలిసికొనుచున్నాడో వాఁడే తెలిసినవాఁడు. జ్ఞావంతుఁడుసుఖదుఃఖములంబొరింపస్యముగావచ్చునని యెఱింగి శోకమోహముల నందఁడు. ఇంద్రియముచేత హింసింపఁబడునది వ్యక్తమనియు, నతీంద్రియమైనది యవ్యక్తమనియుఁ జెప్పఁబడుచున్నది. ఇంద్రియముల జయించిన దేహియుదకపానంబునంబోలె దృప్తుండగును. లోకమందుఁ దన్నును దనయందు లోకమును జూచుచుండెడి పరాపరజ్ఞుని శక్తి జ్ఞానమూలకమగుట నెన్నఁడు నశింపదు. మోహజములైన వివిధక్లేశములను జ్ఞానముచేత జయించుచున్నాఁడు. భూతములయొక్క సంయోగము కారణము లేక రానేరదు. బుద్ధిపరికాశత చేత లోకమార్గము దెలియఁబడుచున్నది.

జీవి స్వకృతములగు కర్మలచేత నిత్యదుఃఖతుండై తద్దుఃఖనివారణముకై నిత్యము ననేకజంతువుల హింసించుచుఁ దిరిగి క్రొత్త కర్మలం జేయుచుండును. అపథ్యముజేసిన రోగివలెఁ దానుజేసిన కర్మఫలము తాననుభవింపుచుఁ దపించుచుండును. మోహాంధుండై

సుఖమను పేరుగల దుఃఖములలో సర్వదా మునింగి తేలుచుండును.

స్వకర్మములచేఁ గట్టఁబడి కవ్వమువలె సంసారచక్రంబునఁ ద్రిప్పఁబడుచు ననేకబాధలం బొందుచుండును. కావున వత్సా! నీవు బంధంబులఁ ద్రెంపికొని కర్మల విడిచి నిజమెఱింగి భావశూన్యుండవై సిద్ధింబొందుము. సంయమనంబున బంధముల ద్రెంపికొని సుఖోదయమై బాధాశూన్యమైన యొప్పు సిద్ధిని ననేకులు బొందియున్నారు.

మహాత్మా! శోకోపహారకములు శాంతికరములైన శాస్త్రముల విననచో మంచిబుద్ధిగలుగును. అట్టి బుద్ధిబొందిన జనుండు సుఖవంతుఁడగును. ప్రతిదినము శోకస్థానసహస్రములు భయస్థానశతములుమూర్ఖుని బొందుచుండును. పండితుఁడు వాని గణింపఁడు. కావునఁ దండ్రీ! యనిష్టనాశనమునకై మదీయోపన్యాసమును వినుము. బుద్ధిని వశము జేసికొనినవానికి శోకము నశించును. స్వల్పబుద్ధులు ఇష్టనాశనమునకై వగతురు. భూతములను గుణములు పొందుచున్నవి. విడిపోవుచున్నవి. వానిగుఱించి విచారించిన లాభములేదు.

మృతునిగుఱించి నష్టమును గుఱించి యతీతమైనవ్వాని విచారించుటవలన దుఃఖమేయగును. లోకప్రచారము దెలిసికొనిన నశ్రుమోచనము చేయఁడు. పెక్కెల నమస్తము లెన్నఁగాఁ జూచువానికి నశ్రుబిందువైన రాఁజాలదు. వినుము. దుఃఖోపఘాతుకంబగు శరీరధర్మంబునందును మనోధర్మంబునందును నుండువానికి దుఃఖము రాకుండ మానునాయందు వేమో! తగిన యత్నముజేసి దానిందలంపఁగూడదు. దుఃఖమునకు వైద్యము తలంపకుండుటయే. చింతించుచున్న వాని శోకము క్రొత్తదియై వృద్ధిబొందుచుండును. ప్రజ్ఞచే మనోదుఃఖమును ఓషధులచే శరీరదుఃఖమును బోగొట్టుకొనవలయును. విజ్ఞానసామర్థ్యమన నిదియేకదా? లేనిచో శిశువులవలె రోదనముజేయుదురు.

లోకము, యౌవనము, రూపము, జీవితము, ద్రవ్యము, ఇష్ట

జనాప్తి, సర్వము నధ్రువమని యెఱింగిన వానికిఁ దద్వియోగంబున శోకము జనింపదు. జనసంఘమువలన వచ్చిన శోకము తానొక్కఁడే యనుభవింపవలదు. దుఃఖింపక యే ప్రతీకారము తెలిసికొని కావింప వచ్చును. లోకమున జీవులకు సుఖముకంటె దుఃఖమే విస్తారముగా నుండును. ఇంద్రియార్థములయందు స్నిగ్ధత్వము మోహమువలన మరణంబు గలుగుచున్నది. సుఖదుఃఖములు రెండును విడిచినవాఁడె యుత్తముఁడు. వయసు నడుచుచు నిమిషము నిలువదుగదా. శరీరమే యనిత్యమగుచుండఁ దత్సంబంధములు నిత్యము లెట్లగును. కష్టము మీఁద నర్థములను నిడుదురు. తత్పాలనకై సుఖములఁ గోల్పోవు దురు. ధనాభివృద్ధి వడసియుఁ దృప్తిలేక సంపాదనపరుండగును. తృప్తిలేనివారు దుఃఖమునే పొందుదురు. తృప్తిగలవాఁడే సుఖముగల వాఁడు. సముచ్ఛ్రయములు పతనాంతములు. వియోగాంతములు సంయోగములు. మరణాంతములు జీవితములు. భూతముల యనిత్యత యెఱింగినవా రెప్పుడును దేనికిని శోకింపరు. విద్వాంసులు సంతోషమే ధనముగాఁ జూతురు. కామములఁ దృప్తిబొందక వానిని గుఱించి విచారించుచుఁ దదనుగుణములగు కార్యములఁ జేయుచున్న మూఢునిఁ బెద్దపులి పశువుంబట్టినట్లు మృత్యుదేవత పైఁబడి యీడ్చి కొనిపోవును. కావున దుఃఖమోచనమునకై యుపాయమాలోచించు కొనవలయును. ఆలోచింపక యేకార్యము ప్రారంభింపఁగూడదు.

ధనికుఁడైనను దరిద్రుడైనను శబ్దస్పర్శరూపరస గంధముల ననుభవించుటకంటె వేఱులేదుగదా? అంతకుమున్ను దుఃఖములేదు. భూతసంమేళనపూర్వమును దుఃఖములేదు. తాను బుట్టకపూర్వ మేమి యును లేదు. తరువాత వచ్చిపోయినవానిగుఱించి పరితపించుట తెలి సికొనమిఁగాదే. పూర్వవృత్తాంతము దలంచికొనిన నాదుఃఖము నిలు వదు. ధైర్యముచే శిశ్నోదరములను మనస్సుచేత చక్షుశ్శ్రోత్రములను

విద్యచే మనోవాక్కులను గాపాడుకొనవలయును.

అధ్యాత్మరతుండై కూర్చుండి నిరపేక్షుండై నిరామిషుండై యొప్పు పురుషుఁడు తన బుద్ధిసహాయమువలన దుఃఖములఁ బాసి సుఖించునని యెఱింగించి నారదుండు వెండియు నిట్లనియె

మునీంద్రా! సుఖదుఃఖములయొక్క విపర్యాసములు గలిగి నప్పుడు ప్రజ్ఞాయుక్తుండుగూడ ధైర్యము నిలుపుకొనఁజాలఁడు. కాని యట్టి ప్రయత్నము స్వభావముచేతనే చేయుచుండవలయును. యత్నముగలవాఁడు దుఃఖింపఁడు. జరామరణరోగముల వలన తన్నుద్ధరించుకొనవలయును. శరీరములు రోగయుక్తములు గదా. శారీర మానసికములగు రోగములు (ఆదివ్యాధులు) ధన్వులచేఁ బ్రయోగింపఁబడిన బాణములవలెఁ జీవుల బాధించుచుండును. రోగములచేఁ బీడింపఁబడుచుఁ జీవితాశగలిగి యవశుండగు వాని దేహము వినాశనమునకై మృత్యువుచేలాగఁబడుచున్నది. జరాజీర్ణమై జారిన దేహము నదీప్రవాహమువలె వెనుకకు మరలదు. (తిరుగా పడుచుఁదనము పొందనేరదు).

రాత్రింబవళ్ళు మనుష్యుల యాయువుల హరించుచున్నవి. శుక్లకృష్ణపక్షములు వృద్ధులఁ జేయుచున్నవి. కాలము నిమిషమైనను నిలువదు. ముదిమిరాకున్నను సుఖదుఃఖములు మనుష్యుల వృద్ధులఁ జేయుచున్నవి.

సూర్యుఁ డస్తమించుచు నుదయించుచు ననేకవిచిత్రభావములఁ గల్పించుచుండును. పురుషకృత్యములగు పనులయొక్క ఫలవిషయమై పరాధీనముకాక స్వతంత్రమే కలిగినచో నెవ్వఁ డేది తలంచి చేయునో యాకార్యము తప్పక సఫలముకావలసినదేకదా. అట్లగుచున్నదా. ఒకసారి లోకముదెసఁ జూడుము. దక్షులు బుద్ధిమంతులు

నగువారు తలపెట్టినకార్యములు నిష్ఫలమగుచున్నవి. వట్టిమూఢులు లోకజ్ఞానమేమియు లేనివారు సర్వకామములచేఁ దృప్తులగుచున్నారు. ఒకనీచుండు హింసాపరుండై జీవులఁ జంపుచు లోకుల వంచించుచు సుఖించుచుండును.

ఒక్కఁడు నిర్వ్యాపారుఁడై కూర్చున్ననువానినిలక్ష్మి యాశ్రయించును. ఒకొక్కఁడెంతప్రయత్నముజేసినను దరిద్రుఁడుగానే యుండి కర్మానుగుణ్యమైనఫల మనుభవింపనేరఁడు. ఇందులకు హేతు వేదియో చింతింపుము. ఇందుఁ బురుషునియపరాధ మేమియున్నది ? కొందఱు సంతానకాంక్షులై వ్రతాదులు జేసియుఁ బుత్రులం బడయ లేకున్నారు. కొందఱికి వలదనుచున్నను సంతానాభివృద్ధి గలుగు చున్నది. మఱియు మంచివారికి నీచులు నీచులకు మంచికుమారులు పుట్టుచుందురు. గర్భమందు మూత్రపురీషములుగలవు. తినిన యన్నము జీర్ణమగుచున్నది. రేతస్సు జీర్ణముగాక గర్భముగలుగ జేయుచున్నది. మఱియొక్కవిచిత్రము చూడుము. జంతువులకు గర్భధారణము నకుగాని విసర్జమునకుగాని స్వాతంత్ర్యమేమైనఁ గలదా. అన్నము లోపలవేయుటయే వాని స్వతంత్రము. తరువాత నేమగునో యెట్లు పోవుచున్నదో వానికిఁ దెలియునా ? కావున మనుష్యులకు స్వాతంత్ర్యోద్ధారణమందు సామర్థ్యములేదు.

వ్యాధులచే క్షుద్రమృగములవలె వ్యాధులచే మనుష్యులు పీడింపఁబడుచుందురు. తఱుచు రోగములు ధనికులనే పీడించుచుండును. మృగములకుఁ బక్షులకు నెవ్వఁడు చికిత్సచేయుచున్నాఁడు? మఱియు మంచిమందులుగల వైద్యులుకూడ రోగపీడితులగుచున్నారు. లోక మీరీతి శోకమోహముల నందుచున్నది. ధనమున నెల్లవారు లోకము నతిక్రమింపవలయునని తలంచుచుందురు. అందులకుఁ దగిన ప్రయ

త్నములు చేయుచుందురు. ఎన్నటికిఁ దృప్తిఁబొందరు. ఐశ్వర్యమత్తుల, మద్యపానమత్తుల, శకులాశ్రయింతురు. కొందఱికష్టములు విమర్శింపకున్నను దొలఁగిపోవును. కొందఱికష్టము లెన్ని ప్రయత్నములనైనఁ దొలంగవు. కర్మసంఘులయందు ఫలవైషమ్యము జూడఁబడుచున్నది. చూడుము! కొందఱు పల్లకీయెక్కుట గోరుచుండఁ గొందరు పల్లకీ మోయుటయే యుద్యోగముగాఁ బరిగణింతురు. కొందఱు స్త్రీలులేక కొందఱు పురుషులులేక దుఃఖింతురు. కావున నో వ్యాసనందనా! గహనమువంటి సంసారమున మునుంగక నీవు నాయుపన్యాసమును వినుము. నీవు ధర్మాధర్మములు సత్యాసత్యములు విడువుము. దేనిచేత నీవు విడువఁబడుచున్నావో దాని విడువుము. ఇది రహస్యము. మనుష్యలోకము కడుచెడ్డది. అదెసం జూడకుమని పలికిన విని శ్రీశుకుఁడు మనస్సులో నాలోచించి అయ్యో! దారాపుత్రాదుల సంగమము మహాక్లేశకరము. విద్యావ్యాసంగము శ్రమకరమైనదే. అల్పక్లేశలభ్యమగు మార్గ మేదియున్నది? నిశ్చయమైన గతియేది? అని రెండుగడియ లాలోచించి నే నెట్లు మోక్షమును బొందువాఁడ నక్కటా వియోగసంకటసాగరమగు నీసంసారమునం బడి తిరగఁజాల. ఎందుఁ బోయినఁ దిరుగా నావర్తము లేదో దానిం గోరుచున్నాను. సర్వసంగములు విడిచి నాకెందు శాశ్వతమైన సుఖముగలుగునో నే నక్కడికిఁ బోవుచున్నాను. కర్తవ్య ముపదేశింపుమని యడిగిన నారదమహర్షి యీయర్థంబు దేటపడ నొక్క యితిహాసంబు జెప్పెద నాలింపుము.

అని చెప్పునప్పటికి కాలాతీతమగుటయు మణిసిద్ధుం డవ్వలికథ పైమజిలీయం దిట్లు చెప్పందొడంగెను.

# నాగుని కథ.



గంగానదీ దక్షిణతీరంబున మహోపప్లవమను నగరంబున భృగుండను విప్రుం డగ్రహారము జేయుచుండెను. అతండు తపస్స్వాధ్యాయనిరతుండు, జితక్రోధుండు, జితేంద్రియుడు, నిత్యతృప్తుండు, ధర్మనిత్యుండు, సజ్జనసమ్మతుండునై యొప్పుచుండెను. న్యాయప్రాప్తంబగు విత్తంబునఁ జిత్తం బలరించికొనుచు జ్ఞాతిసంబంధులచే విపులమగు కులంబున విఖ్యాతివడసి విశిష్టమగు వృత్తి నాశ్రయింపుచు ధర్మానుసారముగాఁ బుత్రులఁ బెక్కండ్రఁ బడసి కాలక్షేపము జేయుచు నొకనా డాత్మగతంబున నిట్లు తలంచెను.

ఆహా! నాకిప్పుడు నగముప్రాయము గతించినది. ధనము సంపాదించితిని. వేదకర్మల యజ్ఞయాగాదులం గావించితిని. బంధువులఁ బోషించితిని. కాని మోక్షమునకు నిక్కమగుమార్గ మేదియో తెలియకున్నది. వేదము కర్మలఁజేయుమని యొకచోటను కర్మలవలనం బ్రయోజనములేదని యొకచోటునం జెప్పియున్నది. వేదోక్తము శాస్త్రోక్తము శిష్టాచారము మూడును మూడుదారులుగా నున్నవి. మోక్షమునకు ముఖ్యమగుమార్గ మేదియో యెఱింగించుమహాత్ముఁడెందైనం గలఁడేమో యని ధర్మనిశ్చయము జేసికొనలేక యతండు సంతత మాలోచించుచుండ నొకనాఁడొక విప్రుం డతనియింటి కతిథిగా వచ్చెను.

భృగుండు మిగుల సంతసించుచు భయభక్తివిశ్వాసములతో నతని కాతిథ్యమిచ్చి భుక్త్వోపవిష్టుండైన యాపాంథుని చేరువ నిలువంబడి తాళవృంతమున వీచుచు విశ్రాంతుండగుటఁ దెలిసికొని మెల్లననిట్లనియె. ఆర్యా! నీమాటలు వినుటచే నీవు ప్రాజ్ఞుండవని తెల్లమగు

-చున్నది. నీయుపన్యాసము కడుమాధుర్యముగా నొప్పుటచే వినుటకుఁ -బ్రీతికరమగుచున్నది. నిన్ను మిత్రునిగాఁ దలంచి నిన్నుఁ గొన్ని మాటల నుగఁదలంచితిని. నేను గృహస్థధర్మముల ననుసరించి పుత్రులం గని వేదోక్తకర్మల నాచరింపుచు సాధారణగుణములచేఁ గట్టఁబడి లోకవాసనల నాశ్రయించి సంచరింతును. మఱియు నేనెల్లప్పుడు నాత్మ లో నాత్మచేతనే యాలోచించుచుందును. పుత్రాదిఫలాశ్రయమైన నావయసు క్రమంబున సగము గడచినది. ఇప్పుడు పరలోకసంబంధ మగు పాథేయమేమని యాలోచింపుచుంటిని. ఈలోకసంభారసము ద్రము పారము జేరుటకు ధర్మమయమగు తెప్ప యేదని బుద్ధిని సర్వదా తలంచుచుందును.

మఱియుఁ బుట్టుచుం బెరుగుచుఁ జచ్చుచుండెడి నీప్రజల సం యుజ్యమానవిశేషములఁ జూచిచూచి నామది విశ్రాంతినొందకున్నది. పారలౌకికసుఖంబుల ననుభవింప నిచ్ఛఁగలిగిన నేనీభోగముల ననుభ వించుసమయంబున నామనసు సంతుష్టినొందదు. కావున మహాత్మా! నీబుద్ధిబలమున నాలోచించి యుక్తమగునట్టి ధర్మమేదియో నిరూపించి మంచిమార్గముజూపుమని ప్రార్థించిన నాలించి యాయతిథి యిట్లనియె.

భూసురోత్తమా! బహుద్వారములుగల స్వర్గమున కేదియుత్త మమార్గమోయని నేనును దలంచుచుందును. ఈవిషయమున మోహముజెందియుంటిని. దీనిం దెలిసికొనుటకే నేను బ్రయత్నించు చున్నాడను. కొందఱు జన్మంబులం బ్రశంసింతురు. కొందఱు గృహ స్థధర్మములఁ గొంబఱు వానప్రస్థము, కొందఱాత్మజ్ఞానము, కొందఱు గురుశుశ్రూషఁ గొందఱు మౌనంబు గొందఱు మాతాపితృసేవ, కొందఱు అహింస, కొందఱు సత్యంబు, కొందఱు దానంబు, కొందఱు యుద్ధమరణంబు ఆర్జవంబు, అధ్యయనంబు తలయొకరీతిని బ్రశంసింపు -చుందురు. ఇట్లు పలువురు పలుతెఱఁగుల మోక్షమార్గము లుప

దేశించియుండ నేది మంచిదో నిశ్చయించుటకు సమర్థముకాక నామనస్సు సందేహడోలిక యెక్కి యూగుచున్నది. వాయువుచేఁ దరళమగు మేఘమువలెఁ దొట్రుపడుచున్నది. అయిన నన్నడిగితివి కావున నీకొక్క యుపాయము సెప్పెద నాలింపుము. నేనిట్లే యడుగ నాగురుం డిది నాకుపదేశించెను. కాని యట్లాచరించుటకు సంసారసక్తచిత్తుండనగు నాకు సింకను సాగకున్నది. వినుము.

నైమిశారణ్యంబున గోమతీనదీతీరంబున నాగమను నగర మొప్పుచున్నది. అందు మాంధాత యనేకయాగములఁజేసి దేవతల నతిక్రమించియున్నవాఁడు. ఆఘూంబునఁ బద్మనాభుండను నాగాధిపతి గాపురము జేయుచుండెను. అయ్యురగపతి త్రికరణములచేత భూతహితము గోరుచుండును. చతురుపాయములచేత రక్షించుకొనుచుండును. అతండు సర్వధర్మములనెఱింగిన ప్రోడ. సర్వశాస్త్రవిశారదుఁడు. సర్వసుగుణములు నతనియందున్నవి. కృతాకృతముల నెఱింగినవాఁడు. తపస్సంపన్నుఁడు. పెక్కేల అతనియందు సద్గుణములన్నియు సంపూర్ణముగా నున్నవఁట. అతనికడకుఁ బోయి యడిగిన నీసందియములుదీర్పఁగలఁడని నాకుపదేశించెను. నేనిప్పుడు నీకామాటయే చెప్పుచున్నాను. నీవందుఁబొమ్ము. నీసందియము దీరఁగలదని పలికిన విని పరమానందభరితుండై యాభృగుం డిట్లనియె.

మహాత్మా! నెత్తిపైనుండి పెద్దబరువు దింపినట్లు దారి నడిచి యలసినవానికి శయ్యగల్పించినట్లు దాహార్తునకు బానీయమిచ్చినట్లు క్షుధార్తునకు భోజనంబిడినట్లు వృద్ధునకు సుతుండు గలిగినట్లు వియోగమునుబొందిన మిత్రునిదర్శనమైనట్లు గ్రుడ్డివానికిఁగన్నులు వచ్చినట్లు తొట్రుపడుచున్న నాకు నీయుపదేశముననట్టి సంతోషము గలిగినది. తప్పక నీవుజెప్పినచొప్పున నామహానుభావు దర్శనమునకుంబోయెదం గాక. మంచిమార్గ ముపదేశించితివని సంతసించుచు భృగుం డారా

శ్రీయెల్ల నాయతిథితో ముచ్చటించుచుఁ దృటిగా వెళ్లించెను. మఱు నాఁడాయతిథి యెం దేసిం బోయెను. భృగుండును భుజగేంద్రదర్శన లాలసుండై శుభముహూర్తమున నిల్లువెడలి నగంబులు దాటి పర్వ తంబు లతిక్రమించి నదీనదంబుల మీఱి క్షేత్రంబులం జూచుకొనుచు మార్గమధ్యంబున ననేక కష్టంబుల భరించి పోయిపోయి కొన్నిదినం బుల కా గోమతీతీరంబునకుం జని యురగనగరంబు బ్రవేశించి వీథు లన్నియుం దిరిగి తిరిగి పద్మనాభుని గృహమడిగి తెలిసికొని వాకిటకుఁ బోయెను. తలుపు మూయఁబడియున్నది. వాకిట నండడి యేమి యును లేదు. అతం డొక్కింత సేపాలోచించి మెల్లన తలుపు తట్టుచు, అయ్యా! లోపల నెవ్వ రున్నారు? తలుపు తీయుదురా? అని కేకపెట్టెను.

ఆ కేక విని ధర్మనత్సలయగు నాగపత్ని వచ్చి తలుపుతీసి యావిప్రుంజూచి యతిథిపూజ గావించి మహాభాగ! మీ రెవ్వరు? ఎందుండి వచ్చితిరి? మాయింట నేదేని బనియున్నదియా? కామితఁ మెఱిఁగింపుఁడు. కావించి కృతార్థురాలగుదునని యడిగిన నాభృగుండు తద్వినయవిశేషముల కచ్చెరువందుచు అమ్మా! నేను బ్రాహ్మణుండ భృగుండనువాఁడ. పద్మనాభుండను నాగపతిం జూడవచ్చితిని. అయ్యురగేంద్రునిగృహ మిదియేనా? అతం డింటనున్నాడా? అని యడిగిన నాయిల్లా లిట్లనియె.

ఆర్యా! మీరాకచే మాగృహము పవిత్రమైనది. నేనా నాగపతి భార్యను. నాభర్త తనవంతురాగా సూర్యరథము గడు పుట కరిగిరి. సంవత్సరమునకొకసారి బోయి మాస మందు వసించి రావలయును. సూర్యరథహయంబులకుఁ బగ్గములుగా భుజగములఁ గట్టుదురని మీరు వినియేయుందురు. ఆయన యెనిమిదిదినములలో నిందు రాఁగలరు. అంతదనుక మీరిందు విశ్రాంతిగా నుండవచ్చును.

మీ కోరంతయు నుండదు. అక్కార్యంబు మావలనం దీఱునదియే యైనచో నుడువుఁడు. భక్తితో నాచరించి కృతార్థులమగుదుముగాక. అని నివేదించిన విని యతం డించుక యాలోచించి యిట్లనియె.

సాధ్వీ! నీయాదరముననే నీసద్గుణంబులు వెల్లడియగుచున్నవి. నాకార్య మొరులవలనం దీఱునదికాదు. ఆతండే వచ్చి చెప్పవలయును. అతండు వచ్చుదనుక నాగోమతీపులినంబున వసించి తపంబు జేసికొనుచుండెద. వచ్చినవెంటనే నాకుఁ దెలియఁజేయుము. ఇదియే నాకోరికయని పలికిన నాగేస్తురాలు. ఆర్యా! ఆతిథ్యమందుచు మా యింటనుండుము. వారు వచ్చి మీకార్యము దీర్తురుగాక. శీతవాతాతపక్లేశములు వహింపుచు నాయిసుకతిన్నెల నుండనేల? యని యడిగిన నతండు తల్లీ! నీయుల్లంబున మఱియొకరీతిం దలంపకుము. నీ యాతిథ్యమందితిని. నీయుపచారముల కానందించితిని. నేనీయెనిమిది దినములు భోజనము సేయను. తపంబుగావించుకొనుచు నందుండెద ననుజ్ఞయిమ్ము పోయివత్తునని ప్రతిమాలికొని యామెయురగి నంగీకరింపఁ జేసి తత్తీరంబు జేరి నిరాహారుండై తపంబొనరించుచుండెను.

ఎవ్వఁడో బ్రాహ్మణుండు నన్ని గోమతీసికతాతలంబున నన్నముతినక మలమల మాడుచున్నాడని విని యాయూరిలోనున్న వృద్ధనాగు లాతిథ్యములుగొని యతనికడకుఁబోయి మహాత్మా! ఇది యేమి కర్మము? ఇది యూరనుకొంటివా? అరణ్య మనుకొంటివా? ఇందలి వారలు ధర్మశూన్యులని తలంచితివి కాఁబోలు. అతిథి యన్నముతినక మలమలవేగుచుండ శంకింపక గృహస్థులు కుడిచినచో నది మూత్రపురీషసమమని యార్యులు సెప్పుదురు. పండ్లో పాలో కాయో కూరో మీరు భుజింప కిట్లుపవాసములు చేయుచుండఁ గుటుంబవంతులము మే మూరకొనిన నశింపమా? రండు. మీకిష్టమైనదాని భుజింపుఁడు మేము కృతార్థులమగుదుమని యెంతయో ప్రార్థించిరి. కాని యది

నాకు వ్రతంబు. వ్రతమధ్యంబునం గుడిచిన మహాపాతకంబు. ఎని మిదిదినములు దాటిన భుజింతునని సమాధానముజెప్పి వారి ధర్మ సత్కారమున కచ్చెరువందుచు భుజించుట కంగీకరింపలేదు.

పదిదినములు గడచినతోడనే పద్మనాభుండు సూర్యు ననుజ్ఞ బుచ్చుకొని యింటికి వచ్చెను. నాగపత్ని పతికెదురేఁగి పాదంబులఁ గడిగి శిరంబునం జల్లుకొని పీఠంబునఁ గూరుచుండఁబెట్టి విసరుచుండఁ బన్నగపతి సతింజూచి యిట్లనియె. యువతీ! నేను లేనిసమయములో దేవతాతిథిసత్కారములు యథాయోగ్యములుగాఁ జేయుచుంటివా? స్త్రీచాపల్యంబునంగాని మద్వియోగదుఃఖంబునంగాని ధర్మసేతువు చెడఁగొట్టలేదుగద అని యడిగిన నాగపత్ని యిట్లనియె.

ప్రాణేశ్వరా! శిష్యునకు గురుశుశ్రూష విప్రునకు వేదధారణము రాజులకు లోకపాలనము గృహస్థున కతిథిసత్కార మెట్లు నియతములో సతికిఁ బతివ్రతాత్వము పరమధర్మము. మీయట్టి యుత్తమునిభార్యనై సద్ధర్మముల నెఱుంగకుందునా? నీవు ధర్మరతుండవని యెఱింగి సన్మార్గ మెట్లు విడుతును? అతిథిసత్కారములఁ యథావిధిం గారవింపుచుంటిని. మీరరిగిన పదిదినములక్రిందట సుమయుండను నొక బ్రాహ్మణుం డతిథిగావచ్చెను. కారణము చెప్పఁడయ్యె. మిమ్ముఁ జూడవచ్చెనఁట. గోమతీసైకతస్థలంబున సమాహితుండై యుపవాసము వేచియున్నాఁడు. మీరాక తనకుఁ దెలియఁజేయుమని కోరియున్నాఁడిదియే మీరు లేనప్పుడు జరిగినచర్య. మీరందుఁ బోవుఁడని యెఱిఁగించిన విని యాయురగపతి యిట్లనియె.

దేవీ! నీవు నన్నెఱుఁగనట్లు పలుకుచుంటివేమి? సురాసురుల కంటె దేవర్షులకంటె సురభివలనం జనించినవారగుట నాగు లధికులని యెఱుంగుము. అట్టి నేను మనుష్యునిం జూడఁబోవలయునా? ఇది మాకు మర్యాదగాదు. నీవుపోయి నా రాక యతనికే చెప్పుము. అతఁడే

యుండు రాఁగలఁడని పలికిన విని యించుక నవ్వుచు నాసాధ్వీరత్న మిట్లనియె.

మనోహరా! ఆర్జవంబున నాబ్రాహ్మణుఁడు దేవుఁడు కాని నీయందుఁ బరమభక్తిగలవాఁడు. అతని కిందు వేరొకపనిలేదు. మేఘోదయమునఁ జాతకంబువోలె నీయాగమన మభిలషించుచున్న వాఁడు. అందుల కేమివిఘ్నమువచ్చునో యని యడలుచున్నాడు. అతం డెట్టివాడైనను మిమ్మాశ్రయింపవచ్చెంగావున మీరు జాతిస్వభావజన్యమగు నహంకారము విడిచి యతనియొద్దకుం బోఁదగును. ఆశాచ్ఛేదమున నాత్మను గహింపఁజేయకుఁడు. ఆశతోఁ గూడికొన్నవాని నశ్రుప్రమార్జనము సేయక రాజైననేమి రాజపుత్రుఁడైననేమి? బ్రాహ్మణహత్యను బొందును. మౌనమువలన జ్ఞానఫలావాప్తియు దానంబునఁ గీర్తియు సత్యవాక్యంబున సర్వాధిక్యము నొందఁగలరు. న్యాయార్జనంబున లభించిన విత్తంబున నాశ్రమసమ్మతమైన భూదానఫలం బనుభవించునని బోధించిన విని యాయుగపతి యిట్లనియె.

సాధ్వీ! నేను మహామోహాజనితమగు నభిమానదోషంబున నే నిట్లంటి. సంకల్పమువలనఁ బుట్టిన నాదోషమును నీవడంచితివి. భుజగములకుఁ గ్రోధము సహజము. గర్వము సర్వగుణములను జెఱుచును. అభిమానము చెడ్డది. అహంకారమువలన రావణుఁడు కార్తవీర్యుడు లోనగువారు శత్రువులచేఁ జంపఁబడిరి. నీమాటలవలన నట్టిక్రోధ ముపసంహరించుకొంటిని. నీవంటిభార్య నాకు దొరకుటచే నన్ను నే బొగడుకొనుచుంటిని. నీమాటవడువున నేనా పాఱునొద్దకుఁ బోయెద. నతని కామితముదీర్చెదనని పలుకుచు నప్పుడే గోమతీతీరమునకరిగెను.

అందుఁ నేకాగ్రచిత్తముతో దనరాకకు వేచియున్న యాజన్మి నట్టుం గాంచి యోమహాభాగ! నీ వెవ్వఁడవు? యెందులకై యిందు వచ్చితివి? ప్రయోజనమేమి? స్నేహముచే నడుగుచుంటిఁ జెప్పుమని

యడిగిన నాబ్రాహ్మణుఁ డిట్లనియె. అయ్యా! నేను ధర్మారణ్యవాసిని. బ్రాహ్మణుఁడ భృగుండనువాఁడ. పద్మనాభుండను సర్పరాజుం జూడవచ్చితిని. కర్షకుండు పర్జన్యోదయమువోలె నేనతనిరాక నిరీక్షించి యతని క్షేమముగోరుచు క్లేశశూన్యమైన యోగ మవలంబించి యున్నవాఁడనని చెప్పిన విని సర్పపతి యిట్లనియె.

అయ్యారే! విప్రోత్తమా! నీవృత్తము కడు కల్యాణమైనది నీ సాధువృత్తి యిట్టిదని కొనియాడఁ జాలను. జగంబంతయు మైత్రిచేఁ జూచుచుంటివి. నేనే యాపద్మనాభుఁడను. నీయునికి విని యిందు వచ్చితిని నీకేమికావలయునో నాకాజ్ఞాపింపుము. కింకరుఁడనై యక్కార్యంబు గావించెద. నీకుఁ బ్రియమేదియో తెలుపుము. నీయిచ్చవచ్చినపనికి నియోగింపుము. నీసుగుణములచేఁ బ్రీతుండనైతినని పలికిన విని యావిప్రుం డట్టులేచి యబ్బురపాటుతోఁ జూచుచు నిట్లనియె.

ఓహో! మహానుభావుఁడవు పద్మనాభుఁడవు నీవేనా! నీదర్శనమున నేనిప్పుడు కృతకృత్యుండనైతిని. నీయాదరణవచనములచే మఱియు మురిసితిని. నీవలన నొకవిషయము దెలిసికొనుతలంపుతో వచ్చితిని. ఉత్తమధర్మమేది? నాకు గతి యెట్టిది? కర్తవ్యమేమి? పరమార్గమేది. అని నాలో నేనసంతతము చింతించుచుందు. యశోగర్భకిరణములచేఁ బ్రకాశించుచు నీవు చంద్రునివలె నాకాహ్లాదము గలుగఁజేయుచుంటివి. నాకుఁగలిగిన సందియము దీర్పవలయును.

అది యట్లుండె. నీవు సూర్యరథము నడుపుటకై యరిగితివని వింటి. ఒకనెల యమ్మహాత్మునితోఁ గలిసి తిరిగితివి. ఆజగచ్చక్షువు సమస్తజగములకు నాధారము. అందున్నవాని కన్నిజగములు కనంబడునుగదా అప్పుడీభూలోక మెట్లుండును? సూర్యరథము నడుచునప్పు డెంతవేగముగానుండును? విశేషము లేమిగనంబడు నచ్చటి

విశేషము లెఱింగింపుమని యడిగినఁ బద్మనాభుఁ డిట్లనియె.

భృగుపవిత్రా! సూర్యునియందుఁగల విశేషములం జెప్పుటకు శేషునకైనను శక్యముకాదు. సూర్యరథమునకుఁగలవేగ మవాఙ్మాన సగోచరము. తత్తేజము తత్త్వసాధనంబునంగాని భరింపశక్యముగాదు. పర్వతములైనను రవిచెంతఁ జేరిన భస్మములైపోవును. మాకుఁ దదను గ్రహమునంజేసి సూర్యకిరణములు జల్లగానుండును. త్రాళ్లంటి వ్రే లాడుపక్షులువలె రవికరసహస్రంబంటుకొని వ్రేలాడుచు వాలఖిల్యాది మహర్షులు తపంబుగావించుచుందురు. వేయికిరణములు వేయిరంగులు గా నొప్పుచుండును. కొన్నికిరణములు భూమియందుఁ గలజలమును లాగి యాకసమున నావిరిగా నెరయఁజేయును. కొన్నికిరణములు పగ్గ ములవలె భూమినాకర్షించుచున్నవి. కొన్నికిరణములు వాయువుతోఁ జేరి యావిరిని నీరుగావించి వర్షము గురిపించుచున్నవి. గ్రహతారక లతోఁ గలిసి కొన్నికిరణములు పంటలుపండించుచున్నవి.

అక్కడికిభూమియంతయు నొకచిన్నచుక్కవలెఁ గనంబడును. ఆతేజోరాశినిమించిన తేజము లేదు. తన్మండలమధ్యవర్తియై నారా యణుండు జగంబులం బాలించుచున్నాడు. ఓడమీఁదనున్న వానికి గమనవేగంబు దెలియనట్లు మాకందుఁ గుదుపుగాని తొట్రుపాటుగాని కనంబడదు. సలువఁబడియున్నట్లే తోచును. కనంబడిన లోకములన్ని యు దూరమగుచుండును. మాకు రాత్రింబగళ్ళు లేవుగదా. చక్ర మువలెఁ దిరుగుచుండును. ఇట్టి విశేషము లనేకములున్నవి. పొద్దు పోయినది. మనమింటికిఁ బోవుదములెండని పలికిన నాభాసురతిల కుఁడు వెండియు నిట్లనియె.

అయ్యా! సంగరములోఁ జచ్చినవారు పుణ్యపురుషులు. సూ ర్యమండలముమీఁదుగాఁ బోవుదురని పురాణముల వినియుంటిమి. అట్టివారు మీకెవ్వరైనఁ గనంబడిరా? అని యడిగిన నురగపతి యిట్లు

నియె. ఆర్యా! అట్టి పుణ్యపురుషు లనేకుల నిదివఱకుఁ జూచియుంటిని కాని మొన్నఁజూచినవింత యెన్నఁడును జూచియెఱుంగను. వినుఁడు.

ఒకనాఁడు సూర్యరథము వేగముగాఁ బోవుచున్నది. అప్పుడు భూలోకమునకు మధ్యాహ్నకాలము కావచ్చును. రవి దివ్యతేజోమయుండై వెలుఁగుచుఁ బోవుచుండ నాతెరఁగొక యద్భుతతేజ మెదురు వచ్చుచుండ మేము జూచితిమి. ఓహో! సూర్యు లిరువురుగలరా యేమి? ఆతేజ మెక్కడిది? అని మేము వెఱగుపడుచుండ నాతేజము మా రవిబింబముచేరువునకు వచ్చినది. అప్పుడాసూర్యుఁడు అసిద్దేశ్యమైన యాతేజమును చేతులుసాచి తనరథముమీఁద కెక్కించుకొనియెను. ఆరెండు తేజంబులం జూచి మేము రవియెవ్వఁడో క్రొత్తతేజ మెయ్యదియో తెలిసికొనలేకపోయితిమి. ఇద్దరు సూర్యులువలెఁ బ్రకాశించుచుండిరి. కొంతసేపటికా తేజము రవిబింబములోఁ గలిసిపోయినది. ఆవింత మేము గన్నులార జూచితిమి.

అప్పుడు మేము రవికి నమస్కరించి మహాత్మా! ఈవచ్చిన తేజ మెయ్యది? మీతేజముతో సమానముగాఁ బ్రకాశించుచున్నదే మీలోఁ గలిసిపోయిన దేమి? దీని వృత్తాంతమంతయు జెప్పుమని యడిగిన నా లోకబాంధవుం డిట్లనియె. ఇతండు దేవుఁడుగాడు. అగ్నికాడు, రాక్షసుఁడు కాడు. ఉంఛవృత్తివలన గాలము గడపిన యొకానొక బ్రాహ్మణుఁడు. తానుజేసిన సుకృతమువలన నాలోఁ కలిసి ముక్తుం డయ్యెనని చెప్పిన మేమిట్లంటిమి. జగన్మిత్రా! ఈ ధాత్రీసురుఁ డెట్టి పుణ్యముజేసి మీలోఁ గలిసెనో చెప్పెదరా? అని యడిగిన సూర్యుఁ డిట్లనియె.

ఇతండు యజ్ఞయాగముల నేమియుం జేయలేదు. యాత్రల దిరిగి యెఱుంగఁడు. నిరాహారుండై దీర్ఘతపంబును జేయలేదు. వినుం డితండు త్రికరణముచేత భూతహితము గోరుచుండును. దేనియందును

మనసు తగులనీయఁడు. దేనినిం గోరఁడు. వచ్చినదానివలన సంతుష్టిఁ జెందుచు. ఉంఛవృత్తివలన జీవనము గావించెను. తత్సుకృతమువలన సిద్ధాస్థుండై మృతినొంది యిప్పుడు నన్నుఁగలిసెను. అని సూర్య దేవుఁడు మాకెఱింగించెను.

ఇదియే కడసారి నేనందుఁ జూచినవింత. ఇంతకన్న నేవిశే షము గనంబడలేదని పలికి మహాభాగా! ఇఁక మన మింటికిం బోవు దము రండు. విశ్రాంతి నహించిన పిమ్మట సావధానముగా నడుగ వలసిన యర్థ మడుగుదురుగాక! యుపవాసముల డస్సియున్నారు. రండని పలికిన విని సంతుష్టాంతరంగుఁడై భృగుండు సర్పపతికి నమ స్కరించి యిట్లనియె.

భుజగేంద్రా! నీవలన వినవలసిన యర్థంబులం దెలిసికొంటి. పోయివత్తునని పలికిన విని చిలువఱేఁడు వెరగందుచు అయ్యో! ఇది యేమి పాపము! నావలన నేదియో తెలిసికొనవలయునని గంపె డాసతో నచ్చి యుపవాసముల డస్సి యిప్పుడు నేను వచ్చిన నన్నేమి యు నడుగకయే యింటికిం బోయెదనందు వేల? నామాటలు నాలుగు వినినంతనే నా యసమర్థత తెల్లమైనదియా యేమి? ఇందులకు నా డెందము సిగ్గు జెందుచున్నదని యడిగిన నప్పుడమివేల్పిట్లనియె.

ఫణిపతీ! నీమతి నట్లనుకొనరాదు. నీమాటలు వినుటచే నా సందియము దీఱినది. నీయుపన్యాసమే నాశంకకు సదుత్తరమైనది. కర్తవ్యము దెలిసికొంటి. సంశయము దీరినది. అని తానువచ్చిన పనికి విన్న విషయము సమాధానముగా నున్నదని పలికి నిజ మెఱింగించి యతని వీడ్కొని భృగుండు నిజనివాసంబున కరిగెను.

అని నారదమహర్షి యెఱింగించిన విని శుకుండు సంతసించుచు మహాత్మా! నీయుపదేశంబున నామనంబునంగల సందియముదీరినది. పోయివత్తు ననుజ్ఞ యిమ్మని పలికి యమహర్షి యొండెదనిం బోయెను.

# నారద పంచచూడా సంవాదము.



ఒకనాఁడు నారదమహర్షి స్వర్గలోకమునుండి యొందేని బోవుచుండఁ బంచచూడ యను నప్సరస దారిలో దారసిల్లి నమస్కరించినది. దేవముని దీవించుచుఁ బంచచూడా! నీవు మిక్కిలి చక్కనిదానవు. అప్సరఃకుల చూడామణివి. ఎక్కుడుగాఁ జదివితివి. స్త్రీరహస్యములు నెఱింగిన ప్రోఢవు. నిన్నొక విషయము నడుగఁ దలంచితిని. దాచక నిజము జెప్పెదవా! అని యడిగిన నప్పడంతి యాంజలిపట్టి యిట్లనియె.

స్వామీ! మీరు నన్ను సమస్తశాస్త్రవేత్రిగా పొగడితిరి. ఇంతకన్న నాకుఁ గావలసినదేమి! మీరడిగిన విషయము నాయెఱింగినదేయైనచో నెట్టి రహస్యమైనను జెప్పి మీదయకుఁ బాత్రురాల నయ్యెదఁగాక. మీకడనిలిచి మాటాడుట కర్హతలేని నన్ను మీరిట్లు పల్కరించుటచే నేనేకాక మాకులమువారెల్లఁ బవిత్రులైరని స్తోత్రములు సేసిన విని తలయూఁచుచు నారదుఁ డిట్లనియె.

పంచచూడా! నుతేమియును గాదు. నీకుఁ దెలిసిన విషయమే యడుగుచున్నాను. స్త్రీస్వభావ మెట్టిదో చెప్పవలయును. నీవెఱుంగని స్త్రీరహస్యము లుండవుగదా. అని యడిగిన నా పంచచూడ యించుక నవ్వుచు నిట్లనియె.

మహాత్మా! నేనాఁడుదాననై నింద్యములైన స్త్రీరహస్యముల మీతో నెట్లు చెప్పుదును? స్త్రీ లెట్టివారో యెట్టి కృత్యములు గలవారో సర్వజ్ఞులైన మీరెఱుంగరా? ఆగుట్టు చెప్పుమనుట మీకు

న్యాయముగా జనవుడు నారదుఁడు కలికీ! అసత్యము జెప్పిన దోషమూ గాని యదార్థ కథనంబున ననర్థ మేమియున్నది? వాకు్రువ్వుమని యడిగిన నవ్వుచుఁ బంచచూడ యిట్లనియె.

మునీంద్రా! మీ రెఱింగియు నానోటినుండి పలికింపవలయునని యడిగితిరి. చెప్పెద వినుండు. మంచికులమున జనించినను స్తోత్రపాత్ర మగు సౌందర్యము గలిగి నిరుపమ కళావిభవాభిరాముండగు మగఁడు గలిగియున్నను స్త్రీలు సద్వర్తనముగలిగి యుండరు. ఇదియే స్త్రీల యందుఁగల దోషము సమస్తదోషములకు స్త్రీలునెలవులు సమర్థులగు భర్తల విడిచి నీచులతోఁ గ్రీడింతు రింతకన్న నధమకార్య మున్నదియా?

మునీంద్రా! సమీపమందున్న వాఁ డెంత తక్కువవాఁడైనను స్త్రీ భజింపకమానదు. లోకాపవాదమునకు వెఱచి మనంబున నిష్టములేకున్నను భర్తలయెడఁ బడఁతుక లిష్టమున్నట్లు నటింతురు. కాని, ధర్మభీతి నాతికిలేదు. స్త్రీలకు భర్తలయెడ భయభక్తివిశ్వాసములు సహజముగానుండవు మహాత్మా! మీయొద్ద నిజము చెప్పుచున్నాను. స్త్రీలకుఁ బొందరానివాఁడు లేడు. ముమ్మాటికిని లేడు. ఇదియే పరమ రహస్యము. భర్తలం దిష్టముగలిగి యంతఃపురముల రక్షింపబడు పడఁతులును, నంధ, జడ, వామన, కుబ్జాదులతోఁ గలిసికొనుచుందురు. వనితయు, లతయు దాపుననున్న వానిపైఁ బ్రాకునను సామెత మీ రెఱింగినదియే.

ఎట్టి వనితయైనను బదిదినము లేకాంతముగా నొకపురుషునితోఁ గలిసి తిరిగినచో నది వానిం గలియకమానదు. సమిధలవలన నగ్నియు నదులవలన సముద్రుఁడు, భూతవధవలన నంతకుఁ డెట్లు తృప్తిబొందకుండుదురో యట్లే స్త్రీలు పురుష శతమువలన దృప్తిబొందరు.

అంతకుఁడు, మృత్యువు పాతాళము, బడబాముఖము, కత్తిధార హాలాహలము, అగ్ని, సర్పము, వీని నన్నిటిని నొకదెసఁ దాస్రిసులో వైచి రెండవ దెస స్త్రీని నెక్కించి తూచినచో వనితయే బరువుగా నుండును. గోవులు క్రొత్తక్రొత్త తృణములకై వెదకుచున్నట్లు స్త్రీలు క్రొత్తవానికై వెదకుచుందురు. ఈపంచభూతములు లోకములు స్త్రీపురుషు లెప్పుడు సృష్టింపఁబడిరో యప్పటినుండియు స్త్రీలయం దీదోషములు నిరూఢములై యున్నవి.

శంబరుఁడు నముచి బలి కుంభీనసుఁడు మయుఁడులోనగు దానవు లెన్నిమాయ లెఱుంగుదురో యామాయలన్నియు స్త్రీలకు సహజములై యుండును. పెక్కేల స్త్రీలు అనృతమును సత్యముగాను, సత్యమునసృతముగాను జెప్పి వాదింపఁగలరు. సమస్త శాస్త్రవేత్త లగు శుక్ర బృహస్పతులుగూడ స్త్రీబుద్ధి నతిక్రమింపఁజాలరు.

మహాత్మా! మఱియొకవిశేషము జెప్పెద వినుము.

శ్లో. ఉజ్జ్వలవపుషం పురుషం కామయతే స్త్రీనరోపి తాం దృష్ట్వా
అనయోరేషవిశేషః స్త్రీ కాంక్షతిధర్మనిరపేక్షా
అభ్యర్థితాపి పుంసా సహసా నస్వీకరోతి సహజేన
సుకృతసమయాద్యపేక్షీ పరివర్తతేవా నవా పురుషః

చక్కని పురుషుని చూచి స్త్రీలు చక్కని స్త్రీని జూచి బురుషుఁడును వరించుట సహజమనుకొనుఁడు. స్త్రీమాత్రము ధర్మాపేక్ష విడచి వరించును. ధర్మాపేక్షచే పురుషుఁడు సందేహించును.

సురమునీంద్ర! స్త్రీలు ఏదియో హేతువునుబట్టిగాని కేవలము ధర్మాపేక్షచే వరింపకుండరు. ఇదియే స్త్రీస్వభావమని యెఱింగించిన విని నారదుండు పంచచూడను మెచ్చుకొనుచు నెందేనిం బోయెను. అని యెఱింగించి మణిసిద్ధుండిట్లు... చెప్పందొడంగెను.

---

## 249 వ మజిలీ.

# కలియుగధర్మములు.



శ్రీకృష్ణనిర్యాణమైన పిమ్మట కలియుగ ప్రారంభమునవ్యాస, జైమిని, గౌతమ, పరాశర, గాలవ శాతాతప, శంఖలిఖితాది మహా మునులొక సభ జేసి కలిధర్మములగురించి యిట్లు సంభాషించుకొనిరి.

గౌతముఁడు—మునీంద్రులారా! యిప్పుడు కలియుగము ప్రారంభించినది. ఇందుబ్రాహ్మణులు శ్రుతిచోదితములగు కర్మలు విడిచి శూద్రప్రాయులై వర్తింతురు. వర్ణాశ్రమధర్మములు నామమాత్రావశిష్టములై ప్రవర్తిల్లును. కావున కొన్నినియమములు మార్పవలసి యున్నవి. ఇందులకు మీమీ యభిప్రాయముల నివేదింపవలయును. అని చెప్పుచుండగనే నారదమహర్షి యొకచేత మొగంబు నొకచేత గుహ్యాంగంబు మూసికొని యాసభకరుదెంచెను.

అమ్మునివరుంజూచి యందున్న తాపసులెల్ల విస్మయముజెందుచు నాసంకేతక మేమని యడిగిన నారదుం డిట్లనియె. కలియుగ ధర్మముల గురించి మీరు సభజేసి నన్ను రమ్మని వార్తనంపితిరి గదా! తత్సంబంధంబులగు క్రియలసూచించుచు నిట్లు వచ్చితినని చెప్పుచు మఱియు నిట్లనియె.

కలియుగంబునఁ బ్రజలకు నీయింద్రియనియమము లేమియు నుండవు. నోరు సత్యమునువిడిచి ధర్మము నతిక్రమించి యిష్టమువచ్చినట్లుగా మాట్లాడుచుండును. స్త్రీపురుషులు విధినిషేధముల విమర్శింపక పశువులవలె స్వేచ్ఛాసంయోగములు గావింపుచుందురు. కలియుగంబున నీయింద్రియద్వయమే కడుంగడు దుష్టమై చెడిపోవును. అని సూచింపుచు నిట్లు కప్పికొనివచ్చితినని యెఱింగించి యాముని

సమాజమునెల్ల వినోదముగా నవ్వఁజేసెను.

పిమ్మట గౌతముఁడి ట్లుపన్యసించెను. ఇదివఱకు మనము వర్ణాశ్రమాచారముల శ్రుతిచోదితముగా విధించియుంటిమి. వానిలోఁ గొన్నిటిఁ దత్తత్క్రియలయందు మాత్రమే చేయఁదగునని తెలిపియుంటిమి. శ్రాద్ధ మాంసభోజనము విధవాప్రజోత్పత్తి అసవర్ణవివాహము లోనగు విధులనంగీకరించి ధర్మశాస్త్రములలోవ్రాసియుంటిమి కలియుగంబునఁ బ్రజలు నియమ బలవిహీనులగుట నట్టి విధులఁగొన్ని సవరింపవలసియున్నది. యిందులకు మీాయభిప్రాయము తెలుపవలయునని యుపన్యసించిన విని నారదమహర్షి తొలుత నిట్లనియె.

నారదుఁడు—శ్లో. సముద్రయాతు స్స్వీకారః కమండులు విధారణం
ద్విజానామసవర్ణాసు కన్యాసూపయమ స్తదా
దత్తాక్షతాయాః కన్యాయాః పునర్దానంపరస్యచ
ఇమాన్ ధర్మాన్ కలియుగె వర్జ్యానాహుర్మనీషిణః

సముద్రయానము సన్యాసము బ్రాహ్మణులు ఇతరజాతిస్త్రీల వివాహమాడుట. అక్షతయోనులగు స్త్రీలకుఁ దిరుగా వివాహముజేయుట. వీని నిషేధింపవలయునని నాయభిప్రాయము.

శాతాతపుఁడు—

శ్లో. యావద్వర్ణవిభాగో స్తి యావద్వేదః ప్రవర్తతె
సన్యాసం చాగ్నిహోత్రంచ తావత్కుర్యాత్కలౌయుగె.

ఎంతవరకు వర్ణాశ్రమధర్మ విభాగ వేదప్రచారము ప్రవర్తించునో యంతకాలము సన్యాసము యజ్ఞకర్మలు చేయవచ్చునని నేనభిప్రాయమిచ్చుచున్నాను.

పరాశరుఁడు—

శ్లో. ఊఢాయాః పునరుద్వాహం జేష్ఠాంశంగోవధం తథా
కలౌపంచ నకుర్వీత భ్రాతృజాయాం కమండులుం.

గౌతముఁడు:—ఊఢ యననేమి?

పరాశర—ఒకనిం బెండ్లియాడినది. "పరపురుషసంయోగాద్రుతేఊఢాపి దేయా" అని కొందఱభిప్రాయ మిచ్చుచున్నారు. ఊఢయైనను అక్షతయోనియైనచోఁ దిరుగా వివాహము చేయవచ్చును.

శ్లో. నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే.

ఈయైదువిపత్తులయందు స్త్రీకి బునర్వివాహము చేయవచ్చునని నే నభిప్రాయ మిచ్చితిని.

గౌత—మీరు రజస్వలానంతరము స్త్రీవివాహము చేయుట కంగీకరింతురా?

పరాశ—అంగీకరింపము.

శ్లో. అష్టవర్షాభవేద్గౌరీ నవవర్షాతురోహిణీ
దశవర్షాభవేత్కన్యా తత ఊర్ధ్వంరజస్వలా.

కన్యకకు సిగ్గు తెలియకపూర్వమే వివాహము చేయవలయును.

శాతాతపుఁడు—అట్లైన నక్షతయోనియగు స్త్రీకిం బునర్వివాహము మీరెట్లంగీకరించితిరి?

పరాశరుఁడు—పదియేండ్లు దాటకుండ కన్యక భర్తృవియోగమును బొందెనేని యట్టి కన్యకకుఁ బునర్వివాహము చేయవచ్చునని నే నభిప్రాయమిచ్చెదను.

శాతాతపుఁడు—

శ్లో. వరశ్చేత్కులశీలాభ్యాం నయుజ్యేత కదాచన
బలాదాహృత్య తాం కన్యాం పునస్గుణవతే నయేత్.

ప్రమాదవశంబున వరుని కులశీలాదులం దెలియక కన్యక నిచ్చిన పిమ్మట నతండు దుష్టుండయ్యెనేని యాకన్యకను బలాత్కారముగా దీసికొనివచ్చి మఱియొక వరునకీయవచ్చునని నేనభిప్రాయమిచ్చితిని.

నారదుఁడు—శాతాతపా! స్త్రీస్వభావము నీవెఱుంగ కిట్లనుచున్నావు. పరాశరమహర్షియుఁ గొంత పొరపాటును బొందుచున్నాఁడు. స్త్రీలకుఁ బునర్వివాహావకాశ మేమాత్ర మిచ్చినను ద్రోహకృత్యములు చేయకమానరు. కావునఁ బూర్తిగనే నిషేధింపవలయు నని నామతము. దూరముగా నాలోచించినం గాని యందలి యుపకారము దెలియదు.

శంఖలిఖితుఁడు—పతివ్రతయగు స్త్రీ సహగమనము చేయవలయును. అందుల కొడంబడ దేని బ్రహ్మచర్యవ్రతము చేయఁదగును. అదియు జేయలేని యువతి పెండ్లియాడవలయునని నాయభిప్రాయము. వయోవ్యవస్థ దెచ్చిపెట్టిన పరాశరమహాముని యభిప్రాయము కఠినముగా నున్నది. నారదుని మతము లోకసమ్మతముగాలేదు.

నారదుఁడు—మునీంద్రా! నీమతము లోకసమ్మత మేకాని యిప్పు డాచరింపఁదగినది కాదు. వర్ణాశ్రమ వివక్ష యున్నంతపర్యంతము నిషేధింపవలయును. బ్రాహ్మణులు వర్ణసంకరులై స్వేచ్ఛావిహారముల సంచరింపుచు ధర్మశాస్త్రముల గణింపనేరరు. అప్పుడు విధి నిషేధములు లేకయే ప్రవర్తింతురు.

అని యీరీతి మునులందఱు విస్తృతమగు వివాదము గావించిరి. అందు గొన్ని నిబంధనములు మార్చిరి. పెక్కండ్రు నారదుని మతములో జేరిరి.

శ్లో. కన్యానామసవర్ణానాం వివాహశ్చద్విజన్మభిః
విధవాయాం ప్రజోత్పత్తి ర్దేవరస్యనియోజనం
బాలాయాఃక్షతయోన్యాస్తువరేణాన్యేన సంస్కృతిః
యతేశ్చ సర్వవర్ణేషు భిక్షాచర్యా విధానతః
పితాపుత్ర వివాదేషు సాక్షిణాం దండకల్పనం
ఏతానిలోక గుప్త్యర్థం కలేరాదౌ మహాత్మభిః
నివర్తితాని విద్వద్భిర్వ్యవస్థా పూర్వకం బుధైః.

అని మహర్షులందఱు కలియుగ ప్రారంభమున నొకసభ జేసి కొన్నియాచారముల మార్పు గావించిరి. అందుఁగూడఁ బరస్పర మతభేదములు గలుగఁగా పరాశర మహర్షి వానికన్నిటికి సామరస్యము గల్పించి యొక ధర్మశాస్త్రము రచించెను. ఆగ్రంథస్థ విషయములు మును లందరు నొప్పుకొని తమతమ నెలవులకుఁ బోయిరి. అందులకే (కలౌపారా శరీస్మృతిః) అని ప్రసిద్ధి గలిగినది.

చ. అని మణిసిద్ధుఁ డెంతయు ప్రియంబున నారదమౌనిసార్వభౌ
 ముని చరితంబు దెల్పుటయు మోము వికాసమునొంద గోపనం
 దనుఁడు బళీ! సెబాసు గురునాయక! యింతకుమున్ను మీరు దె
 ల్పిన కథ లింత చిత్రముగ లేవుచుఁడీ పరికించి చూడఁగన్.

క. ఆనందంబయ్యెఁగదా
 మానసమున గురువరేణ్య! మనకిఁక నాకా
 శీ నగరం బెన్నాళ్ళకుఁ
 గానంబడు నెప్పుడు మునుఁగఁగల మాగంగన్.

క. అన, లేలెమ్మిఁక నెలలో
 పునఁ బోవంగలము ముక్తిపురికిం బృథుకా
 ననమార్గమెల్ల దాటితి
 మనువుగ సులభములు ముందునగు పయనంబుల్.

అని చెప్పినంత నప్పుడే కావడియెత్తికొని గోపాలుండు వెంట నడుచుచు మహాత్మా! నారదమహర్షి చరిత్రము ఇంకను జాలనున్నదని చెప్పితిరిగదా? అవ్విశేషములన్నియు మనము కాశీపురంబు జేరిన పిమ్మట సావధానముగా నెఱింగింతురుగాక. ఏమందురు? అని యడుగ నవ్వుచు నయ్యతిశిఖామణి మౌనముద్రబూనియుండుట శిరఃకంపమున నంగీకారము సూచించుచు నడిచినడిచి క్రమంబున నవ్వలి మజిలీ చేరెను.

కందగీతి గర్భచంపకమాలావృత్తము.

పురహార కామదా కనక భూధరచాపవికారదూర ధ
ర్మరత శివా మనోహర పురందర ముఖ్య సురార్చి తాంఘ్రియు
గ్మరుచిర పుణ్యదామదన ఘస్మర! భక్తసమాజవంద్య శం
కర కరుణా కరా భుజగ కంకణహారవిభూషితాంగకా.

గర్భస్థకందము.

హరకామదా కనక భూ
ధరచాపవికారదూర ధర్మరత శివా
చిరపుణ్యదా మదనఘ
స్మరభక్తసమాజవంద్య శంకరకరుణా.

గర్భస్థగీతము. కనకభూధరచాపవికారదూర
హార! పురందరముఖ్య సురార్చి తాంఘ్రి
మదనఘస్మర భక్తసమాజవంద్య
భుజగకంకణహార విభూషితాంగ.

మ. జయకృచ్ఛాలిశకంబి భాబ్ధి వసుభూ(౧౮౦౮)సంఖ్యాతమైయొప్ప నీ
క్షయనామాబ్దమునందు నీపదవభాగం బేనుగావించి స
త్ప్రియమొప్పన్ భవదంకితంబుగ సమర్పింతున్గదా దేవ! య
క్షయమైయొప్పఁగఁజేయుమయ్య కృప నాచంద్రార్కతారంబుగాన్

చ. గిరితనయా మనోరమణ! కిన్నరసిద్ధపిశాచ సాధ్యఖా
సర్వముఖదేవయోని పరివార! కనద్రజతాచలేంద్ర మం
దిర! పురహూతముఖ్యసురదివ్యకిరీటమణి ప్రభాలస
చ్చరణ! సురాపగాలలితచారుకపర్ద! కృపాపయోనిధీ!

గీ. గుడము నెరజూపి బాలునకును బ్రియమున
మందు ద్రాగి జడిమంబు మాన్పు కరణి
కథలనుచు జెప్పి నీతియుక్తముగ జనులఁ
గృతమతులఁ జేయుటయే మదీప్సితవిధంబు.

గద్య.

ఇది శ్రీమద్విశ్వనాథ సదనుకంపా సంపాదిత కవితావిచిత్రా
త్రేయముని సుత్రామగోత్ర పవిత్ర మధిరకులకలశ
జలనిధి రాకాకుముదమిత్ర లక్ష్మీనారాయణ
పౌత్ర కొండయార్యపుత్ర సోమి దేవీ
గర్భశుక్తిముక్తాఫలసుకవిజనవిధేయ
సుబ్బన్న దీక్షిత నామధేయ
రచితం బగు కాశీయాత్ర
చరిత్రమను మహా
ప్రబంధంబునందు
పదవభాగము.
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

విశ్వనాథార్పణమస్తు.



రామమోహన ప్రెస్, రాజమండ్రి.—1934.